
సదాశివ సమారంభాం
గురు దక్షిణామూర్తి
గురు వేదవ్యాస మహర్షి
గురు శుక మహర్షి
గురు నారద మహర్షి
గురు వాల్మీకి మహర్షి
గురు శ్రీకృష్ణ
శంకరాచార్య మధ్యమాం
గురు దత్తాత్రేయ
గురు బాబాజీ
గురు గౌతమ బుద్ధ
గురు ఆదిశంకరాచార్య
గురు రామానుజాచార్యులు
గురు జ్ఞానేశ్వర్
గురు రవిదాస్
గురు కబీర్ దాస్
గురు చైతన్య మహా ప్రభువు
గురు నానక్
గురు రాఘవేంద్ర స్వామి
గురు వీరబ్రహ్మేంద్ర స్వామి
యోగి వేమన
అస్మదాచార్య పర్యంతాం
గురు త్రైలింగ స్వామి
గురు లాహిరి మహాశయ
గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి
గురు వివేకానంద
గురు సాయి బాబా
గురు అరబిందో
గురు రమణ మహర్షి
గురు యోగానంద
గురు భక్తివేదాంత ప్రభుపాద
గురు మళయాళస్వామి
గురు విద్యాప్రకాశానందగిరి
గురు చంద్రశేఖర పరమాచార్య
వందే గురుపరంపరాం..

నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్ధం మహానుభావులైన శ్రీ డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా వెబ్ సైట్: http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.



**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా వారి వెబ్ సైట్

## http://www.dli.ernet.in



# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

శ్లో॥ సర్వం సంశయ ఏవ దేహఘటనం, సర్వం విచారాస్పదం
సర్వం దుఃఖ పరంపరాన్విత మహో! కాయో భయ భ్రాంతికృత్।
సర్వం చాత్మ శరీర పోషణ మసద్వ్యాపారసిద్ధ్యై నృణాం
ధ్యాతుం త్వాముపయాంతి నైవ మనుజాః శ్రీ కాలహస్తీశ్వర!॥

శ్రీ కాళహస్తీశ్వర శతకమ్. శ్రీ॥ తి॥ గు॥ పరమాచార్యః.

శా॥ అంతా సంశయమే, శరీర ఘటనంబంతా విచారంబె, లో
నంతా దుఃఖ పరంపరాన్వితమె, మేనంతా భయ భ్రాంతమే,
అంతా నాంత శరీర పోషణమె, దుర్వ్యాపారమే దేహికిన్
చింత న్నిన్నుఁ దలంచి పొందరు నరుల్ శ్రీ కాళహస్తీశ్వర!॥

ధూర్జటి కవి - శ్రీ కాళహస్తీశ్వర శతకము.

శ్లో॥ ఆమ్నాయాభ్యసనాచ్చ దర్శనచయ స్యాలోచనా చ్చాంతతః
తత్త్వానాం విచింతనాత్ క్షరమిదం దేహం స్థిరం బ్రహ్మ చ।
జానీమో వయమిత్యసత్యవచనా గోష్ఠీషు యే పండితాః
కింతే చిత్తజయోత్థ నిర్వృతి మియుః శ్రీ కాలహస్తీశ్వర!॥

శ్రీ॥ కా॥ శ॥. శ్రీ॥ తి॥ గు॥ పరమాచార్యః.

శా॥ శ్రుతు లభ్యాసముఁ జేసి శాస్త్ర గణముల్ బోధించి తత్త్వంబుల
స్మృతి నూహించి శరీరమస్థిరము బ్రహ్మంబెన్న సత్యంబు గాం
చితిమంచున్ సభలన్ వృథా వచనముల్ చెప్పంగనే కాని ని
ర్జిత చిత్తస్థిర సౌఖ్యముల్ దెలియరో శ్రీ కాళహస్తీశ్వర!॥

ధూర్జటి కవి - శ్రీ॥ కా॥ హ॥ శతకము.

# ĀRĀDHANA

(A RELIGIOUS MONTHLY MAGAZINE)

VOL. III FEBRUARY 1957 No. 2

Editor

P. PERAYYA P.O.L.,



---

PUBLICATION OFFICE

"ĀRĀDHANA"

OFFICE OF THE DEPUTY COMMISSIONER

*Hindu Religious & Charitable Endowments (Administration) Department, (Andhra)*

MASULIPATAM.

---

ANNUAL SUBSCRIPTION Rs. 12/-

PER SINGLE COPY Re. 1/-

# ఆ రా ధ న

దుర్ముఖి మా స ప త్రి క మాఘము

విషయసూచిక

పుట

తెనుగు



## CONTENTS

### ENGLISH

PAGE



శ్రీ పార్వతి అమ్మవారు - ధ్రువమూర్తి - సోమారామము

" ఆనందరూప మమృతం య ద్విభాతి "




సకృదేవ ప్రపన్నాయ 'తవాస్మీ'తి చ యాచతే।
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ॥

సంపుటము 3 | దుర్ముఖి - మాఘము | సంచిక ౭

ॐ

एवा पित्रे विश्वदेवाय वृष्णे यज्ञैर्विधेम नमसा हविर्भिः ।
बृहस्पते सुप्रजा वीरवन्तो वयꣳ स्याम पतयो रयीणाम् ॥

तैत्तिरीयसंहिता, अष्टकम् १. प्र. ८. अनु. २२.

తాత్పర్యము :—ఇంతియేగాక, (బుద్ధికి అధిపతివగు) ఓ బృహస్పతీ! తండ్రివలె (మమ్ములను) పాలించునట్టియు, దేవగురుడవగునట్టియు, అభీష్టఫలముల నొసగునట్టి నీకొరకు వివిధయాగముల చేతను, హవిర్ద్రవ్యములచేతను. భక్తిపూర్వక నమస్కారములచేతను పరిచర్యల నొనగుదుము. నీ యనుగ్రహమువలన మేము మంచి ప్రజ కలవారమై వీరుల సాహాయ్యముకలవారమై సర్వవిధములగు ధనములకు అధిపతులము కావలయును.

बृहस्पते अति यदर्यो अर्हाद्द्युमद्विभाति क्रतुमज्जनेषु ।
यद्दीदयच्छवसर्तप्रजात तदस्मासु द्रविणं धेहि चित्रम् ॥

తాత్పర్యము :—ఓ బృహస్పతీ! రాజగువాడు రత్నాదిరూపమగు ఏ ధనము ననుభవించునో, మంత్రులు మణిరూపములగు యే ధనము ననుభవించుదురో, యాగాదికార్యములను నిర్వర్తించెడు జను లేధనము ననుభవింతురో, ఏ ధనము - జీవితప్రదానముచే సంపాదింపబడునట్టి సైన్యరూపముగ ప్రకాశించునో - అట్టి వివిధములగునట్టియు, చిత్రమగు ధనమును - సత్యస్వరూపుడగు పరమాత్మ నుండి దేవగురువుగా యావిర్భవించిన ఓ బృహస్పతీ!—మా కొసగుము.

## ब्रह्मज्ञानस्य उपदेष्टारश्चतुर्विंशति ॥

( पूर्वतोऽनुवृत्तम् )

१३. भृङ्ग :—यथा विविधेभ्यः कुसुमेभ्यः मकरन्दं गृह्णाति, एवं ज्ञानी तत्तच्छास्त्रेषु सारं विदित्वा सर्वमतेषु सद्गुणं प्रकटयति ।

१४. मधुकर :—मधु सञ्चिन्वन् मधुना सहैव स्वयमपि नश्यति । अतः धीमान् धनस्य सञ्चयं न कुर्यात् ।

१५. कुरङ्ग :—यथा गीताकृष्टः मृगः जाले पतति, एवं इन्द्रियाकर्षकान् गीतादीन् विवेकी परिहरति ।

१६. आत्मनो रसनादोषेण दुष्टो मीनः मांसलोलुपस्सन् बडिशेन बध्यते एवं जिह्वेन्द्रियस्य दोषेण दुष्टः परिभूयते, विषयैर्गृह्यते च । अतः ज्ञानी जिह्वादोषं परिहरेत् ।

१७. **पिङ्गला नाम वेश्या :—**

पुरा विदेहेषु पिङ्गला नाम पण्यस्त्री वसतिस्म । एकदा सायंसमये सा यथापूर्वं अलंकृता आत्मनः सङ्केतस्थानं प्रति कोऽपि विटः आगच्छेदिति निरीक्षन्ती द्वारदेशे तस्थौ । अत्यन्तं धनलुब्धा सा तन्मार्गेणागतान् सर्वानपि आत्मनः कटाक्षवीक्षणैः आक्रष्टुं प्रायतत । परं तु सुचिरादपि न कोऽपि तस्याः विलासैः आकृष्यत । अथाऽपि सा कोऽपि धनिकः आगत्य धनं प्रयच्छतीति वृथैव आशंसमाना आनिशीथं द्वारदेशे तथैव निरीक्षन्ती अतिष्ठत् । एवं रात्रेर्यामद्वयं गतम् । सा कमपि विटमागतं न पश्यन्ती श्रान्ता मनस्यात्मानं प्रति जुगुप्सामावहत् । समनन्तरमेव सा हृदये किञ्चिदपूर्वं तेजः पश्यन्ती आत्मनो मोहं सम्यक् ज्ञात्वा मनस्येवमचिन्तयत् । “ धिङ्माम् ! याऽहमेतावन्तं कालं आत्मानं असंयम्य नरात् नश्वराणि सौख्यानि अकामयम् । यत् मामनुसृत्य सर्वकालेषु मयि सन्निविष्टं अनश्वरस्य सुखस्य ऐश्वर्यस्य च प्रदातारं भगवन्तं नाज्ञासिषम् । अहं मूढमतिः यत् नित्यानन्ददायकं परमात्मानं त्यक्त्वा क्लेशदुःखरोगकारिणं नरं कामये । अहो मे मौढ्यम् ! यदेतावन्तं समयं स्वयं शरीरं विक्रीय धनलोलुपा निन्द्यजीवितमनैषम् । सत्यज्ञानानन्दरूपः परमात्मैव मे सखा, प्रियतमः गुरुः सर्वमपि । शारीरिकाणि अनित्यानि सौख्यानि परिहृत्य नित्यसत्यस्वरूपं तं परमात्मानं देवमाश्रित्य नित्यानन्दमनुभवेयम् । मर्त्यं नरमाश्रित्य नारी कथं आनन्दं लभेत । नूनमहं भाग्यवती यतः विप्रलब्धाऽपि विवेकेन आत्मनो दुष्कृतानि सम्यक् पश्यन्ती निर्व्याजकरुणाविष्टेन विधिना दिष्ट्यानुगृहीता । अगाधे दुश्चरितकुपे पतितां प्रापञ्चिकैर्विषयैश्च बलादपहृतां च मां करुणाविष्टः भगवान् उज्जहार । यदा नरः विश्वं नश्वरमिति पश्यति तदैव ऐहिकेभ्यः नश्वरेभ्यः सुखेभ्यः आत्मानं निवृत्य आत्मानं स्वयमुद्धर्तुं प्रभवति विवेकवान् । ” एवं मनसा विचार्य पिङ्गला प्रापञ्चिकेभ्यः नश्वरेभ्यः विषयसुखेभ्यः प्रतिनिवृत्ता स्थिरां शान्तिं परममानन्दं च अनुबभूव ।

अतः आशैव नराणां बन्धस्य हेतुः ।
आशाविरहः अत्यन्तं आनन्दहेतुश्च ॥

(क्रमशः)

# శ్రీ సోమేశ్వర ప్రణామాంజలి

౧

శ్రీ కైలాసము నీకు ధీమవరమై - చెన్నొందఁ, భక్తప్రజా
లోకమ్ముజ్జ్వల యోగ భోగ విజయ శ్లోక ప్రమోదాకర
మ్మై కల్యాణపరంపరన్ గనుచు శ్రేయమ్మొందఁగా జేయు స
ర్వైకాధారు సుధీవిహారు నిను సంప్రార్థింతు సోమేశ్వరా!

౨

నీలగ్రీవ! నిరీహ! నిష్క్రియ! శివా! నిర్మాయ! నిర్మోహ! శ్రీ
బాలేందూజ్జ్వలమౌళీ! శూలి! భువన ప్రఖ్యాత కేళీ! లసత్
ఫాలాక్షా! శుభదీక్ష! సంతత జగద్రక్షా సమీక్షా! ప్రియ
ప్రాలేయాచల కన్యకా మధుర లీలాధ్యక్ష! సోమేశ్వరా!

౩

పాపాతంక మడంచి, అన్యవిషయాభ్యాసమ్ము తూలించి, సం
తాప శ్రేణి హరించి, వృత్తికి నిరోధ ప్రాప్తి సంధించి, దుర్
వ్యాపారమ్మొడలించి, నామతిని నిర్బంధించి, నీ పత్నిగా
దీపింపించి, సుఖింపనిమ్ము, మధుమూర్తీ! శర్వ! సోమేశ్వరా!

౪

అన్నన్నన్న భవత్పపమ్ము వచనాభ్యాసమ్ములం జక్క, దొ
న్నెన్నెన్నెన్ని శ్రుతి స్మృతుల్ గనిన నొక్కింతేనిఁ గాన్పింప, దీ
నిన్నున్ నమ్మి, నినుస్స్మరించి, ధృతితో నీమూర్తి ధ్యానింపుచున్,
ని, న్నే బుద్ధి - వరించు, దానికె సుమీ! నీస్ఫూర్తి! సోమేశ్వరా!

౫

దిక్కుల్ నీకు మహాంబరమ్ములుగ - మా దేవాలయాలేల, నీ
వాక్కుల్ వేదములై విభాసిలఁగ - మా పద్యాలు నీకేల, మా
దృక్కుల్ సూర్యుఁడు చంద్రుఁడై వెలుఁగ - మా దీపాలు నీకేల, మా
మ్రొక్కుల్ గైకొని మమ్ముమాయుతుఁడవై పోషింపు సోమేశ్వరా!

# భీమారామము - గుణిపూడి

కవిరాజశిరోమణి, పండిత, దేవి నరసింహాచార్యులు, అష్టావధాని, అవనిగడ్డ.

ఇది పశ్చిమగోదావరిజిల్లా భీమవరం తాలూకాలో భీమవరం రైల్వేస్టేషను (Railway Station) కు-సమీపముగ కలదు. ఇది పంచారామ క్షేత్రములలో నొకటి. తారకాసుర సంహార గాథయు నందు తారకునిచే ధార్యమైన యమృత లింగ ఖండసంబునుఁ గూర్చి గతసంచికలో "క్షీరారామము - పాలకొల్లు" అను వ్యాసమున వివరింపఁబడినది. అందు వివరింపఁబడిన ఖండపంచకములో నొక దానిని చంద్రుఁడు కొనితెచ్చి యీ గుణిపూడి గ్రామములో ప్రతిష్ఠించెను. అందువలన నీదేవుని సోమేశ్వరుఁడందురు. చంద్రుఁడు స్వామిని ప్రతిష్ఠించుకాలమున నాలయమున కభిముఖముగ నొక తటాకమునుఁగూడ నిర్మించెను. దీనికి సోమకుండమనిపేరు. చంద్రుడీ తటాకమున నిత్యము స్నానముఁజేయుచు, తపమొనరించి, సోమేశ్వరుని సేవించి తనకు గురుతల్ప గమనమువలన కలిగిన పాపమునుండి విముక్తుడయ్యెను. ఈ విషయము పద్మపురాణములో ప్రశంసింపఁబడినది.

## పద్మపురాణము - క్షేత్రమాహాత్మ్యము

"యమాశ్రిత్య కలానాథ స్తుత్వాత్రివం మహత్తపః
గురుపత్ని గమనజా ద్దోషాన్ముక్తోభవేత్క్వచిత్
శృణురామ! మహాబాహో! కథాంకథయతోమమ
అత్రి నేత్రాత్స ముభవచ్చంద్రఃపీయూషదీధితిః
బృహస్పతి సమీపేతు సర్వవిద్యా మధీతవాన్
కుశలస్సర్వ విద్యాసు సౌందర్య జితమన్మథః
భోగద స్సర్వదేవానాం వనితానాం సుఖావహః
ప్రాణద స్సర్వలోకానాం సర్వశాస్త్రార్థ కోవిదః
తం దృష్ట్వా కృపయావిష్ట శ్చంద్రంలోక పితామహః
సర్వౌషధీనాం సామ్రాజ్యే స్వభిషిచ్య కృతాదరః
రాజాసమ్మతి తనయ మకరోత్కమలాననః
తదాజ్ఞయా రాజసూయం యజ్ఞం త్రైలోక్యరక్షణః
కృతార్థ శ్చద్రమా స్తత్ర సర్వవస్తు తథాస్థితః
కస్యచిత్త్వథ కాలస్య గురోర్భార్యాం జహారసః
స్వయమేవాగతాం తారాం రాజాసుందర ఇత్యపి



శ్రీ సోమేశ్వరాలయ విమాన గోపురము



శ్రీ జనార్దనస్వామి ఆలయము - గుణుపూడి

గురుణా ప్రార్థ్యమానోఽసౌ మహదైశ్వర్య గర్వితః
సదదాతి స్వయంచంద్ర స్త్యక్త్వైనం సానగచ్ఛతి
ఏవం స్థితేమహద్వైరం బభూవ గురుచంద్రయోః
విభోరోషధినాథస్య శుక్రఃపార్ష్ణి గ్రహోభవత్
కార్యాకార్య విచారేషు పుత్రవచ్ఛిష్యవత్స్వయం
తతశ్శుంభ నిశుంభాద్యాః శుక్రాచార్య ప్రచోదితాః
మహాన్తం చక్రురుద్యోగం యుద్ధేకృత వినిశ్చయాః
లక్ష్మీసమేతః శ్రీవిష్ణుశ్చంద్రగేహ మిహాగమత్
గురోర్గేహేఽవ సద్రాత్రౌ గృహీత్వా జిగవంధనుః
వసవోఽష్టౌ తథారుద్రా ఆదిత్యాస్స మరుద్గణాః
ఇన్ద్రాది లోకపాలైశ్చ సనాసత్యా యుయుత్సవః
తత స్సమభవత్తేషాం ద్వంద్వయుద్ధం మహత్తరం
దేవానాం రాక్షసానాంచ మహద్యుద్ధ మవర్తత
తస్మిన్ యుద్ధే మహాఘోరె రుద్రః పరమకోపనః
అస్త్రం బ్రహ్మశిరోనామ విష్ణోరుపరి సృష్టవాన్
చక్రం మహత్తరం త్యక్తం రుద్రస్యోపరి విష్ణునా
తయోస్సమ భవద్యుద్ధం రుద్రస్య శరచక్రయోః
తతోలోకా మహాభీతా బ్రహ్మాణం శరణంయయుః
తతో బ్రహ్మసమాగత్య నివార్య హరిశంకరౌ
దేవానాం దానవానాంచ యుద్ధంత్యాజి తవాన్ప్రభుః

విధిశ్చంద్రం సమాసాద్య త్యజభార్యాం గురోరితి
ఉక్తవా స్పృహువారంసన దదౌ కామమోహితః
తతస్సనర్జ తారాయాం గర్భంచన్ద్రమసఃప్రభుః
బహిర్నిష్కాస్య తాంతారాం బభాషే గమ్యతామితి
అనుభూయ సహస్రాబ్ద మేవాఽవ్యక్తస్తు నిర్భగాం
క్వమైత్రం క్వమహాస్నేహో రాజ్ఞాం కార్యార్థినాం భువి
తతో భార్యాం కరంధృత్వా గృహమాగా ద్బృహస్పతిః
రుద్రోజగామ కైలాసం విష్ణుర్వైకుంఠమేవచ
దేవాస్సేంద్రా స్సర్షిగణా జగ్ముస్స్వస్థాన ముత్తమం
తథైవ జగ్ముర్దైత్యాశ్చ శుక్రస్స్వ భవనం యయౌ
తతః ప్రభృతి రాజానం త్రిషులోకైక భూషణం
రాజయక్ష్మా మహారోగో వివేశక్షైణ్య కారకః
రాజయక్ష్మా పాపయక్ష్మా జాయయక్ష్మేతితే త్రయః
రాజాన మావిశద్యక్ష్మ రాజయక్ష్మా తతోఽభవత్
గురుపత్నీ గమనజాత్తా రాయాశ్చోత్పన్న ఇత్యతః
పాప యక్ష్మేతి విఖ్యాతః జాయాసంగమ నాదహో !
య ఉత్పన్నస్సజాయేతి చన్ద్రస్యాసీదితి త్రయం
తేన పాపేనమహతా చన్ద్రమా అతిదుఃఖితః
విచరన్ సర్వలోకేషు నవ్యజానా త్కృతాంవిధిం
తతోదదర్శపతరం అత్రింలోక నమస్కృతం

ప్రణమ్య దండవద్భూమౌ పురతః ప్రాంజలిఃస్థితః
తం దృష్ట్వా క్షీణసర్వాంగం తనయం కరుణానిధిః
ఉవాచ చంద్రంరాజానం జీవయుస్వచనం మునిః
ఐశ్వర్య మదమత్తేన కార్యాఽకార్య మజానతా
యత్కృతం పాతకంరాజన్ తథ్యం తదను భూయతె
తథాపి కించిద్వక్ష్యామి హితంతెఽమృత దీధితె
యందృష్ట్వా ముచ్యతేజన్తుః మహాపాతక పంచకాత్
తత్ర తీర్థాన్యనేకాని సంతిపాప హరాణివై
ప్రసిద్ధాన్య ప్రసిద్ధాని తేషుస్నాత్వా మహేశ్వరం
దృష్ట్వానాశయతి క్షేత్రం మహాపాతక పంచకం
పంచాక్షర మహామంత్రం ప్రణవాద్య సమాహితః
ప్రాసాద భూషితోమధ్యే సంఘాయాష్టాక్షరో మనుః
జపన్నిమం మహామంత్రం పశ్యన్సో మేశ్వరం ప్రభుం
మహాపాతక యుక్తోపి ముచ్యతేనాఽత్ర సంశయః ॥

* * * *

" ఆజ్ఞాపిత స్స్వపిత్రైవ మోహధినా మహీశ్వరః
దృష్ట్వా విశ్వేశ్వరం దేవం అంబికా సహితం శివం
ఏకంఖండం సమాదాయ అస్మిన్‌క్షేత్రె ప్రతిష్ఠితః
తత్ర కృత్వా మహాకుండం బ్రహ్మాణం శరణంయయౌ
సర్వత్రసర్వతీర్థాని చరితాని మయాప్రభో!
గురుస్త్రీ గమనోత్పన్నం దోషంన చరితం విభో
అతస్త్వాం ప్రార్థయెఽహం మేదోషం నాశితు మర్హసి "

* * * *

బ్రహ్మ " త్వయా ప్రతిష్ఠితం లింగం త్రిములోకేషు దుర్లభం
తతః సోమేశ్వరో భూత్వాలోక సిద్ధిర్భ విష్యతి
తపసాతవ తుష్టాత్మా సోమేశ్వర దయానిధిః
గురుస్త్రీ గమనోత్పన్నం దోషం హరతి మాచిరమ్ "

అగస్త్యః " తపశ్చచార విధివత్బహు కాలం రఘూద్వహ
తతః ప్రసన్నో భగవానంబయా సహశంకరః
ఉవాచ తపసా ప్రీతోవరం వరయ సువ్రత

చంద్రః " యదిప్రసన్నో భగవన్గురు స్త్రీ గమనం తతః
తత్పాపం పరిహర్తవ్యంయ ద్యస్తి కరుణామయి

ఈశ్వరః " గురు స్త్రీ గమనాజ్జాతం నష్టం పాపం ననంశయః
త్వయా వినిర్మితం చేదం సోమకుండంసరోవరం
సేవితం సర్వమర్త్యానాం సర్వపాప ప్రణాశనం"



ఆలయ ముఖద్వారమునందలి శిల్పము

ఇతి దత్వాపరాన్నంభు స్తత్రైవాస్త రధీయత
చంద్రమాః ప్రాప్త సర్వార్థః శివానుగ్రహ
బృంహితః"

ఇతి పద్మపురాణె పూర్వఖండె రామాఽగస్త్యసంవాదె సోమేశ్వర క్షేత్ర మాహాత్మ్య వర్ణనంనామ అష్టావింశతితమో ధ్యాయః—అని కలదు.

అగస్త్య మహర్షి తన యాశ్రమమున శ్రీరామచంద్రునితో నిట్లు పలికెను. రామచంద్రా! చంద్రుండు యెవ్వరి నాశ్రయించి తనకు, గురుపత్నీగమనమువలన కలిగిన దోషమునుండి విముక్తుడయ్యెనో, అట్టి కథను వినుము. అత్రి కుమారుండైన చంద్రుండు బృహస్పతి సమీపమున సర్వవిద్యలనుం జదివి కుశలుడై, మన్మథునిం బోలు సౌందర్యవంతుండై సర్వదేవతలకును, స్త్రీలకును నాహ్లాద సుఖముల నొనంగుచుండగా, బ్రహ్మ చంద్రుని రోహ ఘునిం గావించెను. మరియు పితామహుని యానతి, రాజసూయా ధ్వర మొనరించి, యైశ్వర్యవంతుండై, కొంతకాలమునకు తన్ను వలచి వచ్చిన గురుపత్నియైన తారను హరించెను. అంత బృహస్పతి యతని నెంత వేడినను మహదైశ్వర్య గర్వముచే నామె నిచ్చియుండలేదు. అమెయు నితని వదలి వెళ్లియుండలేదు. అంత గురుచంద్రులకు యుద్ధము వాసగెను. అప్పుడు దైత్యగురుండగు శుక్రుండు, దేవగురుని సాధింపవలయునని తలంపుతో చంద్రుని జేరదీసి, పుత్రుని వలె శిష్యునివలె లాలించి దుర్ప్రేరితుం జేసి, శుంభనిశుంభులను పురికొల్పి యుద్ధమును వాసగించెను. ఇందువలన దేవదానవులకు మహత్తరమైన యుద్ధము జరిగెను. లక్ష్మీ సమేతుండై శ్రీ మహావిష్ణువు చంద్రుసంతికమునకు వచ్చెను. ఈశ్వరుండును ప్రమథ గణములతోడను సాయుధములతోడను గురునిం జేరెను. అప్పుడు విష్ణువుపై యాశ్వరుండు బ్రహ్మశిరోనామకాస్త్రమును వైవ, శ్రీ మన్నారాయణుండు చక్రమును విడిచెను. అవి రెండును ఘోరముగ పోరుచుండ, లోకములు భీతిల్లి, మర్త్య శ్రీ శివకేశవుల యుద్ధము నాపవలసినదిగా బ్రహ్మనుం వేడికొనిరి. అప్పుడు బ్రహ్మ, హరి శంకరుల యుద్ధము నాపించి, చంద్రునితో నీ యుద్ధమునకు కారణము నీవె గదా? గురుపత్నిని విడువమని కోరగా, నతండు మత్తుండై చాలవరకు వినక, చివరకు తార ధరించిన గర్భమును తాను తీసుకొని తారను విడిచెను! బృహస్పతి నామెను యింటికిం గొనిపోయెను. కాని బ్రహ్మ చంద్రునికి గురుతల్పగమన దోష మొనరించితివి కాన "యక్ష్మ" రోగివి కమ్మని శాపమిచ్చెను. ఆ పాపముచేత చంద్రుండు దుఃఖితుండై పాప పరిహారమునుం గానక, సర్వలోకములు పర్యటన మొనరించుచు, నెచ్చటను దానికి నిష్కృతినిం బొందనేరక,



ఆలయమునందలి శిల్పము

తన తండ్రియైన "అత్రి" మహా ఋషికి సమస్కరించి, తత్పాప పరిహారమును కరుణించవలసినదిగా వేడుకొనెను. కరుణానిధియైన యత్రియు వీక్షించి రోగపీడితుండై యున్న తనయునిం గాంచి, నీ వైశ్వర్యమదముచే యుక్తాయుక్త వివేకత లేక చేసిన పాపమనుభవింపక తప్పదు. ఐనను నీ యందుంగల వాత్సల్యమున నొక్క యుపాయమునుం జెప్పెదను. నీవట్లు చేసినచో నీ పాపము పరిహారము కాగలదు. నీవు సర్వతీర్థాటనముం జేసి, ప్రణవసహిత పంచాక్షర మహామంత్రమును జపించుచు, నొక్క శివలింగమునుం బ్రతిష్ఠింపుము. నీ పాపము పరిహరించునని పలుక నతండట్టి సర్వతీర్థములను మునిగి, దేవేంద్రుని వనమున నున్నదియు, తారకాసురునిచే ధరింపంబడి, కుమార దేవునిచే ఖండింపంబడినదియునగు, "అమృతలింగ" ఖండము నొకదానిని దెచ్చి యీ భీమేశ్వర క్షేత్రమునం బ్రతిష్ఠించెను. దానిముందు నొక చక్కని సరోవరమునుం దీసి, యందునిత్యము నవగాహనమొనర్చుచు, తపముం జేసి, స్వామినర్చించుచు పెద్దకాలముండి, గురుతల్పగమనమునం గలిగిన, పాపమునుండి విడువంబడెను. దీనిని సోముండు ప్రతిష్ఠించుటచే "సోమేశ్వరక్షేత్రమ"నియు, నీ గుండమునుకూడ, చంద్రుండే నిర్మించుటచే "సోమ



శ్రీ సోమేశ్వర లింగము

గుండమ''నియు పేర్లు ప్రసిద్ధి కెక్కినవి. కాన యెవరు యీ సోమేశ్వర క్షేత్రమునకేతెంచి, సోమగుండమున స్నాన మొనరించి, సోమేశ్వరుని సేవింతురో వారు గురుస్త్రీ గమనాది పంచమహాపాపములనుండి విముక్తు లగుదురని ఫలశృతి. ఇది పద్మపురాణము, పూర్వఖండములో రామాగస్త్య సంవాదములో యిరువది యెనిమిదవ యధ్యాయమున వర్ణింపఁబడినది.

## సోమేశ్వరలింగము - ప్రత్యక్ష నిదర్శనము

ఈ లింగము చంద్రప్రతిష్ఠితమనుటకు ప్రత్యక్ష నిదర్శన మొకటి నేటికిని కనపడుచున్నది. ఈ లింగమునకు పాడ్యమి మొదలు పౌర్ణమాసీ పర్యంతము క్రింద (పాన వట్టము) నుండి రోజుకొక "కళ" వంతున, షోడశ కళలు కన్పట్టుచుండును. ఇట్లె కృష్ణపాడ్యమినుండి అమావాశ్య పర్యంతము రోజుకొక కళపంతున దిగుచుండును. అనగా బింబ (లింగ) మంతయు నల్లగా నుండినను, పాడ్యమి నాఁడు లింగముయొక్క యూర్ధ్వకొలతలో షోడశాంశము (16 భాగము) వరకు తెల్లగను, విదియనాఁడు, మరియొక 16 వ భాగమును నిట్లే మూడవనాడు మూడుభాగములును, తెల్లగానుండి తక్కిన భాగము నల్లగా స్పష్టముగా కన్పించును. ఇట్లే పౌర్ణమి వచ్చువరకు షోడశకళా ప్రపూర్ణుడై పూర్ణచంద్రునివలె లింగమంతయు తెల్లగా స్ఫటికమును బోలి కాన్పించును. ఆ మరునాటినుండి - అనగా కృష్ణ పాడ్యమి ప్రభృతి రోజుకొకకళ చొప్పున తగ్గుచు, అమావాశ్యనాటికి లింగమంతయు నల్లగానే యుండును. ఇది యెట్లు ప్రతిఫలించుచున్నదో పలువురు విమర్శకులు పరీక్షించియు గ్రహింపలేక స్వామియొక్క మాహాత్మ్యమని నిర్ణయమునకువచ్చిరి. మరియొక విశేషము- ఇది, క్షీరారామముననున్నది శిరోలింగమెటులో, నట్లు కంఠలింగమని యూహింప తగియున్నది. కారణ మేమనగా? లింగ మధ్యమున నల్లని "కంఠరేఖ" యొకటి అర్ధచంద్రాకృతిగ కలదు. ఇదిస్వామి "శితి (గరళ) కంఠు"డను విషయమును ధృవపర్చుచున్నది. లింగరూపమంతయు నల్లగానున్న రోజులలో, నీ కంఠరేఖ కనపడదు. లింగమంతయు తెల్లగానున్నను మధ్యభాగమున "నల్లనిరేఖ" ప్రత్యక్షముగ కానసగును. అందువలన నిది "కంఠలింగ" మని యూహింపతగియున్నది. అటులైన, యిట్టి మొండెములను పూజించవచ్చునా ? యను సందియము పాఠకులకు కలుగవచ్చును. కాని విష్ణువుకు దశావతారములవలె, యీశ్వరునకు పంచవింశత్యవతారములుఁగలవని శివభాగవతములోఁ గలదు. "శితికంఠత్వము, సోమశేఖరత్వము, గజాంబరత్వము, నటరాజత్వము," యెట్టులో, నట్టులే "లింగస్వరూపత్వము" యొక యవతార భేదమై యున్నది. లింగ మగుటకు కారణము స్వామి అనంతుఁడు, ఆదిమధ్యాంతరహితుఁడు తేజోరూపుఁడు" అను విషయమందరికి తెలియుటకై యిట్టి స్వరూపమునుఁ దాల్చినట్లు పురాణప్రసిద్ధి. బసవ పురాణము, లింగ పురాణము, సాంబ పురాణములీ లింగోత్పత్తినిఁ గురించి స్పష్టముగా వివరించినవి. స్వామిస్వరూప మిట్టిదని తెలియకుండుటకై, అఖండమై, అచింత్యమై, అంగప్రత్యంగరహితమై, అబోధ్యమైనదే లింగస్వరూపము- అనగా స్వామికి అసలు అంగములు లేవని కాదు. అంగములు, శక్తులు అన్నియు అంతర్హితములై యున్నవి. కూర్మము తన శిరములను పాదములను లోన యిముడ్చుకొను శక్తి కలిగియున్నది. అంత మాత్రమున తాబేలుకు కాళ్లు లేవు, కంఠము లేదని యనతగునా? సామాన్యమైన యొక తిర్యగ్జంతువునకే నిట్టి శక్తి యమరియుండ సర్వేశ్వరుఁడు, సర్వశక్తిమంతుఁడైన యా పరమేశ్వరునికి గోపన శక్తి లేక యుండునా? శ్రీమన్నారాయణుఁడు ప్రళయకాలమున నీ సర్వలోకములను లోకేశులను, బీజాంకురన్యాయమున తన కుక్షియందు నిముడ్చుకొని లీలావిభూతిలో నోలలాడుచుండును. తనకు

తిరిగి సృష్టివిలాస మాలోకింపవలెనని సంకల్పము కలిగినచో తిరిగి సృష్టిని సంకల్పించును. "తత్సృష్ట్వాతదేవాను ప్రావిశత్" అనునట్లు తానే ప్రకృతిని ప్రపంచీకరించి యందు తాను ప్రవేశించుననని భావము. ఇందువలన దీనికి ప్రపంచమని పేరు కలిగినది. మరియు సాలగ్రామము ను వైష్ణవులు విష్ణువని వాకొనుచున్నారు. వాటికి మత్స్య కూర్మాదిమూర్తులని వర్ణించుచున్నారు. కాని వాటియందు అంగసౌష్టవము కానవచ్చుచున్నదా? "సాలగ్రామే హరి భావనాదర్శనాత్త"ని శాస్త్రప్రమాణముచే, దీనికి విష్ణువవలె చతుర్భుజత్వము, కిరీటమకరకుండల కేయూరాద్యాభరణ ధారణము వైజయంతీ వనమాలాది చిహ్నములు లేక పోయినను, శాస్త్రప్రమాణమందు విశ్వాసబుద్ధిచే నెట్లు విష్ణువును భావించుచున్నామో యట్లే స్థాణువునే యీశ్వరునిగా భావింపవలెను కాని వానిని ఖండములు చేసినారు కదా? అవి మొండెములు కావా? అను సంశయము పరిహార్య మైనది. విశ్వవ్యాపకమైన యీ తేజస్సుకు యొక చోట యున్నదని కాని దీనియందు లేదని కాని సందేహము లేదు. సర్వవ్యాపకశక్తి పరమాత్మ ఒకప్పుడు రూపవత్తు కావచ్చును. ఒకప్పుడు స్థాణువే కావచ్చును. కాని ఒక్కొక్క లింగమున నొక విశేషము కన్పించుటచేత నివి స్వయంభువములు గాని, చేతాళములు కావు. ఇట్లే అమరావతి, ద్రాక్షారామ, కుమారారామములలోని లింగములును చాలా యున్నతములైనను, వాటి వాటికి తగిన చిహ్నము లుండుటచే సర్వాంగసౌష్టవములే యైయున్నవి. ఈ శ్రీ కంఠమే కంఠలింగ మనుటకు ప్రబల నిదర్శనము.

## శాసనములు, దానములు

ఈ సోమేశ్వరుని కిచ్చిన దానమునుం గూర్చి పాలకొల్లు లోని, శ్రీ క్షీరారామేశ్వరాలయమున నొక స్తంభముమీఁద చెక్కఁబడియున్నది. South Indian Inscriptions Vol. V No. 173.

క॥ మను శివవత్సర సంఖ్యం బయో
జిని శ్రీ సోమేశ్వరునకు శ్రీ దుగ్గిఁకిం చె
కొని రెణ్ణు సంధ్యదీపము
లొసరంగ భణ్ణరువు కొమరండొగి బెట్టె దగన్॥

"బయో" అన్నప్పుడు గణము తప్పినది. వత్సర శబ్దమునకు బదులుగా "మిత" యని యుండిన సరిపోవును. ఇది శకవర్షములు 1114 లోనిదై యుండవచ్చును. ఇందలి విషయము సుగమము. కాని యీ భణ్ణరువు కొమరుం డెవరో తెలియుటలేదు. ఇంకను, నీ "గుణిపూడి"ని గురించి రాజమహేంద్రవరములోని, చిత్రవస్తు ప్రదర్శన



శ్రీ అన్నపూర్ణ - ధ్రువమూర్తి సోమేశ్వరాలయము

శాల గిడ్డంగిలో పడియున్న యొక రాతిస్తంభము మీద యిట్లు చెక్కఁబడియున్నది. A. R. No. 40 of 1912.

* * *

సీ॥ భీమాపురము డాకరేమియును మాడాలు
గుడిపూండియునుం బాలు కొలన వీర
భద్రేశ్వరంబున భావపట్టునం దాంద్ర
పురింబి (    ) పురమునం బరంగు దూబ
ఘంటశాలాపురిం గౌతరంబునను నే
లేశ్వరంబు నను వేగేశ్వరమున
విజయవాటిక నుండవిల్లిని వేలుపూరం
గరమొప్పు గొంటూరంగడలుపల్లి
కనకవలయములును ఘనలోహ వరదండ
ములు సఖండదీపములునుం బెట్టి
మఖలం బెక్కు గుడ్లుం జెఱువులు గొంటూర
నిలిపె మంత్రి మం(త్రి) ఘుభుజుండు॥

ఈ గీతిలో చివరపాదము స్పష్టముగా లేదు. కనుక శాసన దాత పే రెవ్వరో తెలియుటలేదు. మొత్తము మీద నీ మంత్రి పెక్కు దానము లొనర్చినట్లు యీ పద్యము

పలస తెలియుచున్నది. ఆంధ్రదేశమున ప్రసిద్ధిఁగన్న యన్ని దేవస్థానములకును, పెరుమాళ్లకు, బంగారు కడియములును, లోహదండములును, యఖండ దీపములునుఁ బెట్టించినాడు. ఇది భీమారామమను గుణిపూడిలో సోమేశ్వరస్వామి గుడి యెదుటనున్న మంటపములో నొక శిలా స్తంభముపై చెక్కఁబడియున్నది. A. R. No. 46 of 1893.

సీ॥ ధరంజతుర్థాన్వయాభరణుండు దేవయ
తనయుండు దూలశింగస ఘనుండు
శకవర్షములు బాణసాగర రామేందు
పరసంఖ్య నగు క్రోధి వత్సరమున
అరు వారంగాం "గుపరారామ" భీమేశ్వ
రునకు నొప్పార భూజనులు మెచ్చ
కళ్యాణ చంద్రశేఖర మూతిఱం జేయించి
యెలమిం బుట్టెడు శేను విలిచిపెట్టి
(తే)పు ఘంటయుం గంచ్చున దీపగంభ
మును సమర్పించి గోవులందసర నిచ్చి
పట్టుచీరెయుం బళ్లెంబు భక్తి నొసగెం
పనద్దు ధర్మంబులా చంద్రతారకముగా ॥

"గువరారామ" అను చోట "గుమారారామ" అని అర్థము. "శేను" అను తావున, "సేను" అని యుండవలెను. గీతపాదమున "నొసగెం" అను చోట "నొసంగెం" అనియు, "దనద్దు" అను చోట "దనదు" అనియు నుండవలెను. ఈ శాసనదాత "చతుర్థాన్వయాభరణుండను" విశేషణముచేత శాసనాయకులు కావలయును. మరియు దేవయకుమారుఁడు "శింగన" యనుభక్తుడు శకవర్షములు ౧౩౪౫ కు సరియైన క్రోధినంవత్సరమున కుమారారామ భీమేశ్వరస్వామివారికి ఉత్సవమూర్తులను చేయించి యిచ్చినట్లును, యీ సోమేశ్వరునకు యొక పుట్టెడు చేనును, పెద్దఘంటయు, కంచు దీపస్తంభమును, పట్టుచీరెయును, పళ్లెమును, కొన్ని గోవులను దానమిచ్చినట్లు తెలియుచున్నది.

## క్షేత్రపాలకుఁడు - నంది స్తంభము

ఈ క్షేత్రపాలకుఁడు శ్రీ ఆంజనేయుఁడు. ఆలయము ముందు ప్రస్తుతమున్న నందీశ్వరుఁడు గాక, సోమగుండమున నొక స్తంభమును దానిపై నొక నందియు ప్రతిష్ఠింపఁబడియుండినవి. దీనికి కారణము, పూర్వ మీ నంది స్తంభ



శ్రీ సోమేశ్వరాలయ గోపురము - సోమగుండము - నంది

మును, యీ సోమగుండముకూడ ఆలయావరణములోనే యుండెడివనియు స్వామికి నిత్యము యభిషేక మొనర్చు తీర్థము, సోమసూత్రమునుండి ఆ సోమగుండములోనికిఁ బోవు అంతర్మార్గము కలదనియు సందువలన, యీ కుండికలోని జలమున శక్తి మహత్తమరినదనియు, పెద్దలు చెప్పుచుండిరి. ఇప్పటికిని యట్టి గుర్తును గుండముమధ్య నందిస్తంభమును ధృవపఱచుచున్నవి. ఇచ్చట వైదికార్చన విధానమునునుసరించి వెలనాటి అర్చకులర్చించుచున్నారు.

వాహనములు - ఉత్సవములు

ఇచ్చట స్వామికి రజతకవచాదులున్నూ అమ్మవారికి స్వర్ణాభరణములున్నూ, అన్ని వాహనములున్నూ కలవు. మామూలుగా శివాలయములలో జరుగు యుత్సవములన్నియు జరుగుచుండును. శివరాత్రికి బ్రహ్మోత్సవమునుఁ జేయుదురు. అప్పుడు ఆలయమంతయు విమానమును విద్యుద్దీపములతో సలంకరింతురు. ఆకాశమున దేవతలు విమానారూఢులై తిరుగునప్పు డీ దేవాలయము వారికి నవరత్న స్థాపితమైన దేవవిమానమువలె కన్పించుచుండును.



శ్రీ ఆంజనేయస్వామి

# ఉత్సవములు - వ్రతములు

( ఫాల్గుణమాసము నందలివి )

**15-3-57** ఫాల్గుణ శుద్ధ ౧౪ చతుర్దశి శుక్రవారం - రాత్రి పౌర్ణమితిథి - హోళికాపౌర్ణమి.

ఈ హోళికోత్సవము ఉత్తరదేమునందును, పాశ్చాత్యులగు మహారాష్ట్రులును విరివిగా నాచరింతురు. ఈ దినమునందు "ఢుండు" అను రాక్షసిని పూజించి దహనమొనర్చి మరుచటి దినమునందు ఉత్సవము నిమిత్తముగా వివిధములగు వేడుకలు జరిపించుకొనవలయునని కొంతమంది శాస్త్రకారుల మతము. ఈ విధముగ నాచరించిన సకల సౌఖ్యములు గలుగునని ఫలశ్రుతి. వ్రత మాచరింపక పోయినను తత్ప్రయుక్తమగు ఉత్సవములు వేడుకలు (రంగులు జల్లుకొనుట) నేటికిని ఆంధ్రదేశమునగూడ - ఔత్తరాహులు, మహారాష్ట్రులు నివసించెడు ప్రదేశములలో విరివిగా కానవచ్చుచున్నది. ఆంధ్రులు యీ వ్రతములనుగాని, ఉత్సవమునుగాని యాచరించుట యరుదు.

**డోలోత్సవము :** ఈ దినమునందు శ్రీ విష్ణువును డోల (ఉయ్యెలయందు) నూర్చుండపెట్టి ఊపి యుత్సవమును చేయుదురు. రథోత్సవమువలెనే ఈ డోలోత్సవముకూడ పవిత్రమైన దని పురాణప్రసిద్ధము. శ్రీకాకుళము జిల్లాయందలి శ్రీ కూర్మక్షేత్రమునందు ఈ డోలోత్సవము మిక్కిలి వైభవముగా జరుపబడును. ఇంకను అచ్చటచ్చటి వైష్ణవాలయములలో నీ యుత్సవము చేయు నాచారము గలదు.

"రథస్థం కేశవం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే" అనునట్లుగనే

"నరో డోలాగతం దృష్ట్వా గోవిందం పురుషోత్తమం। ఫాల్గున్యాం సంయతో భూత్వా గోవిందస్యపురం వ్రజేత్"

అను శాస్త్రకారవచన ప్రామాణ్యముగ ఈడోలోత్సవము విష్ణుప్రీతికొరకై చేయబడు యుత్సవముగ గన్పట్టుచున్నది.

# నవరాత్రి - శివరాత్రి

కవిరాజశిరోమణి, పండిత, దేవి నరసింహాచార్యులు, అష్టావధాని, అవనిగడ్డ.

పగలు యీశ్వరుని పూజించవలసినదనియు, రాత్రి శక్తిని పూజించవలసినదనియు, పురాణ ప్రసిద్ధమును, ఆగమాచారమునై యున్నది. ఒకప్పుడు దేవి తన పూజా కాలమగు యొక రాత్రిని, యీశ్వరున కిచ్చి తొమ్మిది పగళ్లను తాను తీసుకొనెను. ఆ తొమ్మిది పగళ్లె, దేవీ నవరాత్రు లనెదరు. ఆపర్వ దినములలో దేవికి పగలుపూట కూడ అర్చనాదులు జరుగును. ఆ 9 దినములు ఆశ్వయుజ శుద్ధపాడ్యమి మొదలు మహానవమి పర్యంతము పూజించుట యాచారముగ నున్నది. పూర్వదినమగు ఆశ్వీయుజ శుద్ధ అష్టమియే దుర్గావతార సమయము. అందువలన దానిని దుర్గాష్టమి యందురు. మరునాడు నవమి మహానవమి. ఈ రోజునే భూకైలాసము. అనగా శివుని "పర్వారు" పట్టాభిషేక దినము. ఆ దేవి యీశ్వరుని కిచ్చిన రాత్రియే శివరాత్రి యందురు. ఆ రోజునే యీశ్వరుని లింగావతార సమయము. ఇది శైవుల కత్యంత ప్రీతికరమైన రోజు. ఆగమోక్త ప్రమాణము ననుసరించి, యీ దినమున యీశ్వరునికి పగలు నైవేద్యమును మాని, లింగోద్భవ కాలమువరకు యుండి యప్పుడు పూజనము లొనర్చి నివేదనముఁ చేయుటాచారము. ఇట్లు స్వామికి పగలు నివేదన లేనందువలన శైవులును నా రోజున యుపవాస వ్రతమునుఁ జేయుదురు. ఇది వారికి పర్వదినము. ఈ శివరాత్రిని యాంధ్రదేశమున నన్ని శివాలయము లందును చేయుదురు. అందు యీ క్రింది క్షేత్రములు ప్రసిద్ధమైనవి.

(1) కాళహస్తి (చిత్తూరు): ఇందుగల స్వామిపేరు శ్రీ కాళహస్తీశ్వరుఁడు. అమ్మవారు సత్యజ్ఞాన ప్రసూనాంబ. ఇది చిత్తూరు జిల్లాలో కలదు. సుప్రసిద్ధ శివక్షేత్రము. దీనికే వాయులింగమని పేరు. ఇచ్చట దేవాలయమును భూకైలాసమందురు. ఎక్కడను గాలిసొరగని గర్భాలయములో పెట్టిన దీపము గాలికి యెల్లప్పుడు కదలుచుండు నట్లుండును.

(2) తాటపర్తి (అనంతపురం): శ్రీ బుగ్గా రామలింగేశ్వరస్వామివారు. ఇది పురాతనమైన చాలా ప్రసిద్ధ శివక్షేత్రము. ఇందు అనేక శిలాశాసనములును, శిల్పచిత్రములును కలవు. ఇక్కడను శివరాత్రికే ప్రధానము.

(3) మడకశిర: శ్రీ సిద్ధేశ్వర క్షేత్రము. ఇదియు పురాతనమైన సుప్రసిద్ధ శివస్థలము. ఇచట శిల్పసంపద శాసన సంపత్తి కలదు. ఇది విజయనగర సామ్రాజ్య ప్రభువుల చేత కట్టింపబడినది. పెక్కురు యాత్రికులు వచ్చుస్థలము. అమ్మవారి పేరు హైమవతి. ఇచ్చట శివరాత్రి ప్రధానోత్సవము.

(4) శ్రీ శైలము (కర్నూలు): కర్నూలు జిల్లాలోనిది. మల్లికార్జున దేవరప్రభువు. భ్రమరాంబిక దేవేరి. ఇది త్రిలింగములలో నొకటి. ద్వాదశ జ్యోతిర్లింగములలో కూడ పేర్కొనబడినది. ఇది యొకప్పుడు బౌద్ధకేంద్రము. సుప్రసిద్ధ బౌద్ధాచార్యుడైన నాగార్జును డిందు చాలాకాల ముండెను. శివరాత్రికి యిచ్చటకు అనేక లక్షలమంది జనము వత్తురు; సుప్రసిద్ధమైనది.

(5) తాటిపర్రు (కడప): మూలస్థానేశ్వరుఁడు దేవుఁడు; ఇది గొప్ప ప్రధానమైన క్షేత్రము. ఇక్కడకూడ శివరాత్రికి గొప్ప యుత్సవము జరుగును.

(6) అమరావతి (గుంటూరు) ఇది పంచారామ క్షేత్రములలో నొకటి. ఇంద నేకశిలాశాసనములును, ప్రాచీన శిల్ప సౌందర్యము జూపు కట్టడములును కలవు. ఇదికూడ యొకప్పుడు బౌద్ధకేంద్రమై యున్నది. ఇది దేవేంద్రునిచే ప్రతిష్ఠితమైనది. ఇక్కడ శివరాత్రి యుత్సవము బాగా జరుగును. దీనికి ధర్మకర్తలు వాశిరెడ్డి వెంకటాద్రినాయుఁడు గారి వంశీకులు. ఇది కృష్ణానదీ పశ్చిమతీరమున కలదు.

(7) విరూపాక్షము (కర్నూలు): ఇది తుంగభద్రా తీరమున మాధవ విద్యారణ్యస్వామిచే ప్రతిష్ఠింపఁబడినది. శ్రీ కృష్ణదేవరాయలవారిచే పోషింపబడినది. ఇందు శంకర పీఠముకలదు. ఇచట శివరాత్రికి పెద్దయుత్సవముజరుగును.

(8) యనమదల అను కోటప్ప కొండ (గుంటూరు): ఇది నరసారావుపేటకు 6 మైళ్ల దూరమునఁ గలదు. ఎత్తైన పర్వతముమీద గుడి యున్నది. అనాదినుండి యిక్కడికి ప్రభలు మ్రొక్కుకొని కట్టించుట ఆచారము. ప్రతి సంవత్సరము శివరాత్రికి అనేక వేల ప్రభలు వచ్చును. ప్రభయొక్క ప్రభావము యిచ్చటనే చూచి తీరవలెను. ఒక్కొక్క ప్రభ సుమారు 10 వేల రూపాయలుకూడ వెచ్చించి కట్టింతురు. ఎంతో దూరమునుండి 10-12 జతల యెడ్లను కట్టి లాగించుకొని వత్తురు.

(9) కాకాని (గుంటూరు): ఇక్కడ అనేకులు మ్రొక్కులు తీర్చుకొందురు. ఇదియు ప్రసిద్ధ శివక్షేత్రము. అనేక శాసనములు కలవు.

(10) గోవాడ (గుంటూరు): దీనినికూడ కోటప్ప కొండ అనియే యందురు. ఇక్కడను శివరాత్రి మహోత్సవము జరుగును. ప్రభలిక్కడకు పెక్కు వచ్చుచుండును.

(11) అరవపల్లి (గుంటూరు): ఇదియు కోటీశ్వర క్షేత్రమే. ఇక్కడను గొప్పగా శివరాత్రికి యుత్సవము జరుగును. ఈ క్షేత్రమున పశువులకు మ్రొక్కులు తీర్చు కొందురు.

(12) నంద్యాల (కర్నూలు): ఇది గొప్ప శివక్షేత్రము. ఇందు శిల్పసంపద కలదు. శివరాత్రికి యుత్సవము జరుగును.

(13) మహానంది (కర్నూలు): ఇది గొప్ప శివక్షేత్రము. ఇచ్చట గొప్ప నంది విగ్రహము కలదు. ఆ విగ్రహములో నుండి నొక జీవధార ప్రవహించుచుండును. ఇది యెక్కడ నుండి వచ్చుచున్నదో తెలియదు. ఆ నీరు అతి స్వచ్ఛముగా సంతతము ప్రవహించుచుండును.

(14) పెదకళ్లేపల్లి (కృష్ణా): ఇది ఉభయ నాగేశ్వర క్షేత్రములలో నొకటి. ఇది కర్కోటక క్షేత్రము. జనమేజయుండు సర్పయాగ మొనర్చిన చోటు. కృష్ణానది యుత్తర వాహినిగా ప్రవహించుటచే దీనిని దక్షిణ కాశి యందురు. ఇచ్చట శివరాత్రికి పెద్ద యుత్సవము జరుగుచుండును. దీనికి ధర్మకర్త చల్లపల్లి సంస్థానాధీశులైన శ్రీమంతు యేర్లగడ్డ శివరామ ప్రసాదుగారు.

(15) అయిలూరు (కృష్ణా): ఇదియు ఉభయ రామేశ్వర క్షేత్రములలో నొకటి. ఇది శ్రీ రామచంద్రునిచే ప్రతిష్ఠితము. ఇచ్చటను శివరాత్రికి ప్రసిద్ధముగా యుత్సవము జరుగును.

(16) బెజవాడ (కృష్ణా): ఇది కనక దుర్గాక్షేత్రము. ఇక్కడను మల్లీశ్వరుడు పూర్వము అర్జునునిచే ప్రతిష్ఠితుడయ్యెను. ఇక్కడను శివరాత్రికి గొప్ప యుత్సవము జరుగును.

(17) భీమవరము (పశ్చిమ గోదావరి): ఇచ్చట చంద్రప్రతిష్ఠితమగు సోమేశ్వరుడు దేవుడు. ఇది పంచారామములలో నొకటి. ఇదియును శివరాత్రికి ప్రసిద్ధి.

(18) పాలకొల్లు (పశ్చిమ గోదావరి): ఇక్కడ క్షీరా రామేశ్వరుడు జనార్దన స్వామిచే ప్రతిష్టింపబడెను. ఇదియు పంచారామములలో నొకటి. శివరాత్రి ప్రాధాన్యము గల క్షేత్రము.

(19) బలివె (పశ్చిమ గోదావరి): ఇచ్చట స్వయంభువ మల్లికార్జున లింగము. ఇక్కడ "తమ్మిలేర"ను యేరు కలదు. అనగా శ్రీరామచంద్రుని తమ్ముడైన లక్ష్మణస్వామి బాణముచే నొక బుగ్గను పాతాళమునుండె లాగెను. అందువలన దీనిని తమ్మిలేరందురు ఇక్కడ గొప్ప శివరాత్రి యుత్సవము జరుగును.

(20) ద్రాక్షారామము (తూర్పు గోదావరి): ఇది సూర్య ప్రతిష్ఠితమైన గొప్ప యీశ్వర క్షేత్రము. దీనికి భీమేశ్వరుడని పేరు. శివరాత్రికి గొప్ప యుత్సవము జరుగును.

(21) కుమారారామము (తూర్పు గోదావరి జిల్లా సామర్లకోట): ఇది పంచారామములలో నొక్కటి. దీనిని కుమారస్వామి ప్రతిష్ఠించెను. ఇచ్చట చక్కని సరోవరము కలదు. ఇదియు శివరాత్రి ప్రధానమైన క్షేత్రము.

(22 కోటిపల్లి (తూర్పు గోదావరి): ఇది గోదావరి తీరమున కలదు. ఇక్కడ కోటీశ్వరుడు ప్రతిష్ఠింపబడెను అర్ఘప్రతిష్టితము. పూర్వము యిక్కడ శ్రీకంఠ శివాచార్యులు శైవపీఠమును స్థాపించిరి. దానిని నేటికిని బోధానంద మహ మండలవారు నడుపుచూ సిద్ధులైరి. శివరాత్రికిచట మహోత్సవము జరుగును.

(23) ఆచంట (పశ్చిమ గోదావరి): ఆచంటేశ్వరుడు వెలసిన క్షేత్రము, శివరాత్రి ప్రధానమైనది

(24) కోటిలింగ క్షేత్రము (తూర్పు గోదావరి): ఇది రాజమహేంద్రవర సమీపమున గోదావరీ నదిలో కలదు. ఇదియు శివరాత్రి ప్రధానముగా జరుపు శైవ ప్రసిద్ధ క్షేత్రము.

(25) దేవునిగుంప (శ్రీకాకుళం): ఇది ప్రసిద్ధమైన శివ క్షేత్రము, పార్వతీపురంవద్ద కలదు. శివరాత్రి ప్రధానమైనది.

(26) పుణ్యగిరి క్షేత్రము (విశాఖపట్నం): ఇదియు అడవిలోగలదు. శివరాత్రికి ప్రధాన మగు శివక్షేత్రము. పెక్కువేల మంది యాత్రికులు యీ యడవిలోనికి వెళ్లి స్వామిని సేవింతురు.

(27) బలిఘట్టం (విశాఖపట్నం): ఇది నరిసీ పట్నం వద్ద మన్యంలో కలదు. ఇచ్చట బ్రహ్మలింగేశ్వరస్వామి యందురు. ఇచ్చటనే బలి చక్రవర్తి యీ స్వామిని ప్రతిష్ఠించి పూజించెనట. అందువలన దీనికి "బలిఘట్ట" మని పేరు. శివరాత్రి యుత్సవము జరుగును. ఇక్కడ అమ్మవారు రాజరాజేశ్వరి దేవి.

(28) ధారామల్లేశ్వరం (విశాఖపట్నం): ఇచ్చట ధారామల్లేశ్వరుడందురు. ఇదియు పురాతనమైన క్షేత్రము. శివరాత్రికి గొప్ప యుత్సవము జరుగుచుండును.

(29) ముఖలింగం (శ్రీకాకుళం): ముఖలింగేశ్వర స్వామివారు. అతిప్రాచీనమైన శివక్షేత్రము. శివరాత్రికి గొప్ప యుత్సవము జరుగును.

ఇవిగాక యింకను పెక్కు శివక్షేత్రములు ఆంధ్ర మండలమునగలవు. అన్ని క్షేత్రములందును శివరాత్రి యుత్సవములు విశేషముగా జరుపబడును.

# ఉపాసనారహస్యము

జ్యోతిష విద్వాన్, ఆగమవిశారద తంగిరాల సుబ్రహ్మణ్యశాస్త్రి.

## 10

### "వాస్తుయాగము, వాస్తూత్పత్తి"

పూర్వము కశ్యపునకు సింహికయను భార్యయందు రాహు, వాస్తువు అను యిద్దరు కుమారులు గలిగిరి. వారిలో రాహువును విష్ణువు చక్రముచే సంహరించెను. వాస్తువు గొప్పబలముగలవాడై భయంకరమగు దేహముతో గర్వించి దేవతలను జయించు నుద్దేశ్యముతో బయలువెడలి దేవలోకముల నాక్రమించి యుద్ధమున సురలనెల్ల నోడించి మదగర్వముచే తానే సమస్తలోకములకు ప్రభువుగా భావించి త్రిమూర్తులయొద్దకు బోయి యుద్ధమున కాహ్వానింపగా బ్రహ్మవిష్ణుశివులు అసురుని యౌద్ధత్యమును చూచి మిన్నకుండిరి. అంతట వాస్తువు త్రిమూర్తులతో నిట్లనెను. "ఈలోకమున నన్ను జయించువారు లేరు. నేనే సమస్త లోకములకు నాథుడను; మీకేమి వరము కావలయునో కోరుడు, యిచ్చెద" ననెను. వెంటనే శివుని సృష్టి ప్రబోధముచే విష్ణువు అసురుని జూచి "అసురుడా! అట్లయిన నీవు వెంటనే మరణించునట్లు వర మీయుము"- అని కోరెను. అంతట వాస్తువు విష్ణువుయొక్క మాయను గ్రహించి అసత్యభయముచే 'అట్లే యగు' నని వరమిచ్చి విష్ణువును జూచి "ప్రభూ! నేను మరణించినను నాకీర్తి లోకములో నుండునట్లు అనుగ్రహింపు" మని కోరగా విష్ణువు యిట్లు పలికెను. "ఓయీ వాస్తూ! నీవు శోకింపకుము; నీవు భూమియంశమున జన్మించితివి గావున భూమి యందే లయించెదవు; కాని భూమిని ఆశ్రయించు సమస్త భూతములు నిన్ను పూజింతురు; అట్లు పూజింపక భూమి యందు నివాస మేర్పరుచుకొన్నచో నీవు వారిని బాధింపుము. ఈరీతిగా నీకు భూమియందు ఖ్యాతి గల్గును." అని పల్కెను. అంతట వాస్తువు సంతోషించి తన్ను వధించుటకు యిష్టపడెను. దేవతలు భూమియందు గొప్ప బిలమును త్రవ్వి అందు వాస్తువును అధోముఖముగా నుంచి పైన మట్టి యిసుక రాయి మొదలగు వస్తువులచే బిలమును పూడ్చి తిరిగి వాస్తువు లేచునను భయముచే బిలముమీద యేబదిముగ్గురు దేవతలు నివాసముగా నుండిరి. అందువలన గృహారంభమందు, యాగముల యందును, మండపనిర్మాణము మొదలగు కార్యముల యందు ముందుగా వాస్తుపూజ గావింప వలయును. ఇట్లు వాస్తువుయొక్క శరీరముమీద యెచ్చటెచ్చట దేవతలు గలరో వారితో గూడిన వాస్తువును పూజించుటయే వాస్తుపూజ యనబడును. వాస్తుయాగమును గురించి శాస్త్రము యిట్లు బోధించుచున్నది—

భూమేః పరిగ్రహె పూర్వం శిలానాం స్థాపనె తథా।
జలాధారగృహార్థెచ యజేద్వాస్తుం విశేషతః॥
అపరేష్వపి కార్యేషు యాగహోమాదికేషు చ।
వాస్తుమండలకం కుర్యాత్ సూత్రయిత్వా సమం గురుః॥
సుసమం సుఖదం వాస్తు విషమం న సుఖావహం।
బ్రహ్మాద్యదితిపర్యంతాః పంచాశత్త్రయసంయుతాః॥
సర్వేషాం కిల వాస్తూనాం నాయకాః పరికీర్తితాః।
అసంగృహ్య తు తాన్ సర్వాన్ ప్రాసాదాదీ న్న కారయేత్॥

అనిష్పత్తి ర్వినాశ స్స్యా దుభయో ర్ధర్మధర్మిణోః॥

కావున సర్వకార్యములయందును వాస్తుయాగము ముఖ్యమై యున్నది. వాస్తుపురుషుడు ఈశాన్యదిక్కున శిరమును నైరుతి పాదములు గలిగి అధోముఖముగా భూమిలో శయనించి యున్నాడు. అట్టి వాస్తువుయొక్క శరీరమునందు యే యే అవయవములలో యే యే దేవతలుగలరో ఆ యా దేవతలు యాక్రింద వ్రాయబడుచున్నారు. ఆ దేవతలను పూజించుటయే వాస్తుపూజ యనబడును. ఇట్లు వాస్తు దేవతను పూజించుటకు ముందు పూజార్థమై మండలమును లిఖించుకొన వలయును. ముందుగా మండలస్థానమును గోమయముతో అలకవలయును (భూమియే గోరూపమును ధరించుట వలనను సర్వౌషధులకును సర్వబీజములకును స్థానము భూమి యగుటవలనను అట్టి భూరూపమగు గోవుయొక్క మలములో సర్వదేవతలు సూక్ష్మరూపముగా నున్నారు గావున గోమయాలేపనముచే భూమి శుద్ధమై సర్వదేవతాపూజలకు యోగ్యస్థానమగును). ప్రాచీనకాలమునుండియూ మన మహర్షులు తమ పర్ణశాలలను పూజాస్థానములను గోమయముతో అలుకుట ఆచారమై యున్నది. దుష్టరోగకారణములగు విషక్రిములు భూమియందును గాలియందును ఉండుటవలన అట్టి క్రిములను గోమయము నాశమొనర్చుటచే యిట్టి క్రియ చేయుట ఆచారమై యున్నది. తదనంతరము నిలువుగా తొమ్మిది రేఖలు అడ్డముగా తొమ్మిది రేఖలను లిఖించి అరువదినాల్గు కోష్ఠములుగా దర్భలచే గాని బంగారుకమ్మిచే గాని మండలమును లిఖించుకొన

వలయును. ప్రతిరేఖకు మధ్య సుమారు రెండు అంగుళములు ఖాళీ వుంచవలయును. ఇట్లు లిఖించి అనంతరము ఈశాన్యదిక్కున ప్రారంభించి గంధపుష్పాక్షతలచే వాస్తుపురుషుని శిరమునుండి క్రమముగా నాభిపర్యంతము యేబదిముగ్గురు దేవతలను పూజించవలయును. శిరమున శిఖిని, దక్షిణనేత్రమందు పర్జన్యుని, దక్షిణకర్ణమందు జయంతుని, దక్షిణభుజమందు కులిశాయుధుని, దక్షిణబాహువునందు సూర్యుని, దక్షిణబాహుసంధిలో సత్యుని భృశుని, దక్షిణముంజేతియందు ఆకాశమును, ముందుభాగమున వాయుని, మణిబంధమున పూషను, పార్శ్వమున వితథను గృహక్షతుని, తొడయందు యముని, జానువునందు గంధర్వుని, జంఘలో భృంగరాజును, గుల్ఫమున మృగయుని, పాదములందు పితరులను, వామగుల్ఫమున దౌవారికుని, వామజంఘమున సుగ్రీవుని, జానువునందు పుష్పదంతుని, ఊరువున వరుణుని, పార్శ్వమున అసురుని శోషను, మణిబంధమున పాపమును, ముంజేతియందు రోగమును అహియును, బాహుసంధిలో ముఖ్యుని, బాహువున భల్లాటుని సోముని, భుజమున సర్పమును, వామకర్ణమున అదితిని, వామనేత్రమున దితిని, ముఖమున ఆపుని, దక్షిణహస్తమున సావిత్రుని, గుహ్యమున జయుని, వామహస్తమున రుద్రుని, దక్షిణస్తనమున అర్యముని, వామస్తనమున సవితను, జఠరదక్షిణభాగమున వివస్వంతుని, వృషణములయందు విబుధాధిపుని, జఠరవామభాగమున మిత్రుని, తిరిగి దక్షిణహస్తమున రాజయక్ష్మను, వామహస్తమున పృథ్వీధరుని, వక్షస్థలమున ఆపవత్సుని, నాభియందు బ్రహ్మను, వీరికి ఉత్తరదిక్కున వాస్తుపురుషుని మండలమునకు ప్రాగాదిగా స్కందుని చరకిని జృంభకుని విదారిని పిలిపిచ్ఛకుని పూతనారిని పాపనాశకుని పాపరాక్షసిని యిట్లు ప్రణవాదినమోంతముగా నామమంత్రములతో "ఓం శిఖినే నమః" ఇట్లు ఆవాహనము చేసి పూజించి ప్రార్థించ వలయును. అనంతరము మండలమునకు తూర్పుభాగమున కుండమున అగ్నిని ప్రతిష్ఠించి సమిదాజ్యచరువ్రీహులతో వాస్తుమంత్రముతో "వాస్తోష్పతే" అను మంత్రముతో 108మార్లు హోమము చేసి వాస్తుదేవతలకు ప్రత్యేకముగా హోమము చేసి వాస్తుదేవతలకు బలి యొసంగవలయును. ఇట్లు పూజించుటయే వాస్తుపూజ యనబడును.

వాస్తువనగా, "వసన్తి ప్రాణినః అత్రేతి వాస్తు" అను వ్యుత్పత్తివలన వాస్తువనగా గృహ మనియు అట్టి గృహలక్షణములను, గుణ దోషములను వర్ణించుటవలన, శాసించుటవలన వాస్తుశాస్త్రమనియు చెప్పబడుచున్నది. ప్రాణులకు సర్వసౌఖ్యమును యిచ్చునది గృహము. "గృహ్యతే అనేన సంపదాదికం ఇతి గృహం" దీనిచేత సర్వసంపత్తులు గ్రహింపబడును గాన గృహమని తెలియుచున్నది ఈవిషయమున శ్రుతి యిట్లు చెప్పుచున్నది—

శ్రు॥ ఇహైవ ధ్రువాం నిమినోమి శాలాం,
క్షేమే తిష్ఠతు ఘృత ముక్షమాణా।
అశ్వావతీ గోమతీ సూనృతావతీ,
ఉచ్ఛ్రయస్వ మహతే సౌభగాయ॥

"ఈ స్థలములో స్వకీయమైన గృహమును (శాలను) కట్టుకొందును. ఈ గృహము నాకు కళ్యాణమును యిచ్చుగాక! ఈగృహమే అశ్వములు, గోవులు, సంతానము మొదలుగా గల సర్వసంపదలకు కారణమగుగాక" అనుట వలన సర్వసుఖములకు గృహమే కారణము. మరియు—

పుత్రాదికభోగసౌఖ్యజనకం ధర్మార్థకామప్రదం,
జంతూనాం లయనం సుఖాస్పద మిదం శీతాంబు ఘర్మాపహం।
వాపీదేవగృహాదిపుణ్య మఖిలం గేహా త్సముత్పద్యతే
గేహం పూర్వ ముశన్తి తేన విబుధాః శ్రీవిశ్వకర్మాదయః॥

కావున పరమేశ్వరుడగు విశ్వకర్మ యిట్టి భోగసాధనమగు వాస్తుశాస్త్రమును వాస్తుపథానంతరము భూమిని ఆశ్రయించు ప్రాణులకొరకు మహర్షుల కుపదేశించెను.

శ్రు॥ "విశ్వకర్మా దిశాం పాతు నః పశూన్పాతు సోఽస్మాన్పాతు తస్మై నమః" అనుటచే విశ్వకర్మ యనగా విరాట్.

అట్టి విరాట్టగు పరమేశ్వరునిచే నిర్మింపబడినది వాస్తుశాస్త్రము. ఈశ్వరునిచే నిర్మితమై ఋషులచే ప్రకటితమైన వాస్తుశాస్త్రరీత్యా మానవులు భూపరీక్ష చేసి ఆయాదిలక్షణయుక్తమగు గృహములను ఆలయములను మండపాదులను నిర్మించుకొని సర్వసుఖములు పొందుదురు. అట్లు ఆయనిరూపణము చేయక లక్షణహీనమగు గృహాదులచే సకలబాధలు పొందుదురు. ఆయమనగా సుఖము, సంపాదనము; వ్యయమనగా దుఃఖము, ఖర్చు; గావున భగవంతుడు మానవులకు సుఖదుఃఖములను కలిగించును. గురు - రవి - బుధ - కుజ - శుక్ర - శని - చంద్ర - రాహువులను గ్రహములయొక్క అధిపత్యమున ప్రాగాదిక్రమముగా - అ-క-చ-ట-త-ప-య-శలను, వర్గాష్టకములతో ధ్వజ-ధూమ-సింహ - శ్వాన - వృషభ - ఖర - గజ - కాకాయములను యెనిమిది దిక్కులయందు యేర్పరచి వారివారి నామాక్షరములచే వర్గములనుండి లాభాలాభములను, జయాపజయములను, శతృత్వమిత్రత్వములను తెలిసుకొని ఆయా స్థలములయందు గృహాదులు నిర్మించుకొని సౌఖ్యములను పొందుటయే వాస్తుశాస్త్రప్రయోజనము. దేవతలు నివసించు గృహమునకు ప్రాసాదమనియు, మండపనియు, ఆలయ

మనియు పేర్లు గాన క్రియాదీక్షయందు మండప నిర్మాణ మునకు వలయు వాస్తుపూజ గావించి అనంతరము మండపనిర్మాణము చేయవలను.

## మండప నిర్మాణము

మండపమనగా "మండ్యతే అనేనేతి మండపః" దీనిచేత దేవతలు ప్రకాశింపబడుదురు గాన మండప మని చెప్పబడినది. మండపము ఉత్తమ మధ్యమ అధమ భేదములతో మూడు విధములుగా చెప్పబడినది. 16 మూరలు పొడుగు వెడల్పు గలది ఉత్తమము. 14 మూరలు మధ్యమము. 12 మూరలు అధమము. ఈ మండపము చతురస్రముగా చతుర్ద్వారములతో నుండవలయును. మండపక్షేత్రమును తొమ్మిది భాగములుగా విభజించి భాగసంధులయందు వరుసగా 12 స్తంభములును మధ్యభాగమునకు నాల్గు వైపుల నాల్గు స్తంభములును మొత్తము 16 స్తంభములను పాతవలయును. లోపల స్తంభములు 8 మూరల యెత్తున్నూ వెలుపల స్తంభములు 5 మూరలున్నూ యెత్తు ఉంచవలయును. నాల్గు వైపుల నాల్గు ద్వారములు ఉంచవలయును. ద్వారములకు ముందు హస్తప్రమాణ దూరములో నాల్గు బహిర్ద్వారములు (తోరణములు) ఉంచవలయును. ఆ తోరణములు తూర్పుమొదలుగా రావి, మేడి జువ్వి, మర్రి కర్రలతో చేయబడి 5 మూరల యెత్తు 2½ మూరల వెడల్పు గలిగి ఉండవలయును. స్తంభముల పైభాగమున అడ్డముగా వెదురు మొదలగు కర్రలతో కట్టిన ద్వారములు గాక మిగిలిన భాగమంతయూ పచ్చ, తాటి యాకులు, కొబ్బరి ఆకులు మొదలగువానితో కప్పవలయును. ఇట్లు మండపమును నిర్మించి మండపము యొక్క లోపల నాల్గు స్తంభముల మధ్యలో ప్రధాన వేదికను అమర్చవలయును. తూర్పునుండి వరుసగా యెనిమిది దిక్కులలో యెనిమిది హోమకుండములను యీశాన్య-తూర్పులకు మధ్యలో ఆచార్యకుండమును, యిట్లు తొమ్మిది కుండములను నిర్మాణము చేయవలయును. తూర్పున చతురశ్రము, ఆగ్నేయమున యోన్యాకారము, దక్షిణమున అర్ధచంద్రమును, నైరుతియందు త్రికోణము, పశ్చిమమున వర్తులమును, వాయవ్యమున షట్కోణమును, ఉత్తరమున పద్మాకారమును, యీశాన్యమున అష్టకోణము, అష్టకోణమునకు చతురశ్రమునకు మధ్యలో చతురశ్రరూపమగు ఆచార్య కుండమును వాస్తుశాస్త్రప్రమాణము ననుసరించి నిర్మించవలయును. అనంతరము మండపముయొక్క శిరోభాగమున సాధకుడు యిష్టదేవతయొక్క ధ్వజమును తెల్లని వస్త్రమున లిఖించి ఆ ధ్వజమును కట్టవలయును. మరియు తూర్పునుండి యెనిమిది దిక్కులయందు దిక్పాలక ధ్వజములగు వజ్ర, శక్తి, దండ, ఖడ్గ, పాశ, ధ్వజ, అంకుశ, త్రిశూలములను వారి వారి వర్ణములగు శ్యామ రక్త, కృష్ణ, ధూమ్ర, శ్వేత, పీతశ్యామ, శ్వేతవర్ణములుగల వస్త్రములయందు లిఖించి కట్టవలయును. ఇట్లు తయారైన మండపమును శుద్ధినిమిత్తముగా గోమయముతో అలకవలయును. అనంతరము పంచవర్ణ చూర్ణములతో ముగ్గులను ఉంచవలయును—ఇట్టి మండపము క్రియాదీక్షయందును, దేవపూజయందును ముఖ్యమై యున్నది. మండపనిర్మాణము చేయక పూజాదికాదులు జరిగిన దేవ సాన్నిధ్యము గలుగదు; గనుక ముఖ్యమై యున్నది. కావున మండపమును గూర్చి విచారించుట అవసరమై యున్నది.

మండపమనగా దేహము. దేహము యెట్లు దేవతలకు (ఇంద్రియముల అధిపతులు) నివాసమో అట్లే మండపము గూడ దేవతలకు నివాసము. దేవతలచే దేహ మెట్లు ప్రకాశించునో మండపమునూ అట్లు దేవతలచే ప్రకాశించును. బ్రహ్మాండమంతయూ ఆధ్యాత్మిక ఆధిదైవిక ఆధిభౌతికములను మూడు విధములుగా ప్రకాశింపుచున్నది. అట్టి మూటిని తెలుసుకొనుటవలన బ్రహ్మాండ, దేహ, దేవతలకు అభేదము తెలియును. ఇట్లు అభేదము తెలియుటయే ఉపాసనయొక్క ముఖ్యోద్దేశ్యము. కావున దేహమగు అధ్యాత్మకు, కాలమగు అధిదైవమునకు, మండపరూపమగు అధిభౌతికమునకు, ఏకత్వము బోధించుటవలన సాధకునకు అభేద జ్ఞానము గలుగును. అందుచే ఉపాసనాంగమగు మండప నిర్మాణము అవసరమై యున్నది. ఇప్పుడు వెనుక చెప్పిన అధిభౌతిక బ్రహ్మాండరూపమగు మండపమునకు అధ్యాత్మరూపమగు దేహమునకు అధిదైవమగు కాలమునకు అభేదము చెప్పబడును.

మండపమనగా బ్రహ్మాండము-బ్రహ్మాండమనగా దేహము-దేహమనగా ప్రజాపతి - ప్రజాపతి యనగా కాలము - కాలమనగా మంటపము- ఇట్లు అభేదమై యున్నది. మండప విస్తార ఆయామము 16 మూరలు అనుటవలన దేహమందుగలపంచభూత, పంచకర్మేంద్రియ పంచజ్ఞానేంద్రియ మనస్సులగు 16 భాగములకు కాలమునకు అవయవ రూపములైన లవ, త్రుటి, కళ, కాష్ఠ, ఘటిక, ముహూర్త, ప్రహర, దివస, పక్ష, మాస ఋతు, అయన, వత్సర, యుగ, ప్రళయరూపములగు 16 నకు సామానాధికరణ్యము గలదు. కావున దేహ, కాల, మండపములకు ఏకత్వము తెలియుటకై మండపమునకు 16 మూరలు- అని చెప్పబడినది. మరియు మండపమునకు స్తంభములు 16. వీనిలో వెలుపల 12—లోపల 4—మొత్తము 16 స్తంభములు. ఇట్లే దేహమునకు వెలుపల స్తంభములు 12—భుజములు 2, కూర్పరములు 2, మణికట్లు 2, తొడలు 2,

మోకాళ్లు 2, పాదములు 2, మొత్తము 12. లోపల స్తంభములు 4—అనగా మనసు, బుద్ధి, చిత్తము, అహంకారము. ఇట్లు మొత్తము 16 దేహమునందునూ, యిట్లె కాలమునకు వెలుపల స్తంభములు—12 రాశిరూపములగు మాసములు 12. లోపల స్తంభములనగా మాసములను నడిపే—అగ్ని, వాయు, సూర్య చంద్రులు 4—మొత్తము 16. ఇట్లు సామానాధికరణ్యము గలదు. మరియు మంటప స్తంభముల యెత్తు వెలుపల స్తంభములు 5 మూరలు, లోపల స్తంభములు 8 మూరలు అగుటవలన పంచభూత రూపములునూ, అష్టప్రకృతుల రూపములును అగుచున్నవి. అట్లె దేహమందు వెనుక చెప్పబడిన బయటి స్తంభరూపములగు భుజములు మొదలగునవి పంచభూత రూపములునూ, లోపల స్తంభరూపములగు మనస్సు మొదలగునవి అష్టప్రకృతుల రూపములునూ, అయివున్నవి. గనుక కాలమునకుకూడ వేదప్రమాణముచే బయటి స్తంభరూపములగు మాసములతోగూడిన వత్సరమునకు, సంవత్సర, పరివత్సర, ఇదావత్సర, ఇద్వత్సర, వత్సర, అను పంచరూపములునూ లోపల స్తంభరూపములను అగ్ని, వాయు, సూర్య, చంద్రులకు, సంచారయోగ్యము కొరకు పంచవత్సరాత్మకమున్నూ లోకత్రయమున్నూ కలిగి యెనిమిది అయివున్నవి. వీనిని ఏకముగా తెలియుటకై మంటప స్తంభములకు ప్రమాణములను ఉపాసనాశాస్త్రము నిర్ణయించియున్నది. మండపమునకు నాల్గు ద్వారములు ఉంచవలయును- అనుటవలన దేహమునందలి నాల్గు ముఖ్య ద్వారములు సూచితములు; ప్రజాపతి రూపమగు మండపమునకు ప్రాగ్ద్వారము ఋగ్వేద రూపము అధిపతి అగ్ని. అట్లె దేహమందు ప్రాగ్ద్వారము అగ్ని దైవత్యమగు ముఖము—దక్షిణ ద్వారము యజుర్వేద రూపము అధిపతి యింద్రుడు; దేహమందు ఇంద్ర దైవత్యమగు కర్ణములు దక్షిణద్వారము. పశ్చిమద్వారము అథర్వణవేద రూపము, అధిపతి మిత్రావరుణాత్మక సూర్యుడు. దేహమందు సూర్య దైవత్యమగు నేత్రములు పశ్చిమద్వారము. ఉత్తరద్వారము సామవేద రూపము, అధిపతి సోముడు. దేహమందు సోమ దైవత్యమగు హృదయము ఉత్తర ద్వారము. ఇట్లె కాల రూపుడగు ప్రజాపతికి ప్రాగాదిగా అగ్ని, ఇంద్ర, సూర్య చంద్రులు ద్వారరూపులు ఇట్లు తెలియుటకు మండపమునకు నాల్గు ద్వారములు నిర్ణయింపబడియున్నవి. మండపమునకు- ద్వారములకు ముందుగా తోరణములు- అని చెప్పుటవలన అలంకారములుగా తోరణములు చెప్పబడినవి. తూర్పు తోరణము—రావి ఆరోగ్యమును, దక్షిణ తోరణము- మేడి భూతిని (ఐశ్వర్యము), పశ్చిమ తోరణము- జువ్వి బలమును ఉత్తర తోరణము మర్రి శాన్తిని యిచ్చునవి గావున దేహమునకు ఆరోగ్యము, ఐశ్వర్యము, బలము, శాన్తిని- అగ్ని ఐశ్వర్యమును, యింద్రుడు బలమును సూర్యుడు ఆరోగ్యమును యిచ్చువారై యున్నారు. కావున మండప, దేహ కాలములకు అవినాభావము గలదని తెలియుచున్నది,

కావున కాలాత్మక ప్రజాపతియే బ్రహ్మాండము- దేహమే ప్రజాపతి - మండపమె బ్రహ్మాండము - యిట్టి మండపము సోమ సూర్య అగ్న్యాత్మకము; వెనుక చెప్పినట్లు స్తంభములకు పైభాగము- శిరస్సు సోమరూపమున్నూ స్తంభములు- వేదిక సూర్యరూపము- హోమకుండములు- అగ్ని, అగ్నిరూపమున్నూ అయివున్నవి. మండపమునకు మధ్య గల నాల్గు స్తంభములమధ్యను వేదిక యనుటవలన దేహమందుగల హృదయపీఠమె వేదికయని తెలియుచున్నది. కాలరూపుడగు ప్రజాపతికి హృదయస్థానము ఆదిత్యుడు- అనగా "విదంత్యస్యాం ఇతివేదికా" అనుటచే హృదయ పీఠమునందు ఆదిత్యరూపుడగు ఆత్మయుండి సమస్తమును తెలియుచుండుటవలన దేహమందుగల హృదయమే మండపమందుగల వేదిక - యీ వేదియందు సాధకుని ఉంచి గురువు అభిషేకముచేయుటచే శిష్యుడు దేవతాస్వరూపమును చక్కగా తెలియగలడు కావున దీక్షలయందు ప్రధానవేది ముఖ్యావసరమై యున్నది.

మండపమందు నవకుండములను యేర్పాటు చేయవలయుననుటచే దేహమందలి నవవిధములగు ప్రాణస్థానములే కుండములు అయియున్నవి. కుండమనగా అగ్నికి నివాసస్థానమగుటవలన దేహమందలి అగ్ని మొదలగు దేవతలకు ప్రాణస్థానములగు రంధ్రములే స్థానములు—ఎట్లనగా - ముఖమే చతురశ్రరూపమగు అహవనీయము, నాభి వృత్తరూపమగు గార్హపత్యము, కుడికన్ను అర్ధచంద్ర రూపమగు దక్షిణాగ్ని, గుహ్యస్థానము యోనికుండము, కుడి ముక్కు త్రికోణకుండము, యెడమముక్కు పంచకోణ కుండము. కుడిచెవి అష్టకోణకుండము. యెడమచెవి పద్మకుండము, యెడమకన్ను చతురశ్రరూపమగు ఆచార్య కుండము. కాలాత్మకుడగు అగ్ని యెనిమిదిరూపములను పొంది అగ్ని, జాతవేద, సహోజ, అజిర, వైశ్వానర, నర్యాపస, పంక్తిరాధస, విసర్ప అను పేర్లతో పైనచెప్పిన మొదటి యెనిమిది కుండములయందునూ తొమ్మిదవకుండమగు ఆచార్యకుండమున మంత్రరూపకుండమున తపస్సనే శివాగ్నిరూపుడగు అగ్ని యుండియున్నాడు. కావున మండపమందలి కుండములకు దేహమందలి ప్రాణస్థానములకు కాలాత్మకుడగు అగ్నియొక్క నవరూపములకు అభేదము.

ఈ మండపమున నిర్మాణము చేయు కుండములకు మేఖలములు, కంఠము, నాభి, యోని, బిలము అను

అయిదు అవయవములు కలవు. ఈ అయిదున్నూ పంచభూతరూపములు; ఎట్లనగా - మేఖలములు పృథివీ భూతము. కంఠము ఉదకభూతము, నాభి అగ్నిభూతము, యోని వాయుభూతము, బిలము ఆకాశభూతము అని తెలియవలయును. ఇట్లె శరీరమునందు కుండరూపములగు రంధ్రములయందుగూడ అవిధముగనే పంచభూతరూపములు గలవు. ఎట్లన - నేత్రములలో రక్తరేఖలు పృథివీభూతరూపమగు మేఖలములు, తెల్లగుడ్డు ఉదకభూతరూపమగు కంఠము. నల్లగుడ్డు వాయుభూతరూపమగు యోని, నీలము ఆకాశభూతరూపమగు బిలము. ఆ లోని కళయే అగ్నిభూతరూపమగు నాభియందుగల జ్యోతియనియూ యిట్లు తెలిసి కుండమనగా ఆత్మయొక్క స్థానముగాని వేరుగాదను బుద్ధితో అభేదమును తెలియుటకుగాను ఉపాసనములో దీక్షాదులయందు కుండమంటప నిర్మాణము అత్యంతము అవసరమై యున్నది. కావున దేశికుడు ముందుగా మంటపకుండ నిర్మాణము చేయించి సాధకునకు క్రమముగా వాని అవినాభావమును బోధించి మంటపమునకు దేహమునకు కాలమునకు అగ్నీషోమాత్మకత్వము బోధించి అగ్నీషోమాత్మకమగు శివశక్తి సంపుటమును తెలియపరచుటకై క్రియాదీక్షలో సగుణ రూపమగు మండపకుండములతో అవసరము గలదు. అట్లు మండపకుండ రచన గావించుకొని తదనంతరము అంకురారోపణమును చేయవలయును.

## అంకురారోపణము

· అంకురారోపణమనగా మంగళార్థము చేయబడు నొక కర్మమునకు పేరు. ఇందలి ముఖ్యవిషయము బీజములను పాలికాదులగు పాత్రలలోగల మృత్తికలోవుంచి అంకురోదయముచే శుభాశుభఫలముల నెరుంగుట. శాస్త్రములయందు వివాహము, మౌంజిబంధనము, దీక్షారంభమందును యిట్టి మంగళరూపమగు అంకురారోపణము ముఖ్యముగా వర్ణింపబడియున్నది

పాలికలు, ఘటికలు, శరావములు అను పేర్లుగల పాత్రలను బంగారు, వెండి, రాగి, లేక మట్టివిగాని తంత్రశాస్త్రోక్తరీత్యా తయారుచేసి పదునారుగాని, పదునాల్గుగాని, పన్నెండుగ్గాని యథాప్రకారము వేరువేరుగా గ్రహించి వానిలో శుద్ధమగు పుట్టమట్టినివుంచి ఆ మృత్తికలో బీజములను. అనగా బ్రహ్మదైవత్యమగు యవలను, శివరూపమగు ఆవాలను, స్కందరూపమగు కొర్రలను, వాయురూపమగు అనుములను, విష్ణురూపమగుపెసలను, లక్ష్మీరూపమగువడ్లునూ, సూర్యరూపమగుగోధుమలు, వరుణరూపమగుమినుములు, యమరూపమగు నువ్వులు, నిరుతిరూపమగు కందులు, అగ్నిరూపమగు ఉలవలు, (సర్వబీజములకు అధిపతి సోముడు) మొదలగు బీజములను ఉంచి పైన మృత్తికతో పూరించి అయిదుదినములు సోమకలశమున సోముని పూజించి ఆ ఉదకమును చల్లుతూ అంకురోదయమున ఫలమును గ్రహింపవలయును. క్రియాదీక్షయందు అంకురారోపణముయొక్క అవసరమును గూర్చి విచారింతము. బీజము-అంకురము అను దృష్టాంతముచే సాధకునకు శివశక్తులయొక్క ఏకత్వమును తెలియజేయుటయే అంకురారోపణముయొక్క ముఖ్యవిషయము. సకలుడగు (శక్తిసహితుడగు) శివునివలన బీజము (సృష్టికారణము) కలిగినది - అని పూర్వమె చెప్పబడినది. సృష్టికి ఈశ్వరేచ్ఛ, కాలము, ప్రయత్నము మొదలగునవి ముఖ్యములు. శివశక్తుల సంయోగరూపమే బీజము, అట్టిబీజమే సోమరూపము. ఈ సోమరూపమగు బీజమునుండి అగ్నీషోమాత్మక బ్రహ్మాండ ముత్పన్నమైనది. బ్రహ్మాండమంతయూ శివశక్త్యాత్మకమని సాధనచే తెలియుటకై సాధనరూపము అంకురారోపణము.

అంకురారోపణ క్రియలోని శరావాదులు మృద్వికారములు. మృత్తికయనగా అగ్నిరూపము. అట్టి అగ్నిరూపమగు మట్టిలో బీజమును ఉంచినయెడల అగ్నియందంతర్భావముగల కాలరూపము సూర్యకిరణ సంపర్కమను ప్రయత్నముతో యీశ్వరేచ్ఛవల్ల బీజమునుండి అంకురము కలుగుచున్నది. బీజమును మట్టి నీరు మొదలగు వస్తువులచే సంయోగముచేయక ఉంచినచో యెంతకాలమునకైననూ అంకురోత్పత్తి కలుగనేరదు. అట్లె యిచ్ఛాకాలము మొదలగునవి లేక యీశ్వరుడగు సకలునివలన బ్రహ్మాండముత్పన్నముగాదు. బీజమునందు అంకురకాండపత్రపుష్పఫలాదులు కంటికి అగుపించని సూక్ష్మరూపముతో అంతర్భూతమై యున్నవి. అట్లు అంతర్భూతమై యున్ననూ యిచ్ఛాదులు లేక అభివ్యక్తములుగావు. కావున సాధకుడు యిచ్ఛాదులవల్ల బీజములను శరావాదులయందు వైచి అంకురోత్పత్తి చేసినయెడల బీజములలోనుండు అంతర్భూతశక్తి రూపమగు అంకురము బయలువెడలి ప్రతిక్షణము పరిణామము పొందుచూ తిరిగి బీజరూపమును పొంది బీజమందు అంతర్భావమై తిరోహితమగుచున్నది. గనుక ముందు బీజము, వెనుక బీజము శివశక్త్యాత్మకమై యుండుటవలన మధ్య పరిణామముపొందు అంకురాదులు మాయికములుగాని యథార్థములు గావు. అట్లె సర్వశక్తిసంపన్నుడగు పరమేశ్వరుడు సృష్టికి ముందును సృష్టికి వెనుకను ఉండి మధ్యలో పరిణామరూపమగు బ్రహ్మాండము అభివ్యక్తమగుటవలన బ్రహ్మాండము మాయికమె. పరమేశ్వరు డొక్కడుమాత్రమే యథార్థము - అని సాధకునకు తెలియజేయుటకై దీక్షాంగముగా అంకురారోపణము

ముఖ్యమైయున్నది. నిర్గుణ బ్రహ్మతత్వము సాధనచేగాక గ్రంథపఠనమాత్రముచే గోచరముగాదు "బ్రహ్మసత్యం జగన్మిథ్యా జీవో బ్రహ్మైవనాపరః" అను సూక్తి సాధనచే మాత్రమె గోచరమగుటవలన జ్ఞానమునకు సాధనమగు ఉపాసనము చాల ముఖ్యమని అద్వైతమత స్థాపనాచార్యులగు శంకరభగవత్పాదులు ఉపదేశించియున్నారు. సామాన్యముగా మానవులు బ్రహ్మాండముయొక్క పుట్టుకయున్నాలయమున్నాగూడా ప్రత్యక్షముగా చూపలేరు. గావున ఉపాసనాకాండమున బీజాంకురదృష్టాంతమున అంకురారోపణమనె కర్మసాధనద్వారా గురువు శిష్యునకు ఉపదేశించి క్రమముగా అన్ని సాధనలయందును శివశక్తి సంపుటమును బోధిస్తూ క్రియాదీక్షద్వారా అద్వయ బ్రహ్మతత్వమును బోధింపుచున్నాడు. ప్రస్తుతము చరిత్రకారులు భూమండలమును గ్లోబుగా తయారుచేసి ఆ గ్లోబుద్వారా (స్కెచ్) దేశములు, సముద్రములు, నదులు, పట్టణములు పర్వతములు, అరణ్యములు చూపించినట్లు అద్వయ బ్రహ్మతత్వమును (అనగా జ్ఞానమును) ఉపాసనాకాండమునందు క్రియాదులు - అను స్కెచ్ద్వారా చూపించి దేహమునకు క్రియలకు బ్రహ్మాండమునకు శివశక్తులకు అభేదమును చూపించి ఏకత్వమును బోధింపుచున్నది. అందువలన క్రియాదీక్షయందు అంకురారోపణము ముఖ్యమైయున్నది. (సశేషము)

---

# మధురానగరి - మధురస్మృతులు

యం. చిట్టిబాబు

మన దక్షిణదేశపు పుణ్యస్థలాల్లో మధురానగరం ప్రముఖమైంది. 'మధురం' అంటె తియ్యదనం అని అందరకూ తెలుసు. దీన్నిబట్టి మధురాపట్టణంలోనూడా ఏదో ఒక తియ్యదనం ఉండే తీరాలి. అవును. ఆ విచిత్రమైన స్థలపురాణమే ఇప్పుడు మనం తెలుసుకోబోతున్నాం :

చాలాకాలంకిందట పాండ్యదేశంలో ఒక వర్తకుడు. ఒకనాడు అతను తన వ్యాపారంమీద బయల్దేరాడు. ఆ కాలంలో మహారణ్యాల్లోనుంచి పోవలసివచ్చేది. అలానే అతడు ఒక అరణ్యంలో ప్రయాణం సాగిస్తున్నాడు. కొంత సేపటికి అలసిపోయి, ఒక చెట్టుకింద చతికిలబడ్డాడు.

చెట్టుకింద కూచుని విశ్రాంతి తీసుకుంటున్న ఆ వర్తకుడికి అల్లంతదూరంలో ఒక కోనేరు కనిపించింది. ప్రాణం లేచివచ్చింది. తిన్నగా అక్కడికి వెళ్లి దాహం తీర్చుకుని, గట్టెక్కుతూవుండగా ఒక శివలింగం కనిపించింది, చూసి ఆశ్చర్యపోయాడు.

అంతలో పొద్దు వాలటంచేత ముందుకు సాగలేక, వర్తకుడు అక్కడే వుండిపోయాడు. తెల్లవారుఝామున ఒక చిత్రం జరిగింది!—దేవతలు వచ్చి ఆ శివలింగం చుట్టూ నాట్యంచేసి, భక్తితో ఆరాధించారు. కొలనులోని నీళ్లతో స్నానం చేయించారు. రకరకాల పువ్వులతో పూజచేసి అంతర్హితులయ్యారు. ఇదంతా చూడగా వర్తకుడి ఆశ్చర్యానికి అంతులేకపోయింది.

వెంటనే అతడు, ఆనాటి పాండ్యభూపతివద్దకు పోయి, జరిగినదంతా పూసగుచ్చినట్టు విన్నవించాడు. ఇది విని రాజూ ఆశ్చర్యపోయాడు. తక్షణమే రాజు పరివారంతోసహా శివలింగం వున్న చోటుకి బయల్దేరి వచ్చాడు. ఈసారి మరొక వింత కనబడింది—అక్కడ ఒక పెద్దపులి లేడిపిల్లకు పాలివ్వటం ప్రత్యక్షంగా రాజుకు కనబడింది!—రాజు విస్మితుడయ్యాడు.

శుభమహిమలతో విరాజిల్లె ఆ పవిత్ర ప్రదేశంలోనే తన రాజధాని నిర్మించుకోవాలని నిశ్చయించుకున్నాడు రాజు. కానైతే నగరానికి సరిహద్దులేవి?—ఆ పరమశివుని ప్రతిభ ఎంతమేర వ్యాపించివున్నదీ అని రాజు సందిగ్ధంలో పడ్డాడు. ఈ సంశయం తీర్చే భారంకూడా పరమాత్ముని మీదనే వేసి, తదేక లక్ష్యంతో ధ్యానించాడు.

అప్పుడు అక్కడికి ఒక సిద్ధుడు వచ్చాడు. అతని మెడలో ఒక పాము వున్నది. అతను రాజును చూచి, "రాజా!—నీ సందేహం నేను తీరుస్తాను. ఇదిగో - ఈ పాము గొప్ప మహిమ కలది. కేవలం దేవతాసర్పం. నీకు కావలసిన సరిహద్దులు ఇది నిర్ణయిస్తుంది" అంటూ నాగుపామ్ముని వదిలిపెట్టాడు. వెంటనే ఆ మహాసర్పం దానితోకను ఒకచోట స్థిరంగావుంచి, దేహంమట్టుకు పెంచుకుంటూ, వంపులు తిరుగుతూ, చుట్టిచుట్టి వచ్చి, తలను మళ్లీ తోకతో కలిపింది. అంతమేరా పాముచుట్టిన ఆనవాళ్లు

నగరానికి పునాదులుగా ఏర్పడినట్టయింది. మళ్లీ కన్ను తెరిచి చూసేటప్పటికి సిద్ధుడూ లేడు, సర్పమూ లేదు!—

ఇలా పాము చుట్టివచ్చిన పవిత్ర ప్రదేశంలోనే పాండ్య రాజు తన రాజధాని స్థాపించాడు. దానికి 'తిరు ఆలవై' అని నామకరణం జరిగింది. శివుని మహిమతో వెలసిన ఆ పట్టణం సమస్త సౌభాగ్యాలతోనూ తులతూగుతూ వున్నది.

అయితే, సామంత రాజొకడు ఇదిచూచి సహించలేక పోయాడు. అతడు ఒకానొక మాంత్రికుణ్ని పిలిపించి, 'తిరు ఆలవై' పట్టణ వైభవాన్ని దగ్ధం చెయ్యమన్నాడు ఆ మాంత్రికుడు ఒక గొప్ప విషనాగును మంత్రించి వదిలాడు. అది పాండ్యరాజు పట్టణంలో ప్రవేశించి జలాశయాలన్నింటిలోనూ గరళం కక్కింది. ఆ నీళ్లు తాగిన ప్రజలంతా చచ్చిపోసాగారు. పాండ్యభూపతి తనరాజ్యంలో జననష్టాన్ని సహించలేకపోయాడు. ఎన్నో ప్రక్రియలు చేయించాడు. లాభంలేకపోయింది. చేసేదిలేక చివరకు 'నీవేశరణు! అంటూ ఈశ్వరుణ్ణిగూర్చి తపస్సు ఆరంభించాడు. పాండ్యరాజుచేసే ఉగ్రతపస్సుకు మెచ్చి ఈశ్వరుడు ఆ నగరంలో అమృతం కురిపించాడు. రాజూ, ప్రజాకూడా ఆశ్చర్యభరితులయ్యారు. అమృతం కురియుటంతో, విషనాగు జలాశయాల్లో కక్కిన విషం తృటిలో విరిగిపోయింది! అంతటినుంచీ ఆ నగరం మళ్లీ పూర్వపు శోభతో ప్రకాశించింది. మధువు వర్షించిన కారణంచేత ఆ నగరానికి 'మధురై' అని, 'మధుర' అనీ పేర్లు వచ్చాయి. అదే ఈనాడున్నూ మీనాక్షిదేవికి వాసస్థలమైన దక్షిణ మధుర.

మధురానగరం ఇది వక్కటే కాదు. ఉత్తరహిందూస్థానంలో యమునానదీతీరంలో మరొక మధురాపట్టణం వున్నది. దాని పుట్టుపూర్వోత్తరాలగురించిన్నీ ఒక చిత్రమైన పురాణగాథ వున్నది:

శ్రీరామచంద్రమూర్తి కోసలరాజ్యాన్ని పరిపాలించే కాలంలో 'మధువన'మనే ఒక అడవి ఉండేది. ఆ అడవిలో మధువుడు అనే ఒక రాక్షసుడు ఉండేవాడు. దీన్నిబట్టే ఆ అడవికి ఈపేరు వచ్చిందంటారు. అతనికి 'లవణుడు' అనే కొడుకు వున్నాడు. లవణుడు తండ్రిని మించిన బలవంతుడూ, గర్వం కలవాడున్నూ. అతడు గర్వంతో ఇష్టంవచ్చినట్టు తిరుగుతూ ప్రజల్ని పీడిస్తూ వుండేవాడు.

ఒకసారి లవణుడికి, చేస్తే శ్రీరాముడితోనే యుద్ధం చెయ్యాలి అని బుద్ధిపుట్టింది. ఈ వుద్దేశాన్ని ఒక దూతచేత శ్రీరాముడికి వర్తమానం పంపించాడు. "రామా!—నేను నీకు సమీపంలోవుండే ఒక శత్రువునే. ప్రజాక్షేమం కోసమూ, రాజ్యాభివృద్ధికోసమూ రాజులు యుద్ధంచేస్తారు. శత్రువుల్ని జయిస్తారు. ఇది న్యాయమే. ఐతే ప్రజాహితం కోరే రాజు ముందుగా ఇంద్రియాలను జయించాలి. స్వార్థపరుడై ఉండకూడదు. సామంతరాజులంటే భయపడకూడదు. కానీ—నువ్వు చూడగా స్త్రీలోలుడివి. స్వార్థపరుడివి. ఒక్క ఆడదానికోసం బంధుమిత్రాదులతోసహా రావణాసురుణ్ణి నాశనంచేశావు. ఇది న్యాయం కాదు. పైగా—మా రాక్షస జాతి నంతటినీ మచ్చుకేనా లేకుండా రూపుమాపావు. ఇదా నీ ధర్మం?—సుగుణాభిరాముడవైన నీకు క్రోధం తగదు. నీ దుష్టచేష్టలవల్ల ఆశ్రమవాసులందరికీ తీరని కళంకం వచ్చింది. మా రావణుడు జితేంద్రియుడు కాసందువల్లనే అలాంటి చావు చచ్చాడు. కానీ—ఇప్పుడు నీలో చేవ వుంటే, సువ్యేకసక్షత్రియవీరుడివైతే, రా—నాతో యుద్ధానికి రా. వచ్చి నీ శూరత్వం చూపించు" అని ఈవిధంగా సవాలు చేశాడు.

ఈ వర్తమానం తెచ్చిన దూతకూడా లవణుడికి తగిన వాడే. ఏమీ అంటే— ఆతను పలికిన పలుకులు శాంతస్వభావుడైన శ్రీరామచంద్రుడికి చికాకు కలిగించాయి. గర్వంతో విర్రవీగుతున్న లవణుడికి తగినట్టు బుద్ధి చెప్పాలని నిశ్చయించుకున్నాడు శ్రీరాముడు. తమ్ముడైన శత్రుఘ్నుణ్ని పిలిచి, ఆ దుర్మార్గుడి పొగరు అణచి రమ్మన్నాడు. శత్రుఘ్నుడు సోదరుని దీవనపొంది బయల్దేరి వెళ్లాడు.

మధువనంలో లవణాసురుడికీ, శత్రుఘ్నుడికీ ఘోర యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో, శత్రుఘ్నుడు లవణాసురుడి శిరస్సు ఖండించివేశాడు. ఆ కత్తితోటే మధువనాన్ని ఛేదించటానికి ప్రారంభించాడు. మరికొద్దికాలానికే మహారణ్యమంతా మాయమై, ఆప్రదేశమందు పరమసుందరమైన ఒక మహానగరానికి అంకురార్పణ జరిగింది. లోకక్షేమం కోసం, దుష్టుడైన లవణుణ్ణి సంహరించినప్పటికీ, ధర్మప్రభువు శ్రీరాముడు, ఇప్పుడు వెలిసిన మహానగరానికి రక్షకుడైన మధువుడి పేరు సార్థకమయేట్టు 'మధుర' అని నామకరణం చేశాడు. ఇదే ఉత్తరహిందూస్థానంలో వుండే మధురయొక్క మధురస్మృతి!

# భారతీయ ధర్మము - VIII

"కాశ్యప"

అగ్నే ! నయ సుపథా రాయే అస్మాన్। విశ్వానిదేవ !
వయునాని విద్వాన్।
యుయోధ్య స్మజ్జుహురాణమేనో। భూయిష్ఠాంతే
నమ ఉక్తిం విధేమ ॥

అగ్నిమీడే పురోహితమ్. అగ్నిదేవా ! సకల జీవ లోకములకు నమగ్ర సర్వతోముఖ హితమును సమకూర్చు పురోహితుడవు, స్వయంప్రకాశమానుడవు, సర్వవ్యాపకుడవు, వైశ్వానర రూపమున అఖిలప్రాణిప్రేరకుడవు, సర్వభూత హృదయస్థాంతర్వర్తివి, సర్వశక్తి సమన్వితుడవు, అత్యంత సన్నిహితుడవు, సర్వదేవతా స్వరూపుడవు. వేయేల! సృష్టిస్థితిలయ కారణుడవు. సర్వాభీష్ట వరప్రదుడవు. నిన్నాశ్రయించువార లెట్టివారైనను, అమృతత్వమునే పొందెదరు. స్వామీ ! ఈ దీనుని విన్నపమాలింపవా ! జగద్రక్షకా ! నిక్కముగ నేను పాతకుడను. నీవు పావకుడవు. దీనజనావనా ! నా స్థితి 'చీమతల యంత నోరు. ఆకాశమంత యాకలి' అనునటులున్నది. సర్వజీవుల సుకృత దుష్కృతములను నీవు స్వయముగ సంపూర్ణముగ నెఱుగుదువు. నా యొనరించిన యఘపరంపరలనంతములు. అవి శుష్కములైన చెత్తచెదారముల కుప్పలే. ఇపుడే వానినెల్ల నీకు సమర్పించుచున్నాను. అందు నీ యనుగ్రహమునకు పాత్రముగా గల పరమాణు వొక్కటియైన లభించునో లేదో ! లభింపకున్నను అచ్చెరువందవలసిన పనిలేదు. అయినను హృదయ పీఠికాధిష్ఠితకుటిలేశ్వరా ! నిర్భాగ్యుని విన్నపమందికొని యత్నింతువా ? నీ కీ యుద్యోగము సుపరిచితమే కదా! బాహ్యాడంబరములకన్న, భావశుద్ధినే ప్రధానముగ గ్రహించుట నీ కలవాటే కదా ! భక్తుల చరిత్రలను పర్యించిన భగవంతుడు సుప్రసన్ను డగునని పెద్దలందురు.

నాగరికత యన నేమో యెఱుంగని యాటవిక జాతికి జెందినది శబరి. ఆమె యమాయికురాలే కావచ్చును, నదుద్దేశమే కలిగియుండవచ్చును— ఒక్కటియైన విడిచి పుచ్చక, ఫలములన్నియు కొఱికి చవిచూచి, తృప్తిపడి, ఆ యెంగిలి పండ్లనే స్వామి కారగింపుచేసెను. అఖండ సామ్రాజ్యమును తృణప్రాయమ్ముగ తిరస్కరించి, కారడవులకు విజయము చేసిన, కౌసల్యానందవర్ధనుడు, పతితపావనుడు, ఇనకులతిలకుడు, తారకనాముడు, దశరథ రాముడు పరమానందమున మహాప్రసాదమని ఆ ఫలముల నారగించెను; ఆ యమ్మకు ప్రతిఫలమ్ముగ మహాఫలమైన మోక్షమునే యొసగి ఋణవిముక్తుడయ్యెను.

ఎంతని-నే-వర్ణింతును-శబరీ సౌభాగ్యము.

ఇల్లాలి మాట గాదనలేక కుచేలుడు కృష్ణసందర్శనార్థియై బయలుదేర నున్న సమయమున, ఆ మానవతి యే నాటివో, మూషికములుగూడ హితవుగాక ముట్టనొల్లని చెరె పటుకుల నెటులనో సంపాదించి తెచ్చి పతిచేత నుంచె. కుచేలుడు, సార్థకనాముడు, సహస్రాధికఛిద్ర సంకలిత చేలాంచలంబున వాని నెట్టులో ముడిచి దాచి భగవత్సన్నిధానమును జేరెను. నందనందన సుందరపదనారవింద సందర్శనానందతుందిల హృదయుడైన సుదాముడు అటుకులమాట గత జీవిత వృత్తాంతముతో విస్మరించెను. పాపము! కడుపునింత దిండితిని యెంతకాలమయ్యెనో ! శ్రియః పతి తనకుదానై చిన్ననాటి చెలికాని యొడలు తడివి మాసినచీర వ్రేలాడు ముక్కిన యటుకులను కడు సంబరమున నొక్క మారుగ బొక్కివైచెను. లౌకికైశ్వర్యములనే గాక, బ్రహ్మేంద్రాదుల కపేక్షింపనలవి కాని స్వీయపదమునే యనుగ్రహించెను. ఆశ్రిత వాత్సల్యమనిన అటులనే యుండనగును గదా ! 'కార్యసిద్ధిపథః సూక్ష్మః స్నేహేనాప్యుప లక్ష్యతే.' అఖిల లోకబాంధవా! పరమపవిత్రా ! ఆశ్రితజన మిత్రా ! జ్ఞానాజ్ఞానకృత మత్సమస్త కర్మసంతానమున నజీవమై యక్కఱకువచ్చు నొక్క సుకృత పరమాణువైన గోచరింపదా ! స్నేహదృష్టికి సూక్ష్మాతి సూక్ష్మపదార్థమైన పొడగట్టునని పెద్దలందురే ! కుటిలేశ్వరా ! నీకు మ్రొక్కుకొనుట దక్క నే జేయగలదేమి గలదు ? ఇపుడే యిచటనే ఆర్తుడనై నీ యక్షరరూపమునకు నమోవాకము ప్రశంసించితిని. ఇక నా కర్తవ్యము ముగిసినది. శోధించి పరిశోధించి మత్సుకృత లేశమును సాధించెదవో లేక దుష్కృతమునే సుకృతముగ రూపొందించెదవో! కనికరించెదవో, మానెదవో అది నీ చిత్తము.

మహాప్రభూ ! ఊర్ధ్వగతుడవు - అంతేకాదు - నీ యుపాసకులనుగూడ నూర్ధ్వగతులకు గొనిపోవుచు అగ్నిపదమును సార్థకము చేసికొనుచున్నావు. నీవు సర్వభక్షకుడవు, హుతాశనుడవు, దహనుడవు. ఆశ్రితవత్సలా ! నీకు సమర్పితమైన నా యీ యపవిత్ర కర్మసంజాతము సమస్తము క్షణములో తప్తమై, దగ్ధమై, రూపుమాసి, మసియై, నుసియై, విభూతియై గ్రహణధారణములకర్హముగాక తప్పదు. లేకున్న నీ

బిరుదములు? ఈ తీరున దుర్గతి కీడ్చుకొని పోవు నా కుటిలజటిల పాతక పరుషవిషమ శైలసందోహము నమసి పోవునటుల ననుగ్రహింపవా తండ్రీ! 'పితేవ పుత్రమభి వక్షతా దిమమ్' కుపుత్రునియెడల కోపముచే మండిపోవు చున్నటుల, బహిర్దృష్టికి గోచరించుచున్నను, కరుణార్ద్ర హృదయుడైన జనకుని యా గ్రహము, అనుగ్రహమునకు రూపాంతరమే కాదా! ఆత్మా వై పుత్ర నామాసి—స్వస్వరూపాంతరమనదగు పుత్రుని శాశ్వత నరకవాస దుఃఖమునకు పాలుచేయు తండ్రు లెన్నడైన జనియించిరా! నికంటబడి నది, నిన్నంటినది నిర్మల సువర్ణమగును గదా! స్పర్శవేది సంయోగమందినది అయోమయమైనను పదియారువన్నె బంగారమగుట లోకదృష్టికిని విశ్వసింపదగినదే కదా! నా కర్మయోగ్యతయందు నాకు విశ్వాసము లేదు. పతిత పావనా! నీ యుపారకరుణావిశేషమునే నమ్మియున్నా డనయ్యా!

అనుత్తరమార్గమును వీడి ఉత్తరమార్గమున సంచరించుటయే ముముక్షువుల లక్ష్యము. 'తమ సోమాజ్యోతిర్గమయ.' దుఃఖప్రదమయిన ధూమమార్గమునుండి నన్ను రక్షించి సుఖకరము ప్రకాశవంతము నగు దేవయానమున నన్ను నడిపించుకొని పోవా! దేవా! దేహమే యాత్మ యని విషయసుఖములు నిత్యములు ఆనందసంధాయకములనియు భ్రమించి యింతకాలము అనంత జీవయోనుల సంక్రమించి దక్షిణాయన మార్గమ్మున యాతాయాతంబుల సాగించి విసివి వేసారి చిక్కుతెన్ను గానక అపార సంసార సాగరాగాధభీకరావర్త పరస్సహస్రంబుల మజ్జనోన్మజ్జనములు గావించుచుంటిని. దీనజనోద్ధారకా! ఎన్నడైన యాదృచ్ఛికముగనైన, ఘుణాక్షరన్యాయమున త్రికరణ శుద్ధిగ భగవద్దివ్యనామము నుచ్చరించితి నేమో! అట్టిదే దేనియున్న సర్వజ్ఞుడవు సర్వసాక్షివి నగు నీకు విదిత మగును గదా! ఎపుడైన వాగింద్రియ మొకటియే నా చెప్పినమాటలు వినునటులు నటించును. మిగిలిన యింద్రియములు నా సంప్రార్థనమును నిర్దాక్షిణ్యముగ త్రోసిరాజనుచున్నవి. ఇక మనస్సు సంగతి చెప్పవలసిన దేమున్నది. సర్వకాలములయందును మోహారణ్యములో, ఆశా శాఖలమీద విచ్చలవిడిగ స్వైరవిహారము గావించు చున్నది - స్వామీ! అది సహజముననే కోతి, దానికిపుడు మితిమీరిన బలము చేకూరినది, విషయ సుఖమను మద్య పానము చేసినది, దురభిమాన పిశాచావిష్టమైనది. కామముచే నున్మత్తమైనది. భేదబుద్ధి యను తేలుగుట్టినది. హా! ప్రభూ! దుష్టశిక్షకా! జగద్రక్షకా! దానిని దారికి దెచ్చు నాశయే లేదా! కటకటా! దుస్సంగతికిలోనై మతి చెడి పోయినది. శిరము పలితమైనది. సంధిబంధములు సడలి పోవ సంగము గళితమైనది. యమ మహిషఘంటికాని నాదము వినవచ్చుచున్నదే. ఇక యుత్తరగతులకు తిలో దకము లీయవలసినదేనా!

ఈశ్వరుడు దయామయుడు, సకల లోకశరణ్యుడు సర్వాన్తర్యామియై యున్నాడు కదా! ఆ! స్మృతికి వచ్చినది. భగవత్కృపకుపాత్రుడు కాడనినవాడు లేడు లేడు లేడని యా మహామహు డెవరో ఘోషించుచున్నాడే. ఎట్టి మధురశబ్దములు. ఎంతటి యాశాజనకములయిన పదములు. నేటిమాటలచేతనే నిన్నభ్యర్థింతును కరుణాకరా! మాటలలో మనసు కలియలేదని వెనుకాడకుము. దీనజన బాంధవా! భవబంధవిమోచనా! - అగ్నే! త్వంనో అంతమః ఉతత్రాతా శివః - అనాథరక్షకా! నా యంతరంగమునందును ఉన్నవాడవు కదా. నీవు మంగళకరుడవనియు జగద్రక్షకుడవనియు శ్రుతులు ఘోషించుచున్నవే!

త్వమగ్నే! ద్యుభి స్త్వమాశుశుక్షణిః భక్తులపాపములను నీ యద్వితీయశక్తిచే శీఘ్రముగా నాశనము చేయుచుందువుగదా!

చరణం పవిత్రం వితతం పురాణమ్ । యేనపూతఃతరతి దుష్కృతాని ।
తెన పవిత్రేణ శుద్ధేన పూతా । అతిపాప్మాన మరాతిం తరేమ ॥

సురాసురబృందవందితపాదారవింద! సనాతనమై, సకల లోకవ్యాపకమై, సర్వమంగళకారణమైన నీ పదము గను గొను శక్తి నొసగుము. ఆ పాదధూళి శిరమున దాల్తును. శరీరమునం దంతటను నలంకరించుకొందును. దురిత పంకమును తొలగించుకొందును. పూతాత్ముడనయి నరక హేతువైన పాపశత్రువును తలదన్ని యతిక్రమింతును. ఏమందువు జగన్నాథా! అనుట కేమున్నది? - త్వయి ప్రసన్నేమమ కింగుణేనతయ్యప్రసన్నేమమ కింగుణేన - నీ కనుగ్రహమే కలిగెనా నా దోషముల ప్రసక్తియే ఉండదు. నీ కాగ్రహము కలిగిన నా గుణము లెందు కక్కఱకు వచ్చును. నీవా సదాశివుడవు, విబుధాధిపతివి. నీకు జెప్ప వలసిన పని యేమున్నది. గుణదోషౌ బుధోగృహ్ణన్ ఇందు క్ష్వేళావివేశ్వరః। శిరసాశ్లాఘతేపూర్వం, పరంకంఠేనియచ్ఛతి॥ రాజహంసంబు క్షీరనీరంబుల నీరంబునిరసించి క్షీరంబు నేగ్రహించును. పరమహంసస్వరూపుడవయిన నీకు హేయ గుణంబులయందాదరము లేదు, కల్యాణగుణంబుల యందే నిక్కముగ నాదరము గలదు. విబుధులు దోష జ్ఞులయ్యును గుణానురక్తులుగదా!

అగ్నిర్జ్యోతిరహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్-

సత్యవ్రతా! నీ యనుగ్రహమున మృత్యువును జయించినవారు నీ రాజ్యమును జేరుదురు. అటనుండి జ్యోతిర్లోక

మును దర్శించి, అహర్లోకమును పొంది, క్రమముగ శుక్ల లోకము, సంవత్సరలోకము, దేవలోకము, వాయులోకము, ఆదిత్యలోకము, చంద్రలోకము, విద్యుల్లోకము, వరుణ లోకము, ఇంద్రలోకము, ప్రజాపతిలోకము, తుదకు బ్రహ్మ లోకము నంది ముక్తు లగుదురని శాస్త్రము లుద్ఘోషించు చున్నవి. అంతటి పుణ్యపురుషు లెవరో? ఏనాటి మాటలో? సంసారాంధకూప నిపతితులైన అస్మదాద్యకృత సుకృతుల మాటతడవ బనిలేదు. దేవర చిత్తము, దాసుని భాగ్యము. దాసుని తప్పులుదండముతో సరి. కర్తు మకర్తు మన్యథా కర్తుంసమర్థాః. ప్రభువులు సర్వసమర్థులుగదా! అప ద్బాంధవా! యత్కించి త్సుకృత ఫలలేశమును ముం దనుభవింపనిమ్ము. అంతలో ప్రారబ్ధక్షయమై చిత్తశుద్ధి కలుగునేమో!

అనంతవాసనాక్షయమై చిత్తశుద్ధి గలుగుట సాధారణ విషయము గాదు. విషయధూమావళి మనోదర్పణమును మలినము గావించుచుండును. నిత్యము నిరంతరము సాగిపోవు ప్రకృతిధర్మమది. విషయముల నరికట్టినను, అది సాధ్యముగాదు కనుక, ఆ విషయములనే ఈశ్వరా ర్పణము గావించిన, చిత్తము స్వగతచిదగ్ని జ్వాలలచే దగ్ధమై, తప్తమై, ఒకనాటికి శుద్ధస్ఫటిక సంకాశమగును. ఈశ్వరాభిముఖమయిన శ్రీబుద్ధి చిత్తశైలశిఖరమును వరించి తపించి మల్లికార్జునుని మన్ననల నందుకొని పునరావృత్తి రహితమైన అచ్యుతస్థితి సంపాదించుకొనును.

సరసహృదయ నందనవనము జ్ఞానప్రసూనామోద భాసు రము. జ్ఞానప్రసూనాభిరాముడు చిదంబరనటేశ్వరుడు. తనకు దానై చుట్టుకొన్న బంధాల జిక్కి బయటపడనేరని తంతునాభము, ఒరుల కంట దాను బడక తనకంట నొరుల బడనీయక తప్పించుకొని తిరుగువిషకాకోదరము, శారీరి కాడంబరమే కాని బుద్ధిపాటవ మెఱుగని మత్తగజరాజము, తమ నేర్చిన రీతి సేవించి శివసాయుజ్యమంది శ్రీకాళ హస్తీశ్వరుని ప్రతిష్ఠ ఆచంద్రార్కముగ వెలయించిరి. ఈశ్వరుని లీలలు విచిత్రములు ఆనందప్రదములు. ఆటు లనే భగవద్భక్తుల చరిత్రములు అపూర్వములు శ్రోత్ర మనోఽభిరామములు. బంభ్రమ్యమాణమగు మనోభ్రమర మును భ్రమరేశ్వరుని పాదారవిందముల నిలిపిన మహా ఫలమును కరతలామలకమగును.

విషమనేత్రుడవయ్యు వీడ వెన్నడు నీవు, సమదృష్టి
సర్వభూతములయందు.
అదిభిక్షుడవయ్యు నాశ్రితావళి కెల్ల! సమకూర్తు వనుప
మైశ్వర్యములను,
కాంతాన్వితార్ధవిగ్రహుడవయ్యు, జితాత్మ గుణమునః
కముల భాస్కరుడ వీవు.
ఆశివసప్రాప్తృతాత్ముడవయ్యుని, స్తుతుల కృపాకలిత
చిత్తుండ వీవు.

మృదమూర్తివయ్యు భద్రప్రదుండవు-
భవుడవయ్యు భవవివర్జితుడవు-
వెత్తివాడవయ్యు వేదవేద్యుడవీవు-
హర! భవత్ప్రవృత్తు లద్భుతములు.

నరులార! ఓంనమోనారాయణాయేతి మంత్రజాపకుల సామ్రాజ్యమనగ పరికించి వాసుదేవస్సర్వమనుబుద్ధి కల వారి కరతలామలక మనగ ఆత్మప్రవృత్తి బ్రహ్మార్పణం బొనరించు ప్రాజ్ఞుల పెరటికల్పక మనంగ తన్నునన్యాసక్త తను గొల్చు భక్తాపతంసుల దాసానుదాసుడనగ

పతితదీనార్తరక్షణవ్రతు డనంగ
సకలజగములనమర ప్రశస్తి గన్న
రంగనాథునిశ్రిత మనోరంగనాథు
గాంచి సేవించి శుభము లార్జించుకొనుడు.

(సశేషము.)

# హిందూ సంస్కృతి - వేదములు - IV

(వేదకాలము - గతసంచిక తరువాయి)

శ్రీ తటవర్తి సూర్యనారాయణ

నానాటికి మనుష్యుని జ్ఞానశక్తి దుర్బలమగుచుండుటచే ఋషులు మంత్రముల క్రమమును సులభపరచిరి. ఒక ఋషి తన శిష్యులకు మూలసంహిత చదివించెను. దానిలో నుంచి యొకడు ఒక దేవత మంత్రములన్నియు సేకరించెను. ఇట్లు దేవతాక్రమమున మంత్రక్రమము నుంచబడెను. ఇంకొకడు ఋషిక్రమమున మంత్రములను సపరించెను. ఒకడు విషయక్రమమున నింకొకడు ఛందస్సు క్రమములో బెట్టెను. ఈ విధముగ నాల్గు వేదములను వేఱు వేఱు క్రమములో నుంచిరి గాని ఒక్కొక్క దానిలోను మఱల అనేక క్రమములు వచ్చెను. దీని తరువాత పాఠక్రమమున శాఖలయ్యెను. పద, క్రమ, ఘన, జటాదులు వేదపాఠమున కెన్మిది పద్ధతులు. ఒక్కొక్క శాఖ వీటి కారణమున ఎన్మి వెన్మిది భాగములలో విభక్తములై పోయినది. ఈ శాఖాక్రమములు పెఱుగుచు వచ్చెను. ఏ ఋషి శిష్యులే వేదమున కెన్ని శాఖలు గావించి యుండిరో పురాణములందు విశదముగ వివరించబడియున్నది. కావుననే విభిన్న గ్రంథములలో వైదిక శాఖల సంఖ్య యొక్క విధముగ సమానముగ లేదు. కూర్మపురాణానుసారముగ ఋగ్వేదమునకు 21, యజుర్వేదమునకు 100, సామవేదమునకు 1000, అథర్వ వేదమునకు 9 శాఖలు. ఇవ్విధమున వేదముల మొత్తము శాఖలు 1130 అయ్యెను.

వేదముల శాఖలు వేదముల ఏ భాగము, ఏ ఖండము గావని పైన చెప్పిన దానివలన తెలియుచున్నది. ప్రతియొక శాఖయందును పూర్తి వేదమున్నది. శాఖాభేదములు కేవలము మంత్రములయొక్కయే సంపాదన క్రమభేదమునకు కారణములు గాన శాఖలు గలియకున్నచో ఏ వేదాంశమున్ను అప్రాప్యమై యుండలేదు. కేవలము కొన్ని సంపాదన క్రమములు మాత్రమే అప్రాప్యములై పోయినవి. ఒక వేళ నాల్గు వేదముల ప్రతియొక శాఖయు నిర్వివాద రూపమున శుద్ధములై లభించినచో మూల— ఈశ్వరీయవాణి రూపమున నాల్గు వేదములు లభించినవని తలంచకుండుట కేకారణము నుండజాలదు. నేడును ఋగ్వేదముయొక్క శాకల, వాష్కల శాఖలు, యజుర్వేదముయొక్క మాధ్యందినీయ శాఖ, సామవేదముయొక్క కౌథుమీ శాఖ, అథర్వ వేదముయొక్క శౌనక శాఖయు మూల, శుద్ధరూపములో ప్రాప్తించుచున్న విషయములో నెవ్వనికిని విప్రతిపత్తి లేదు. గాన యీ శాఖల రూపములో నాలుగు వేదములున్ను ఈశ్వరుని వాణియొక్క వాస్తవిక రూపములోనే నేడు నుపలబ్ధములై యున్నవి.

వేదములయొక్క శబ్దములు మంత్రములు. వీటి అక్షరములును నిత్యములు. కాని మంత్రముల క్రమము మనుష్యకృతము - మండలము, అష్టకము, కాండము, అధ్యాయము —ఈ క్రమములో ఋషులు వీలు వెంబడి యనేక విధముల మార్పులు గావించిరి. ఈ సంపాదన క్రమముచేతనే శాఖలైనవి. ఇట్లు చేయుటలో గూడ ఒక్క మాత్ర తగ్గించబడను లేదు; లేదా పొడిగించబడను లేదు. వేదముల శబ్దములు అర్థములు నిత్యములని వేదభాష్యకారుడైన మహీధరుడు నుడివియుండెను. కాని వీటిలో గల మంత్రముల అనుపూర్వి శాఖాభేదముచే గలిగినది.

## వేదమంత్రముల ఋషులు

ప్రతియొక వేదమంత్రముతోగూడ దాని ఋషి పేరుండును - ఋషయోమంత్రద్రష్టారః ॥ ఈ ఋషులు మంత్రద్రష్టలని చెప్పబడిరి. మననాత్ మంత్రః - మననముచేత స్పష్టమగు అర్థము గలది మంత్రము. ఏ ఋషి హృదయముయొక్క గంభీరమగు ఏకాగ్రతలో ఏ మంత్రార్థమును సాక్షాత్కరింపజేసుకొనెనో అతడా మంత్రముయొక్క ద్రష్టయని చెప్పబడెను. మంత్రమన్న శ్రుతి. అవి పరంపరగా వినబడినవి. ఆ వినియున్న మంత్రముల అర్థము వ్యాకరణము లేదా నిరుక్తముచేత తెలియబడదు. వ్యాకరణ, నిరుక్తములవల్లనే మంత్రార్థము కావలసినచో మంత్రముతోగూడ దాని ఋషి—మంత్రద్రష్ట నామముండదు. దానికి ఋషి మునిగణము మంత్రముతోపాటు మంత్రద్రష్ట పేరుగూడ ఉండియుండదు. మంత్రద్రష్ట యగుట గూడ ఇంత గౌరవ విషయముగూడ అయియుండదు. "పరోక్షవాదోవేదోఽయం" వేదముపరోక్షవాణి. ఉత్తమమైన యధికారికి 'తత్త్వమసి' యను మహావాక్యము గురువువలన వినుటయే చాలునని వేదాంతవిద్వాంసులెఱుగుదురు. మననమువలన స్వతః దాని తాత్పర్యము వెలువరించుకొనును. భగవంతుడు మనుష్యునికి బుద్ధి యొసంగి యుండెనుగాని దానిని మననము చేయవలెను. బ్రహ్మ - అదిస్రష్ట వేలకొలదియేండ్లు తపముచేసి వేదార్థ

ము ప్రత్యక్షమొనర్చుకొనెను. ఆ జ్ఞానముచేతనే అతడు సృష్టిరచన గావించెను. ఋషులుగూడ అంతఃకరణ మందేకాగ్రులై మంత్రార్థమును దర్శించియుండిరి.

"శబ్దార్థప్రత్యయానా మితరేతరాధ్యాసా త్సంకరస్త
త్ప్రవిభాగ సంయమాత్సర్వభూతరుతజ్ఞానం"

ప్రతియొక ప్రాణికిని అతని వాణి యాశ్వరునివైపు నుండియే ప్రాప్తించియుండెను. గావున వేదవాణియొక్క అర్థము నెట్టి ఆత్మసంయమముచే ప్రాప్తించుకొనియుండెనో అట్టి ఆత్మసంయమముచేతనే ప్రతియొక ప్రాణికిని భాషా జ్ఞానము కాగలుగును. ఉపర్యుక్త యోగసూత్రమందు మహర్షిపతంజలి ఇదే నుడివియుండెను. శబ్ద-అర్థములలో వాటి జ్ఞానముయొక్క వేఱువేఱు స్వరూపములో మన స్సంయమము చేయుటవలన సమస్తప్రాణుల భాషా జ్ఞానము కాగలదు. సమస్తప్రాణుల భాషాజ్ఞానము చేకూర్ప గల సంయమము వేదమంత్రార్థముల దర్శనముగూడ జేయించును. ఇవ్విధమైన సంయమ మెవ్వడుచేసినను మంత్రార్థదర్శనము చేయగలడు.

ఇదంతయు సరిగనే యున్నదిగాని మంత్రద్రష్ట పేరు పల్లించుచున్నచో నేమి లాభము? విషయమేమన - వేదార్థ మన్నది అయ్యెడిదిగాదు. వేదభాష్యప్రథ రావణుని నాటి నుండియు వచ్చినది. తదాది ఖండనమండనములతో ఆ ప్రథ నడవవలసివచ్చినది; గనుక వేదార్థములు చేయు బూనినవారు నిరాశులగుచున్నారు. దర్శనశాస్త్రనిర్మాతలగు ప్రకాండతత్త్వజ్ఞులైన ఋషీశ్వరులుగూడ పదేపదే యేల వేదముల కొక్క నమస్కారముచేసి దానియెడల నెట్టి సంబంధము కలిగించుకొనక యూరకుండిరి? వారి కంత మహత్వ మేలవచ్చినది యనునది యెఱుంగను లేక పోయిరి. వేదఋక్ యొక్క మంత్రద్రష్టయైన ఋషి నిర్మితశాస్త్రములందామంత్రార్థము విస్పష్టమై యున్నది. మంత్రముతోనూడ ఋషిని స్మరించుటలో గల ఉద్దేశ్యము ఆ మంత్రముకొఱకా ఋషి శాస్త్రము చూడవలయునని.

ఇతిహాసపురాణాభ్యాం వేదం సముప బృంహయేత్
బిభేత్యల్పశ్రుతాద్వేదో మామయం ప్రహరిష్యతి ॥

ఇతిహాస - పురాణములద్వారా వేదమంత్రముల ఉప బృంహణ—అర్థవిస్తారము చేయవలెను. అల్పశ్రుతముచే వేదములు ఇది మమ్ము నష్టపఱచునని భయపడును. వేదార్థసంబంధములో నిది యాదేశము. ఋషి నిర్మిత గ్రంథములను 'స్మృతు' లందురు. స్మరణచేసి వ్రాసినది యని 'స్మృతి' కర్థము. ఋషులేకాగ్రమైన యంతఃకరణములో వేదమంత్రముల యర్థమును దర్శించి ఏకాగ్రత్వమువలన నుత్థితమైన పిమ్మట దానిని స్మరించి యుపదేశించిరి. ఆ యుపదేశమే స్మృతి. వ్యాసభగవానుడు మహాభారతము - పురాణములలో ఋషుల యొక్క యుపదేశములను సంకలితమొనర్చియుండెను. ఇందులో ప్రాచీనోపదేశములు చరిత్రములు సంకలితములగుటచేత యా గ్రంథములు పురాణములని చెప్పబడెను. వేదముల యర్థము మంత్రమందు మనస్సంయమము గావించి యెఱుగబడగలుగును; లేదా స్మృతి, మహాభారతము, పురాణములందును దానిని చూడవచ్చును. ఇవి వేదముల వాస్తవిక భాష్యములు. మంత్రముల యర్థము చేయు నెవ్విధమైన ప్రయత్నమందును భ్రాంతమగుననియే భయము.

## మంత్రదేవతలు

'యా తేనోచ్యతె సా దేవతా'

ఏ మంత్రముద్వారా యేది వర్ణింపబడియున్నదో యది ఆ మంత్రముయొక్క దేవతయని 'సర్వానుక్రమణి'లో దేవత కీ యర్థము చెప్పబడినది. అనగా - ఏ మంత్రమున కేదేవతయైయుండునో ఆ మంత్రమందాతని స్వరూప మారాధన ప్రభావము, స్థూలజగత్తులో దాని కార్యము వర్ణితమైయున్నది. నిరుక్త మీ సంగతి నింకను స్పష్ట పరచినది.

యత్కామ ఋషిర్యస్యాం దేవతాయామార్థ పత్యమిచ్ఛన్
స్తుతిం ప్రయుంక్తె తద్దైవతః సమంత్రో భవతి"

ఏ దేవతను ఏ మంత్రముచే ఆ మంత్రార్థ దర్శనేచ్ఛతో ఋషులు స్తోత్రము చేయుచుందురో యదే యా మంత్రముయొక్క దేవత. మంత్రద్రష్టలైన ఋషులు మంత్రార్థ దర్శనమునకై మంత్రదేవతా ధ్యానములో మనస్సు నేకాగ్రముచేసిరి. ఆ దేవతా ప్రసాదముచేత మంత్ర దర్శన మయ్యెను. శబ్దార్థము లందును జ్ఞాన స్వరూపాదులందును మనస్సు నేకాగ్రము చేయుటచేత పశు - పక్షుల భాషకూడ తెలియవచ్చునని మొదట జెప్పియుంటిమి. ఏ పశు వాణి యందు మనస్సు నేకాగ్రము గావించిన ఆ పశుభావనకూడ నుండును. ఇది ఫలానా పశువువాణి యని భావింపకున్నచో జ్ఞానముయొక్క వ్యవస్థితోదయముకాదు. ఇట్లేమంత్రమున మనస్సునేకాగ్రము చేయు సమయమున తద్దేవతయొక్క భావన అవశ్యకము; ఏలనన మంత్రములో దేవతయొక్కయే వర్ణనము గలదు.

స్వాధ్యాయాదిష్ట దేవతా సంప్రయోగః

ప్రతియొక మంత్రమున కొక అధిష్ఠాన దేవతయుండునని యోగదర్శనము చెప్పినది. మంత్రముయొక్క గంభీర స్వాధ్యాయముచేత దాని ఇష్టదేవతా సాన్నిధ్యము ప్రాప్తించును. గాన మంత్రస్వాధ్యాయ సమయమందేమంత్రము

చేత ఏ దేవతాశక్తి సాక్షాత్కరించునో యది సూచించుట కొఱకు మంత్రముల దేవతలు నిశ్చయింపబడిరి.

ఋషులు దేవతలు నొక్కరేయైన మంత్రములు చాల గలవు. ఇది రెండు కారణములచే నయ్యెను. కొందఱు మంత్రద్రష్టలగు ఋషులు మంత్రారాధ్య దేవతతో నేకాత్మత్వము బడసియుండిరి.

యో యచ్ఛ్రద్ధః స ఏవ సః

కనుక వారి స్వతంత్ర నామము లోకమున బ్రచలితము కాలేదు. రెండవది - అనేక పర్యాయములు మంత్రము నాధారముగ గైకొనక శ్రద్ధాళువులు జ్ఞానప్రాప్తికి దేవారాధనము జేసిరి.

ప్రసన్నుడైన దేవత వారికేదో మంత్రరహస్య ముపదేశించెను గాన ఆ మంత్రదేవతయే తన మంత్రమునకు ద్రష్ట కూడనయ్యెను.

## మంత్రముల ఛందములు

ఋషి, దేవతవలె మనము వేదముల ఛందస్సునుగూడ స్మరించెదము. వేదములయొక్క ఛందస్సులు చాల విచిత్రములు. మంత్రములను ఛందస్స్వరములో పద పాఠ సహితము చదివినచో వాటి చరణములన్నియు సమాసములై తోచును గాని ఇట్లు చేయక వాటిని సంధి సహితముగ బదివినచో చరణములు తగ్గును హెచ్చును. వేద పాఠములో స్వరభంగముగూడ ఒక పెద్దదోషము. ఛందములవలన స్వరము నిశ్చయమగును. శాఖాభేదముచే మంత్రముల సంపాదన క్రమము జఱిగియుండుటచేత చాలా మంత్రములొకదానిలో గలిసిపోయినవి. ఇట్టి మంత్రముల ఛందస్సులు రెండు మూడు చెప్పబడును. తాత్పర్యమేమన - విషయదృష్టిచే మంత్రము లేకత్ర యొనర్పబడినవి. గాని మూలస్వరము తప్పిపోయి యుండరాదు. దాని ఎంతభాగమేఛందస్సుదో అంత ఆఛందములో బదువవలసియున్నది.

మంత్రముయొక్క స్వరాత్మక రూపరక్షణ మాత్రము ఛందస్సువలన నగుచునేయుండును. ఛందములు మంత్ర దర్శనమునకును సహాయకములగును. యజుర్వేదములో చాలా భాగము గద్యములోనున్నది, గాని ఆ మంత్రములకును ఛందములు నిశ్చితములైయున్నవి. ఛందమున కర్థము - విశేషప్రకారమైన స్వరమని సారాంశము. స్వరమొక కంపనస్తరమును బుట్టించును. ఈ స్వరజన్య కంపనము మంత్రదేవతా భావస్తరములోనికి తన భావస్తరమును జేర్చును. ఇదేమంత్రార్థ దర్శనము. ఎట్లన - ప్రణవధ్యానమునకు—

'దీర్ఘ ఘంటానినాదవత్'

ధ్వనిలో మనస్సు నేకాగ్రము చేయవలెనని ఆదేశము. ప్రతియొక పదార్థ ధ్వనియొక్క వ్యక్తరూపము కంపన పరిణామము. ప్రత్యేక కంపనమొక శక్తిస్రోతము గలిగియుండి అవ్యక్తములో నొక సాకారమైన ఆకృతిని గల్పించును. ఈ సాకారా కృతియొక్క శక్తిస్రోత మా యధిష్ఠాతయగుదేవత.

ఛందముల విషయములో ఇంకను నెఱుగవలసినది ఒకే ఛందములో చాల మంత్రములు అతిస్వల్ప పరివర్తనముచేతను లేక అరూపముగను నాల్గు వేదములందును వచ్చినవి. పరివర్తనము కొంచెమున్నచోట ఆ మంత్రము కొంచెము విశేషతతో వచ్చియున్నదనుట స్పష్టము. కాని ఉన్నదున్నట్లు వచ్చినచోటను లేక రెండవ అర్థములో వచ్చియున్నను లేక ఆ అర్థములో వచ్చియున్నను అది అట్లొచ్చుట వచ్చుట అవశ్యకమైనదని యెరుంగవలెను. ఒకే వాక్యము లేక శబ్దము అనేకార్థములలో లౌకిక సాహిత్యములోగూడ పదేపదే వచ్చుచున్నది. గంభీరగ్రంథము లందొకే పరిభాష విషయమును సుస్పష్టముజేయుట కనేకసార్లు ఆమ్రేడితము చేయబడినది. ఇట్టి స్థలములలో పునరుక్తియని చెప్పనురాదు, అట్టి మంత్రములనట నుండి తొలగింపనురాదు.

## వేదములలో ఇతిహాస భూగోళాదులు

వేదములనాది, నిత్యములు, ఈశ్వరీయవాణి రూపములై యున్నప్పుడు వాటిలో నైతిహాసిక ఘట్టముల, వ్యక్తుల, భూగోళ సంబంధఘట్టముల, జ్యోతిషాదుల వర్ణనము లుండరాదని చెప్పుచు కొందఱు ఇతిహాస భూగోళాది సూచక శబ్దములకు ఇంకొక యర్థము చేయుదురు. వేదములలోని ఇతిహాస భూగోళ జ్యోతిషములను సరియైనవని తలంచి కొందఱు వేదములను మానవకృతములని యెంచుచు అట్టి వేదము లెప్పుడు పుట్టినవో దాని నిర్ధారణకై పూనుకొనుచున్నారు. వేదముల నర్థముచేసుకొను విషయమై పై రెండు సంగతులు వచ్చుచున్నవి. మంత్రశక్తి మాట అటుబెట్టి అచ్చట వ్యాకరణము అధికారము చేయుచున్నది. గాని మనము వేదార్థమునకై పూనుకొనక మంత్రములను కేవలము యజ్ఞసమయమున ఉపాసనా సమయమందు విషయముగా మనస్సునేకాగ్రము గావించుకొని జ్ఞాన ప్రాప్తికి కారణమైన సూత్రములని తలంచితిమా పురాణాదులు వేదభాష్యములని అంగీకరించవలసి యుండును. పురాణములందును ఇతిహాస భూగోళము లున్నవనికూడ మఱువరాదు.

పురాణముల స్వరూపము వాటి వర్ణ్య విషయసత్యతను వివేచించుటయనునది స్వతంత్ర విషయము "ఎవడు నెవ్వనికిని నవీనజ్ఞాన మొసగుటలేదను స్తోత్రటీకు వాక్యము ముందుగనే ఉదాహరించబడియున్నది. జ్ఞానదాత కేవలము విస్మృతజ్ఞానమును జ్ఞాపకము చేయుననికూడ నతడు వక్కాణించియుండెను. నవీనజ్ఞాన మొసగుట సంభవము కానప్పుడు నేటి యీ వైజ్ఞానికుల శాస్త్రము భౌతికజ్ఞాన సంబంధమైన అనేకానుసంధానములు. ఇవన్నియు నూతనజ్ఞానమని చెప్పవచ్చునా? - కాదు. విస్మృతజ్ఞానమునకిది పునః స్మృతిమాత్రమే. నిజమునకు యీ అనుసంధానముల - సిద్ధాంతముల క్రమపూర్వ భాగము నూతనమైనది మానవుని అంతఃకరణమే సము. వీటి సత్యము పురాతనము; ఏలనన - సత్యమెప్పుడును నవీనముగాదు. జ్ఞానవిస్మరణ — స్మరణ చక్రము ప్రపంచమున నడచుచునేయుండును.

జ్ఞానము నవీనము కానట్లే విచారములుగూడ నవీనములుగావు. విచారములచేతనే జ్ఞానము కలుగును. మనుజుడు నిత్యము నవీనవిచారములు చేయజాలడు. విచారమునకు గొన్ని నిశ్చిత స్తరములు గలవు. మానవుని మనస్సు వాటిలో ఏ స్తరమునందునో ఆ స్తరము యొక్కయే విచారధార మనస్సునకు వచ్చివేయును. పదార్థములు ఘట్టములు విచారపరిణామములని యుంచ తెలుగుదురు. మనస్సునకు రాకుండ ఏపనియు నుండదు. ఏ పదార్థము - ఏ ఘట్టముయొక్క నిర్మాణము ఉండదు. ఇంక కొంచెము ముందునకు బోవుదము. ఈ వ్యాసములో మొదట, సృష్టి స్వతః అయియుండలేదని వివరముగ జెప్పబడినది. సృష్టికర్తయగు చేతనమేదియో యుండియున్నది. అతని సమీపములో మనస్సున్నది. అతని మనోమతితార తమ్యమే సృష్టిలో లక్షితమగుచున్నది. సృష్టికర్తయొక్క విచారమే సృష్టిరూపములో బరిణతమగుచున్నది సృష్టికర్త గూడ నవీనవిచారములు చేయడు; ఏలనన-నూతన జ్ఞానము నూతన విచారముండజాలదు. అతని మనస్సుకూడ మానవ స్తరములనుండియే విచారము గ్రహించును. ఆ స్తరములయందే యతని మనస్సు తిరుగుచునుండును. ఫలితముగ సృష్టి ఆ స్తరముల, వ్యక్తమైన అభివ్యక్తి మాత్రమై యుండును.

(కళ్యాణ్ నుండి అనువాదము)

---

# వార్తలు - విశేషములు

## శ్రీ రామేశ్వరస్వామి శ్రీ వేణుగోపాలస్వామివారల ఆలయములు స్కిన్నరపురము

*(ధర్మకర్త - శ్రీ వేమూరు శ్రీనివాసరావు)*

(హిందూదేవాదాయ ధర్మాదాయ పరిపాలనాశాఖ పాతికేండ్ల పర్యవేక్షణలో (1932 - 19 7) అభివృద్ధి.)

స్కిన్నరపురము పశ్చిమగోదావరిజిల్లా తణుకు తాలూకాలో తణుకునకు నైఋతిమూలగ బదిమైళ్ళ దూరములోనున్న యొక చిన్నగ్రామము. 1801 లో బందరుజిల్లా రెండవడివిజన్ కలకక్టరు, స్కిన్నరుగారి విహారస్థలన ఈ గ్రామమేర్పడినదిగావున దీనికి స్కిన్నరపురమని పేరువచ్చెను. ఈ గ్రామమేర్పడిన యచిరకాలములోనే మొగల్తుర్రు సంస్థానమునుండి యిది పిప్పరయెస్టేటుకు సంక్రమించెను. 1839 లో ఆ యెస్టేటు చెల్లించవలసినపన్నుకై వేలమునకు రాగ ఈ గ్రామమును కంపెని-గవర్నమెంటువారు కొనిరి. అప్పటినుండియు నిది పూర్తిగ గవర్నమెంటు గ్రామమయ్యెను.

ఇంచుక ప్రజలసహాయముతో వేమూరివారు శ్రీ రుక్మిణీ సత్యభామా సమేత శ్రీ వేణుగోపాలస్వామి వారి ఆలయమును, వారి బంధువులు గోవిందరాజువారు శ్రీ రామేశ్వరస్వామివారి ఆలయమును కట్టించిరి. విష్ణ్వాలయము పాంచరాత్ర ఆగమము ప్రకారము ప్రతిష్ఠింపబడినది. రెండాలయములు నొక్కటే ప్రాకారములోనున్నవి. రెండింటికి అర్చకుడు ఒక్కడే; వెల్నాటి అర్చకులు. దేవాలయము మాన్యములు యు. 21 - 02 ఉభయస్వామివారలపేర సమోజై తత్కాల మేనేజరు స్వాధీనము నందుండెను.



శ్రీ రామేశ్వరస్వామి, శ్రీ వేణుగోపాలస్వామి ఆలయములు నిర్మాణపూర్వరూపము

ఈ గ్రామమునకు సన్నివసతులేర్పాటైయున్నను ఇచటికి ప్రయాణ సౌకర్యములేదు. వర్షకాలములో వానయోగ్యము కాకయుండెను; వ్యవసాయమునకుతప్ప ఇతరవృత్తుల కవకాశములేదు. గ్రామము వృద్ధినొందక క్రమముగ క్షీణించుచు వచ్చెను. 1930 నాటికి ఆలయములు రెండును పూర్తిగ శిథిలము లయ్యెను. ధ్వజస్తంభములు, ప్రాకారము వినాశ పోయినవి. ఉత్సవములు జరుగుటలేదు. అర్చకుడు రోగగ్రస్తుడై యుండెను. ఆలయమునకువచ్చెడు వారెవరునులేరు. నైవేద్యము పెట్టవలసినప్పు డర్చకుడు, తలుపులువేసినతోడనే గబ్బిలములు, ఎప్పుడైన పాములుతప్ప, ఇతరజీవు లాగుడులోనికి పోయెడువారుకారు.

దేవాలయముల స్థితి యిట్లుండ 1931లో శ్రీ వేమూరి శ్రీనివాసరావుగారు కాకినాడనుండి తమకు కాపురమువచ్చుట తటస్థించెను. అప్పటి కైదారేండ్ల క్రిందటనే దేవాదాయ వ్యవహారములను సక్రమముగ నిర్వర్తించుటకు చట్టమును, బోర్డును యేర్పడియుండెను. వీరి సహాయముతో ఈ దేవాలయములను పునరుద్ధరింపవలెనను సంకల్పము కలిగినది. అప్పటికి అర్చకుడు కాలముచేయుటచే ఆయన పినతండ్రి వచ్చి దేవాలయభూములు స్వాధీనము చేసుకొనజూచిరి. ఆభూములనుగురించి గవర్నమెంటువారికి ఆయన ఇన్‌క్లాసుఫీజ్ కట్టియుండిరి. బోర్డువారికి కంట్రిబ్యూషను కట్ట నవసరములేదని కోర్టులో పిటీషనుపెట్టి వాదించుచుండిరి. అప్పుడు బోర్డు చేయుచుండినపని దేవాలయములకుగల ఆస్తులను తెలిసికొనుట, వానిని స్వాధీనము చేసుకొనుటకు కోర్టుచర్యలు జరుపుట. ఆతరుణమున మేము కలుగజేసుకొని దేవాలయము భూములన్ని నిష్పూచిగ మాకు స్వాధీనము చేయుటకును, బోర్డువారికి కట్టవలసియున్న కంట్రిబ్యూషను, ఖర్చులు మేము కట్టుకొనుటకును, ఈ భూములనుగురించి ఆయన చేసినఋణము యావత్తు మేము కాంపౌండుపద్ధతితో తీర్చుకొనుటకును, ఆయన రెండాలయములలో అర్చకత్వము చేయుటకును, అందులకై ఆయనకు ధూపదీప నైవేద్యములకుసహా జీతముగ ముప్పదిబస్తాల ధాన్యము ఇచ్చుటకు నొడంబడిక గావించుకొంటిమి. ఇది చేకూరినపిమ్మట ఈ ఆలయములనుగూర్చి స్కీము చేయవలసినదనియు, మేము కట్టుకొనుట కంగీకరించిన ఋణము దేవాలయముల ఋణముగ నంగీకరింపవలసినదనియు, అట్లు అయ్యెనేని యేకోర్టుచర్యలు అవసరములేకయే దేవాలయము భూములు

రు. 21-02 లు స్వాధీనమగుననియు బోర్డు యాజమాన్యమున దేవాలయముల కార్యములు మేము సరిజూచుచుందు మనియు వ్రాసుకొంటిమి. మేము కోరినట్లుగ 1932 లోనే స్వాధీనముచేసిరి. అప్పట్లో దేవాలయము భూములనుండి 68 బస్తాలధాన్యమును పన్నులకై రు. 70 లును వచ్చుచుండెను.

ఈ దేవాలయములను జేరి రామగుండమను పేరుతో గ్రామతటాకమున్నది. గ్రామములో మంచినీటి వసతికి ఆధారము. అందలి చేపలను సహజముగ గ్రామములోని కాపులు భక్షణ చేయుచుందురు. ఈ చెఱువును దీనిగట్లపైనున్న తాటిచెట్లును దేవాలయము ఆస్తియేయని అట్లు పరిగణింపవలెనని గ్రామస్థులు కోరిరి. చేపలను జంపి డబ్బు తెచ్చుకొని వానిని దేవాలయ కార్యములకు వినియోగించుటకు మేమిష్టపడలేదు. దీనికి మేమంగీకరింప సంతమాత్రమున చేపలను తినువారు తినుటమానరని చెరువును వేలమువేయుచు వచ్చినచో నది ఆదాయకరముగనుండునని ప్రజలనిరి. ఈ చెరువును దేవాలయముల ఆస్తిగ చెప్పవలెనని బోర్డువారిని కోరితిమి. కలక్టరుగారికి నోటీసు యిచ్చి విచారణచేసి బోర్డువారు దీనిని దేవాలయము ఆస్తిగ నిర్ణయించిరి.

1938 నాటికి అప్పుతీర్చి వేసితిమి. మరల నింకొక యత్నము చేయుటకు ధైర్యము కలిగినది. దేవాలయములు జీర్ణమైయుండుట, పార్వతీ ప్రతిష్ఠలేక శివలింగ మొక్కటియే ప్రతిష్ఠింపబడియుండుట, ఆడియు కదలిపోయి యుండుట గ్రామమున కనర్థహేతువులని పెద్దలు చెప్పిరి. తిరిగ ఋణముచేసి పునఃప్రతిష్ఠలు చేయ నిశ్చయించితిమి. దేవాలయము ఆస్తులను తనఖాపెట్టి ఋణము తెచ్చుటకు బోర్డువారి అనుమతి కోరితిమి. మా కృషికి బోర్డువారు సహాయపడిరి: దేవాలయముల ఆస్తుల తనఖాపై మేము ఋణము తెచ్చుట కనుమతినిచ్చిరి. రు. 1200 ఋణము తెచ్చి కొంచెము చందాలుగ తెచ్చుకొని, జీర్ణమై కదలిపోయి యుండిన శివలింగమును ఉత్థాపనముగావించి కాశీపట్టణమునుండి శ్రీ శ్రీ శ్రీ బ్రహ్మానంద సరస్వతీస్వాములవారు పంపిన కళలతో విరాజిల్లు ఉత్తమ నర్మదాబాణమును, క్రొత్తగ శ్రీ పార్వతీదేవిని విఘ్నేశ్వరుని, నందిని, దేవాలయమునందును, రుక్మిణీ సత్యభామా సమేత శ్రీ వేణుగోపాలస్వామిని, శ్రీ ఆంజనేయస్వామిని విష్ణ్వాలయమునందును బహుధాన్య వైశాఖ శు॥ ద్వాదశి బుధవారమునాడు (11 - 5 - 1938) ప్రతిష్ఠగావించితిమి. అపుడే ఆలయములకు ప్రాకారము నిర్మించితిమి. అప్పటినుండియు పూర్వము జరుగు ధూపదీప నైవేద్యములేగాక ప్రతి శుక్రవారము శ్రీ పార్వతీ రుక్మిణీ సత్యభామలకు కుంకుమపూజయు, ప్రతి మంగళవారము శ్రీ ఆంజనేయస్వామికి విశేష పూజయు, మాసశివరాత్రికి దేవాలయములో అభిషేకము, ఏకాదశికి శ్రీ వేణుగోపాలస్వామికి సహస్రనామార్చనయు చేయుచున్నాము.

పునఃప్రతిష్ఠ జరిగి అప్పటినుండి భయభక్తులతో శ్రద్ధగ అర్చనచేయుచున్నప్పటినుండి గ్రామము సిరిసంపదలతో వర్ధిల్లుచు వచ్చినదను నమ్మకము గ్రామస్థులకు కలిగినది. అయినను ఆలయమునకువచ్చు అలవాటు వారికి కలుగలేదు. నిజముచెప్పవలెనన్న మా గ్రామస్థులందరికి (అర్చకుడు, గ్రామకరణముగార్లకు తప్ప) అమ్మవారి జాతరయందె ఎక్కువ మక్కువ.

ఆలయమునకు ధ్వజస్తంభములు లేనిలోటు ఉండినది. కాని అది కొంచెము సొమ్ముతో నగుపనికాదు. మేమిక అప్పు చేయదలచుకొనలేదు. ఉన్నఅప్పును తీర్చివేసి సొమ్ము నిలువజేయ జూచితిమి. ఒక్క ధ్వజస్తంభమునైన ప్రతిష్ఠించు పుణ్యాత్ములుందురా యని తలపోయుచుంటిమి. కోరుకొల్లు గ్రామకాపురస్థులు, శ్రీ మంతెన తిమ్మరాజుగారి భార్య సుభద్రయ్యగారు శ్రీ వేణుగోపాలస్వామివారి ఆలయమునకు మూడు నాల్గువేల రూపాయలుఖర్చు పరచి సర్వధారి నామ సంవత్సర చైత్ర శు॥ పంచమి బుధవారమునాడు (28 - 4 - 1948) ధ్వజప్రతిష్ఠ గావించి పుణ్యముకట్టుకొనిరి.

ప్రతిష్ఠలుచేసినను అంతటితో సరిపోదు. దేవాలయములలో ప్రభావము నిలబెట్టుటకు ఆలయములందు తఱచు స్వస్తివాచకము, పూజలు, భక్తుల ఆగమనము, ఉత్సవములు, అఖండ దీపములు అవశ్యకములని 1919 లో అనుభవజ్ఞులైన శ్రీ అసిస్టెంటు కమిషనరుగారు మాకు సలహాయిచ్చిరి.

వేదాధ్యయన సంపన్నులు, స్వస్తివాచకులు అన్యగ్రామములనుండి రావలసియుండుటచేతను వచ్చినవారికి భోజనము పెట్టవగినవారుకాని పెట్టగలవారుకాని గ్రామములో లేకపోవుటచేతను దానికగు వ్యయము దేవాలయము రాబడినుండి చెల్లించుట యుచితమగుట అంగీకరింతుమని మా కభయమిచ్చిరి. వారట్లు సలహా నిచ్చినతోడనే పెద్దలు నిశ్చయించిన శుభముహూర్తమున, విరోధి సంవత్సర జ్యేష్ట బహుళ షష్టి గురువారము (16 - 6 - 1949) రెండు ఆలయముల లోను అఖండదీపములు ప్రతిష్ఠించితిమి.

ఆలయములలో స్వస్తిచెప్పుటకు పొరుగూరునుండి వచ్చువారలకు భోజనమునకగు ఖర్చులను అంగీకరించితిమని అసిస్టెంటు కమిషనరుగారు సెలవిచ్చినప్పటినుండి ప్రతిసంవత్సరము కళ్యాణములు చేయుచున్నాము. ఈ కళ్యాణములలో మూడురోజులు వేదపారాయణ, సుందరకాండ పారాయణ, సూర్యనమస్కారములు, అభిషేకములు, కుంకుమపూజలు జరుపుచున్నాము; కాని వినోదములకు గానసభలకు ప్రాధాన్యమీయలేదు. ఈ కళ్యాణములు మేము ప్రతిష్ఠలు గావించిన వైశాఖ శు॥ ద్వాదశి కనుకూలముగ, ఆ యేకాదశికి చేయ ప్రారంభించితిమి కాని, దేశమందన్ని ఆలయములలో కళ్యాణములు మాఘాది మాసముల ఏకాదశులకే జరుగుచుండుటచే దృష్టి ఇచ్చుటనే పెట్టి మూడురోజులు ఇటనుండి గదలక కళ్యాణములు చేయించు అధ్వర్యులు దొరకుట కష్టమయ్యెను. అందుచే పెద్దల సలహానుపొంది రథసప్తమితో అవభృతస్నానమగునట్లు కళ్యాణములు చేయుచున్నాము. హరిహరుల కభేదము గావున రెండాలయములలో కళ్యాణములు ఏకకాలమందే ఒక్క ప్రాకారములోనే శైవ వైష్ణవాధ్వర్యులచే జరిపించుచున్నాము. ఆదినములలోనే ఆలయములు నిండుజీవముతో నొప్పారుచు ఆధ్యాత్మిక ప్రభల ప్రసరించుచుండును.

శ్రీ రామేశ్వరస్వామివారి ఆలయమునకును ధ్వజస్తంభములేని లోటుతీర్చగల్గితిమి; మేము కూడబెట్టుచువచ్చిన సొమ్ముతో జయనామ సంవత్సర మాఘ శుద్ధ చతుర్దశి ఆదివారమునాడు (6-2-1955) రామేశ్వరస్వామివారి ఆలయమునకు ధ్వజప్రతిష్ఠగావించితిమి. ఇంజనీరుగారు ధ్వజస్తంభ నిర్మాణమునకు రు. 3500 లు అంచనావేయగా వీరియా కమిటీవారు రు. 2000 లు మాత్రమే ఆమోదించిరి. కర్మకాండభాగమునకు అంగీనను ఏమియుచెప్పరు. ఖర్చు తగ్గుటకు ధ్వజప్రతిష్ఠ కళ్యాణములతో గలిపి చేసితిమి. ఆగమోక్త క్రతుభాగమునకు, కళ్యాణములకు, కలిపి రు. 677-0-6 లు మాత్రమే ఖర్చు అయ్యెను. ధ్వజప్రతిష్ఠ అన టేకు దూలమును ఇత్తడితొడుగుతో సిమెంటుతో బిగించుటకాదనియు, సూత్రవిహితమైన జపహోమహవనాదులతో గూడిన క్రతువనియు, దీనికి అవశ్యముగా సొమ్ము ఖర్చు అగుననియు అంటువారికి, బోర్డువారికి నచ్చచెప్పవలసివచ్చుట మాకు చిత్రముగనే దోచెను. దైవకార్యములగురించి చేయు ఖర్చులలో ధర్మకర్తల కించుక వైశాల్యమీయక అణాపైసలు గుణించుకొనుచున్నచో భారతీయ సత్ సంప్రదాయములు వితనాదవలసివచ్చుచుండును.

అర్చకునకు మేమిచ్చు జీతమునుండి 7 బస్తాలు తగ్గించవలసినదని 1953 సంవత్సరములో ఇన్‌స్పెక్టరుగారు అకారణముగనే అర్చకునకు చెప్పకయే, వీరియాకమిటీకి సిఫార్సుచేసిరి. వీరు తథాస్తు అనిరి; దీనిపైన అర్చకుడు డిప్యూటీ కమిషనరుగారికి అప్పీలు చేసుకొనగ శ్రీ భాగవతుల అన్నపూర్ణయ్యశాస్త్రిగారి యొద్దకువెళ్ళి పరీక్షయిచ్చి రమ్మని అర్చకునకానతిచ్చిరి. దీనితో నతడు తన మంత్రస్వరముల లోపములను దేవాలయములందలి పరికరములలోని లోపములను పూరించుకొని వెళ్ళి పరీక్ష ఇచ్చి అప్పీలు గెల్చుకొనివచ్చెను. ఆలయప్రాకారభవనాది స్థిరాస్తులపైననేగాక బోర్డువారు దేవాలయాంతర్గత జీవముపై శ్రద్ధపెట్టుటచేత మా ఆలయములలోను అర్చనలు జరుపుచు విగ్రహములకు కవచములు, వెండి బంగారు వస్తువులు, ఇవి దాచుటకు ఇనుపపెట్టెయు కొని వాని కన్నిటికి రమారమి రు. 2000 లు వరకు ఖర్చు పెట్ట గల్గితిమి.

ఈ పాతికేండ్లలోను మేము కోరినపుడు గ్రామస్థులు దేవాలయ కార్యములందు మాకు తోడ్పడుచునేవచ్చిరి. మేమే రైతుపైనను దావాచేయవలసిన అవసరమెన్నడురాలేదు. దేవాలయములే భూమికామందులైనపుడు రైతుకు భూమికామందుకుమధ్య ఉండవలసిన సంబంధము ఆదర్శ ప్రాయముగనే యుండవలయును.

## దేవాలయముల ట్రస్టీలకు సన్మానము

స్కన్నరపురములో వెంచేసిన శ్రీరామేశ్వరస్వామి శ్రీ వేణుగోపాలస్వామి వారల కల్యాణ మహోత్సవములలో పంచాయతీబోర్డు ప్రెసిడెంటు శ్రీ అందే నాగభూషణముగారి అధ్యక్షతను పెద్దసభ గావించిరి. ఆ సభలో ట్రస్టీలు శ్రీ వేమూరి శ్రీనివాసరావుగారు బి. యె. బి. యల్., గనిసెట్టి రామయ్య, అందే సుబ్బన్న, అందేరామన్న గారలు తాము ట్రస్టీలుగ 1932 నుండి ఒక్కపట్టున పాతికేండ్లు దేవాలయములకై చేసిన పనులను, అభివృద్ధినిగూర్చి తమ రిపోర్టు ప్రదర్శించిరి. వీరుచేసిన సేవకు గ్రామస్థులు కొనియాడి వీరి గౌరవసూచకముగ ట్రస్టీలను నూతన వస్త్రములిచ్చి సన్మానించిరి.

# THE IDEAL OF RENUNCIATION

(From Srimad Bhagavatam)

O thou, God of gods,
Prince among Yogis,
Blessed are they who speek thy Word,
And Blessed is he who hears of thee.
Thou hast willed to leave this earth
And go to thine eternal abode.
Thou art the Lord of my heart, O Kesava:
Separation from thee is intolerable even for a moment:
Take me with thee to thy dwelling place.

O Krishna, blessed indeed are they who but hear of thee and meditate on thy divine life and thy divine play, for they become free from all worldly desires and attain to thy being.

But how can we, thy devotees, thine inseparable companions, live apart from thee?

Thou art our only beloved,
Thou art our very Self.

Verily, we thy servants will conquer thy Maya, the delusion of existence, merely by living in thy holy company and by doing thee service.

Sages and saints there are, who, freed from physical consciousness, practising great austerities, living continent lives, self-controlled, pure, and free from worldly desires, attain thy being, the abode of Brahman;

But we who live in the world, still attached to karmas, can overcome the world, by thy grace alone.

We can overcome this world, and go beyond the boundless ocean of darkness, only by conversing of thee with thy devotees, by remembering thee and reciting thy deeds and words, by thinking and meditating on thy divine life and thy divine play.

*(With the kind courtesy of Sri Ramakrishna Math)*

" We must recognize that it is providential that the West has come to India. And yet someone must show the East to the West, and convince the West that the East has her contribution to make to the history of civilization. India is no beggar of the West. And yet even though the West may think she is, I am not for thrusting off Western civilization and becoming segregated in our independence. Let us have a deep association. " (1)

This great task of realising our own culture and at the same time associating ourselves with Western culture is in keeping with the spirit of unity in diversity, which is the backbone of our culture. (2) And this great task can be achieved not by the politician but by the man of culture who is rich in moral ideals.

*Scientific Humanism*

The history of India has been the history of constant re-adjustment between the constructive spirit of the external with the creative spirit of the internal in Man. The former always seeks the cadence of order in social organization while the latter seeks freedom and love for its self-expression. History tells us that once we laid stress on the one and realized that the evils of that age were the results of the neglect of the other; and realizing this we so foolishly laid the stress on the other at the cost of the one, that the pendulum swung to the other extreme and the other age had again its reprisals which put a spoke in the wheel of progress. Today we stand at the cross-roads of civilizations. We have to watch and see if still the creative spirit is living in India; and also whether it offers its service and hospitality to the sick and suffering world.

There are many evidences to show that even in the past humanity was happy when a balance was struck between the two opposites, the creative and the constructive spirits. In the epic age the Kshatriya stood for the constructive spirit of the external while the Brahmin for the creative spirit of the internal in Man. There was always a difference of opinion, a clash of ideologies between these two outstanding castes of India, simply because they represented two different approaches to life. But whenever there was tolerance exhibited by these two, there was peace and concord among the people. That is to say they had comprehended their *Yugadharma*. It was a realization of truth, a realization of a harmony between the two opposites, generally through the *Yugapurusha*. And peculiarly enough the *Yugapurusha* happened to be by birth or heredity quite the opposite of what he was by profession or upbringing. We might take up the lives of the three *Yugapurushas* of old (there are many others too who stand our study; space restricts our vision and we shall deal with these three only). Janaka, Visvamitra and Ramachandra, who represented three different ages of human elivation.

Janaka was described as a *Rajarshi* which means a kingly prophet. As an ideal king, he had to prove to his subjects that even a ruler, a Kshatriya by birth was to be a Brahmin by breading, that is, he must strive towards the Knowledge of the Supreme Truth, *Brahmajnana*, so that he can maintain the unity of the world (*Lokasamgraha*). (3)

1. "Selections from Tagore". Macmillan and Co ,Limited. Ed. 1945. P. 77.
2. "Aradhana". Jan. 1957.
3. Gita. III. 20. कर्मणैव हि संसिद्धिमास्थिता जनकादय: । लोकसङ्ग्रहमेवाऽपि सम्पश्यन् कर्तुमर्हसि ॥

The interesting story of the fight between Vasishtha and Visvamitra again represents the conflict between the creative and the constructive spirits of the age. In that conflagration the Brahmins were not all on one side, nor all the Kshatriyas took to the other. Many Kshatriyas espoused the cause of the Brahmin-warrior, Vasishtha. Visvamitra tried his might to defeat Vasishtha but could not do so. Finding that all his strategies and manoeuvres were defeated by the "sacred-stick" (*Danda*) of Vasishtha, Viswamitra accepted defeat and proclaimed, "Down with the power of the Kshatriya! The power of the Brahmin is the power of powers." (1)

Ramachandra was born in the orthodox creed of the royal house which took Vasishtha as its priest and prognosticator. But from his boyhood he was won over by Visvamitra, the born-enemy of Vasishtha. Ramachandra was the confluence at which the streams of the creative and the constructive spirits met.

These examples will suffice to prove that life in ancient India moved in the cadence of constant adjustment of the opposites; it was a perpetual reconciliation of contradictions; a unity achieved in diversity.

Even today, the problem before us is the same problem. Only the approach we are trying to make is modern. Every age is limited by its environment and suffers from the illusion that its approach to things is the only right way. Then a seer, a genius is born, who looking into the future through the help of the past and the present, helps his age to have a complete vision of humanity and the universe. He throws open the book of eternal truths and they pick and choose from it the solutions of their own problems. Thus to achieve a correct solution is always to solve a problem of that generation.

In India of old, the races that occupied the country were only a few; and those too were scatterrd all over the land and therefore they could think in those narrow terms of nationalism. In fact, what seems to us as narrow nationalism now was to them internationalism in our modern sense. The Brahmin wound up his daily prayer saying, "Let the Brahmins and the cows of the land surrounded by the four seas be happy and prosperous." (2) The Brahmin represented the spiritual life of the Aryan while the cow stood for the economical and mundane prosperity, for the Aryan civilization was an agricultural one. Today, for us the Brahmin has altogether a different meaning and it is perhaps silly on our part to say that the non-Bramin was overlooked and that the Brahmin was always the dictator of old India. The non-Brahmin was represented by the cow.

In modern age, the constructive spirit in man is science while the creative is humanities. And even today the daily prayer of the Brahmin holds good. It means in modern terminology, "Let there be harmony between humanities (Brahmin) and sciences (the cow, or the Kshatriya or the non-Brahmin as the case may be) if man is to be happy and prosperous." Accordingly, a Brahmin is one who upholds the creative spirit and not he who claims by heredity his position in society; and a non-Brahmin is one who works for constructive ideologies and not one who is born to non-Brahmin parents. Even now it is possible for a Brahmin by birth to take to the life of a non-brahmin by profession or upbringing; that is to

1. "धिग्बल क्षत्रियबलं ब्रह्मतेजोबलं बलम्" ॥

2. चतुस्सागरपर्यन्तं गोब्राह्मणेभ्यः शुभं भवतु ॥

This is almost the burden of the song in many ceremonial recitations also in Hinduism.

చూచుచుండును. 70 సంవత్సరముల క్రిందట ఆశ్రమము నానుకొని రైలురోడ్డు వేయుటచే రైళ్ల రాకపోకలతో ప్రశాంతత అశాంతికి దారి చూపినది. అచ్చట సనాతన బిల్వవృక్షమున్నది. బొటనవ్రేలి లావు గలిగి 8 అడుగులు పొడువు గలిగి పెరుగక తరుగ కట్లే యుండుటచే మార్కండేయుని పేరున భక్తులు ప్రేమించి పూజింపుచుందురు. వృద్ధులెల్లరు యీ విషయమై సాక్ష్యమిచ్చుచున్నారు. ఆశ్రమము వెనుకనే సెల యేరున్నది. స్నానపానములకు తపమునకు యోగ్యమగు పుణ్యభూమి. సుమారైదు సంవత్సరముల నుండి శ్రీ సత్యనారాయణస్వామి అను వారున్నారు.

## శృంగిశైలము

శ్రీ ఆంధ్ర వాల్మీకి వావిలకొలను సుబ్బారావుగారు వాల్మీకాశ్రమమను పేరున నొక కట్టడము నిర్మించి ఇందు తపో, ధ్యాన, భజన, సత్కావ్యరచనాదులు చేసిరి. ఇది రామతీర్థపు గట్టుననే యున్నది.

క్షేత్ర, తీర్థ, ఆశ్రమ మాహాత్మ్యముల గురించి తెలిపితిని. ఇక రాముండెంత సత్యాత్ముడో పిలచిన వారిని, తలచిన వారినెట్లు కాపాడెనో కొన్ని సంఘటనల మూలమున తెలియనగును. ఆ చరిత్రముల చిత్తగింపుడు.

## బమ్మెరపోతనామాత్యుడు

వీరి కవితాప్రాభవ మెంత దొడ్డదో ప్రారబ్ధమంత చెడ్డది. రాను రాను చరిత్రములు తఱచువారు వీరిని ముప్పతిప్పలు పెట్టుచున్నారు. మా వాడంటే మావాడని ప్రేమించు టెంతవానిని? మావరకు పోతన మా యూరు వాడనియె చెప్పకొందుము. నిదర్శనములందురా? శాసనములందురా? ఆధారములందురా? వారి గ్రంథము నుండియే లభించవలెను. అంతమాత్రపు టాధారమె అందరికిని. ఒకరి జీవితకాలములో రెండు స్థలముల నుండ కూడదా? అట్లులేరా? అప్పటికాలమున మహమ్మదీయుల దౌర్జన్యమెక్కుడై, నిష్ఠాపరులు, సాధుపంతులు, మొగము చూపని, యోపని, పాడుకాలము తెలంగాణమునకు సంభవించినందున ఇచ్చట నుంచి యుండవచ్చును. ఏ పేరు గల వారాయూరనే యుండవలెనను నియమమా? ఆంధ్రులట్లున్నారా? ఆంధ్రుడై కాకర్లవంశాబ్ధి సుధాకరుడైన త్యాగరాజు తంజాపుర రాజ్యమున నుండలేదా?

ఓ పూజ్య మహాకవీ! భక్తశేఖరా! వైరాగ్యఖనీ! పలికెడిది భాగవతమైన పలికించెడివాడు రామభద్రుడా? ప్రయోజనము? భవహరణమా? శ్రీ కైవల్యపదంబు జేరుటకా?

బాల రసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యకను కూళల కిచ్చి యప్పడుపు కూడు భుజింపని దారిద్ర్యమునే



బమ్మెర పోతనామాత్యుని శిలా విగ్రహము

వరించి హాలికుడవై నిజదార సుతోదర పోషణ జేయుచు నత్కవీశ్వరునివైతివా? అహా! యెంత ధన్యుడవయ్యా! మహానుభావా!

పోతన మడియను పేరున రామతీర్థమునకు దూర్పున నిప్పటికిని గలదు. పోతన మా మేనమామవంశీకుడని చెప్పకొను వారు (కోడూరు కరణము ఎల్లప్పగారు) యిప్పటికి సజీవులు. సూక్ష్మతనూ విద్యావిలాసమను తాలపత్ర గ్రంథము వీరింటి దేవతార్చనయందున్నది. గ్రంథకర్త పోతనవంశమువాడ నని వ్రాసుకొనెను. ఒంటిమిట్టయందే మేనమామగారి వంశమని చెప్పకొన్నామె యొకరిత 20 సంవత్సరముల క్రిందటనే మరణించెను. పోతన గృహమను స్థలము అందుపై కాలువ వారి సత్రమను నొక ప్రాత సత్రము ఇటీవల శిథిలమైనది.

ఇంతకూ నిజము దేవుడెరుగు నీరు పల్ల మెరుగునన్న వార్తకు బమ్మెర పోతరాజు జీవిత మంకితము.

భగవద్భక్తి సామ్రాజ్యాభిషిక్తుడై, వైరాగ్యయుక్తుడై ఇతరుల తరింపజేయ ఆంధ్ర మహాభాగవతము రచించి, తాను శ్రీ కైవల్యపదంబు జేరెను. మనకూ అంతే కావలసినది.

వీరికి బావగారైన సకల విద్యాసనాథ శ్రీనాథకవి సార్వ భౌములు కేవల మైహికమునే నమ్మి అష్టభోగములు నన వరత మనుభవించి అంత్యమున నెట్లు విలపించెనో చూడుడు.

పొగడదండ కవిరాజు కంఠము కౌగలించెను గదా!
నల్లగుండు కవిసార్వభౌముని బుజమెక్కె గదా!
ఆంధ్ర నైషధకర్త కాళ్లకు చేతికి సంకెలలా?
యేడునూర్లు టంకములు చెల్లించలేక బొడ్డుపల్లె గొడ్డే రులో మోసపోయెనే!

కృష్ణవేణమ్మ గొనిపోయినది పోగా నింకేమి గలదు? వీరారెడ్డి కాశి విశ్వేశుని గలిసె. మైలారు విభుడు కైలాస గిరి జేరె. దెనుగు రాయలు స్వర్గపురి జేరె. విస్సనమంత్రి అమరుడయ్యె. భాస్కరుడు ముందే దేవుని జేరె. రత్నాం బరములిచ్చువారు, దినవెచ్చములు దీర్చువారు, హేమ పాత్రాన్నము సహపంక్తినిడువారు ఇంకెచ్చటను లేనపుడీ శ్రీనాధుడుమాత్ర మీ కలియుగమున నుండనేల? అని దారిద్ర్యమున కేడ్చుచు మరణించెను. ఐహిక, ఆముష్మిక ముల భేద మీ చరిత్రలవలన గ్రహింపదగును.

"బమ్మెర పోతరాజు నిరపాయ సుఖాత్ముని జేసె."
(ఆంధ్రవాల్మీకి)

## అయ్యలరాజ రామభద్రుడు

అయ్యలరాజ త్రిపురాంతకుడు (అప్పరాజు) ఒంటిమిట్ట రఘువీర శతకమును రచించెను.

"అతుల ప్రౌఢిమ మీఱు రాయకవి యయ్యల్రాజ సత్పుత్రుడం
చితభక్తిం ద్రిపురాంతకుండు రచియించెం దెల్గు పద్యంబులన్
శతకం బొక్కటి దీని నీకు విసుమాచంద్రార్కమై నిల్చు ప
ర్వత కన్యాసుత! యొంటిమిట్ట రఘువీరా! జానకీ నాయకా!"

అని వ్రాసెను. ఇంతకు అయ్యల రాజవంశీయులు ఒంటి మిట్టలో నివసించి యున్నట్లు ఆ దేవుని గొలిచినట్లు ముందు విన్నవించుకొందును.

శ్రీ కృష్ణదేవరాయల యాస్థాన కవియగు అయ్యలరాజు రామభద్రకవి తన రామాభ్యుదయ అశ్వాసాంతగద్యమున, "ఇది శ్రీ మదొంటిమిట్ట రఘువీరశతక నిర్మాణ కర్మఠ జగదేకఖ్యాతి ధుర్యాయలరాజు తిప్పయమనీషి పర్వతాభి ధాన ప్రౌత్రార్కయార్యపుత్ర పరిశీలిత సమర్థ రామానుజ మత సిద్ధాంత మర్మమమ్మడి వరదాచార్య కటాక్షవీక్షా పాత్ర హృదయ పద్మాధిష్ఠిత శ్రీ రామభద్ర శ్రీ రామభద్రప్రణీతం బైన శ్రీ రామాభ్యుదయమను "టచే వీరు తాతముత్తాతల నుండి శ్రీ రామభక్త శిరోమణులగుట నిశ్చయము. వీరు రచించిన శ్రీ రామాభ్యుదయమను కావ్యముగాక యించుక వీరి జన్మ వృత్తాంతము వలన శ్రీ కోదండరామ మాహాత్మ్యము దెలుప నెంచితిని. అయ్యలరాజ వంశము ఒంటిమిట్టలో నుండగా రామభద్రుడు జన్మించెను. ఇంచుమించు 1503 క్రీ.శ. వారుగ నుండవచ్చును. వీరిదిపండిత కవి వంశమని ముందే తెలుపుకొంటిని. శ్రీ రామభద్రుడు శిశువు గనున్నపుడు దేవుని గుడిలో యుత్సవముజూడ, తల్లియు దండ్రియు శిశువు నెత్తుకొనిబోయిరి. కొంతసేపటి కామె భర్త చేతికి పిల్లవాని నిచ్చెను. వారు పిల్లవానిని కొంతకాలము ఆడించి భార్య ప్రక్కనె పరుండబెట్టి 'నే బోయెదను. నీవు నిదానముగ నింటికి రమ్మ'నెను. ఊరి యుత్సవమునకై స్వామి బయలుదేర అత్రొక్కిడిలో అందరు లేవగా శిశువును మరచి భర్తయొద్ద నుండునని దలచి నిశ్చింతురాలై యుండెను. ఇద్దరింటికి వృత్తచేతుల చేరిరి. బిడ్డను నీ చేతి కిచ్చితిగదా యని యొకరు, నీ వద్దనే విడిచి వచ్చితిగదా యని యొకరు తారుమారు లాడుకొనిరి. ఇంతకు బిడ్డ గతి యేమయ్యెనోయని రాలుగరుగ నాయిల్లా లేడ్చెను. ఇరు గమ్మలు పొరుగమ్మలు, శిశువు రూపగుణములగూర్చి వర్ణింపుచు, తల కొక్క మాటగాననిరి. సొమ్ములపై నాశతో శిశు హంతకు లెత్తుకొనిపోయి యుండవచ్చుననిరి. మరి కొందరు దేవాలయమున వెదకబోయి గుడి తలుపు తాళ ములు వేసియుంటిపని వెనుకకు వచ్చిరి. తలి దండ్రు లిర్వురు ద్వారము చెంగటబడి విలపించుచు 'సీతారామా! నీవేగతి, మా బిడ్డని జూపుమా! రామా!' అనుచుండిరి. ఇంతలో యరుణోదయ మయ్యెను. అర్చకులు కుంచె కోలలతో దలుపులు దెరచి ప్రాభాతసేవల స్వామిని సేవించిరి. సకలలోకమాతయగు సీత యొడిలో నొకశిశువు ఆడుకొను చుండుట చూచి విస్మయాందోళిత హృదయులైరి. ఈ వింత వార్త అపుడే యూరెల్ల వ్యాపించెను. గుంపులుగట్టి యా యాశ్చర్య సంఘటనము జూడవచ్చిరి. రాతిరెల్ల విల పించి స్పృహ తప్పియున్న రామభద్రుని తలి దండ్రులు, తెప్పరిల్లి పరుగు పరుగున లోనికేగి బిడ్డను జూచి యానంద మున మైమరచిరి. తల్లి యొడిలో నున్నట్లున్న బిడ్డను చేత దీసికొని స్తన్యమీయబోగా కడుపునిండ యున్నట్లు, పెదవుల పాల గురుతులు గను పట్టెను; గనుక సీతాదేవి దయా మయ యగుట బిడ్డకు పాలిచ్చి కాపాడెను. లోకమాత స్తన్యము గ్రోలిన వాడగుటచే మహాకవియై శ్రీ రామాభ్యు దయ మహాకావ్యమువ్రాసి శ్రీ రామానుగ్రహము నొందెను.

(సశేషము)

# శ్రీనాధుని దక్షారామం

జె. వెంకట్రాజు, బి. ఏ.,
అసిస్టెంటు కమీషనరు, హెచ్. ఆర్. & సిహెచ్. ఎండౌమెంట్సు డిపార్టుమెంటు, ఏలూరు.

'దక్షవాటిక శివుని యంతఃపురమ్ము' అన్నాడు శ్రీనాధుడు, కవి సార్వభౌముడు, తాను రచించిన భీమేశ్వర పురాణంలో. ఈ దక్షవాటికయే యీ నాటి ద్రాక్షారామం. తూర్పు గోదావరి ఖండంలో రామ చంద్రపుర మండలంలో ఉన్నది. ఇక్కడి ప్రసిద్ధమైన వేల్పు శ్రీ భీమనాథేశ్వరుడు. ఈయన పట్టపురాణి మాణిక్యాంబ.

పూర్వకాలంలో యిక్కడ ద్రాక్షతోటలు విస్తారంగా ఉండేవి. అందుచేత ద్రాక్షారామం అని ప్రసిద్ధనామం వచ్చింది అని పలువురు చెబుదురు. కాని భీమేశ్వర పురాణంలో ద్రాక్షారామశబ్దమే కనుపించదు. దక్షప్రజాపతి, అతని నగరు దక్షారామం, అది భీమేశ్వరునికి నిరంతరావాసం - ఇదే శ్రీనాధుని వాడుక.

శివుని పట్టపురాణి గౌరీదేవి. గౌరీదేవిని కన్న తండ్రి దక్షప్రజాపతి. అతని నగరం దక్షారామం. కేవలం తొలిమామ గారి నగరం, యీశ్వరునికి అత్తవారి యిల్లు అంతఃపురం గావడం క్రొత్తగాదు. శ్రీమహావిష్ణువు కూడా పాలకడలి విడవడు చూడండీ. ఏం కారణం?....అత్తిల్లు. అంతే కావచ్చు, పాలకడలి శ్రీ మహావిష్ణువువారి అంతఃపురం అయితే శివదేవునికి దక్షారామం యెందుకు కాకపోవాలి? మహానుభావుడు - శ్రీనాధుని వాక్యం సత్యం - మధురంగా చెప్పేడు.

అంతటితో విడువలేదు కవిసార్వభౌముడు. ఇంకా రెట్టించాడు.

> 'ఎల్ల కాలంబు నుండెద నిచట నేను
> మొదలి మా మామ యారామపదము నందు,
> వెండిగుబ్బలిపై ప్రేమ వీడికొలిపి
> మేరు నగరాజుపై చాల మెచ్చు వదలి'॥

అని అనిపించాడు - తన కథానాయకుడు భీమేశ్వరుని చేత. కైలాసం విడిచాడట. మేరు పర్వతం వదిలేడట. దక్షారామంలోనే కాపురం ఉంటాడట నిరంతరం....విశ్వనాథుడు, పరమేశ్వరుడు, అత్తింటికోనరం యింత ఆరాటం. అయితే యేక పతీనాథుడు మానవు డత్తింట యిల్లరికం ఉండటం ఆశ్చర్యమా?

చూడండి - అత్తవారింట సంచరించే అల్లుని ప్రకృతి వికృతిని బడుతుంటుంది. నిరక్షరకుక్షి పరమ విద్వాంసు నిలా నటిస్తాడు. గోచిపాతరాయుడు చీని చీన్యంబరధారణ చేస్తాడు. గంజి త్రాగేవాడు కాఫీ లేనిది ఘడియ పడదంటాడు. పరమ శివునికి కూడా యీ ప్రకృతి పట్టినట్లు శ్లోకించాడు కవి - చక్కగా వర్ణించాడు - వినండి.

> 'గజచర్మ మెన్నడో గాని నిచ్చట గట్టు పసిడికమ్ముల
> పట్టు పచ్చడమ్ము
> భసిత మెన్నడొ గాని ప్రతిదినమ్మున యందు మలయ
> జమ్ముకురంగమదము గూర్చు
> నిడుద పాములరాజుతొడవు లెన్నడొ గాని తారహార
> ములు నిత్యము ధరించు
> సృకరంకరండమాలిక లెన్నడో గాని ధరియించు కల్హార
> ధామ మెపుడు
>
> కాటి నడుచక్కి నెన్నడో గాని యుండు
> దక్షవాటీసువర్ణ సౌధముల మీద;
> యెన్నడొ పిశాచులను గాని యిందుముఖుల
> నెల్లకాలంబు దలచు భీమేశ్వరుండు'॥

అయితే భీమేశ్వరుని కీ పామరత్వం మాత్రమే చూపి ఊరికోలేదు శ్రీ నాథుడు. దక్షారామంమీద శివుని కింత ప్రేమ కలుగడానికి హేతువులెన్నో చూపించా డింకా.

> 'దక్ష ప్రజాధినాథ మహాధ్వరక్రియాదీక్షాధిగమ పుణ్య
> దేశమునకు
> బ్రహ్మవిష్ణుపురందర ప్రధాన సుపర్వ పరమనంయమి
> సభాభవనమునకు
> దాక్షాయణీ యోగదహనార్చి రున్మేష సామిధేని మంత్ర
> జాతమునకు
> వీరభద్రభుజావిహారహేలానమారంభనాటక నాట్య
> రంగమునకు
>
> అమృతమయ దివ్యతేజఃన్వయంబు లింగ
> శాంత భీమేశ్వరేశ్వర స్థానమునకు
> దక్షవాటంబునకు మోక్షధామమునకు
> భోగజన్మ స్థలమునకే పురము సరియె!'

దక్షారామం యజ్ఞభూమి. దేవతల సభా భవనం. వేద వేదాంగ మంత్రనిధి. వీరభద్రుని నాటక విహారరంగ స్థలం. స్వయం ప్రతిష్ఠితమైన భీమేశ్వరుని అమృతమయ లింగ స్థానం. మోక్షధామం. భోగభూమి - అన్నాడు శ్రీనాథుడు. ఇంకా దక్షారామ మహిమలనంతంగా పేర్కొన్నాడు. అవి

మున్ముందు చెప్పబడ్డాయి. ఈ కారణాలన్నిటి చేతనూ భీమేశ్వరునికి దక్షారామం అంటే యింత ప్రేమట.

ఉత్తరదేశంలో కాశీనగరం, దక్షిణదేశంలో దక్షారామం- రెండూ సమాన మన్నాడు శ్రీనాథుడు అక్కడ విశ్వేశ్వరుడే యిక్కడ భీమేశ్వరుడట. అక్కడ గంగానది యిక్కడ సప్తగోదావరమట. అక్కడ ఢుంఢి విఘ్నేశ్వరుడే యిక్కడ వినాయకుడట అక్కడ దండపాణీశ్వరుడే యిక్కడ దండపాణీశ్వరుడట. అక్కడ కాలభైరవుడే యిక్కడ భైరవస్వామట. అక్కడ నందీశ్వరుడే యిక్కడ నందిదేవుడట. వారణాశి ఉత్తరకాశి, దక్షారామం దక్షిణకాశి శ్రీనాథుని మతంలో - ఇంతేకాదు - దక్షారామం కాశీ కన్నా గొప్ప దన్నాడు కూడా.

' కాశీ క్షేత్రమృతో జీవీ పునర్జన్మ శివాకృతిః
చిత్రం! దక్షపురీ జీవీ నజన్మ నశివాకృతిః '.

కాశీలో మరణించిన జీవి పునర్జన్మలో శివాకృతి పొందుతుంది. దక్షారామంలో మరణించిన జీవికి పునర్జన్మ లేనే లేదు. ఆ జన్మలోనే శివసాయుజ్యం పొందుతుంది-అన్నాడు.

దక్షారామానికి యెల్లలు చెప్పేడు శ్రీనాథుడు -

' తూర్పు దిశకును లవణపాథోధి సీమ;
దక్షిణమునకు వృద్ధగౌతమియె సీమ;
పడమటికి రాజమాహేంద్ర పట్టణంబు;
ద్యుమ్న పతిదిక్కునకు సీమ తుల్యభాగ ',

దక్షారామంలో యెక్కడ చూచినా సరస్సులు, దేవమందిరాలు, తటిసులు, పుష్పవాటికలు, నదులు, ఉన్నాయి. గోదావరీ తుల్యభాగా కౌంతేయకణ్వాపగా నదీ మాతృకాయమానమై యిరుగారును బంటనిచ్చే పంట పలంతి కేదార క్షేత్రాలతో ఉంటుంది. దక్షారామం భారతవర్షానికి ఫలసంపద- అన్నాడు శ్రీనాథుడు.

శ్రీనాథుని ఊహాప్రపంచంలో భీమమండలం విరిసిన తామరపువ్వు. ఈ పద్యం యెంతసొగసుగా చెప్పేడో చూడండి.

' ఆంధ్రభూభువసమధ్యము పుండరీకమ్ము; సప్త గోదావర జలము తేనె;
బ్రహ్మసంవేద్యాది బహుతీర్థములు తేకు; లకరులు చారు దివ్యస్థలములు
నాళంబు లవణాబ్ధివేలావిభాగంబు; కల్యాణభోగ మోక్షములు తావి;
దక్షవాటీ మహాస్థానమ్ము కర్ణిక; హంసమ్ము భీమ నాయకుడు శివుడు
గౌతమీ సింధుకౌంతేయ కణ్వనదులు
తుల్యభాగయు నేలేరు దుమ్మికొనలు;
భువన సంభావ్యమైన యీ పుణ్యభూమి
అనఘ! సంసారతాపశాంత్యౌషధమ్ము ॥ '.

" ద్వాదశక్షేత్ర వికచపంకజముతోడి దక్షవాటిక యనెడి కెందమ్మి విరిసి " అని శ్రీనాథోక్తి. పూర్వం బ్రహ్మాది దేవతలు భీమేశ్వర దర్శనార్థం వచ్చి సప్తగోదావరిలో స్నానం చేసి ద్వాదశ శివలింగ క్షేత్రాలు దర్శించారట. అప్పుడు దేవసిద్ధ సాధ్యగరుడ గంధర్వ కిన్నరకింపురుషులు తమ తమ పేరట శివలింగ ప్రతిష్ఠలు చేశారట. శ్రీనాథుడు పేర్కొన్న ద్వాదశ జ్యోతిర్లింగాలు చూడండి.

' ఇంద్రేశతీర్థమ్ము ఋషి సమాకీర్ణమ్ము; సిద్ధేశ్వరము సర్వసిద్ధికరము
యోగీశతీర్థమ్ము యోగలక్ష్మీదాయి; కాలేశ్వరము భక్త కల్పతరువు
శమనేశతీర్థమ్ము శాంతిదాంత విధాయి; వీరభద్రేశమ్ము విశ్వహితము
బ్రహ్మేశతీర్థమ్ము బ్రహ్మర్షిసేవ్య; మష్టైశ్వర్యదము కపాలేశ్వరమ్ము
కుక్కుటేశమ్ము శాంతికి కొంత వెలితి;
శ్రీ మహేశ్వరుతీర్థమ్ము శివుని మెచ్చు;
సోమనాథేశ్వరము ముక్తి సూచకమ్ము;
త్రిభువనాభ్యర్చితము రామతీర్థ మనఘ!'.

ఈ ద్వాదశ లింగక్షేత్రాలకూ మధ్య గరుడగంధర్వ యక్షకిన్నరులచేత ' శివలింగకోటి ' కల్పింపబడినదన్నాడు - శ్రీనాథుడు.

అంతే గాదు - ద్వాదశ క్షేత్రహృదయుడై భీమనాథుడుంటాడనికూడా అన్నాడు. ' నడుమరాయుంచ శ్రీ భీమనాయకుండు,' ' ద్వాదశలింగ దర్శనం భీమనాథ దర్శనం.

శివలింగ మాహాత్మ్యం వర్ణించాడు శ్రీనాథుడు -

' సకల లోకప్రపంచమును లింగమయమ్ము; త్రిజగమ్ము లింగప్రతిష్ఠితమ్ము;
సంభవ స్థితిలయ స్థానంబు లింగమ్ము; లీనార్థగమకమ్ము లింగమనగ;
లింగ ప్రసాదమ్ము లేక సిద్ధింపవు భోగమోక్షంబు లేయోగములను;
లింగాజ్ఞ వెలిగాగ లేశమాత్రంబును సంచలింపదు పోతృణాంచలమ్ము;
మంటనైనను లింగమ్ము మలిచి కొలుదు
ఇసుకనైనను లింగమ్ము నేర్చి కొలుదు
పేడనైనను లింగమ్ము పెట్టి కొలుదు
నీటనైనను లింగమ్ము నిల్పి కొలుదు ॥ '.

కోణార్కం, వారణాసి, కేదారం, కుంభకోణం, కుక్కుటేశం - అనే పంచతీర్థసేవాఫలం భీమమండలిలోనే ఉన్నదన్నాడు. శ్రీనాథుడు - కారణం యిక్కడగల - పంచతీర్థాల మహిమే నన్నాడు. ఈ తీర్థాలు సోమేశ్వరం, మహేశ్వరం, సప్తగోదావరం, రామేశ్వరం, భూధరేశ్వరం - అన్నాడు. ఇచట చేసే హెూమం దానం, అధ్యయనం, శ్రాద్ధం, దేవతార్చనం, వ్రతం - ఒక్కొక్కటి 'కోటిగుణోపలబ్ధి' - అన్నాడు. సప్తగోదావరానికీ భీమేశ్వరునికీ మధ్య యే సుకృతం చేసినా వేయి విధాల ఫలిస్తుందన్నాడు. దక్షారామ పంచతీర్థాల్లో పంచశివలింగాలున్నా యన్నాడు. అవి - అగస్త్యేశ్వర, రామేశ్వర, నాకులేశ్వర, గణేశ్వర, పాతాళభైరవేశ్వరు లన్నాడు. ఈ పంచతీర్థాలనూ యిక్కడి దేవతాపంచకాన్ని దర్శించి మానవుడు పంద్రెండు జ్యోతిర్లింగ క్షేత్రాలూ దర్శించిన పుణ్యఫలం పొందగల డన్నాడు. లింగా లన్నిటిలోనూ మూలస్థానేశ్వర లింగం 'ఆదిమూలం' అన్నాడు. అది దర్శిస్తే భీమమండలంలో లింగాలన్నీ దర్శించి నట్లే నన్నాడు. దక్షారామ మండలిలో తీర్థంగాని ప్రదేశమే లేదన్నాడు

పంచతీర్థాలను గూర్చి శ్రీనాథుని ప్రసంగం యింకా ఉన్నది. హిమవంతుడు శివుడు తన కల్లుడు గావాలనే కోరికతో నిండు పదునాలుగేళ్లు తపస్సు చేశాడు. ఆ తపస్సు చేసిన చోటులే పంచతీర్థాలు. రాసురాసు పదిరెండు పుణ్యస్థలాలయినాయి. ఇవి మహామహిమ వంతాలు.

పంచారామాలలో దక్షారామం ఒకటి. కథ వినిపించాడు - కవి సార్వభౌముడు - ఈశ్వరుడు త్రిపుర సంహారం చేశాడు, త్రిపురదైతేయుల కులదైవతమైన దివ్యలింగం ఉన్న దక్కడ. అది పంచబ్రహ్మ పంచాక్షరీ పంచతత్వ పంచ భూతమయం. అందుచేత దానిని పంచఖండాలు చేశాడీశ్వరుడు. దానిలో ఒకటి అమరారామం - అమరేశ్వరుడు దీనిని ప్రతిష్ఠించాడు. ఈ ప్రతిష్ఠ కృష్ణవేణీ నదీతీరంలో ధరణాల కోటలో జరిగింది. రెండవ ఖండం సోమేశ్వరారామం - సోముడు ప్రతిష్ఠించాడు. గౌతమీతీరదక్షిణకూలమందు గుణిపూడి గ్రామంలో యీ ప్రతిష్ఠ. మూడవలింగం రామలింగేశ్వరం - శ్రీరామ ప్రతిష్ఠ. పాలకోట గ్రామంలో యీ ప్రతిష్ఠ. ఇదే క్షీరారామం. నాలుగవ ఖండం భీమారామం. చాళుక్యవంశ రాజధానియైన చాళుక్య భీమవర గ్రామంలో కుమారస్వామిచేత ప్రతిష్ఠింపబడింది. పంచమ ఖండం భీమారామం. శివుని మొదటిమామ దక్షప్రజాపతి వారి నగరం దక్షారామంలో యీ ప్రతిష్ఠ యేర్పడింది. ఇది స్వయం ప్రతిష్ఠ. అది శివుని కునికిపట్టు. శివుని పంచారామాలు ప్రతిష్ఠ నొందించి తాను దక్షారామంలో మున్నీటి తలంలో 'విశుద్ధస్ఫటిక సంకాశ' మైన భీమేశ్వరలింగమందధివసించాడు.

దక్షారామాని కింత ప్రతిభగలగడానికి ముఖ్యకారణాల్లో ముఖ్యమైనది - యిచ్చటి జలాశయాలని - శ్రీనాథుని మతం -

'ఒక ప్రక్క వృద్ధగౌతమి'
ఒక ప్రక్క యేలానది
ఒక ప్రక్క తుల్యభాగ
ఒక ప్రక్క సప్తగోదావరం'

ఇందు సప్తగోదావరాన్ని పలుమారభినుతించాడు శ్రీనాథుడు. భీమేశ్వర పురాణంలో యే భాగంలో చూచినా సప్తగోదావరస్మృతి స్మరణ స్తుతి వర్ణనలేని ఘట్టమే కనుపించదు. ఈ సప్తగోదావరశబ్దాన్ని శ్రీనాథుడు రెండువైపులా ఉపయోగించుకొన్నాడు. తాను పేర్కొన్న యెల్లల ప్రకారం భీమ మండలిలో గల సప్తగోదావరులను యివే నామంతో పిలిచాడు. సప్తమునులూ ప్రయత్నించి వృద్ధగౌతమినుంచి దక్షారామానికి తెచ్చిన సప్తగోదావర ప్రవాహాన్నికూడా యీ పేరటనే వాడికొన్నాడు - ఏదైతే నేమి? - సప్తగోదావర తీర్థం దక్షారామ సుప్రసిద్ధ స్థితికి ముఖ్యకారణాల్లో ఒకటిగా చెబుతాడు శ్రీనాథుడు.

'సప్తగోదావరం నది. భీమనాథుడు వేల్పు - అని శబ్ద భేదమే గాని అర్థభేదం లేదు' అంటా డొక చోట. అంటే సప్తగోదావరమే భీమేశ్వరుడు - భీమేశ్వరుడే సప్తగోదావరం - అని యాయన అభిప్రాయం. తన గ్రంథంలో యిమిడ్చికొన్న యీ క్రింది సప్తగోదావర మంత్ర శ్లోకాలు చూస్తే శ్రీనాథునికి సప్తగోదావరంపై గల ప్రేమ భక్తి విశ్వాసం వెల్లడవుతాయి.

'సప్తగోదావరం తీర్థం సర్వతీర్థోత్త మోత్తమమ్
అత్ర సన్నిహితో రుద్రో భీమనాథేశ్వరేశ్వరః ।'

'నమస్తే భీమనాథాయ సప్తగోదావరాంభసే
పాపేంధనాగ్నయే తుభ్యం నిమజ్జామి హర త్వయి ।'.

సప్తగోదావరస్నాతులై భీమేశ్వరుని దర్శించేవారికి సప్త జన్మాఘ వినాశ మవుతుందట.

దక్షారామ క్షేత్రంలో సప్తగోదావర తుల్యభాగలను గూర్చి శ్రీ నాథు డీ క్రింది కథ చెప్పేడు:—

ఈశ్వరుడు త్రిపుర సంహారం చేసిన తరువాత కారాగార బద్ధులైన దివిషత్కాంతా జనులు దుఃఖంతొలగి గోదావరిలో స్నానం చేశారు. అప్పుడు భరద్వాజాది సప్తమహామునులు భీమేశ్వరుని కర్ఘ్యపాద్యాచమనీయాదు లిచ్చికొనే నిమిత్తం భీమదేవుని దగ్గరకు గోదావరీ నదిని ప్రవహింపజేయ ప్రయత్నించారు. ఈ ప్రవాహాన్ని తీసుకుపోయిన తదుపరి దక్షవాటికలో భీమేశ్వరలింగాన్ని ప్రతిష్ఠింప దలచుకొన్నారు. ప్రతి

ష్ఠకు లగ్నం నిశ్చయించికొన్నారు. గోదావరీ ప్రవాహన్ని తీసుకురా బయలుదేరేరు. వృద్ధగౌతమిని చేరికొన్నారు. తమ తమ యోగశక్తులు ప్రయోగించారు. గౌతమిని పిలిచారు. మునులు పిలిచినంతనే గంగ వారివెంట బయలుదేరింది. వారు ప్రవాహానికి వెనుక ముందులు నిలిచి దక్షపురి వైపుకు నడిపిస్తున్నారు.

సప్తమహర్షులీ పనిమీదుంటే దేవతాచక్రవర్తి యింద్రుడు తన పనిమీద దృష్టికేంద్రీకరించి కొన్నాడు. సప్తమునులు చేసేపనిని తన కుపయోగించి కోదలిచాడు. తనపని రాక్షస నిర్మూలనం. ఈ అభిప్రాయంతో దేవతాసమూహంతో ఆకస మార్గంలో ప్రవాహంవెంట వస్తున్నాడు. నదీ ప్రవాహం అరణ్య మధ్యంలోనుంచి వస్తున్నది అక్కడ మరొక నది ఉన్నది. ఇది తుల్యభాగ, తుల్యభాగుడనే రాక్షసుడు పరమధర్మాత్ముడు. దేవాసురులకు వివాదం వచ్చినప్పుడెల్లా తగవు తీర్చేవాడు. ఇతడే యీ నదిని లోగడ యిక్కడికి తెచ్చాడు. ఈ నది యొడ్డున మహారణ్యంలో రాక్షసమునులు తమతమ ఆశ్రమా లేర్పరచు కొన్నారు. పరమసుఖంగా గడిచిపోతున్నాయి వీరి రోజులు. ఈ రాక్షసులను నాశనం చెయ్యాలని యింద్రుని కోరిక. అందుకే అంబరవీధిన వస్తున్నాడు - సప్తమునులూ తెచ్చే ప్రవాహం వెనుక. ఈ ప్రవాహం యీ ప్రాంతంలోకి రావడంతోనే రాక్షసాశ్రమం మీదికి పట్టించా డింద్రుడు. మహావేగంతో వస్తున్న ప్రవాహం- పాపం! రాక్షసాశ్రమం పూర్తిగా కొట్టుకపోయింది. ఈ పని సప్తమునులే చేశారని రాక్షసమును లనుమానించారు. మహాకోపోద్దీపితులయ్యారు. సప్తమునులనూ డీకొన్నారు. సప్తమునులూ తక్కువ తిన్నారా? తామే పాపం యెరుగరు- కర్మవశాత్తు జరిగిన ఉపద్రవానికి రాక్షస మునులు తమ్మెదుర్కొంటే యెందుకూరికోవాలి? సప్త మునులూ మరింత కోపించారు. ఇరు ప్రక్కల మునులూ గంగోదకాలు చేతబట్టేరు. ఒకరినొకరు శపించటానికి మొదలు పెట్టేరు. రాక్షసమునులు ముందు శపించేశారు. సప్త మునులు తెచ్చేవాహిని 'శుష్కతోయ' కావాలన్నారు. అపూజ్యం అస్పృశ్యం కావాలని తిట్టేరు. ఇంతలోకి వచ్చాడు తుల్యభాగుడు. ఇరు పక్షాలనూ వారించాడు. రాక్షసుల తొందరపాటుకు వారిని మందలించాడు. వారి శాపోక్తులుప సంహరించికోమన్నాడు. తమ శాపం తిత్తవేదన్నారు వారు. కాని సప్తమునులు తెచ్చిన నదికి అంతఃప్రవాహం ప్రసాదించారు. సప్తమును లంతటితో సంతోషించారు. రాక్షసుల నది తుల్యభాగకు వీరు వరాలిచ్చారు. ఉత్తరాయణ దక్షిణాయన పుణ్యకాలాల్లోగాని, సూర్య చంద్ర గ్రహణకాలాల్లో గాని, పౌర్ణమాసీ ప్రభృతి మహాపర్వకాలాల్లోగాని, సంక్రమణాది కాలంలోగాని, ఆదివారం రోజున తుల్యభాగవద్దచేసే శ్రాద్ధ దేవార్చన స్నాన దాన జప తపః కర్మఫలం- అక్షయం అన్నారు. సతీపతులకు రజస్వలాద్యంతరాయం లేకుండా బ్రహ్మచర్యోపవాస నియమంతో యీ నదిలో భానువాసర చతుష్టయస్నానం సిద్ధిస్తే సంతానప్రాప్తి గలిగేటట్లు ప్రసాదించారు. అంతటితో యిరుపక్షాలవారు సంతుష్టాంతరంగులయ్యారు. సప్తమునులూ వృద్ధగౌతమిని మళ్లా నడిపించారు. ఆ వాహిని కల్యాణ ప్రదంగా దక్షవాటికకు ప్రవహించి వచ్చింది. సప్తమునులచే తేబడిన ప్రవాహం గనుక యీ వాహినికి సప్తగోదావరం అని ప్రసిద్ధనామం యేర్పడింది రానురాను.

పాలసముద్ర మథన సమయంలో కాలకూట విషం భూనభోంతరాళాలు కప్పివేయుగా ఆ భయంకరవిషాన్ని శివుడు మ్రింగివేశాడు- కాబట్టి అతనికి భీమేశ్వరుడని పేరు ప్రసిద్ధమైనదని శ్రీనాథుని నిర్వచనం. ఆదికూర్మమే చుట్ట కుదురుగా, రసాతల మూలమైన మందరగిరి కవ్వంగా, నాగ రాజు వాసుకి కవ్వపు త్రాడుగా, అపహ ప్రవహాది వాయువులు బంధపు త్రాళ్లుగా కూర్చి దేవాసురులు పాల సముద్రాన్ని తరచడం, అందు కాలకూటాగ్ని మహాప్రళయంగా బయలుదేరడం, శివుడు దానిని గుటుక్కున మ్రింగడం, లోకాలన్నిటినీ రక్షించడం, గరళం కంఠమందు నిలిపికొన్న కారణంచేత నీలకంఠుడు లేక గరళకంఠుడు కావడం - యీ కథ శ్రీనాథుపతి చమత్కారంగా వ్రాశా డీ ఘట్టంలో. ఇది యెరుగనివారులేరు. మళ్లా యిక్కడ వ్రాయుటం అనవసరం. త్రిపుర సంహారి, గరళకంఠుడు, రుద్రభగవానుడే భీమేశ్వరుడని మాత్రం పాఠకులు గ్రహింపదగిన విషయం.

భీమేశ్వరుని శ్రీనాథుడు వేయివిధాల వర్ణించాడు తన గ్రంథంలో- సప్తపాతాళభువన గర్భగోళంనుంచి ఆవిర్భవించిన దివ్యస్వయంభూజ్యోతిర్లింగమూర్తి భీమేశ్వరుడు- అన్నాడు.

'దక్షప్రజాపతి తప్పు లోగొని యాత్మ గృపపుట్టి మిగుల రక్షించెగాన
హరివిరించిపురందరాది దైవతకోటి మించి క్రమ్మర గారవించె గాన
అరిగి యంతర్ధానమందిన తనదేవి నెడమమేన బరి గ్రహించె గాన
కోపాగ్నిగడు పరితాపమ్ము నొందెడు రిసులకు నభయమ్ము నొసగెగాన

నఖముదెగవేసి జన్నపుటజ్జ శిరము
గరిమ జెడకుండ దివి వ్రేల గట్టె గాన
నయము గల వేల్పు శ్రీ భీమనాయకుండు
దక్షవాటమ్ము తీర్థమ్ము ధరణియందు ॥'

భీమేశ్వరుని ప్రతిష్ఠాదులనుగూర్చి శ్రీనాథుడు చాల సావధానంగా వర్ణించాడు- కథ వినండి- పైన సప్తగోదావర కథ మళ్లాజ్ఞప్తికి తెచ్చుకోండి- సప్త మహామునులు దక్షవాటికలో భీమలింగ ప్రతిష్ఠ చెయ్యదలంచారు. అందుకు లగ్నం నిర్ణయించికొన్నారు. ముందు గోదావరీ వాహినిని తేబోయారు. వారు గోదావరిని తెచ్చే సమయంలో రాక్షసమునులతో పోరాటంవచ్చింది. ఆ పోరాటం మళ్లా సంధిసంపూర్తి అయేటప్పటికే చాలా ఆలస్యం అయింది. సప్తమునులూ తదుపరి త్వరపడుతూ గోదావరిని తెస్తున్నారు. ఇంతలో వీరు నిర్ణయించిన శివలింగప్రతిష్ఠాపన లగ్నం సమీపించింది. మును లింకా రాలేదు. అప్పుడు అమృతలింగం లగ్నం దాటకుండా తనకుతానే ప్రతిష్ఠిత మయింది. దగ్గరలో ఉన్న సూర్యనారాయణుడీ విషయం గమనించాడు. ఆ మహాపుణ్యసమయంలో తనకు కలలోగూడా కనని సదవకాశం దొరికింది. తక్షణమేవచ్చి స్వయం ప్రతిష్ఠిత భీమలింగానికి పరమభక్తివినమ్రుడై పూజాది క్రమాలు తాను చేశాడు. సమయంలో అర్చకమహాశయుడు లేనిలోటు పూర్తిచేశాడు. తొలిపూజ సూర్యనారాయణునిది. తదుపరి బ్రహ్మవిష్ణుమహేంద్రులూ దేవసిద్ధసాధ్య గంధర్వాదులూ పూజించారు. అంతలో వచ్చారు- సప్తమునులు- లగ్నం దాటిపోతున్నదని తత్తరపడుతూ శివలింగం సమీపించారు. శివలింగం సుప్రతిష్ఠితమై ఉన్నది- చూచారు. చాలా విస్మయపడ్డారు. తమ శ్రమలన్నీ వృథా అయినందుకు మిక్కిలి విచారించారు. విచారం కోపంగా మారింది తుదకు ఈ ప్రతిష్ఠచేసిన వారెవ్వరు? ఎందుకు చేశారు? ఎలా చేశారు? వారి నేమి చెయ్యాలి? - అని తర్జనభర్జన చేస్తున్నారు-సప్తమహర్షులూ. శపిస్తారేమోనూడా యిక - సూర్యుడు భయపడ్డాడు. అంతరిక్షంనుంచి దిగి వచ్చాడు. వారిని సవినయంగా గౌరవించాడు. జరిగిన సంగతంతా పూసగ్రుచ్చినట్లు చెప్పేడు. మహర్షు లక్కడ లేకపోవడంచేత స్వయం ప్రతిష్ఠితుడైన భీమేశ్వరునికి విధ్యుక్తంగా తానే పూజచేయువలసి వచ్చిన దన్నాడు. మునుల పని తాను చేసినందుకు క్షమించ మన్నాడు. పాపం! - మహర్షులకు మోకాళ్లలో మూలుగులు తెగినయి. ఎంతో ఉత్సాహపడ్డారు. తామే ప్రతిష్ఠిద్దా మనుకొన్నారు. బ్రహ్మాండమంత ప్రయత్నం చేశారు. తుద కాశాభంగం, తొలిపూజకూడా తాము చేయ్యలేకపోయారు. దురదృష్టానికి మిక్కిలి సంతాపింప మొదలెట్టారు. అప్పుడు ఆకసవాణి చెప్పింది. 'అయ్యా! భక్తి ప్రధానం, భక్తితో మీరు చేసిన ఫలమే యీ ప్రతిష్ఠాపన, స్వయం సంస్థాపితుడైనా భీమేశ్వరుని మీరు ప్రతిష్ఠించినట్లే, సంభారాలన్నీ చేసిన వారు మీరు, ప్రథమ పూజాధురంధరుడు సూర్యుడు. అందుచేత మీ రెనమండుగురూ యీ శివప్రతిష్ఠాతలే, సందేహించకండి. ఇప్పుడు మీ రెనమండుగురూ యెనిమిది శివమూర్తులను ప్రతిష్ఠించండి. ప్రతిష్ఠించిన మీ అష్టమూర్తులే - 'శాకంగ నర్థు లెవ్వారలైన' - 'మీ అష్టమూర్తి విశిష్టా న్వయసంభూతులైన వారే యీ భీమేశ్వరలింగాన్ని తాకడాని కర్హులు ఇతరులు కారు' ఆకసవాణి దివ్యగంభీరోపన్యాసంతో సప్త మహర్షులూ కొంతవరకూరడిల్లారు. ధైర్యోత్సాహాలు తెచ్చికొన్నారు. తాము తెచ్చిన సప్తగోదావరిలోని పవిత్రజలం తెచ్చారు. భీమేశ్వరు నర్చించారు.

స్వయం ప్రతిష్ఠితమైన శివలింగంలో శివసన్నిధానం చేయ సమకట్టాడు సూర్యభగవానుడు-కైలాసానికి ప్రయాణమయ్యాడు. కైలాస సమీపాకసంవద్ద రథం దిగాడు. శివావాస సన్నిధానం చేరికొన్నాడు. నందీశ్వరుడడ్డి కొన్నాడతన్ని. సూర్యుడు 'విపుల శాఖాశిఖా మంత్రాలతో' నందీశ్వరుని స్తుతించాడు. నందీశ్వరుడు సంతుష్టుడయ్యాడు. భృంగీశ్వరాది కక్ష్యాంతరాలు దాటించి సూర్యుని లోనికి గొనిపోయాడు. సూర్యుడు పురారిని దర్శించాడు-సంస్తుతించాడు- దక్షారామ శివలింగసన్నిధానం గావలసిందని శివునికి తన కోర్కి వెలిబుచ్చాడు. "నాన్నగారూ! అమృత మథనవేళ ఆవిర్భవించిన శివుడట చూడాలని ఉన్నది. దక్షారామం పోయివద్దాం" అని ప్రార్థించాడు - విఘేశ్వరుడు తండ్రిని. తదుపరి ఉమాసహిత కైలాసవాసులందరూ అదేకోరిక వెల్లడించారు - శివదేవునికి. శివునికికూడా భీమేశ్వరుని చూచి రావలెనని కోరిక పొడమినది - హరివిరించులను జూచాడు. "సూర్యుడు ప్రాథేయపడు తున్నాడు. ఊబుసు పోతుంది. వినోదాలుకూడా చూడవచ్చు. ఆంధ్ర భూభాగం చూచి వద్దాం రండి" అన్నాడు. ప్రమథగణాదు లందరినీ ప్రయాణం చేశాడు. అప్పుడు గౌరీదేవి శివుని వినయపూర్వకంగా కోరికొన్నది. 'తన పుట్టిల్లు దక్షపురి. అది తనకు మిక్కిలి ప్రేమపాత్రం. అక్కడ భీమలింగంపైన శివదేవుడు సన్నిధానం కావాలి.' ఇది ఆమె కోరిక. ఉత్తరాదికి కాశీ యేలాటిదో భోగమోక్షాదులకు-దక్షిణాదికి దక్షారామం ఆ విధంగా కావాలన్నది. కాశి కదుగలేని కుంటి, గ్రుడ్డి, కుష్ఠువు, వృద్ధులు, బాలురు దక్షవాటికలో మోక్షం పొందేటట్లనుగ్రహింపమన్నది. రౌరవాదినరకాల్లో పడబోయే అజ్ఞానులు, కాముకులు మొదలైన నిష్ఠుర ప్రవృత్తులకు దక్షవాటిక కాశీ కావాలన్నది. చిరునవ్వు నవ్వికొన్నాడు శివదేవుడు. "సరే" నన్నాడు. కుటుంబ సమేతుడై బ్రహ్మాది దేవతలతో కూడికొన్నవాడై దక్షపురి చేరికొన్నాడు. అక్కడ యింద్రాది దేవతలందరూ అచ్చర కాంతలతో శివునికి స్వాగత సన్మానంచేశారు. దక్షిణాది జనులందరికీ కన్నుల పండుగ. మార్గశీర్షశుద్ధ చతుర్దశినాడు రోహిణీ నక్షత్రంలో

గౌరీదేవితోసహా శివుడు భీమనాథాలయం ప్రవేశించాడు. అప్పు డింద్రుడు శివుని సువర్ణపుష్పాలతో పూజచేశాడు. అచ్యుతులు తదుపరి పూజ చేశారు. శివునికి విరించ్యాదులు మధుపర్కాలు సమర్పించారు. అవి స్వీకరించి శివుడు దేవీసహితంగా గర్భాలయం ప్రవేశించాడు. అక్కడి మహా దేవ స్వయం భువజ్యోతి స్సుధామయ మహాలింగాన్ని ఆగ మోక్త ప్రకారం అర్చించాడు. తద్రూపం ఆపాదమస్తకం ముహూర్తమాత్రం చింతించాడు. ఆ మహాలింగంలో ఐక్య మయ్యాడు. కవిగారి వర్ణన చూడండి యీ పట్ల :—

'అవ్యయుంబనవద్యమాద్యమచ్యుతమజంబవ్యక్త మప్ర
మేయుం బసంగ
బరగి కైలాసభూధరసమాగతమైన తేజంబుతోగూడి
తేజరిల్లె
దక్షవాటీపురాధ్యక్ష భీమేశ్వర శ్రీ స్వయంభూదివ్య
సిద్ధలింగ
మమృతపాథోధి మధ్యాంత సముద్భూత మమల పరం
జ్యోతిరాదికంబు
భువన బీజంబు కైవల్యభోగదాయి
యఖిల కల్యాణకారి విశ్వాద్భుతమ్ము
పూజ గొనియెను మురభిదంబుజభవాది
దేవతా కోటిచే సంప్రతిష్ఠ బొంది ॥'.

ఈ పవిత్రకాలంలో విశ్వమంతా ధూపదీపనైవేద్యాదులు సమర్పించారు. ప్రదక్షిణలు చేశారు. స్తుతించారు. పురాణ పతివ్రతలు - అరుంధతి, అహల్య, శచీత్యాదులు హారతి పట్టి మంగళం పాడేరు. శివుడు వారందరికీ వరాలిచ్చాడు. అందరూ దిగ్భ్రమ చెందేటట్టు అంతలోనే అంతర్హితు డయ్యాడు.

భూదానమహిమ పూర్వమే తెలిసికొన్నా డింద్రుడు దేవా చార్యుడు బృహస్పతివల్ల - ఈ శుభసమయంలో పరమ పాత్రుడైన శివదేవునికి భూదానం చెయ్యగోరేడు. తక్షణం నీళ్లు చేతబోసికొన్నాడు. వెనుక జెప్పిన యెల్లలుగల భీమ మండలాన్ని భీమేశ్వరుని 'ఏక భోగంగా' ధారబోశాడు.

'తుల్య భాగా తరంగిణి తోడగూడ
కణ్వవాహినితో గూడ కనకరత్న
దివ్యప విధాన సహితంబు దేవభర్త
ధరణి భీమేశ్వరున కిచ్చె ధార బోసి।'.

'వారవధూ త్రిశతద్వయంతో' అనేక దానాలు చేశాడు దేవేంద్రుడు. అంతేకాదు -

'కట్టించె బట్టణ క్ష్మావిభాగముపైడి గల్పించె వప్రంబు
కాంచనమున
మలిపించె బంగారముల దేవగృహముల గూర్పించె
నట్టిళ్లు కుందనమున
నిర్మించె ప్రాసాదనివహంబు గనకాన పాటించె గవకులు
హాటకమున
రచియించె గార్తస్వరమున గోపురములు కీలించె గేళి
దీర్ఘికలు భూరి
నాటె మందారతరువులు తోటలందు
వలతి సురభులు గీలారములకు నిచ్చె
పోసె సిద్ధరసంబును పుష్కరిణుల
కణక నింద్రుండు దక్షిణ కాశియందు।'.

ఆ నాటినుంచీ భీమేశ్వరుడు భీమమండలం పరిపాలించాడు. ఇతని సరి సామంతుడు కుమారారామంలో భీమేశ్వరుడు. ఇరుగుపొరుగువారు పల్వలేశుడు, మృకండేశుడు-అంటాడు శ్రీనాథుడు.

సప్తసింధువుకూ భీమశంకరునికీ మధ్య యింద్రేశ్వరం. ఇది యింద్రప్రతిష్ఠితం. భీమేశ్వరునికి దక్షిణంగా యజ్ఞ పురుషేశ్వర లింగం. అక్కడ అగ్నికుండం ఉన్నది. దానిలో స్నాతులైనవా రూర్ధ్వలోకాలు పొందగలరట. అగ్నీ శ్వరుని ప్రోల అగ్నికుండిక కూపతటంలో దక్షకుండం. దానికి దక్షిణంగా దాక్షాయణీదేవి. అక్కడికి ఉత్తరంగా నిర్వృతిలింగం. ఇది వీరభద్రప్రతిష్ఠ. భీమేశ్వరునికి పడమట వరుణలింగం. వరుణుడు ప్రతిష్ఠించాడు దీన్ని. భీమేశ్వరు నికి వాయువ్యమూలగా వాయులింగం - వాయుదేవుని ప్రతిష్ఠ. సోమేశ్వరలింగ ప్రతిష్ఠాత సోముడే నట. భీమేశ్వర పురాణ కర్త వర్ణించా డిలా.

భీమేశ్వరుని విష్ణుమూర్తివారుకూడా పూజించేవారని తెలుస్తుంది పురాణంలో - ఈ కథ వినండి - జలంధర గంధ కాద్యసురులు లోకాతిరేకులై పోయారు. దేవతలను బాధి స్తున్నారు. వారిని చక్కబెట్టడం యింద్రునికి సాధ్యంకాలేదు. బ్రహ్మదేవునికి మొఱపెట్టుకొన్నాడు. బ్రహ్మ దేవతలందరి తోనూ పోయి విష్ణువును ప్రార్థించాడు. అప్పటికి విష్ణుమూర్తి వద్ద సుదర్శన చక్రంలేదు. వెనుక దక్షయాగ ధ్వంసకాలంలో వీరభద్రుడు విరిచేసి మ్రింగేశాడు సుదర్శనాన్ని. ఆయుధం లేనిదీ యిప్పు డసురులమీదికి దాడివెడల వీలు లేకపోయింది. రాక్షస సంహారం తప్పదు. అయితే ఆయుధం కావాలి. సుదర్శనాన్ని మళ్లా సంపాదించాలి. ఆ పని శివుని దయ వల్లనే జరగాలి. అయితే తాను శివుని మెప్పించాలి. అందుకు శివుని పూజించాలి నిశ్చయించుకొన్నాడు విష్ణుమూర్తి - సుదర్శనం సంపాదించుకొని వస్తానని చెప్పేడు - బ్రహ్మాది దేవతలతో తాను బయలుదేరాడు. దక్షవాటికి వచ్చాడు. జటావల్కలాజినధారణ చేశాడు. భీమేశ్వరుని పూజించాడు. సహస్ర కమలాలతో ఆ పూజ - మరునాడూ అంతే - మూడవ నాడూ అలాగేచేశాడు. ప్రతిరోజూ లెక్క తప్పకుండా సహస్ర పద్మాలతో పూజిస్తున్నాడు. అంతా చూస్తున్నాడు శివుడు.

అనుగ్రహకాలం చేరువకు వచ్చింది. విష్ణుమూర్తివారి భక్తిని పరీక్షించాడు. తమాషా చేశాడు. విష్ణుమూర్తివాడు దీక్షగా పూజ చేస్తున్నాడు. మైమరచి పోయాడు. శివుడు రహస్యంగా ఆ ప్రదేశం చేరాడు. పూజార్థం విష్ణువు తెచ్చి కొన్న సహస్రకమలాల్లో ఒకదాన్ని దాచాడు. ఏమీ యెరుగనట్లు వెళ్లిపోయి కూచున్నాడు. విష్ణువు పూజ సమాప్తమయింది. 999 కమలాలతో పూజించాడు. 1000 వ కమలం లేదు. వెతికాడు. మళ్లీ చూచాడు. ఇంకోసారి చూచాడు. పద్మం కనబడలేదు - ఏమయింది? తాను తెచ్చాడే? లేదేమో? పొరపాటేమో? అయితే యిప్పుడేం చెయ్యాలి. పూజ ఆగిపోతుందే? ఎన్నడూ లేని విఘ్నం - ఈనాడు విఘ్నం కావడమేనా? కాదు - అలా జరుగగూడదు - తన శివపూజకు భిన్నం రాకూడదు - పూర్తి కావాలి. అయితే యింకో పద్మం కావాలే? - అవును - కావాలి. పద్మం లేదు - మరి యెలాగ? తన నయనపద్మం తన దగ్గరే ఉన్నది. వే రెక్కడికీ పో నక్కరలేదు. తన కన్ను బలవంతాన పుణుకడమేనా? - తప్పదు - నిర్ధారణ చేసికొన్నాడు. కుడికన్ను పుణుకుకొన్నాడు-విష్ణుమూర్తి - పవిత్ర రక్తధారలతో తడిసిన తన నయన పద్మాన్ని భీమేశ్వర లింగంమీద పెట్టేడు భక్తివినమ్రుడై. ఫకాళించి నవ్వేడు - శివదేవుడు. "ధన్యుడవయ్యా! విష్ణుమూర్తీ! నీ భక్తికి మెచ్చాను. నీ కోరిక సఫలం చేస్తాను. ఇదిగో! నీ సుదర్శనం" అన్నాడు. సుదర్శనం ప్రత్యక్షమయింది. దానిని విష్ణుమూర్తి కిచ్చాడు భీమేశ్వరుడు. కృతార్థు డయ్యాడు విష్ణువు. సెలవు తీసికొన్నాడు. తక్షణం బయలుదేరాడు. అసురులమీదికి దండెత్తేడు. అందరినీ సర్వనాశనం చేశాడు.

దక్షారామంలో మహామునులు చిరకాలం నివసిస్తూండేవారు. అహరహం సప్తగోదావరిలో స్నానం - భీమేశ్వర దర్శనం - ద్వాదశ జ్యోతిర్లింగ క్షేత్రయాత్ర - ఇది వారి దినచర్య. ఉత్తర దేశంలో కాశీ విడచి దక్షిణయాత్రకు వచ్చిన అగస్త్యమహర్షి సతీమతల్లి లోపాముద్రా సహితంగా దక్షనగరంలోనే పలు సంవత్సరాలు ప్రవాసం చేశాడు. కొన్నాళ్లకు వ్యాసభగవానుడుకూడా తన మున్నూరు శిష్యబృందంతో యిక్కడికి వచ్చాడు. దీని కొక కథ - ఈ కథ కూడా భీమేశ్వర పురాణం చెబుతుంది - వినండి.

బాదరాయణుడు కాశీక్షేత్రంలో ప్రవేశించాడు పలు యాత్రలు చేస్తూ శిష్యబృందంతో. గంగానదిలో స్నానంచేసి జపతపోహోమాదులు పూర్తి చేసికొని విశ్వేశ్వరుని దర్శించి పట్టణంలోనికి బయలుదేరేరు. విడువకుండా యిల్లిల్లు తిరిగేరు. మొదటి రోజు ఒక్క యింటనూ భిక్ష దొరకలేదు - ఒక్కరికీ దొరకలేదు - ఆ నాటికి పస్తు - రెండవనాడూ అలాగే అయింది - మూడవనాడూ అంతే జరిగింది - నాలుగు, అయిదు, ఆరు, ఏడునాళ్లు యిలాగే కటికపస్తు - మున్నూట శిష్యసహితంగా వ్యాసమహర్షికి - పాపం! - అనేక యాత్రలు చేసి అలసిపోయిన వారు - ఏకంగా యేడునాళ్లు పస్తు. ఎంత మహర్షు లైతేనేం? ఎంత యింద్రియనిగ్రహు లైతేనేం? పాంచభౌతిక శరీరాలు గదా? నిలువలేక పోయారు. ఎనిమిదవనాడు యథావిధిగా మణికర్ణికలో స్నానపానాదులు చేశారు. జపతపాలు పూర్తిచేశారు. విశ్వేశ్వరుని దర్శించారు. భిక్షాపాత్రలు పట్టి మళ్లీ యింటింటికి బయలుదేరారు. మళ్లీ యెప్పటి ఆటే - అన్ని యిళ్లు తిరిగారు. 'భవతి భిక్షాందేహి' శబ్దం ప్రతి చోటా ఎ దేరు. లాభంలేదు - ఒక్క తల్లి భిక్ష పెట్టలేదు - ఒక్క గృహస్థుడు శివపూజ కాహ్వానింపలేదు - ఆకలిబాధ - కడుపులు మండిపోతున్నాయి - విసిగిపోయారు. వేసారేరు - పాపం! - శిష్యులు సకసకలాడి పోతున్నారు. వారి ముఖాలు చూస్తే గుండెలు తరుక్కుపోయాయి - వ్యాసులవారికి. అన్నపూర్ణాదేవికాలవాలమైన కాశీపట్టణం కఱవెత్తిపోతున్నదే? కోటి దానాలకు పేరుమోసిన వారణాసి గొడ్డుపోలయిందే? పవిత్రమైన బ్రహ్మర్షికీ వారి శిష్యులకూ పట్టెడన్నం బెట్టే పుణ్యాత్ములే లేకపోయారే? ఎందు కిక్కడ విశ్వేశ్వరుడు? ఎందు కిక్కడ అన్నపూర్ణాదేవి? ఈ కాశీనగరం యింకా యెందుకు నిలవాలి? శపించదగినదే - యిలాటి పాపపు పట్టణాన్ని. నిర్ధారణ చేసికొన్నాడు వ్యాసభగవానుడు - 'భిక్షాపాత్రము రాతిమీద శతధా భిన్నంబుగా వేసికొట్టాడు. కమండలువులో నీళ్లు చేతిలో పోసికొన్నాడు. కాశీపట్టణాన్ని శపించడాని కుద్యుక్తుడయ్యాడు. అంతలో ఆ పట్టణ మధ్యంలో ఒక యింటినుంచి వచ్చిందొక ముదుసలి ముత్తైదువ - పండిన శిరోజాలు - కడకడ వణికే శరీరం - ముడుతలుపడిన చేతులు - వంగిపంగి నడుస్తూ వచ్చింది. "ఆగు నాయనా! ఆగు. వద్దు బాబూ! శపింపవద్దు."

అంటూ వచ్చింది. వ్యాసుని సమీపించింది. అట్టే నిలిచిపోయాడు-వ్యాసుడు. "బాబూ! నాతో కూడారండి" అన్నది-అవ్వ. వ్యాసుడు శిష్యులు సంతోషించారు. ముందు వ్యాసమహర్షి - వెనుక శిష్యులు నడిచారు - అవ్వకూడా. విశ్వేశ్వరాలయానికి తీసుకపోయింది అవ్వ. వ్యాసుని దరి చేరింది. మృదుమధుర శాంతవాక్కులతో అన్నది. "భిక్ష లేదని యింతగా కోపగిస్తారా బాబూ! దాన ధర్మాలకు పుట్టిల్లు వారణాసి. ఇక్కడ భిక్షలేక పస్తుండే జీవిలేదు. నిన్నూ నీ శిష్యులనూ పరీక్షించారు-విశ్వేశ్వరులవారు. మీ మనశ్శుద్ధిని పరీక్షిస్తున్నారు. అందుచేత మీకు భిక్ష లేకపోయిం దిన్నాళ్లు- అంతే - ఈ మాత్రానికి కాశీపట్టణం వల్లకాడు చెయ్యాబో యావు. నీ శాంతగుణం యింతపట్టుగిల బడినదేం? విశ్వే

శ్వరులవారికి నీ మీద యెంత కోపం వస్తుందో యిందుకు!. సరి, చూదాం ఆ సంగతి! - ముందు భోంచేదురుగాని రండి. మీ రందరూ రండి! - అన్నది. వ్యాస సహితంగా శిష్యు లందరూ కూర్చున్నారు భోజనాలకు. అవ్వలోనికి పోయింది. అంతలోనే కూర్చోబెట్టిందే భోజనాలకు! పొయ్యిమండలేదు. వంటలు వండలేదు. ఇంత తొందరలో భోజనాలెలాగ? ఆశ్చర్యపడ్డారు శిష్యులంతా - ఆలోచిస్తున్నారు. ఇంతలో దివ్య పురంధ్రీలు తెరలు తెరలుగా బయలు దేరేరు. కొందరు విస్తరులు వేశారు - కొందరు బంగారు కలశాలలో పరమ పవిత్ర గంగాజలా లుంచారు - కొందరు వరుస వరసగా పలువంటకాలు వడ్డనలు చేశారు - షడ్రసోపేత భోజనాలు - కావలసినంత వడ్డించారు - తిన గలిగినంత తిన్నారు - మహర్షులు. ముదుసలి ముత్తైదువ చిరునవ్వు నవ్వికొంటూ నిలవబడి చూస్తున్నది - బిడ్డలు భుజించడం - భోజనాలు పూర్తయినాయి-చేతులు కడిగికొన్నారు. దక్షిణలు తీసికొన్నారు. అక్కడ సౌధమధ్యమం దొకవేదికవద్ద భుక్తా యాసం తీర్చికోడానికి విశ్రమించారు. అప్పుడు పార్వతీ సహితుడై విశ్వనాథు డక్కడికి వచ్చాడు. పార్వతీదేవి కరుణామయిగానే ఉన్నది. విశ్వనాథుని ముఖం వికృతకోప సంభరితంగా మాత్రం ఉన్నది. మునులు పురాణదంప తులను చూచారు. ప్రత్యుత్థానం చేశారు. మడి చేతులు పట్టి నిలువబడి ఉన్నారు. విశ్వనాధుడు పార్వతీ సమేతుడై వేదికపైన గూర్చున్నాడు. వ్యాసుని వంక కోపంతో చూచాడు. "ఓరీ! వ్యాసా! కూటికక్కుర్తికి కాశీ పట్టణాన్ని వల్లకాటిని చెయ్యబోయావు. నీవు నీచాత్ముడవు! నీబోటివాళ్లకు కాశీ పట్టణంలో తావులేదు. నీ శిష్యసమేతంగా పో! కాశీ పట్టణం విడిచిపో! ఈ పొలిమేరలో నిలవవద్దు. నిలిచేరో మీ ముఖాలు రాళ్లమీదపెట్టి రాయిస్తాం! పొండి!" అన్నాడు. నిర్విణ్ణుడయ్యాడు - వ్యాస భగవానుడు. మారుమాటాడలేక పోయాడు. గిరుక్కున వెనుకకు మరిలాడు. అప్పుడు పార్వతీదేవి దయాముదితాంతరంగంలో వ్యాసుని వద్దకు వచ్చింది. "బిడ్డా! వ్యాస మహర్షీ! విచారించకు. నీ మీద మాకు దయలేదనికాదు. ఈ సంఘటనలో అర్థం ఉన్నది. ఇది నీ భావికుపయోగం. ఇప్పుడు మరెక్కడికీ పోవద్దు. ఆంధ్రదేశంలో గోదావరీ నదీ తీరంలో దక్షారామం ఉన్నది. అది భీమేశ్వరునియావాసం. భీమనాయకుడఖకొఖలేనివేల్పు. అక్కడ నీకు నిఖిలాభ్యుదయాలు చేకూరగలవు. అక్క డికి వెళ్లండి. విచారించకండి." అని చెప్పింది. ఆ మృదు మధుర శీతలవాక్యాలు వ్యాసుని సంతప్తహృదయాన్ని చల్లబఱచినయ్యి. బుద్ధి దక్షారామం మీద లగ్న మయింది. పార్వతీదేవి శెలవుతీసికొన్నాడు. ప్రయాణ మయ్యాడు. శిష్యులు వెన్నంటేరు. ఆంధ్రదేశం ప్రయాణం చేశారు.

యాత్రలు చేసికొంటూ క్రమక్రమంగా పీఠికాపురం వచ్చారు. అక్కడి దేవతా దర్శనం చేశారు. కుమారారామం చేరికొన్నారు. తదుపరి సర్పవరం దరిచేరారు. అందుండి ప్రయాణం చేస్తూ దక్షారామాశతో తుల్యభాగా నదీ తీరానికి వచ్చారు. అక్కడ సాంపరాయణ గ్రామం చేరువలో యెదు రయ్యాడు-అగస్త్యమునీంద్రుడు. మును లొకరినొకరు పుల కాంకురాలలో దర్శించి కౌగిలించి కొన్నారు. కుశల ప్రశ్నలు చేసికొన్నారు. వ్యాసుని ఆంధ్రదేశ యాత్రకు కారణం అడిగా రగస్త్య మునీంద్రులవారు. పూస గ్రుచ్చినట్లు జరిగిన విషాద చరిత్ర వెల్లబోసికొన్నాడు-వ్యాసమునీంద్రుడు. గుడ గుడలాడాడు. శివునికి తనపై గలిగిన కోపానికి మరీమరీ పరితాపపడ్డాడు. అగస్త్యుడు సేదదీర్చాడు - వ్యాస భగ వానుని - దక్షవాటిక దక్షిణ కాశీ అన్నాడు. దక్షవాటీనివాసం భీమేశ్వరార్చన కొన్నాళ్లు చెయ్యడం శ్రేయస్కరం అన్నాడు. వ్యాసుని దక్షారామం తోడ్కొని పోయాడు. తానే కూడా ఉండి భీమనాథుని దర్శనం చేయించాడు. అక్కడి యావద్దేవతా రహస్యాలూ వర్ణించి చెప్పేడు. తన ఆశ్రమానికి తీసికొని వెళ్లేడు. తనతోనే నివాసం యేర్పరిచాడు. తాను కలిసి మెలిసి తిరుగుతూ వ్యాసునికి మనస్తాపాపసయనం చేస్తూ వచ్చాడు. వ్యాస భగవానుడు సంతుష్ట హృదయు డయ్యాడు. భీమేశ్వరార్చనంలో లోగడ కాశిలో విషాదఘట్టం మరిచిపోయాడు. క్రమంగా దక్షారామ నివాసంలో ఆనందం అనుభవించాడు. అగస్త్యుని ఆదేశానుసారం 'బ్రహ్మసూ త్రాలు' అనే వేదాంత గ్రంథం రచించాడు-దక్షారామంలోనే-సప్త గోదావర సమీపంలోనే తపస్సుచేసి అక్కడ శంభు ప్రతిష్ఠచేశాడు. ఆ శివలింగాన్ని చాలాకాలం పూజించాడు. ఒకనాడు భీమేశ్వరుడు బ్రహ్మవిష్ణువులతోసహా ప్రత్యక్ష మయ్యాడు. పూలవాన కురిసింది. దిక్కులు వెలిగినయ్యి. దుందుభులు మ్రోగాయి. ఆకాశం ఆనందించింది. అచ్చరు లాడేరు. గంధర్వులు పాడేరు. మునులు కూడికొని అద్భుతం చెప్పికొన్నారు. భీమేశ్వరపురాణంలో - వ్యాస భగవాసుని కథ - యిది.

శివగంగ, రుద్రగంగ అనే కూపాలు రెండు కలవట దక్షారామంలో. శివగంగలో స్నానం జేస్తే పాపాలన్నీ పటా పంచలవుతాయట. రుద్రగంగా జలంలో క్రుంకు పితృదేవ తలకు ప్రీతికరమట. యాత్రికులందరూ యీ రెండు గంగల్లోనూ శరీరాలు కడిగికొని మరీ కాలు కదుపుతారట-దక్షారామంలో శ్రీనాథకవి చెప్పిన రహస్య వాక్యం.

భీమేశ్వరాలయంలో తిరిచుట్టు మాలను గూర్చి శ్రీనాధుడు వ్రాక్రుచ్చిన పలుకులు పరమానందదాయకాలు ఇది కూడా ఒక కథ - ఒకనాడు భీమనాథుడు భూర్భువస్సు వర్లోకాతీతుడై పొంగిపోయాడు. అప్పుడాతని శరీరంలో అది

మధ్యాంతాలు పొడనూపలేదు. 'నిన్నెలా పూజించవలెను స్వామీ!?' అని అడిగారు దేవతలు. వారి కష్టం గ్రహించాడు- పరమేశ్వరుడు - భీమనాధుడు-దయ దాల్చినాడు. బ్రహ్మాండ గోళానికి మీరిపోయి పెరిగిన తన శరీరాన్ని సంకుచిత పరి చాడు. కొంచెం తిరిచుట్టు మాలలో యిమిడికొన్నాడు. ఈ స్వల్ప స్థలంలోనే గౌరీ జనార్దనులకు రుద్రకేశవులకు, దుర్గాతాండవేశ్వరులకు, నృత్యభైరవునికి ఏడుగురు దేవత లకి చోటు పెట్టేడు. ఈ దేవతలే గాక యిక్కడ నైరృతి పాపహరేశ్వరులుకూడా పరివేష్టించి ఉంటారు స్వామిని. భీమనాథుడంతర్గృహంలో మాణిక్యాంబా సమేతుడై నిల్చి ఉంటాడు. భీమవాటికలో నివసిస్తూ లోకం పరిపాలిస్తుంటాడు.

భీమమండలంలో దక్షవాటిక చతుర్ద్వారాల్లోనూ శంభు లింగ ప్రతిష్ఠలుచేశారు దేవతలు. భీమనాధుని ప్రార్థిం చారు. అన్ని లింగాలకూ భుక్తిముక్తి ప్రదాన సామర్థ్యం ప్రసాదించాడు భీమనాధుడు.

ఈ క్రింద చూపినసమయాల్లో సప్తగోదావరస్నానం జేసి భీమేశ్వరుని పూజించి అభిషేకించి వారికి నైవేద్యాదులు సమర్పించిన ప్రజలు పాతకవిముక్తులు కాకమానరని శ్రీనాథుడు ధృఢంగా చెప్పేడు.

| 1. | చైత్ర | మాసంలో | సూర్యుడు | మేషంలో | నిలిచినప్పుడు | చిత్రా | నక్షత్రమందు |
|---|---|---|---|---|---|---|---|
| 2. | వైశాఖ | ,, | ,, | వృషభంలో | ,, | విశాఖ | ,, |
| 3. | జేష్ఠ | ,, | ,, | మిధునంలో | ,, | జ్యేష్ఠ | ,, |
| 4. | ఆషాఢ | ,, | ,, | కటకంలో | ,, | ఉత్తరాషాఢ | ,, |
| 5. | శ్రావణ | ,, | ,, | సింహంలో | ,, | శ్రవణ | ,, |
| 6. | భాద్రపద | ,, | ,, | కన్యలో | ,, | పూర్వాభాద్ర | ,, |
| 7. | ఆశ్వయుజ | ,, | ,, | తులలో | ,, | అశ్వినీ | ,, |
| 8. | కార్తిక | ,, | ,, | వృశ్చికంలో | ,, | కృత్తికా | ,, |
| 9. | మార్గశిర | ,, | ,, | ధనుస్సులో | ,, | మృగశిర | ,, |
| 10. | పుష్య | ,, | ,, | మకరంలో | ,, | పుష్యమీ | ,, |
| 11. | మాఘ | ,, | ,, | కుంభంలో | ,, | మఘా | ,, |
| 12. | ఫాల్గుణ | ,, | ,, | మీనంలో | ,, | ఉత్తర ఫల్గుని | ,, |

పైజూపిన కాలాల్లో ప్రజలందరూ యజ్ఞకుండంలో స్నానాలు చెయ్యాలట. ఈ యజ్ఞకుండం సప్తగోదా వరంలో ఒక భాగమట. ఈ విధంగా స్నానంచేస్తూ స్వామిని నిత్యమూ సేవిస్తూండే భక్తులకు కైవల్యప్రాప్తి తప్పదట.

దక్షారామ మహత్వం తెలిపే శ్రీనాధకవి కమనీయ వాక్యాలు చిరస్మరణీయాలు. కొన్నిటిని యిక్కడ పొందు పరిచినాను - చదవండి - ఆనందించండి - హృదయాలకు హత్తించికోండి :—

'గౌరి యొక్కతె యాకాశగంగ యొకతె
కాశి యొక్కతె దక్షిణకాశి యొకతె
నలుగురును శంభునకు లోకనాయకునకు
రాణివాసమ్ము లనురాగరసము పేర్మి'।

'అఖిల పురాణ ప్రసిద్ధము దక్షారామము'.

'మోక్షస్థానము భోగభూమియునునై మున్నూరు క్షేత్రం
బులన్
సాక్షాద్బ్రహ్మ పదంబనంగ నపరస్వర్గంబునా నొప్పగున్'.

'దక్షారామంలో జన్మించాలనే ఆశతో మర్త్యయోనిజు లౌతూంటాను దేవతలు'.

'భీమనాథభూమిలో
జంతువులు శంభులగుదురు చచ్చినపుడు'

'తీర్థాలు, అడవులు, యిళ్లూ, యజ్ఞవాటికలు, వల్ల కాళ్లూ - అనే విభేదం లేదు - భీమవాటికలో'.

'మత్తో నాస్త్యపరం దైవం న దేవీగిరిజావమా
దక్షారామాత్పరం! క్షేత్రం నాభూన్న చ భవిష్యతి'

'రత్యంతరే మూత్రపురీష మధ్యే
చండాలవేశ్మ న్యథవా శ్మశానే
కృత ప్రయత్నో ప్యకృత ప్రయత్నః
శ్రీదక్ష పుర్యాద్య పరోపముక్తః'

'భేదంలేదు, ఏ జీవియైనాసరే దక్షవన చతుర్ద్వార సీమలో దేహం విడిస్తేచాలు. పొందుగైవల్య కల్యాణ భోగలక్ష్మి'

'భీమఖండంలో దర్శన మాత్రంచేత పాపాలు భస్మీ భూతమౌతాయి - ప్రాణావసానవేళ ప్రతిజీవికి పరమేశ్వ

రుడే తారక బ్రహ్మవిద్యా రహస్యం ఉపదేశిస్తాడు. కాని డబ్బు దానం చేసినా-పిడికెడు భిక్షపెట్టినా-ఫలం అనంతం. శ్రద్ధాభక్తులతో యోగికి బెట్టిన భోజనంగాని, వస్త్రంగాని దాతలను భవబంధ విముక్తులను జేస్తుంది. ఇక్కడచేసిన జప తపో హోమాదుల ఫలం మేర మీరినది. హిమవంతం వద్ద కోటి సంవత్సరాలు చేసిన తపఃఫలం యిక్కడ ఘటికాద్వయ మాత్రంలో వస్తుంది. కాశీలో కోటి బ్రాహ్మణులకు భోజనం బెట్టిన ఫలం యిక్కడ ఒక్క భిక్షువుకు చేస్తే చాలును '।

'భీమలింగంబు త్రిభువనస్వామి యెపుడు
సన్నిధానమ్ము గైకొనియున్న కతన
తీర్థములలోన నుత్తమతీర్థ మయ్యో
దక్షిణా నందవన వాటి దక్షవాటి '.

'సప్తగోదావరం వద్ద చిన్న మెత్తు బంగారం దానం చేస్తే మేరుగిరి దానం చేసినట్లే!

'ఇక్కడి వారి వర్తనలన్ని శంభుసేవా వ్రతాలు
మాటలన్ని పంచాక్షరీ మంత్రరాశి '.

'ఇక్కడ బ్రహ్మయోగి కొక్కనికి చప్పరం గాని గుడి గాని చవికగాని మఠంగాని కట్టించి నిల్పిన భక్తుడు పూజ్యుడు - మాన్యుడు '. ఈ పై మాటలన్నీ చెప్పేడు - శ్రీనాధుడు - అతనికి తనివి తీరలేదు. దక్షారామ మహిమ పూర్తిగా వర్ణింప లేకపోయా నను కొన్నాడు. మహాశక్తి పూరితమై పలుపురినోట ప్రతిధ్వనించే లోకోక్తిని తన గ్రంథంలో యిమిడ్చి కొన్నాడు - తృప్తి పడ్డాడు :—

" కన్నులు తేడికో
కాళ్లు నరుక్కో
కాపురం చెయ్యి దక్షారామంలో "

---

# ఉత్సవములు - వ్రతములు

## ( చైత్రమాసము నందలివి )

**1-4-1957** హేవలంబి సంవత్సర చైత్ర శుద్ధ పాడ్యమి సోమవారం. చాంద్రమానమున వత్సరాది. వసంత నవరాత్ర ప్రారంభము. నూతన సంవత్సరారంభమున తత్ప్రియుక్తమగు అభ్యంజనాదికము, నవవస్త్రాభరణ ధారణము చేయుట ఆచారము. ఈ దినమునందారంభించి చైత్రశుద్ధ నవమీ పర్యంతము వసంత నవరాత్రులనబడును. ఈ నవ రాత్రులయందుగూడ శరన్నవరాత్రులందువలె దేవాలయములయందు విశేష పూజల నొనర్చుట యాచారము. కొంత మంది గృహస్థులుకూడ ఈ నవరాత్రులయందు శ్రీ రామచంద్ర ప్రీతికొరకు శ్రీ మద్రామాయణ పారాయణమును పఠింతురు. రామాలయము లందంతటను ఈ నవరాత్రులయందు ఉత్సవములు వైభవముగా జరుపబడును. ఈ దినమునందు నింబకుసుమ భక్షణము చేయవలెననుట శాస్త్రసిద్ధము. లౌకికముగగూడ వేపపూవును భక్షించుట రోగనివారకము. ఋతువు మార్పువలన శరీరమునకు సంభవించెడు వ్యాధులను కూడ నివారించుట నింబకుసుమ భక్షణమునకు దృష్టఫలము. ఈ దినమునందు ప్రపాదానము (చలివేందల నుంచుట) పితృదేవతలకు ముక్తిహేతువని శాస్త్రసిద్ధము. ప్రపాదానమునం దశక్తులగువారు తమ యిండ్లలోనైన ఉదకుంభ దానముచేయనగును.

**8-4-57** చైత్ర శుద్ధ ౮ అష్టమీ సోమవారము. స్మార్తమాధ్వులకు శ్రీ రామనవమి.

**9-4-57** చైత్ర శుద్ధ ౯ నవమి మంగళవారము. వైష్ణవులకు శ్రీరామనవమి. ఈ శ్రీరామనవమియందు రామాలయములందు విశేషపూజలు జరుపబడును.

**10-4-57** చైత్ర శుద్ధ ౧౧ ఏకాదశి బుధవారము. స్మార్తులకు మాత్రం ఏకాదశి.

**11-4-57** చైత్ర శుద్ధ ౧౨ ద్వాదశి గురువారము. మాధ్వులకును, వైష్ణవులకును ఏకాదశి. ఈ ఏకాదశియందు ఆంధ్రదేశమున చాలచోట్ల దేవాలయములందు కళ్యాణోత్సవములు జరుపబడును.

**13 4-57** చైత్ర శుక్ల ౧౪ చతుర్దశి శనివారము. మేషసంక్రమణము.

**14-4-57** చైత్ర శుక్ల ౧౫ పౌర్ణమి ఆదివారము. పర్వము - ఈ దినమునందు చిత్రవస్త్ర దానము సర్వసౌభాగ్య ప్రదము - తీర్థస్నానాదులు అశ్వమేధ క్రతుపుణ్య ఫలదములు.

**25-4-57** చైత్ర బహుళ ౧౧ ఏకాదశి గురువారము - గుర్వేకాదశి.

**29-4-57** చైత్ర బహుళ ౩౦ అమావాస్యా సోమవారము. అమావాస్యా సోమవార వ్రతము సకల సంపత్సౌభాగ్య ప్రదము.

# విశేషపూజలు - ఉత్సవములు

శ్రీ మాన్ పండిత, పార్థసారధి భట్టాచార్య.

దేవాలయములలో నిత్యము జరుపబడు నిత్యారాధనము మాత్రము కాక సంవత్సరమునందలి ఆయా మాసములందు జరుపబడవలసిన విశేషపూజలు చాలాకలవు. ఇవన్నియు శైవ వైష్ణవశాక్త భేదములు లేక అన్ని దేవాలయములందును జరుపబడవలయును. ప్రత్యేకించి విష్ణ్వాలయములందును శివాలయములందునుమాత్రమే చేయబడవలసిన పూజలును కలవు. వైఖానస పాంచరాత్ర శైవాగమము లందు స్థలపురాణము ననుసరించియో పూర్వాచారము ననుసరించియో జరుపబడెడి పూజలును తత్ప్రకారభేదమును తప్పక మనకు ఆదరణీయమై యుండగలదు. ఇట్లు ఆలయ సామాన్యమున సర్వసాధారణముగ జరుపదగినట్టియు వైష్ణవ శైవసంప్రదాయ భేదముచే కొన్నిటియందు మాత్రమే జరుపదగినట్టియు స్థలపురాణాది ప్రమాణముచే అక్కడక్కడ మాత్రమే జరుపుచు రాబడునట్టియు ఉత్సవముల పూజలనుగురించి ఈ వ్యాసమున వ్రాయ యత్నించెదను.

విశేషపూజను గురించిన విధివాక్యము మరీచి సంహిత యందిట్లు కలదు.

'అథ మార్గశీర్షాదిమాసేషు మాసనక్షత్రేషు విష్ణు పంచ దినేషు విషువే అయనే సంక్రమణేషు గ్రహణే అన్యస్మిన్ పుణ్యనక్షత్రే రాజ్ఞో యజమానస్య వా జన్మర్క్షే విశేషపూజాం కుర్యాత్.' (విమానార్చనా కల్పము ౪౭ పటలము)

వైద్యనాథ దీక్షితీయ నిబంధనమున నిట్లుకలదు.

'సంక్రాన్తిః జన్మనక్షత్రం శ్రవణంద్వాదశీయుతమ్
పర్వద్వయం సముద్దిష్టం సవిశేష క్రియావిధౌ
చన్ద్రసూర్యోపరాగేచ ప్రాదుర్భావదినేహరేః
మాసర్క్షేషుచపుణ్యేషు విశేషారాధసంహరేః
దుర్నిమిత్తేషు దుస్స్వప్నే సంజాతే చమహాభయే
ఆగతేషు చభక్తేషు కుర్యా ద్వ్యైశేషి కార్చనమ్'
(స్మృతిముక్తాఫలము)

భగవానుని, నిత్యారాధనమనునది శ్రౌతమగు అగ్ని హోత్ర పరిచర్యవంటిదనుట వైఖానస శాస్త్రసిద్ధాన్తమనుటను పాఠకులు జ్ఞాపకమున నుంచుకొనవలయును. అగ్నిహోత్రమును చేయు శ్రౌతులు ఆ యగ్నిహోత్రోపాసన పరిపూర్తికై తదంగముగ సంవత్సరము పొడవునను ఆయా ఋతువులందును మాసములందు ఆయా తిథులందును నక్షత్రములందును అనుష్ఠించవలసిన హోమకార్యములు (ఇష్టివిశేషములు) ఎన్నియో వేదమున విధియింపబడినవి. అట్లే నిత్యాగ్నిహోత్ర ప్రకృతికమగు నిత్యారాధనమునకు గూడ పరిపూర్తికై ఆయాకాలములందు విశేషపూజలను ఉత్సవములను జరుపుటయుక్తము.

విశేషపూజకు ఉక్తకాలములు:—మాస నక్షత్రములు, విష్ణుపంచకదినములు, విషువము, అయనము, సంక్రమణములు, గ్రహణము, ఇతరపుణ్య నక్షత్రములు, రాజుయొక్కగాని యజమానుని యొక్కగాని జన్మ నక్షత్రము అనునీ ప్రత్యేక కాలములు చెప్పబడుచున్నవి. పై మరీచి వచనమందు చెప్పబడిన విషువము మొదలగు నిమిత్తములు ధర్మశాస్త్రములందు ప్రశంసింపబడిన ఇతరములగు పుణ్యకాలము లన్నిటికిని ఉపలక్షణములు. గ్రంథాన్తర సంవాదబలముచే ఇతర పుణ్యకాల సామాన్యము నీ పరిగణనమందు చేర్చవచ్చును. అట్టి పుణ్యకాలదండకమున వ్యతీపాతము, గజచ్ఛాయ, మన్వాదులు, యుగాదులు మొదలగునవి సంగ్రహింపబడవచ్చును. ఆ ధర్మశాస్త్ర కారులందరును ఐకమత్యముగ పైన చెప్పబడిన విషువాదులయొక్క మహత్త్వమును పుణ్యప్రదముగ ప్రశంసించుచు అట్టి సమయములందు స్నానము, దానము, జపము, హోమము, దేవర్షిపితృతర్పణము, శ్రాద్ధము, అభిషేకము, దేవపూజ మొదలగు పుణ్యకార్యములను చేయవలయునని విధియించిరి. ఇట్టి స్నాన దాన జప హోమాదులన్నియు విష్ణుపూజలో చేరిన భిన్న ప్రకారములే గలవని నిరూపించుచు శ్రీ వైఖానస భగవచ్ఛాస్త్ర సంహితాకారులగు మరీచిమహర్షి 'సర్వే వైదికాచారాః తపో యజ్ఞాశ్చ విష్ణుపూజావిధేర్భేద ఇతి వైఖానససూత్రమ్, తత్సూత్రోక్తానుష్ఠానం సర్వం సమాచరన్తి' అని విమానార్చనా కల్పము ౮౧ పటలమున చెప్పుచున్నారు. కాగా ధర్మశాస్త్రములందు పుణ్యకార్యాచరణమున కుద్దేశింపబడిన విషువాది పుణ్యకాలములు సకలపురుషార్థ పరమోద్దేశమగు భగవదారాధనమునకును ఉద్దేశింపబడుట కైముతికసిద్ధము. మాసనక్షత్రాదుల స్వరూపము నుపపాదించుట ఈయెడ అవసరమైయుండుటచే దాని నీ క్రింద వివరించెదను.

మాస నక్షత్రములు— ధర్మశాస్త్ర కారులు మాసమును నాలుగు విధములుగ కొందరును మూడు విధములుగ కొందరును చెప్పుచున్నారు.

'మాసాస్తు సావనః సౌరః చాంద్రోనాక్షత్ర ఇత్యమీ
దర్శాన్తః పూర్ణిమాన్తోవా చాంద్రోఽసౌవిప్ర వైశ్యయోః
సౌరోరాజ్ఞ స్సావనశ్చ యజ్ఞే జ్యోతిషికే పరః
శ్రౌతస్మార్త క్రియాన్సర్వాః కుర్యాచ్చాంద్రమసర్తుమ'
తదభావేతు సౌరర్తుష్వితి జ్యోతిర్విదాంమతమ్.'
(విధాన పారిజాతము)

(సౌరమానము, చాంద్రమానము, సావనమానము, నాక్షత్రమానము ననునవి నాల్గు మానభేదములు. నాక్షత్రమును విడచినచో మూడు భేదములు అగును. శుక్లపాడ్యమి అరంభించి అమావాస్య చివరవరకు గల తిథులు కలిగినది చాంద్రమానము. ఈ నియమము వింధ్యపర్వతమునకు దక్షిణమునందు అనుసరించ బడుచున్నది. ఇట్లే కృష్ణపాడ్యమి అరంభించి పూర్ణిమతో అంతమగు తిథులు కలదియు చాంద్రమానము వింధ్యకు ఉత్తరదేశమందుండెడి వారలచే యనుసరించబడుచున్నది. 'శ్రౌతస్మార్త క్రియాః సర్వాః కుర్యాచ్చాంద్ర మసర్తుమ' అను మొదలగు ప్రమాణములచే పైపూజలందు చాంద్రమానము ననుసరించుట న్యాయ్యము. సూర్యుడు మేషాదిరాసులలో ఒక రాశినుండి మరియొక ప్రక్కరాశికి పోయి ఆ రాశి యందుండు కాలము సౌరమానమనబడును. ఒకేరీతిగ మానమునకు ముప్పది దినముల వంతున ౩౬౦ దినముల పరిణామముగల సంవత్సరమున పంద్రెండవ భాగము సావనమానము. అశ్విన్యాది నక్షత్రములు యిరువదియేడు కలసిన ఒక సంకేత కాలపరిణామముగా వ్యవహరింపబడునది నాక్షత్ర మానము.

'సౌరోమాసో వివాహదౌ యజ్ఞాదౌ సావనః స్మృతః
అబ్దికే పితృకృత్యేచ చాంద్రోమానః ప్రశస్యతే
అయుర్దాయ విభాగశ్చ ప్రాయశ్చిత్త క్రియాతథా
సావనేనైవ కర్తవ్యా........చాప్యుపాసనా.' (గర్గుడు)

అనుచు అయా పరిభాషలలో చెప్పబడిన అయా మానములందు చేయదగిన పనులను గర్గుడు చెప్పిన సూక్ష్మ పరామర్శ మనకియెడ అత్యంతావశ్యకము కాదు.

చాంద్రమాన పరిగణనములో ఒకానొక నెలలో పూర్ణిమ తిథియందు వచ్చెడి నక్షత్రము పేరిట ఆ నెల వ్యవహరింపబడుట చాంద్రమాన సిద్ధాన్త సంప్రదాయమై యున్నది. అనగా మృగశిరనక్షత్రముతో కూడిన పూర్ణిమ సంభవించెడి మాసమునకు మార్గశీర్ష మానమని పేరు పెట్టబడినది. వింధ్యదక్షిణ సంప్రదాయము ననుసరించి శుక్లపక్ష పాడ్యమి మొదలు గలిగి రాబోవు అమావాస్యకు నడుమ వచ్చెడి పూర్ణిమతో మృగశీర్ష నక్షత్రము కలసి వచ్చిన యెడల ఆ మానము మార్గశీర్ష మనబడును చున్నది. ఇట్లే పుష్యమి, మఘ, ఉత్తరఫల్గుని చిత్త, విశాఖ, జ్యేష్ఠ, పూర్వాషాఢ, శ్రవణము, పూర్వాభాద్ర, అశ్విని కృత్తిక నక్షత్రములతో కూడిన పూర్ణిమ తిథి గల మానములు పుష్యము మాఘము ఫాల్గునము చైత్రము వైశాఖము జ్యేష్ఠము ఆషాఢము శ్రావణము భాద్రపదము ఆశ్వయుజము కార్తికము అని వ్యవహరింప బడుచున్నవి. ఒకప్పుడు ఈ నియత నక్షత్రములు పూర్ణిమ తిథి యందే రాకపోవుటకూడ సంభవించి ఒక దినము ముందు వెనుకగ కూడ వచ్చుచుండును. అట్టి సందర్భమున 'మార్గశీర్షాది మాసేషు మాననక్షత్రేషు' అని ప్రత్యేకముగ నక్షత్రమునకు ప్రాధాన్యము చెప్పబడుటచే పూర్ణిమ తిథియందుగాక మాన నక్షత్రమునందే ఉక్తకార్యములను జరుపవలసియుండును. పూర్ణిమ తిథికి కూడ ప్రాముఖ్యమును చెప్పుటకు ఈ దండకమున విష్ణుపంచక దినములుదహరింపబడినవి. సౌరమానమున కూడ ఈ మాన నక్షత్ర పరామర్శము సమన్వితము కాగలదు.

## విష్ణుపంచక దినములు

'అమావాస్యా యదా తస్యాం శ్రవణర్క్షం తథైవచ
ద్వాదశ్యోశ్చద్వయో స్తస్మాత్పూర్ణ మాస్యాంత థైవచ'

అమావాస్య శ్రవణ నక్షత్రము శుక్లకృష్ణముల రెండింటి యందలి రెండు ద్వాదశి తిథులు పూర్ణిమ అను నీ యైదు దినములును విష్ణుపంచక దినములని సంకేతింపబడినట్లు అత్రిసంహిత ౫౪ వ అధ్యాయమందు చెప్పబడినది.

ఇదే లక్షణము పంచరాత్రపాద్మ సంహిత చర్యాపాద పంచదశాధ్యాయ మందును కలదు.

'పక్షద్వయేచ ద్వాదశ్యౌ సినీవాలీ కుహూ స్తథా
శ్రవణర్క్షం దినాని స్యుఃమాసేషు ద్వాదశస్వపి'

విషువము అయనము ననునవికూడ సంక్రాన్తి భేదములేయైనను లక్షణ భేదముచే వానికి వ్యవహార భేదము యేర్పడినది. సంక్రాన్తి సంక్రమణము రెండును సమానార్థక పదములు. సంక్రమణ మనగా సూర్యుడు మేషమాదిగా గల రాసులలో ఒక రాశినుండి మరియొక రాశికి ప్రవేశించు కాలమునకు వ్యవహారము. ఒక సంవత్సర పరిమిత కాలమందు మేషమాదియగు పంద్రెండు రాసులందును ఒక అవృత్తి సూర్యుడు సంచరించును. ఒక్కొక్క రాశి యందు సూర్యుడొక్కొక మానము దినములుండి ప్రక్క రాశికి పోవును. ఆ మానములను ఆ రాశి పేరిట దక్షిణ దేశము వారలు మేషమానము వృషభమానము మొదలగు పేరులతో వాడు కొందురు. ఈ మానములు కొంచెము ముందు వెనుకగా మన చాంద్రమాన సిద్ధమగు చైత్రము వైశాఖ మానము మొదలగు మానములకు సరిగా వచ్చుచుండును. అట్లు రవిసంక్రమణము లోక సంవత్సరమున పంద్రెంటు కలవు. ఆ పద్రెండు సంక్రమణములకు గల

యాశ్రయించి రక్షింపఁబడెనని యైతిహ్యము కలదు. అట్లు సంరక్షింపబడినవారిలో అనంత కర్కోటక తక్షకాదులు మాత్రము మిగిలిరట. అందువలన యీ లింగమునకు "కర్కోటకమహారూపం త్వేతల్లింగం శిలామయ" మని స్కాందమునఁ గలదు. విశ్వామిత్రుని కీ లింగమున స్వామి దర్శన మిచ్చినట్లు చతుర్థాధ్యాయములో,

అగస్త్యః ॥

ఏవం బహువిధే కాలే వ్యతీతే రఘుసంభవ
సాయంకాలె నమః కర్తుం శంకరం లోకశంకరం
నాగేశ్వరసమీపంతు సభాయాం మునిసత్తమః
ప్రదక్షిణత్రయం కృత్వా దేవదేవ ముమాపతిం
ఉత్థాయోన్మీల్య నయనే లింగమధ్యే దదర్శహ ॥

అని వర్ణింపబడిది. నేటికిని ఉపాసకులకు స్వామి యిట్లె దర్శనమిచ్చుసని ప్రతీతి కలదు. ఇప్పటికి కూడ స్వామి భక్తులకు నాగరూపమున ప్రత్యక్ష మగుచుండును. కాని అట్టి దర్శనభాగ్యము పాపములనుండి విముక్తులై, పుణ్యకర్మలొనర్చు వారికే లభించునని క్షేత్రమహత్మ్యము చతుర్థాధ్యాయము 57 శ్లోకమున,

"ఇత స్తతశ్చర న్నాగో దృశ్యతే పుణ్యకర్మభిః
సుధియాం నష్టపాపానాం న నాగో నేత్రగోచరః" అని స్పష్టముగా నిర్వచింపఁ బడినది. ఇది స్వయంభువమను టకు మరియొక గాథను అచ్చట అర్చకులు చెప్పుదురు. పూర్వ మొకప్పుడు చల్లపల్లిసంస్థానాధీశులైన అంకినీడుప్రభువు స్వామిగర్భాలయము చాలా పల్లముగా నుండి ఆ గర్తములో అభిషేకతీర్థము నిలుచుచున్నదనియు, అందువలన స్వామిని, త్రిపీఠములు యెత్తుగా కట్టించి తిరిగి ప్రతిష్ఠఁ గావించుటకు ప్రయత్నించి త్రవ్వించగా అగర్భాలయములోనే కాక అవరణపర్యంతము యొకే శిల చుట్ట చుట్టుకొని యున్నట్లు కన్పించెనట. అంత నాపని సాధ్యము కాదని మానుకొనిరట. నేటికిని స్వామి యట్లే గర్తము (గుంట)లోనే వేంచేసియుండిరి. ఇంక నాగకుండమును, కర్కోటకాదినాగులు తల్లిశాపమువలన భయవిహ్వలురై యీకదళికారణ్యమునకు వచ్చి యిక్కడ బహు కాలము తపంబొనర్చి యీ కుండమును త్రవ్వుచుండగా స్వామి కదళీషండమధ్యస్థుడై పార్వతితో కూడ నాగరాజులకు దర్శన మిచ్చునట్లును, నంత వారికి శాపవిముక్తి కలిగినట్లును, అట్లు నాగులచే సేవింపఁబడుటవలన "నాగేశ్వరుఁడ"నియు, "నాగలింగమ"నియు, పేర్లు ప్రసిద్ధిఁ గాంచినట్లును ఈకుండమును నాగులు తపమొనరించి త్రవ్వినదగుటచే దీనికి "నాగకుండ"మను పేరు విలసిల్ల కలదని చెప్పి వారికనేకవరముల నిచ్చి అదృశ్యుడైనట్లు

అగస్త్యః ॥

"మాతృశాపపరిత్రస్తాః పశ్చా న్నాగా ఇహాగతాః
వాసుకి స్తక్షకశ్చైవ కర్కోటకధనంజయౌ
ధృతరాష్ట్రః పింగళశ్చ గుళిక శ్శంఖక స్తథా
శంఖపాలో రత్నచూడః శంఖచూడశ్చ కంబళః
ఏవమాద్యా మహానాగా శ్శివం సంపూజ్య సాంబికం
బహుకాలం తప స్తప్త్వా కుండం నిర్మాయ యత్నతః
తదా స్తోతుం సమారభ్య స్తుత్వా నాగేశ్వరం విభుం
కదళీషండమధ్యస్థ మంబికాసహితం ముదా

నాగేశ్వరః ॥

దృష్ట్వా వ్యాజహువు ర్నాగాః కదళీకదళీగిరః
తతః ప్రభృతి మాం లోకాః కీర్తయంతు సదానఘాః
భూమౌ నామ్నా నాగలింగో నాగేశ స్తక్షకేశ్వరః
కర్కోటకేశ్వర శ్చేతి ప్రథితాః పన్నగోత్తమాః
భవద్భి ర్నిర్మితం తీర్థం పుణ్యోదకవిరాజితం
నాగకుండమితి ఖ్యాతం గమిష్యతి న సంశయః
కదళీషండమధ్యస్థం మాం దృష్ట్వా చాంబికాయుతం
కదళీకదళీత్యుక్తం భవద్భి ర్గద్గదస్వరైః
కదళీనగరీ తస్మా త్ఖ్యాతా లోకే భవిష్యతి"
ఇతి దత్వా వరాన్ శంభు స్తత్రైవాంతరధీయత"

అని తృతీయాధ్యాయములో 18 శ్లోకములలో వర్ణింపఁబడినది. మరియు నీ అధ్యాయములో 24 శ్లోకమునుండి, యితర తీర్థములను గురించి కళాధరుఁడను విప్రుడు విశ్వామిత్రునికి చెప్పినట్లు,

కళాధరః :—

"బహూని సంతి తీర్థాని విఖ్యాతాని మహీతలె
నాగకుండసమం తీర్థం శీఘ్రసిద్ధిప్రదం నహి." అని ప్రారంభించి,

"బ్రహ్మకుండం మహాతీర్థం దర్శనాత్స్పర్శనాన్మునె"
"నాగేశపూర్వదిగ్భాగె భైరవం తీర్థ ముత్తమం"
"కపర్దితీర్థం విఖ్యాతం పిశాచస్య విముక్తిదం"
"నాగేశ్వరస్య వాయవ్యే కుండాంబాకుండ ముత్తమం"
"సరః కుముద్వదాఖ్యాత మంబికాకుండపశ్చిమే"
"తత్పశ్చిమే క్రోశమాత్రె నదీ చంద్రేణ నిర్మితా"
"తత్పశ్చా ద్విమలా నామ సరసీ శివనిర్మితా"
"నాగేశనైరుతె భాగె శక్రతీర్థం మహత్సరః"
"బ్రహ్మకుండస్య వాయవ్యే శారదాకుండ ముత్తమం"
"వాయవ్యె నాగకుండస్య విష్ణుతీర్థం మహత్తరం"
"ఆగ్నేయే సూర్యకుండాఖ్యం మహాతీర్థం తపోధనం"

అని ఆయాకుండముల మహిమను వర్ణించి చెప్పుచు, యీ తీర్థములన్నియు నాగకుండమును ప్రవేశించి యుండునని,

"ఏతాని సర్వతీర్థాని నాగకుండం విశంతి హి"

అని యుపదేశించి అంతర్ధానుడయ్యెను. అంత విశ్వామిత్రుడు తన కుపదేశించినది సాక్షాన్నాగేశ్వరుడే యని గ్రహించి.

అగస్త్యః ॥

విశ్వామిత్రోఽపి ధర్మాత్మా స్మరన్ విప్రం ముహుర్ముహుః
సంతోషం పరమం ప్రాప్య తపసె కృతనిశ్చయః
తపస్తప్తుం సమారేభె బ్రహ్మవాపీజలె పునః
కళాధరద్విజాకారం ధ్యానార్థం మునిచేతసి
స్థాపయామాస నాగేశం స్వకృపాం దర్శయన్ముహుః
కదళీతీర్థమాహాత్మ్యం ఇక్ష్వాకుకులవర్ధన !
కించిజ్ఞాతం మయా ప్రోక్తం కిమన్య చ్ఛ్రోతుమిచ్ఛసి

ఇతి శ్రీ పద్మపురాణె పూర్వభాగె శ్రీరామాగస్త్యసంవాదె నాగకుండ కదలీపురక్షేత్ర మాహాత్మ్య సంక్షేపవర్ణనం నామ తృతీయోఽధ్యాయః" అని కలదు. స్వాయంభువ మనువు కాలమున బ్రహ్మచే నొక కుండము నిర్మింపఁబడి యీశ్వర ప్రీతిగా నాకుండతీరమున సరస్వతీదేవితో కూడకలసి పంచాశ్వమేధములను త్రిసహస్రమహాచయనములను చేసినట్లును కర్దమగర్గాదిమహాఋష్యాదులు కూడ నీబ్రహ్మకుండికా తీరమున అగ్నిష్టోమాది యనేకక్రతువులొనర్చి యీశ్వరానుగ్రమును పొందినట్లును, నప్పటినుండియు నది బ్రహ్మకుండ మను పేరఁ బరగి సర్వపాపహరమై సర్వదేవతల చేతను, ఋషులచేతను సేవింపఁబడుచున్నదనియు, భూలోకమున ననేకతీర్థము లున్నను, నాగకుండమునుఁ బోలి శీఘ్రసిద్ధిప్రదమైన కుండము లేదనియు, నీనాగకుండమునకు తూర్పుభాగమున తీర్థరాజమైన భైరవకుండమును, తత్పూర్వభాగమున పిశాచత్వమునుఁ బోగొట్టఁ జాలినదై మొగలిచెట్లతో కూడుకొని యుండిన యీశ్వరనిర్మితమైన కపర్దితీర్థమును కలవనియు, నాగేశ్వరాలయమునకు వాయవ్యభాగమున, దక్షప్రజాపతికి శివహేళనమువలన కలిగిన దోషమునుఁ బోగొట్టిన "అంబికాకుండము" కలదనియు, యీకుండమున స్నాన మొనరించు వారలకు, అంబికానాగేశ్వరుల ప్రసాదమున "శ్రీవిద్యాసిద్ధి" కలుగుననియు, యీకుండమునకు పశ్చిమమున "కుముద్వతీ" యను కుండము కలదనియు, యిందు చంద్రుఁడు రాజసూయాధ్వరమొనర్చి, తనకు గురుపత్ని సమాగమమున కలిగిన రాజయక్ష్మనుండి విముక్తుడయ్యెననియు, నీకుండమునకు నొకక్రోశెడు దూరమున చంద్రునిచే నిర్మింపఁబడిన "నది" కలదనియు (దీనికే "చంద్రకుండమ"నియు "రాజనేరని"యు పేర్లు) ఇందుస్నానము సేయు వారలు సర్వరోగములనుండి విముక్తులగుటయే గాక బ్రహ్మజ్ఞానసిద్ధి కలుగుననియు, చండికాలయమునకు వెనక యీశ్వరనిర్మితమైన "విమలా" తీర్థము కలదనియు, యిందు స్నాతకులు సౌందర్యవంతులగుదురనియు, పూర్వము "రక్తాక్షుఁడ"ను గంధర్వుఁడు అగ్నిహోత్రుని శాపమువలన, కుబ్జుడై (మరుగుజ్జువుడై) నారదోపదేశమున నీకదళీపురమునకు వచ్చి, విమలాతీర్థమున స్నానమాడి యీశ్వరదర్శనము చేసినంతమాత్రమున, కుబ్జత్వము పోయి సుందరతరమైన రూపమునుఁ బొందెననియు, యీనాగేశ్వరాలయమునకు నైరుతి భాగమున దేవేంద్రునిచే నిర్మింపఁబడిన తీర్థము కలదనియు, యీ శక్రతీర్థమున స్నానమాడినచో వారికచంచలమైన లక్ష్మి లభించుననియు, యిందు స్నానముచేసియే పూర్వము యింద్రుఁడు తానుఁ గోలుపోయిన స్వర్గాధిపత్యమును తిరిగి సంపాదించుకొనెననియు, బ్రహ్మకుండమునకు వాయవ్యదిశను "శారదా" కుండము కలదనియు, (దీనినే సరస్వతీ కుండమందురు) యిందు మునుఁగువారు విద్వాంసులగుదురనియు, నాగకుండమునకు వాయవ్యదిశను, విష్ణువుచే నిర్మింపఁబడిన "నీలకుండమ"ను తీర్థము కలదనియు, అందొకమారు స్నానమాడినచో విష్ణుసాయుజ్యమునుఁ బొందుదురనియు, యీక్షేత్రమున కాగ్నేయమున "సూర్యకుండము" కలదనియు, అందు భానువారమున స్నానమాడినందువల్ల, "ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేత్త"ను సూక్తి ననుసరించి, సర్వరోగములు శాంతి నొంది ఆరోగ్యము పాలింపఁ బడుననియు, దక్షిణదిశను "శుకమహర్షి" తపమొనరించిన "నది" కలదనియు, (దీనినిప్పుడు చిలుకరామకోడందురు) యీ శుకతీర్థమున నవగాహన మొనర్చువారలకు బ్రహ్మజ్ఞానము కలుగఁగల దనిన్ని విశ్వామిత్రమహర్షికి యిందు వసించి తపంబొనరించితివేని, "బ్రహ్మర్షి"వై, వశిష్ఠునితో వాదింప శక్తికల వాడవగుదువని కళాధరుఁడను విప్రుడు క్షేత్రమాహాత్మ్యమునుఁ జెప్పినట్లు కలదు. ఇంకను యీక్షేత్రమహాత్మ్యము బ్రహ్మవైవర్తాదిమహా పురాణములందక్కడక్కడ అనేకవిధముల ప్రశంసింపఁబడియున్నది. ఇట్లే కృష్ణామాహాత్మ్యమును మహాభారతాదిసంహితలయందును, స్కాందాదిపురాణములయందును కొనియాడఁబడినది. ఈ నాగకుండము అన్నిసరస్సులవలె గుండ్రముగనో చతురస్రముగనో నుండక గవాకృతిగ నుండును. ఇందుకేదో మహత్తరమైన కారణ ముండునని పెద్దలు చెప్పుదురు. పై కుండములలో కొన్ని యిప్పుడు కానవచ్చుటలేదు. ఈ కుండతీరమున నేటికిని పురాతనమైన యిష్టికలు కానవచ్చును. (సశేషము)

# శ్రీ కోదండరామాలయము - ఒంటిమిట్ట

(గతసంచిక తరువాయి)

శ్రీ రామావఝుల వేంకటేశ్వర్లు

### ఇమాంబేగ్

వీరు కడప పట్టణమును నేలిన నవాబు. హిందూ దేవాలయముల నేమి గొప్ప యున్నదో తెలుసుకొన కుతూహలము గలవాడు. అన్ని క్షేత్రముల జూచుచు తుదకు ఒంటిమిట్ట జేరెనట. మీ రాముడేమిగానున్నాడనెను. పిలిచిన బలుకునని చెప్పిరి. అట్లయిన నే బిలిచిన పలుకపలయు. లేకున్న విగ్రహముల బీకివేయించెద ననెను.

తనయొద్ద నున్న అధికారులను లోని కంపి, నలుమూలల వెదకించి, తలుపు ముద్రలు వేయించెను. నవాబు స్వయముగ మూన్నాళ్లుపవాసము చేసి, మహాద్వారమున శరణాగతుడై పడియుండి నాలవనాడుదయమే మేల్కాంచి 'ఓ కోదండరామా!' అని ముమ్మారు పిలచెను. 'ఓ!' యని బదులు వచ్చెను. నవాబు తృప్తి పడి, తన పేర నొక బావి త్రవ్వించి, యిందుండి తీర్థము గ్రహించి అనుదినము స్వామికి అర్చనాదులు జరిపించమని హుకుము జారీ చేసెనట. ప్రాకారము చుట్టు చిన్న బురుజులు కట్టించెను. 1935 వరకు విశాలమగు బావిగానుండి చుట్టు గోడలు పడిపోయి ప్రజలకు అపాయముగ నున్నందున కీ॥శే॥ ఆంధ్ర వాల్మీకి వాసుదాసుగారు చిన్నచేదుడు బావిగ గట్టించి బాగు చేయించిరి. నేటికి గూడ యిమాంబేగ్ బావి యని ప్రతీతి. శ్రీ స్వామికి అనుదిన అర్చన, తిరుమంజనాదులి బావినుంచి తీర్థము గ్రహించి చేయు వాడుక గలదు. గ్రామమందలి గల బావుల నీరుప్పనీరు. ఇది మాత్రము మంచి నీరు.

### మాల ఓబన్న

రమారమి 120 సంవత్సరముల క్రిందటి చరిత్రమిది. ఈ యోబని వంశీకు లిప్పటికిని యున్నారు. దేవాలయము నెదుట మాగాణి భూములు దాటగనే మలకాటిపల్లె (మళ్లకాటిపల్లె అనగా మళ్లకవతలి యొద్దున గల పల్లె) యను గ్రామము గలదు. ఆ గ్రామమునందు గల మాలవాడలో చెన్నదాసరులనువారున్నారు. శ్రీ రామానుజుల కాలమున వీరు వైష్ణవమతమును బుచ్చుకొన్నవారు. క్రిష్టియానిజం, వీరిని కబళించలేదు. వైష్ణవమత మను యాభిజాత్యము కొలదిని వీరు పూర్ణముగ హిందువులే యైరి. కాట దాసరి, వెంకట్ల దాసరి, ఓబ దాసరి యను పేరు లుంచుకొందురు. శూద్రులలో జరుగు ఉత్తరక్రియా (అంత్యకర్మము) కలాపములలో వీరిని ముఖ్యముగ రావించి ఆదరించి వీరిచే పుణ్యకథా శ్రవణము జేయుదురు. కొన్ని మామూళ్లు యిత్తురు. తంబూర, చిరుతలు, గరుడగంబము, పెద్దరు మాల, పట్టివర్ధనాలు, వీరి చిహ్నములు. ముడులు బెట్టిన తీగెలు శృతిజేసి, లయబద్ధముగ చిరుతలు వాయింపుచు చక్కని అభినయముతో చెన్న దాసరి పదములు బాడుదురు. "తీగె బిగింపను పండ్లిగిలింపను నరిపోయెనే పద మెప్పుడు పాడెదవురా పాడు దాసరీ" అను సామెత నీ ప్రాంతముల వాడుచుందురు.

మాలయోబని యింటి పేరు భవనాసివారు. ఇతడు అపరిమిత హరిభక్తిభావనాపరుడు. అజన్మశుద్ధుడు. బాల్యములోనుండి రామభక్తుడై యుండుటచే, తలిదండ్రు లతని చేష్టలకు ముగ్ధులైరి. వారి సంస్కారము మంచిది గనుక అట్టి పుత్రుడుదయించెను. "యద్భావంతద్భవతి" యని గదా పెద్దలందురు.

భక్తివివశుడై ఏకనాదపు తంబూరపై కంఠము మేళవించి 'ఓ రామా!' యని ఉచ్చైర్నాదమున రాముని గీర్తించునపుడు మేనుబులకరించునట; ధారాప్రపాతమున కన్నీరొలుకునట; తుదకు కంఠము గాద్గదిక మగునట; నిజముగ లీనమై చేయు భజనముగాని, గానముగాని, నాట్యముగాని, కవితగాని యెందు కానందమున ముంచి యెత్తదు? హరికథా కథకులు వారెచ్చి యితరుల నవ్వించినట్లున్న రసపోషణము గాజాలదు. కీ॥శే॥ బళ్లారి రామకృష్ణమాచార్యుల వారి దశరథ పాత్ర, హరిశ్చంద్రుని పాత్ర, దుఃఖరస పోషణమును స్మరించినపు డెల్ల మామునలమ్మ యొకర్తు తత్సన్నివేశముల దలంచి కుములుచు కన్నీరు గార్చుచుండెను. ఇంతకాలము జ్ఞప్తి యందుండునది గదా ఉత్తమ కళ.

అవర్ణులు సవర్ణులు అను భేద మింతయు లేక అతని భజన కీర్తనాదుల సందరు పాల్గొనుచుండిరి. ఆలయము నెదుట గూర్చుండి ఆనంద పరవశుడై సంకీర్తనముజేసి ధ్యానానందపూర్ణుడై కొంతవడి నిశ్చేష్టుడై యట్లే యుండి తుదకెపుడో తన పల్లె జేరుచుండెను. తన కులవిద్యచే నార్జించిన కొలదివిత్తముతోనే తృప్తిపడుచుండెను.

ఓబడు చిన్నతనమున రామాయణము సంపూర్ణముగ వినుటచే రామభక్తి యంకురించి, అనుదిన ధ్యాన భజన

లచే భక్తి మరింత దృఢముగ నాటుకొనెను. రారాను సఖ్య దాస్య మధురభావ పరిపుష్టమై మనోలయమై భక్తి శిఖరాగ్రమున విహరించెను. అనన్య సామాన్యమగు దివ్య పదము నధిష్ఠించెను. ఇంక నేమి గావలయు?

ఓబన్న - భజన

ఎపుడు దరిసెనమిడుదో - కృపతోడ రఘురామ
అపరాధినని నీవు - నెపము లెంచకురామ. ॥ ఎ ॥
జడుడను బాలుడను - జాల్ముడ మత్తుడ
గడుబాపచిత్తుడ - గరుణింపవే రామ. ॥ ఎ ॥
అంజలి మున్నునే - నంజనాసుతపరద
రంజిలిచేసిన - రాదుగా యీ పుట్టు ॥ ఎ ॥ (వాసుదాసు)

నాడు శ్రీరామనవమి. శ్రీ కోదండరాముని దర్శింప నుద యమె స్నానములుజేసి మడిగట్టి, బొట్టువెట్టి, ఉపహార ములు చేబట్టి, భక్తులు, సేవార్థులు తండోపతండములుగ దేవాలయమునకు బోయి వచ్చుచుండిరి. మన యోబడు తానొకడేగాక తోడిబాలురను జేర్చుకొని యానంద పరవశుడై నృత్యముజేయుచు సంకీర్తన మొనరించెను.

ఆ రోజులలో తహశీల్‌దారు పేరు అమలుదారుడు. తాలూకా యంతటికి మకుటములేని చక్రవర్తి. ఏ యూరికి తహశీల్‌దారుడు విచ్చేసినను వివిధ వాద్యములతో ఊరిలోని వార లెదుర్కొనుచుండిరి. వారి దర్శనము భగవద్దర్శ నమే. వారు ప్రసన్నులైరా అంతయు శుభమే. అట్టి తహ శీలుదారొకరు సకుటుంబముగ స్వామిని దర్శింపవచ్చెను. బంట్రౌతులు ముందు బరాబరులు సెప్పుచుండిరి. బెత్త ములు చేబూని జనుల యొత్తిడి తొలగించుచు అధికారులు ముందు నడచుచుండిరి. ఆ యధికారమత్తుడు ఓబని భజనమును అచట జేరిన జనసమూహమును జూచి చీకాకు పడెను. అది అసూయయో, మనఃక్లేశమో, శిరోభారమో, మరియేమో; అందరికి సంతసముగనున్నపుడతనికి సంతాప మెట్లు కలిగెను?

లేదు—అనాటి సంఘవ్యవస్థ అట్లున్నది. ఇప్పుడున్నది. రేపటికి యుండగలదు. జనత సంస్కారము మారినా సాంఘికముగ నున్న కట్టుబాట్లు సుఖముగ నడలిపోవును. ఈ సమస్య మంచిదా? చెడ్డదా? దీనిని గురించి పెద్దలు నిర్ణయించిరి. తిరిగి ప్రయత్నించుట చర్విత చర్వణము. ప్రకృత మనుసరింతము.

ఆ యధికారి మీసములు దువ్వుచు, 'ఓరీ మాలడా! ఏమిరా! నీ పొగరు! పదుగురు వచ్చెడి పోయెడి దారిలోనా నీ యల్లరి? మడులు గట్టి వచ్చెడి మమ్మెన జూడలేదా? ఛీ ఛీ తొలగిపో.' అని యరచుటయేగాక, ప్రక్కనున్న జవాను షరాటుగ నున్నందున ఫెడేలున చెంపవాచునట్లు గొట్టెను. వాడు రెడ్డిని యుతిమెను. రెడ్డి వీరావేశమున దలవిరియబోసుకొని ఆ భక్తుల గోష్ఠిని చీకాకుబరచి దతిమెను.

ఇక నెవరు నాకుదిక్కు - ఇందిరారమణ
ఇక నాకు దిక్కెవ్వ-రిందరు, చూడగ
ప్రకటితముగ నీవే - పదపదమని శ్రేయ ॥౧॥
నీవె నా దిక్కని - నెఱనమ్మినందులకు
ఈవిధ మర్యాద - వెనగించితే రామ ॥౨॥
తల్లివి తండ్రివి, దైవ-ము నీ వని
యుల్లములో నమ్మి - యున్నఫలమా యిది ॥౩॥

అని యనేకవిధముల దలచి యేడ్చుచు, తల్లినెడబాసిన లేగవలె కొండలు మార్మోగునట్లు రాముని బిలచి దలచెను. ఆలయమునకు బడమటి దెస చెరువుగట్టున నిలచి అఖండ ముగ భజన జేసెను. ఎపుడు ప్రొద్దుగ్రూకెనో ఎపుడు వేకువ యయ్యెనో తెలియ దాతనికి.

ప్రాతః కాలోచిత మంగళతూర్యారవములు శుభనాదము లెనగ, శుభవస్తునంచయహస్తులై యర్చకులు సుప్రభాత, వేదపఠనాది, యుపచారములతో దలుపుల దెరచిరి. ఇంకే మున్నది! స్వామి పశ్చిమాభి ముఖుడై యుండెను. ఓబన్న భజన తన్నాకర్షించె నేమో! అవును. భగవానుడు జూడ పలసినది భక్తులనేగదా! తమ సర్వస్వమర్పించి తన్నేనమ్మి యున్నవారి యోగక్షేమముల వహింపనిక నెవరు? కాక- అహంకార మమకార ప్రేరితులై, సంసార పారావారమున బడి యీదుచు నల్లాడుచు యేనాటికి దరిజేరని, జేరనిశ్చ యింపని యీ మొండి మానుసులనేమి జూడవలెను?

ఈ వింత ఆ నోటి యీ నోటి బడి వూరెల్ల రేకమైరి. గుంపులు గుంపులుగ దేవాలయము జేరిరి. విస్మయాశ్చర్య మనసులైరి; ఏమియు తోపక భ్రమాస్పడిరి. అనా డేమాన వుడు గాని ఆహార, పానములు సేయలేదు. ఎచ్చట జూచి నను సీతారామ సంకీర్తనమే. ఈ వింత జూచుటకు పౌరు గూరులవారును జేరిరి. అంద రాలోచించి పరమభక్తు డగు మాల యోబని ధిక్కరించినందుల కిట్టి పరిస్థితి దాపు రించినదని నిర్ణయించిరి. అమలు దారునితో సహ అందరు గలసి, ఓబని బ్రతిమాలి తిరిగి తూరుపు దెసకు దెచ్చిరి. లోనుండి యర్చకులు యానందోత్సాహముల బరువెత్తుచు వచ్చి స్వామి యథాస్థితిగ ప్రాఙ్ముఖు డయ్యెనని వినిపించిరి. అందరొకసారి యుచ్చైస్స్వరమున "జైజానకీ జీవనా! కోదండ దీక్షాగురో!" అని స్తోత్రము జేయుచు స్వామిని దర్శించిరి.

ఓబని స్మరణార్థ మొక రాతి స్తంభము అరుగు గట్టి బడియున్నది. అతని వంశము వారిప్పటికిని బ్రహ్మోత్సవ

కాలమున విచ్చేసి, స్తంభము చుట్టు పచ్చని పందిరి వైచి, భజనలు సేయుచుందురు. గరుడసేవనాడుదయము నుండి యుపవాసముండి రాత్రి గరుడ వాహనారూఢుడై మహాద్వారమున స్వామి దరిసెనము కాగా స్తంభముపై జ్యోతిని వెలిగింతురు.

అరగింపు పెట్టి హారతిలు వెలిగించి పిమ్మట భుజింతురు. దేవాలయమునుండి టెంకాయ కర్పూరము తలగెడు బియ్యము మొదలగు సామగ్రులు, మూలస్థానమున గల నొక తోమాలయు సమర్యాదగ వారి కడకు బంపెడి వాడుక గలదు.

ఓబడు 125 సంవత్సరములు పూర్ణాయుర్దాయము నను భవించెనట. వృద్ధాప్యముపైబడి యిల్లు విడిచి రాలేని స్థితి యందు, ఉదయమె స్నానము జేయించి ఊర్ధ్వపుండ్రములు బెట్టి మనుమలెత్తుకొని యూరిబయటకు వచ్చి గోపుర సందర్శనము జేయించుచుండిరట. తరువాత గాని భుజింప డని యాతని వంశమువారు జెప్పిరి.

ఏనాటి చరిత్రమోగాదు. ఎప్పటి వినుకలియె గాదు. హరిజనాలయ ప్రవేశాదులు లేనికాలమున యాత డెట్ల మరుఁడయ్యెను? చండాల స్పర్శాదు లుత్సవాదుల లేవని పెద్దలెట్లు శాసించిరి? గుడికి బోయివచ్చి కాలు గడుగ రాదు. మడిగట్టసురాదని సనాతనులు వచింతురు గదా! శ్రీ ఆదిశంకరులును "చండాలోస్తు సతు ద్విజోస్తు గురురిత్యే షామనీషామమ" అని సెలవిచ్చెను గదా: భగవద్రామాను జులు కంచి గాలి గోపురమెక్కి గురూపదేశమును బయలు పెట్టిరి గదా! తిరుమంత్రమంపరు విని తరించిన, నేనుసు తరించినట్లే యని వచించెను.

భక్తులకు కులగోత్రాదుల వివక్షత లేదు.

మ॥ అమల జ్ఞాన సుదాన ధర్మరతి సత్యక్షాంతి నిర్మత్సర
త్వములన్ యజ్ఞతపోనసూయల గడున్ దర్పించు ధాత్రీసురో
త్తము కంటెన్, "శ్వపచుండు ముఖ్యుడు;" మనోర్థ ప్రాణ వాక్కర్మముల్
నమతన్ నిన్ను సయించెనేని, నిజవంశ శ్రీ కరుండౌతు దిన్ (భాగవతము)

## ఆలయ పూజాదికములు

చాలాకాలమునుండి కాంచి నగర ప్రాంతములనుండి వచ్చిన వడగల వైష్ణవులే యర్చకులుగ నున్నారు. పాంచ రాత్రాగమానుసారమే యర్చనాదులు జరుగుచున్నవి. ప్రాతస్సాయం కాలపూజలుమాత్రము జరుగుచున్నవి. వేద పారాయణము చేయు బ్రాహ్మణులు, పూలదాసరి, మేళ గాండ్రు, కుంభారతి, దేవదాసీలు, ఆ యా పూజాకాలముల ఉత్సవాదుల చేరునట్లుగ, యేర్పాటులు గలవు. వీరి జీవి తములకు జాలినంత పుష్కలముగ మాగాణిభూమి మెట్ట భూమి యినాములుగ యివ్వబడియున్నది. ఇప్పటికిని అను వంశికముగ వృత్తులు జేయుచు యినాముల ననుభవించు చున్నారు. దేవదాసీ యినాములు పట్టాలు చేసి వారిని వారి వృత్తిని తొలగించుటచే, దేవాలయమునకు యిపుడు వారు వచ్చుటలేదు. పట్టాలు కాగా వానిపై బేరీజు డిడెక్షనుగా కొంత మొత్తము తసదిక్ గ్రాంటుగా రు. 280 లు. మొత్తము మూడు వందలకు పైగా వచ్చుచున్నది. నిత్యనైవేద్య, అఖండ దీప, బ్రహ్మోత్సవాదుల కేమియు నిర్ణయములు లేవు. అన్నియు పై మొత్తముతోనే జరుపుచుండెడి వాడుక. అర్చకులకు నాలుగెకరముల మాగాణి యుండెను. అర్చక మునకు ప్రతిఫలముగ వా రనుభవించెడి దేమియు లేదు. "చెరువోకు. మడిబీడు" అను సామెత మాకు సార్థక మైనది గనుక, ఏ యర్చకులు స్థిమితముగ నుండక తరచు మారుచుండిరి. ఆంధ్రదేశమున పలుచోటుల గల దావాలు తగాయిదాలు, మాకు లేవు. ఆశలేని కూటికి దోసము లేదు గదా! ఇనాములు వదులుకొని మాసభృతి నిపుడు స్వీక రింపుచున్నారు.

ఇక నిత్యపూజా కైంకర్యములకు గావలసిన ఆర్థిక సౌష్ఠవము:—గత సంచికలో వివరించిన శాసనముల ప్రకా రము కర్నాట ప్రభువు లిచ్చిన ఆస్తులు యిపుడు లేవు. అవియె కాబోలు రైతువారిగ మార్చివేసి ప్రత్యామ్నాయ ముగ తసదిక గ్రాంటు ఏర్పాటు అయి యుండవచ్చును.

అనుదిన వృత్తులు జేయువారికి యినాములుండగా అర్చకు సకు మాసవేతన మియుగా నిలిచిపోవునది నిత్యకైంకర్యమె.

ఈ కొఱత దీర్చుట కనేకులు విశ్వప్రయత్నములు జేసిరి; గాని, తీరలేదు. 1908 సంవత్సరమునుండి శ్రీ వావిలి కొలను సుబ్బరావుగారును ఆలయ జీర్ణోద్ధారము, నిత్య భోగ కల్పనము జేయుటకే సంపూర్ణోద్దేశ్యమున వచ్చిరి. వచ్చినందులకు చాలభాగము పనులు జేయించిరి. శ్రీ రామసేవాకుటీరమను రామసత్రము, శ్రీరామతీర్థ జీర్ణో ద్ధారము, నూతన రథము, విమాన గోపుర జీర్ణోద్ధారము, సంజీవరాయాలయ పునర్నిర్మాణము మొదలగు నిర్మాణ ములు టెంకాయచిప్ప చేబూని, కౌపీనమాత్ర నిరాడం బర జీవితము నెరపి, దేశాటన మొనరిచి, లక్షలపైబడిన ద్రవ్యముతో పై జీర్ణోద్ధారముల జేయించిరి. శతాధిక గ్రంథ రచన సాగించి చిరంజీవులైరి. వారు మద్రాసు నందున్న కాలములో నొక భిక్షుడుగా వెంటనంటి నాకింత అన్నము పెట్టించవా? అని యడిగెనట; వీధి తిరిగి చూచునప్పటి కెవ్వరును రారైరి. ఇంటికి రాగానే సిద్ధవటము తహసీల దారు వుత్తరమువచ్చి యుండెనట, నిత్యనైవేద్య కైంక

ర్యము లోపముగ నున్నదని వ్రాసియుండెనట; అందుల కని నెల 1 కి పదిరూపాయలు పంపుచుంటినని వారే వ్రాసుకొనిరి. శ్రీమద్రామాయణ వ్యాఖ్యానమునందు పలు చోటులందు వ్రాసియుండిరి. 'ఘటికాచలవాస నృసింహ కేశవా,' అను మకుటముగల పద్యముల వ్రాయుచు షోలింగ వరమున సేవచేయుచున్న తరిని, ఇద్దరు బైరాగి వేష ముల నున్నవారు స్వప్నముగ సాక్షాత్కరించి, "ఒంటి మిట్టకు రారాదా" యని పిలచుటయు, పైని వివరించిన జీర్ణోద్ధారాది కైంకర్యములు జేయుటయు తటస్థించినది. వీరికాలమున జాల యభ్యున్నతస్థితికి వచ్చెను. శ్రీస్వామి వారికి 108 కాసుల మాలయు 108 మంగళ సూత్రముల హారములు, హారపతకములు స్వర్ణమయ కిరీటములు, వైరముడులు మొదలగునవి సుమారు వంద తులముల బంగారము, తీర్థపాత్రములు బిందె, పళ్లెరములు, కిరీటక వచాదులు మున్నగు వెండివస్తువులు వేయి తులములవరకు గలదు. మూడువేలమంది వచ్చినను, వుండను- వండను- స్త్రతము, పాత్రసామగ్రియు గలవు. ఉత్సవార్థమగు పటా టోపము లన్నియున్నవి. రెండు వాహనములు ముదునలివి. మిగిలినవి మంచిస్థితి యందున్నవి. చక్కని శిల్పముతో కూడిన రథమున్నది. ఇంకను సమకూర్ప వలసినవి పెక్కు గలవు. ఇట్లుండగా నిత్యభోగ కల్పనమట్లే నిలిచియున్నది.

1949 సంవత్సరములో పరిసర మంటపంపల్లె గ్రామ వాస్తవ్యులు, ఉదారులు, విద్యా వినయ భక్తి సంప న్నులునగు పుట్టంరెడ్డి రమణారెడ్డిగారనువారు ట్రస్టీగా నైనతరువాత ఇదే సమస్యను తిరిగి వారాలోచించి ముప్పది ఆరువేల రూపాయల స్కీము నొకదానిని సిద్ధపరచిరి. సంవ త్సరమున మున్నూటిరువది దినములకు ఉభయదారుల నెంచుకొని, ఒక్కొక్కరు 116 రూపాయలు నిధికై యిచ్చు నటుల, అది మూలధనముగ నుంచి, అందుపై రాగల వడ్డినిమాత్రమె నిత్యపూజాదికముల జరుపునటుల నొక ప్రణాళిక నేర్పరచి, వంద యుభయముల మాత్రమే సమ కూర్ప గలిగిరి. ఇంకను ప్రాకారముచుట్టు రాతిపరుపు చేయు నమకట్టి మూడింట నొకభాగము చేయించిరి. ఇంతలో హెచ్. ఆర్. ఇ. బోర్డువారు ఏరియా కమిటి మెంబ రుగా వీరిని స్వీకరించి మేనేజింగ్ ట్రస్టె పదవికి రాజీ నామా చేయించిరి. వీరి సహచరులుగ పనిచేయు నుత్సాహ వంతులగు ధర్మకర్త లందరు నిస్పృహులైరి.

## ఉత్సవములు

పాంచరాత్రాగమము ననుసరించి యుత్సవాదులు జరుగునని ముందే మనవిచేసితినిగదా! ఆ రీతిని, ఉగాది యుత్సవము, పంచాంగ శ్రవణము. పునర్వసు ప్రయుక్త శ్రీరామ నవమినాడు ధ్వజారోహణము, చైత్రద్వాదశి హను మద్వాహనము, వరుసగా త్రయోదశి, చతుర్ధశి, పౌర్ణమి, గరుడసేవ, కల్యాణ, రథోత్సవములు జరుగును. నవాహ్నిక దీక్షగా ఉత్సవములు సంపూర్తియగును. కల్యాణోత్సవ రథోత్సవములనే ప్రజాసమూహ మెక్కుడగును. శారదా నవరాత్రములు, విజయదశమి శమీదర్శనోత్సవము, ధను ర్మాస పూజలు, వైకుంఠ ఏకాదశి, భీష్మైకాదశి, సంక్రాంతి, పార్వేట యుత్సవము మున్నగునవి జరుగును. సేవార్థు లప్పుడప్పుడు విడిగా యుత్సవముల జేయింపుచుందురు.

## ఉపసంహారము

గతసంచికలోను, యీ వ్రాసిన వరకు కీ॥ శే॥ వావిల కొలను సుబ్బరావుగారి పుస్తకముల యాధారమునను, ఇతరాధారముల చేతను, చరిత్రను క్లుప్తముగా దెలిపితిని. ఆరాధన పత్రిక సంవత్సరముగ బరిచయమున్నందున, యిందు మా దేవాలయమును గురించిన కథ కొంత వ్రాయ నుంటినిగాని ఈనాటి కిది యయ్యెను. దేవాలయ సేవకుడు (Hon. Executive Officer) గ సేవజేసిన అనుభవ మును బురస్కరించుకొని రచన సాగించితిని. ఆలయ జీర్ణోద్ధారము జేయుటకు కనీసము పదిలక్షలు, ద్రవ్య మవ సరము. ఆర్కలాజికలువారు 1914వ సంవత్సరమున సనాతనవస్తు జ్ఞాపక చిహ్నముగ స్వీకరించిరి. పడుగు పాటున మహద్వార గోపురము దెబ్బతినగా, ఇనుప దూల ముల నడ్డుపెట్టి కాపాడియున్నారు. తదాదిగా నొకప్రకటన నాటించుట తప్ప నా యెరిగినవర కేమియు చేయలేదు. అర్చనంప్రదాయము లడుగంటినవి. భక్తి ప్రపత్తుల పునా దులే కదలుచున్నవి. ఒకరి కెదురుచూడక ప్రజలే చైతన్య వంతులై తమ ధర్మముల గాపాడుకొన తామే ప్రయత్నింప వలయును. అర్చవైఖరి సంప్రదాయాను సారముగ ఏమా త్రము లోపములేని పూజాదికములు, దానికి దగిన యుప పత్తియు గల్పించ గలుగునది ప్రభుత్వము. ఆగమశాస్త్ర మేదియో పండితులు విశదముగ దెలుపవలయును. అర్చ కులు పూజాదికములగాని, మరి యెచ్చోగాని మూగనోము పట్టుచున్నారు. వేదము దెలిసిన అర్చకులే యుండవలెను. అనువంశిక మర్యాద యుండవలె ననుకొన్నవారు పై విష యముల నిష్ణాతులైన తరువాత అన్నిటకు బ్రయత్నింపవల యును. అమంత్రకులగు అర్చకులు మూర్తి సాన్నిధ్యమె లేకుండజేసి, "గుడి పాడైనా గూబ వదలదు; గుడి పాలాల పూజారి వదలడు." అన్న సామెత సార్థకము జేయుదురు. పండితులు వీనిని బరిష్కరింపవలయును. పరిపాలకులుగా నున్న వారికి నీ విషయము సుపరిచితము.

కింతవ్యోహం.

# ఉత్సవములు - వ్రతములు

( వైశాఖమాసము నందలివి )

వైశాఖ మాసమునందు శ్రీ మహావిష్ణువును కృష్ణతులసి చేతను, లక్ష్మితులసి చేతను పూజచేసిన ముక్తి కలుగు నని శాస్త్రసిద్ధము.

ఈ మాసమునందు అశ్వత్థమూలమును నీటితో నింపుట, అశ్వత్థ ప్రదక్షిణముచేయుట అనేక జన్మసంతరణఫలము నొసగును. ఈ విధముగనే యీ మాసమునందు ప్రపాదానము- (చలివెందలను) యిచ్చుట, వ్యజనము (విసనకర్ర) ఛత్రము (గొడుగు) ఉపానత్ (చెప్పులు) దానము నొసంగిన మహాఫలము శాస్త్రములందు చెప్పబడినది.

2-5-1957 వైశాఖ శుక్ల తృతీయా గురువారము - అక్షయ్య తృతీయ. "యః కరోతి తృతీయాయాం విష్ణుం చందన భూషితం । వైశాఖస్య సితే పక్షే సయాత్యచ్యుతమందిరమ్ ॥" అను శాస్త్రప్రమాణమున ఈ అక్షయ్య తృతీయ దివసమునందు చందనముచే విష్ణుపూజనము అచ్యుతపదప్రాప్తి ఫలము నొసంగును.

ఈ తదియ దివసమునందు ఆంధ్రదేశమున సుప్రసిద్ధమగు విష్ణుక్షేత్రమైన శ్రీ సింహాచల క్షేత్రమున శ్రీ వరాహ లక్ష్మీనరసింహ స్వామివారి చందనోత్సవము జరుపబడును. ఈ దినమునందు చేయబడిన దానాదులు కొంచెమైనను అక్షయ్యమగు ఫలము నొసగునని శాస్త్రసమ్మతము.

ఈ అక్షయ్య తృతీయ దివసమునందు గంధఫలయవాదులతోకూడ ఉదకుంభదానము అక్షయ్య ఫలప్రదము.

4-5-1957 వైశాఖ శుద్ధ ౫ పంచమీ శనివారము- ఆర్ద్రా నక్షత్ర యుతము- ఈ దినమునందు శ్రీ వైష్ణవులు ఎంబెరుమానార్ తిరునక్షత్రమును విష్ణ్వాలయములందు జరుపుదురు. ఈ దినమునందు శ్రీరామానుజులు వారి వర్ధంతి. తిథి ననుసరించి ఈ దినము శ్రీ శంకర జయంతి. శ్రీ శంకరాచార్యులవారి జన్మదినోత్సవము విశేషముగా జరుపబడును.

10-5-1957 వైశాఖ శుద్ధ ౧౧ ఏకాదశీ శుక్రవారము. ఈ దినమునందు కూడ ఆంధ్రదేశమున కొన్ని ఆలయములందు కళ్యాణోత్సవములు జరుపబడును. సుప్రసిద్ధమగు శ్రీ అన్నవరక్షేత్రమున శ్రీ సత్యనారాయణస్వామివారి కళ్యాణ మహోత్సవము ఈ దినమునందు జరుపబడును.

12-5-57 వైశాఖ శుద్ధ ౧౩ త్రయోదశీ ఆదివారం విష్యం ౧౪ చతుర్దశీ. స్మార్తమాధ్వ శ్రీ నృసింహ జయంతి. ఈదినమునం దుపవాసముచేసి సాయంకాలమునందు నృసింహపూజ యొనర్చి "పరిత్రాణాయ సాధూనాం జాతో విష్ణో నృకేసరీ । గృహాణార్ఘ్యం మయాదత్తం సలక్ష్మీ ర్నృహరిః స్వయమ్ ॥" అని అర్ఘ్యము నీయదగినది.

13-5-57 వైశాఖ శుద్ధ ౧౫ పౌర్ణమీ సోమవారం- పర్వదివసము. ఈ దినమునందు కృష్ణాజిన దానము పృథ్వీదాన ఫలము నొసగును. దధ్యన్నము, వ్యజనము, ఛత్రము, పాదుకలు, ఉపానత్, (చెప్పులు) ఈ వస్తువులలో దేనినైనను యథాసంభవముగ దానమొసంగుట అనంతఫలప్రదమని శాస్త్రసమ్మతము- ఈ దినమునందు సంపద్గౌరీ వ్రతముకూడ చేయబడును.

14-5-57 వైశాఖ బహుళ ౧ పాడ్యమీ మంగళవారము - వృషభ సంక్రమణ ప్రవేశము.

25-5-57 వైశాఖ బహుళ ౧౧ ఏకాదశీ శనివారం - మతత్రయైకాదశీ.

29-5-57 వైశాఖ బహుళ 30 అమావాస్యా బుధవారం - అమావాస్యా ప్రయుక్తకార్యము లాచరింపనగును.

# విశేషపూజలు - ఉత్సవములు

(గతసంచిక తరువాయి)

శ్రీ మాన్ పండిత, పార్థసారథి భట్టాచార్య.

## గజచ్ఛాయ

'హంసే కరస్థితే యాతు అమావాస్యా కరాన్వితా
సాజ్ఞేయా కుంజరచ్ఛాయా ఇతి బోధాయనోఽబ్రవీత్।

(కన్యామాసమున హస్త నక్షత్రముతో కూడిన అమావాస్య దినము 'గజచ్ఛాయ' యను పుణ్యదినముగ ప్రశంసింప బడినది.)

'గజచ్ఛాయ లేక కుంజరచ్ఛాయ' లక్షణము మరియొక విధముగ కూడకలదు.

## వ్యతీపాతము

'శ్రవణాశ్వి ధనిష్ఠార్ద్రా నాగదైవత మస్తకైః
యద్యమా రవివారేణ వ్యతీపాత స్స ఉచ్యతె.

(ఆదివారముతో అమవాస్య తిథిచేరి శ్రవణము, అశ్విని ధనిష్ఠ, ఆర్ద్ర, ఆశ్రేష, మృగశీర్ష ఈ నక్షత్రములలో యేదైన ఒక నక్షత్రముకూడ కలసెనేని అట్టిదినము వ్యతీ పాతమనబడును.) అందును

'మాఘమాసే కృష్ణపక్షే పంచదశ్యాం రవేర్దినమ్
వైష్ణవేనతు ఋక్షేణ వ్యతీపాతస్తు దుర్లభః।

(మాఘ బహుళ అమావాస్య తిథి ఆదివారము శ్రవణ నక్షత్రము చేరిన వ్యతీపాతము మిక్కిలి గొప్పది)

## అర్ధోదయము

'అమార్కపాత శ్రవణైర్యుక్తా చేత్పౌష మాఘయోః
అర్ధోదయః సవిజ్ఞేయః కోటి సూర్యగ్రహైః సమః॥

(పుష్యమాసమందుగాని మాఘమాసమందుగాని అమావాస్య తిథియందు శ్రవణ నక్షత్రముతో వ్యతీపాత సంబంధము కలిగిన రవివారము అర్ధోయమను పుణ్యకాలమున ప్రశంసింపబడినది.)

ఇంకను కొన్ని విశేష దినములు :—

'అమావాస్యాతు సోమేన సప్తమీ భానునా సహ
చతుర్థీ భూమిపుత్రేణ సోమపుత్రేణ చాష్టమీ
చతస్రస్తిథయస్త్వేతాః సూర్యగ్రహణ సన్నిభాః
స్నానం దానం తథాశ్రాద్ధం సర్వం తత్రాక్షయం భవేత్।

(సోమవారముకూడిన అమావాస్య, ఆదివారము చేరిన సప్తమి, మంగళవారముతో చేరిన చవితి, బుధవారముతో చేరిన అష్టమి, ఈ నాలుగు తిథులును సూర్యగ్రహణ పుణ్య కాలమువలె పుణ్యములైనవి. ఈ తిథులందు స్నానదానాలు ఫలప్రదములగును.)

తరువాతిది గ్రహణము-రాహు కేతువులను ఛాయా గ్రహములలో నొకటి సూర్యునిగాని చంద్రునిగాని పట్టి కొనెడి సమయము గ్రహణకాలము. రాహుకేతులు సూర్యుని చంద్రుని కబలింతురను ప్రవాదమును గురించిన తత్త్వమీ యెడ మన కక్కరలేదు. గ్రహణముకూడ సంక్రమణము వలె అపూర్వమగు శక్తి కలదనియు భౌతికముగ నియ్యది పరిణతిజనకమనియు వైజ్ఞానికశాస్త్రవిదులు నమ్ము చున్నారు.

'అస్యన్మిన్ పుణ్యనక్షత్రే' అనుటచే భగవదవతార మందుక్తమగు నక్షత్రకాలమును స్వీకరించునది.

'రాజ్ఞోయజమానస్యవా జన్మర్క్షే' అనునపుడు ఆ దేశ మును పరిపాలించెడి ప్రభువుయొక్క గాని దేవాలయ కైంకర్యములను జరుపునట్టి ధర్మదాతయొక్క గాని జన్మ దినమునందుగాని యని అర్థము. పైన నిరూపించినట్టి విషువ, అయన, సంక్రాన్తి, గ్రహణ, అస్యపుణ్య నక్షత్ర, రాజజన్మ నక్షత్ర, యజమాన జన్మ నక్షత్రములందు భగవానునకు విశేష పూజలను జరిపించు విధి ఆగమము లందు విధించబడినది. పై నిమిత్తము లన్నిటిని ఉద్దేశించి ఆయా సమయములలో స్నానదాన జపహోమ శ్రాద్ధాది కృత్యములను కర్తవ్యములుగ ధర్మశాస్త్రములు విస్తరించి చెప్పుచున్నవి. ధర్మశాస్త్రములందు విస్తరించి వర్ణింపబడిన విషువాదుల మహత్త్వమును నిరూపించెడి ఆగమ శాస్త్ర కారులు ఆ పుణ్యకాలములను భగవదనుభవాహములు గను ఐహికాముష్మికోభయఫలదాయకములుగను ఆ సమ యములందు భగవత్పూజ చేయుటను విధించిరి.

అయనాదులందు చేయదగిన దానాదులను గూర్చిన ధర్మశాస్త్ర వచనము లీ క్రింది రీతిన నున్నవి.

'అయనాదౌ సదా దేయం ద్రవ్యమిష్టం గృహేతు యత్
షడశీతి ముఖేచైవ విమోక్షే చంద్ర సూర్యయోః।
దానాధ్యయన జప్యాది విశిష్టం వహ్నిహోమకమ్
వసోర్ధారాసు లభతే త్వన్యథా నకథంచన'

(అయనాదులందు జపహోమాదుల నాచరించుట అభ్యు దయ సాధనము. ఈ పుణ్యకాలములందు శక్తికల్గినవారు తమకు కలిగినట్టి పదార్థములను ప్రీతిపూర్వకముగ దానము చేయవలెను. ఈ దానాదులవలన యజ్ఞఫలము లభించును.

'సంక్రాన్త్యాయాని దేయానిహవ్యకవ్యాని కర్తృభిః
తాని నిత్యం దదాత్యర్కః పునర్జన్మని జన్మని"

(సంక్రాన్తి మొదలగు పుణ్యకాలములందు దేవకార్యము గను పితృకార్యముగను ప్రీతిపురస్సరముగ ఏయే వస్తువులను ఒక మానవుడు ధర్మముచేయునో ఆయా వస్తువులను ఆ మానవుని రాగల జన్మములందన్నిటియందును సమృద్ధిగ సూర్యభగవానుడు ప్రసాదించును.)

మరియు ఈ దానాదులవలన ఐహికమగు శ్రేయస్సు కల్గుటమాత్రమే కాక అనిష్టనివృత్తియు శాస్త్రములందు చెప్పబడుచున్నది.

'యస్యజన్మర్క్ష మారభ్యరవి సంక్రమణం భవేత్
తన్మాసాభ్యన్తరే తస్య వైరక్లే శధనక్షయాః'
'తగరసరోరుహపత్రైః రజనీ సిద్ధార్థలోధ్ర సంయుక్తైః
స్నానం జన్మర్క్షగతే రవిసంక్రమణే సృణాంశుభదమ్'

(ఎవనియొక్క జన్మనక్షత్రమందు రవిసంక్రమణము సంభవించునో ఆమాసమున నా జన్మనక్షత్రము కలవారలకు ఇతరులతో వైరము క్లేశము ధనక్షయము మొదలగు కష్టములు సంభవించును. అట్టివారలకు ఓషధులతో మన్త్రపూర్వకముగ స్నానము చేయుట శుభదము.)

మరియు గ్రహణ మహిమ యిట్లు చెప్పబడుచున్నది.

'చంద్రేవాయది వాసూర్యే దృష్టే రాహౌ మహాగ్రహే
అక్షయం కథితం పుణ్యం తత్రార్కేతు విశేషతః
రవిగ్రహః సూర్యవారే సోమే సోమగ్రహస్తథా
చూడామణిరితి ఖ్యాతః తత్రానస్త ఫలం లభేత్
వారేష్వన్యేషు యత్పుణ్యం గ్రహణే చన్ద్ర సూర్యయోః
తత్పుణ్యం కోటిగుణితం గ్రాసే చూడామణౌ స్మృతమ్

(చంద్రునిగాని సూర్యునిగాని రాహుగ్రహము పట్టినపుడు కలిగిన గ్రహణము అక్షయమగు పుణ్యము నీయగల పుణ్యకాలము. అందును సూర్యగ్రహణ కాలము పుణ్యతరము. ఆదివారము నాటి సూర్యగ్రహణము గాని సోమవారమునాటి చంద్రగ్రహణముగాని 'చూడామణి' యని పిలువబడును. తక్కిన వారములలో కలిగెడి గ్రహణమునకంటె "చూడామణి" గ్రహణము కోటిగుణితమగు పుణ్యఫలము నిచ్చునది.) మరియు, గ్రహణకాలమును బట్టి శాన్తివిధిని శాన్తి నాచరించని వారలకు అరిష్టముకూడ నీ దిగువ రీతిని చెప్పబడుచున్నది.

'జన్మ సప్తాష్టరిష్ఫాంక దశమస్థే నిశాకరే
దృష్టోఽరిష్ట ప్రదోరాహుః జన్మర్క్షే నిధనేఽపిచ'
'యన్నక్షత్రగతో రాహుః గ్రసతే శశి భాస్కరౌ
తజ్జాతానాం భవేత్పీడా యే సరాశ్శాన్తి వర్జితాః
యస్య త్రిజన్మ నక్షత్రేతస్యరోగోఽథ వామృతిః
తస్యదానం చహోమంచ దేవార్చన జపౌ తథా
ఉపరాగాభిషేకంచ కుర్యాచ్ఛాన్తి ర్భవిష్యతి
స్వర్ణేన వాఽథ పిష్టేన కృత్వా సర్పస్య చాకృతిమ్
బ్రాహ్మణాయ దదేత్తస్యన రోగాదిశ్చ తత్కృతః'

(ఏ పురుషునియొక్క 1, 7, 8, 12, 9, 10 స్థానములలో చంద్రుడుండగా జన్మతారయందుగాని సప్తమతారయందుగాని రాహు గ్రస్తముగ చంద్రగ్రహణము కలుగునో అట్టి పురుషునకు అరిష్టము సంభవించును. అట్లే ఏ నక్షత్రమున సూర్య చంద్రులుండగా గ్రహణము సంభవించునో ఆ నక్షత్రమందు జన్మించిన వారలు ఉక్తశాంతిని చేసికొనని యెడల కష్టముల పాలగుదురు. ఎవనియొక్క జన్మనక్షత్రమందుగాని పదవ నక్షత్రమందుగాని పందొమ్మిదవ నక్షత్రమందుగాని గ్రహణము సంభవించి నపుడాతనికి రోగము లేక మృత్యువు కలుగును. ఆ దోష నివృత్తికై అతడు దానము హోమము దేవతార్చనము జపము గ్రహణాభిషేకము మొదలగు పరిహారములను చేసికొని శాన్తి జేసికొనవలయును. బంగారుతోగాని పిండితోగాని పాము యొక్క విగ్రహమునుచేసి దానార్హుడగు బ్రాహ్మణునకు ఈయవలయును. దానిచే అరిష్ట పరిహారము కలిగి సుఖము కలుగును.)

'యస్య రాజ్యస్య నక్షత్రే స్వర్భాను రుపరజ్యతే
రాజ్య భంగం సుహృన్నాశం మరణం చాత్ర నిర్దిశేత్'

(రాజ్యము యొక్క నక్షత్రమందు రాహుగ్రస్త గ్రహణము కలుగుచున్నదో ఆ రాజుకు రాజ్యభంగము మిత్ర నాశము మరణము కలుగుచున్నది.)

పై చెప్పబడిన విశేషములను మనసున నుండిన పరమ కృపాలులగు నాగమశాస్త్ర ప్రవర్తకులు లోకకల్యాణము నకై ఆలయములందీ విశేషపూజను విధించిరి. దేశమున విశాలమగు ప్రదేశములో నివసించెడి ప్రజలు ధర్మశాస్త్ర నిర్ణయములను తెలిసినవారును తెలియనివారును ఉండవచ్చును. తమకు అరిష్టమని తెలిసినను అశ్రద్ధచేతను అవిశ్వాసముచేతను అజ్ఞానముచేతను లోభముచేతను శాంతి పరిహారమును చేయుటకు అవకాశము లేక అట్టి వారలు నష్టపడవచ్చును. ప్రభువులు రాజ్యములు కలవరము కలిగి చెడిపోవచ్చును. అను విశాల దృష్టితో రాజ రాష్ట్ర గ్రామ యజమానాచార్యార్చకపాచకపరిచారక లోకమునకు యోగక్షేమాభి వృద్ధికై ప్రతిష్ఠింపబడిన దేవాలయములందు సకల పరిజనారిష్టశాంతికై ఈ విశేష పూజలను నిత్యముగ మహర్షులు యేర్పరచిరి. ఈ యంశమునే సంగ్రహముగ ఆలయార్చా మహత్త్వమును చెప్పెడి యుపోద్ఘాత ప్రకరణమున సంహితలలో చెప్పబడినది.

# మనః పరివర్తనము

బులుసు - వేంకటరమణయ్య.

సాధారణంగా మనుష్యుని మనస్సు మెత్తనిది. కారణం లేకుండా, కోరివుండి యితరులకు అపకారాన్నీ, హానినీ కలిగించాలని అతడు తలంచడు. కాని, కొన్ని సమయాల్లో స్వార్థంవల్లకాని, మరికొన్ని సమయాల్లో ఆశవల్లకాని అతని మనస్సు చెడునడతలోకి దిగడం సంభవిస్తుంది. తన కోరిక నెరవేరడానికి మానవుడు ఆ సమయంలో ఎంత సాహసానికయినా సిద్ధపడతాడు. అలాటి సందర్భంలోకూడా భగవంతుడు తన మాహాత్మ్యాన్ని వెల్లడించి, మానవుని దుష్ట మనస్సును మార్చి అతడు సన్మార్గగామి అగుటకు తోడ్పడతాడు. మరియు, అమాయకుల భక్తికి ఎంతో సంతోషించి, వారికి సంతృప్తిని కలిగిస్తాడు. ఈ విషయాలకు ప్రమాణంగా స్కాందపురాణంలో యీ క్రింది విషయాన్ని గ్రహించవచ్చును.

మన భారతదేశంలో మోక్షాన్ని ప్రసాదించే పట్టణాలు ఏడు. వాటినే సప్తపురాలు అని అంటారు. అవి ఏవంటే—

అయోధ్యా మధురా మాయా
కాశీ కాంచిరవంతికా,
పురీ ద్వారవతీ చైవ
సప్తైతా మోక్షదాయకాః ॥

[అయోధ్య, మధుర, హరిద్వారం, కాశి, కంచి, అవంతి, ద్వారక—అనే ఏడున్నూ ముక్తినిచ్చే నగరాలు.]

వీటిలో అయోధ్య, కాశి మున్నగునవి చాలా ప్రసిద్ధాలే! అవంతీ నగరం సంగతి కొందరికి తెలియకపోవచ్చును. అది ఉజ్జయినికి నామాంతరం- గొప్ప శివక్షేత్రం! ఇక్కడ మహాకాళేశ్వరుడనే పేరితో శివుడు అవతరించి వున్నాడు.

పూర్వకాలంలో ఒకప్పుడు ఆ నగరాన్ని చంద్రసేను డనే రాజు ఏలుతూ వుండేవాడు. అతడు గొప్ప ఐశ్వర్యవంతుడు. అందంలో ఏమీ తక్కువలేదు. చక్కని రూపం ఉన్న చోట ఉత్తమ గుణాలకు లోపం వుండదు. కాబట్టి అతడు గుణవంతుడని వేరే చెప్ప నక్కరలేదు. సిరిసంపదలతో తులతూగుతూ, లోకోత్తర సౌందర్యము కలిగివున్నా అతడు ఏ మాత్రమూ గర్వించక తా నొక సామాన్య మానవుడననియే భావిస్తూవుంటాడు. అతడు గొప్ప శివభక్తుడు కూడాను. ప్రతిదినమూ మహాకాళేశ్వరుని గుడికి పోయి, భగవంతుని పూజించి, ఆ తర్వాతనే తక్కిన కార్యాలు చేసేవాడు.

చంద్రసేన మహారాజుకు తనయందు గల యీ భక్తికి పరమేశ్వరుడు మిక్కిలి సంతోషించాడు. అలా సంతోషించి అతనికి 'చింతామణి' అనే గొప్ప మణిని ప్రసాదించాడు. దేనిని కోరితే, దానిని ఆ మణి యిస్తూవుంటుంది. అంతే కాదు- ఆ మణితో ఏ లోహాన్ని తాకించినా, అది బంగారంగా మారిపోతుంది. ఆ మణిని ధరించినపుడు చంద్రసేన మహారాజు దివ్యమైన తేజస్సుతో ప్రకాశిస్తూ వుండేవాడు.

ఎవరైనా అభ్యుదయం పొందారంటే ఓర్వలేనివారు ఎక్కువమంది వుంటారు. ఇలా ఉండడం సహజం కూడాను. చంద్రసేన మహారాజునకు భగవదనుగ్రహంవల్ల చింతామణీ రత్నం లభించడమూ, అది అద్భుతమైన శక్తులు కలిగివుండడమూ ఇరుగు పొరుగు రాజులకు కన్నులు కుట్టినట్లయినది. ఎలాగనైనా ఆ చింతామణిని అపహరించాలనే దుర్బుద్ధి వారికి కలిగింది. మిత్రభావంతో వచ్చి కొందరు దానిని యాచించారు; కొందరు రాజును మోసగించి- అపహరించాలని చూచారు. కొందరు ఎదురుగావెళ్లి 'ఆ చింతామణిని ఇవ్వకపోతే మనకూ, మనకూ యుద్ధం తప్పదు' అని బెదరించారు. ఎవరు ఏవిధంగా యత్నించినా సరే- చంద్రసేనుడు ఉలకనూ, పలకనూ లేదు. అతనికేమో, ఆ మణిని ఉంచుకోవాలనే ఆశలేదు. కాని, భగవంతుడు ప్రసాదించినది! అట్టి దానిని అతడు యితరులకు ఏలాగున ఇవ్వగలుగుతాడు?

తమ కోరిక ఫలించకపోగా—ఆ మణిమీద ఆశపడిన రాజులందరూ కూడబలుకుకొని—ఒక్కసారిగా అవంతీ నగరాన్ని ముట్టడించారు. ఇలా జరుగుతుందని రాజు కలలోకూడా అనుకోలేదు. పోనీ - తన విరోధులను ఎదిరించడానికన్నా- అతడు తగిన బందోబస్తులో లేడు. అతడు రాజకీయ వ్యవహారాలకంటె మహాకాళేశ్వరుని పూజనే ప్రధానంగా భావించడంవల్ల సైన్యాన్ని సమీకరించడంలో శ్రద్ధ చూపలేదు. ఇలాంటి అవసరం కలుగుతుందని అతడు భావించడంలేదు. అందువల్ల అతడు శత్రువులను ఎదుర్కొనే స్థితిలో లేనందున భారమంతా ఆ మహాకాళేశ్వరుడిపైనే వుంచి, పాలలో ముంచినా, నీళ్లలో ముంచినా ఆ జగద్రక్షకుడే అనే విశ్వాసంతో ధైర్యం వహించి, ప్రత్యేక ప్రార్థనలు సలుపడానికి అయన గుడికే ప్రాతఃకాలం బయలుదేరి వెళ్లాడు.

ఆ దినం శనివారం. ప్రదోషంకూడాను. అందువల్ల అది శివునకు మిక్కిలి ప్రియమైన సమయం. శివరాత్రి ఎంత పవిత్రమైనదో- ఆ రోజూ అంత పవిత్రమైనదే! నాడు జరిపే ప్రార్థనా, చేసేపూజా భగవంతుణ్ణి తప్పకుండా సంతృప్తిని

చెయ్యగలవు. ఈ సంగతి చంద్రసేనుడికి తెలియక పోలేదు.

చంద్రసేనుడు మహాకాళేశ్వరునికి విశేషంగా పూజలు చేసి, శత్రువుల బారినుంచి తన్ను రక్షించవలసినదని ఆ దేవదేవుని పరిపరి విధాల ప్రార్థిస్తూ - ఆ ధ్యానంలోనే తన్మయుడై ఉండిపోయాడు- కొన్ని నిమిషాలపాటు- ప్రపంచమును మరచి.

ఆ సమయంలో ఒక గొల్లయువతి గబగబా ఆ మహాకాళేశ్వరుని గుడిలోకి పరుగెత్తుకుంటూ వచ్చి. పట్టలేని ఆనందాన్ని వెల్లడిస్తూ రాజుగారి పాదాలమీదపడి "ప్రభువులు చిత్తగించాలి. ఏలినవారి అనుగ్రహంవల్ల మా దరిద్రం తీరిపోయింది. మేము సిరి సంపదలతో తులతూగుతున్నాము. మా చిన్నవాడు రోజూ పూజచేసేచోట ఇప్పుడొక గుడివెలిసింది. అది వెండి, బంగారాలతో నిర్మింపబడివున్నది. దానిలో వున్న శివలింగం బంగారు మయమై రత్నాలు పొదిగివున్నది. మా గుడిసె యిప్పుడు దివ్య భవనంగా తయారైనది. దీని కంతటికీ ప్రభువులే కారణం! అందువల్ల మొదట ప్రభువులతో మనవి చెయ్యడానికి వచ్చాను." అని ఎంతో వినయంతో విన్నవించుకున్నది.

చంద్రసేనుడికి యిదేమీ అర్థం కావడంలేదు. తా నా యువతిని గాని, ఆమె కుమారుణ్ణిగాని యెరగడు. తనవల్ల వారికి ఆ రీతి ఐశ్వర్యం కలిగిందంటే ఆశ్చర్యపడడూ? ఒక సువర్ణలింగం ఆవిర్భవించినదంటే—అంతకన్నా వింత మరొకటి వుంటుందా?

అతడు వింతగా ఆ యువతివైపు చూస్తూ "అమ్మా! నువ్వెవరో నాకు తెలియదు. నీ కుమారుడినైనా నేను ఒకప్పుడయినా చూసినట్లు జ్ఞప్తిలేదు. మీ అభ్యుదయానికి నేను ఎలా కారణం కాగలిగినానో నాకు ఏమీ బోధపడకుండా వున్నది. విషయమంతా కాస్త వివరించి చెప్పగలవా?" అని అన్నాడు.

తర్వాత ఆ అభీరయువతి చేతులు జోడించుకుని ప్రభువు యెదుట నిలిచి భయభక్తులతో యిలాగున విన్నవించినది-

"మహాప్రభూ! మేము గొల్లలం. ఒక్క పిల్లవాడుతప్ప 'నా' అన్నవారు మరెవ్వరూ నాకు లేరు. గర్భదరిద్రురాలనైన నాకు నిలవడానికి మాత్రం ఆధారంగా ఒక చిన్న గుడిసె వున్నది. బిచ్చమెత్తుకోవడం తప్ప వేరేపని నాకు చేతకాదు. నేను పగలల్లా ఊరులో తిరిగి సగం కడుపు నింపుకొని రాత్రికి నా గూడు చేరుకుంటూ వుంటాను. నా యీ స్థితిలో బిడ్డనుకూడా చంకను పెట్టుకొని తిరగలేక యీ దేవాలయద్వారం దగ్గర కూర్చోపెట్టి ఒకనాడు ఊళ్లోకి వెళ్లాను. తిరిగి కొంతసేపు పోయాక వచ్చిచూస్తే అక్కడ పిల్లవాడు కానరాలేదు. నా ప్రాణాలు నిలువునా పోయినట్లయింది. అయినా మొండిధైర్యం తెచ్చుకుని, లోపలికివచ్చి నాలుగుమూలలా వెతుకుతూ వుండగా—దేవాలయ ప్రాకారం లోపల ఒకచోట నా బిడ్డకు తనముందు ఒక రాతిని ఉంచుకుని పువ్వులతో పూజించి, ఎదుట కన్నులు మూసుకుని కూర్చున్నాడు. "ఇదేమిటి బాబూ!" అని నేను అడిగితే "దేవుడికి పూజచేస్తున్నానమ్మా!" అన్నాడు. "రాతి ముక్క దేవుడేమిటిరా? దానికి పూజేమిటి?" అని నేనన్నాను. "ఇది దేవుడేనమ్మా! రాయికాదు. చూడు, రాజుగారు యీ లోపలికివచ్చి- లోపలవున్న రాతికి ఇలాంటి దానికే పూజచేస్తూ వుండడం నేను చూశాను. ఉత్తరాయే అయితే ఆయన పూజిస్తారా? ఆ రాతిలో దేవుడు ఉంటే ఇందులో వుండడూ? నేను దేవుడికే పూజచేస్తున్నాను" అన్నాడు. "సరే వాడియిష్టం" అనుకుని నేను ఊరుకున్నాను. కాని క్రమక్రమంగా వానికి ఈ వెర్రి ముదిరిపోయింది. పెద్దపెరుగుతున్నా, పనీ, పాటూ సాయం చేయడు. పిలిస్తే పలకడు. నేను కష్టపడి సంపాదించి పెట్టిన అన్నమునైనా తరచు తినకుండా ఏదో పరధ్యానంలో వుంటూ వచ్చాడు. ఇలా ఉపేక్షచేస్తే పూర్తిగా చెడిపోతాడు గదా అని- వాడు లేని సమయంచూసి నిన్ననే ఆ రాతినీ, ఆ పూజా వస్తువులనూ చాలా దూరప్రదేశంలో పారవేశాను.

పిల్లవాడువచ్చి చూచుకునే సరికి, వాడి దేవుడూ లేడు; వస్తువులూ లేవు. ఎంతో దుఃఖపడ్డాడు. వలవల యేడ్చాడు. నాకూ జాలికలిగింది. "అమ్మా! నా దేవుణ్ణి నువ్వే తీసి పారవేశావా? నిజం చెప్పు" అని గట్టిగా అడిగితే "నేనే తీసిపారవేశాను. నువ్వు నీ దేవుడి దగ్గరే కూర్చుండి పిచ్చివాడివై పోతున్నావని, ఆ రాతిని చాలా దూరంగా ఒక రాళ్లకుప్పలోకి విసిరివేశాను" అని సమాధానం చెప్పాను.

తర్వాత వాడు తలవంచుకుని "ఎంతపని చేశావమ్మా! అలా పారవేస్తారా? పారవేస్తే దేవుడికి కోపంరాదూ! నా దేవుడిని విడిచి నేనెలాగున ఉండగలను? అయ్యో!" అని వాడు వెక్కివెక్కి యేడ్వసాగినాడు. నేను చేసినపనికి మనస్సులోనే బాధపడుతూ అక్కడినుంచి వెళ్లిపొయ్యాను.

తర్వాత నా కుమారుడు ఆ స్థలంలోనే కూలబడి "ఓ దేవదేవా! ఈ మహాపరాధాన్ని క్షమించు. మా అమ్మ తెలియక చేసిన తప్పును మన్నించు. ఆమె అజ్ఞానంనుంచి యిలా చేసింది. అజ్ఞులను క్షమించే నీవు మన్నించక పోవని నా ధైర్యం. నా కిప్పుడు మరొక చిక్కు కలిగింది. నిన్ను ఆ విధంగా పారవేశాక—మళ్లీ యేలాగున సంపాదించ గలను? నాకు మార్గం ఏమీ తోచకుండా వున్నది. దీనరక్షకా! నన్నెలా రక్షిస్తావో? నీదే భారం!" అంటూ భగవంతుణ్ణి ప్రార్థించేసరికి అతనికి యీ అమాయకుడిమీద దయ కలిగింది. ఇదివరలో వాడు పూజచేస్తూ వుండిన రాయి వున్న

చోట ఒక బంగారు శివలింగం ఆవిర్భవించినది. దాని నిండుగా నవరత్నాలూ తాపటం చెయ్యబడివున్నవి. ఆ లింగం చుట్టూ ఒక దేవాలయంకూడా వెలసినది. అది వెండి, బంగారాలతో తయారయివున్నది.

ఇదంతా చూచి పిల్లవాడు దిగ్భ్రాంతుడైనాడట! భగవంతునికి తనమీద కలిగిన అపార కరుణకు పొంగిపోయి ఆనందం పట్టలేకపోయాడు. వెంటనే ఆ సంతోషవార్తను తెలపడానికి నా వద్దకు—మే ముండే గుడిసెదగ్గరకు పరుగెత్తుకొని వచ్చాడు. కాని మా గుడిసె యేదీ? అది కాన రాకుండా మాయమై పోయింది. మా గుడిసె వుండే చోట ఇప్పుడు దివ్యభవనం ఒకటి తయారైనది. మాలేమి పూర్తిగా పటాపంచలైనది. నేను గొప్ప ఐశ్వర్యవంతురాల నయాను. మునుపు శ్రీకృష్ణుని దగ్గరకు వెళ్లి— అతని అనుగ్రహాన్ని సంపాదించిన కుచేలుడు తన పూరికి వచ్చేసరికి తన కుటీరం దివ్యభవనంగా మారిపోయింది కదా! అప్పుడు తన యింటిని కనుక్కోవడానికి అతడు ఎంత కష్టపడ్డాడు! ఆ రీతిగానే నా కుమారుడుకూడా మా యిల్లు తెలిసికోవడానికి మిక్కిలి శ్రమ పడ్డాడు. ఎల్లాగయితే నేమి- చివరకు తెలుసుకుని జరిగినదంతా తెలిపాడు. నా ఆనందానికి అవధి లేకుండా పోయినది. ఇలా జరగడానికి కారణం ప్రభువులే! ప్రభువువారి పూజావిధానాన్ని చూడకపోతే నా కుమారుడికి భగవంతుణ్ణి పూజించాలనే బుద్ధి పుట్టనే పుట్టదు; వాడికి స్థిరమైన భక్తిభావం కలగనే కలగదు. అందువల్ల యీ అద్భుత వృత్తాంతాన్ని ప్రభువులకు విన్నవించాలనే కోరికతో వేగంగా వచ్చాను. ప్రభువుల ధ్యానానికీ, పూజకూ ఆటంకం కలిగినట్లయితే—క్షమించాలని ప్రార్థన.''

ఆ యువతి యీ విధంగా చెప్పేసరికి చంద్రసేనుడికి కూడా ఎక్కువ ఆశ్చర్యం కలిగింది. వెంటనే అతడు గుడిలోనుంచి బయటకు వచ్చి, ఆమె దారిచూపగా, ప్రాకారం లోపలి భాగంలో ఒక మూలను వెలసిన వెండి బంగారాల గుడినీ, లోపలి బంగారు లింగాన్నీ చూచాడు. భగవంతుడికి ఆ చిన్నవానిమీద కలిగిన అనుగ్రహానికి ఎంతో ఆనందించాడు.

అప్పటి కప్పుడే యీ వార్త ఉజ్జయినీ నగరం నాలుగు మూలలా ప్రాకిపోయింది. జనులు తండోపతండాలుగా ఆ గుడివద్దకు రాసాగినారు. 'ఈ గొల్లపిల్లవాడు ఎంత అదృష్టవంతుడు!' అని అందరూ వానిని కొనియాడ సాగినారు.

ఉజ్జయినికి పొలిమేరలలో సైన్యాలతోకూడా వున్న రాజు లందరికీకూడా చారులవల్లా, దారిపోయే వారివల్లా యీ సంగతి అంతా తెలిసింది. భగవంతుని అనుగ్రహం వుంటే ఎంత తక్కువ వాళ్లయినా గొప్పవారు కాగలరనీ, అతని కరుణ లేకపోతే ఏ పనీ సాగదనీ వారు గ్రహించారు. ఒక వేళ తాముబలాన్ని ఉపయోగించి, చంద్రసేనుణ్ణి జయించి చింతామణిని సంపాదించినా, దేవుడు తలిస్తే అది వెంటనే మటుమాయ మౌతుందని వారు గ్రహించారు. అందువల్ల యుద్ధం చెయ్యడం ఎంతమాత్రమూ మేలైన పని కాదని వారు తెలుసుకున్నారు. ఈ రీతిగా వారి మనస్సులను ఆ మహాకాళేశ్వరుడే మార్చివేశాడు. వారికి నూతనంగా వెలసిన స్వర్ణలింగాన్నీ, దేవాలయాన్నీ చూడవలెననే కుతూహలం ఎక్కువయింది. అందువల్ల వారు చంద్రసేనుడికి ఒక వర్తమానం పంపారు. తమకు నూతనంగా వెలసిన దేవాలయాన్ని చూడాలనే కుతూహలం అమితంగా ఉన్నదనీ అందువల్ల నగరంలోకి రావడానికి అనుమతి యివ్వవలసినదనీ, తమ కెట్టి దురుద్దేశమూ లేదనీ ఆ వార్తయొక్క సారాంశం. సరళ స్వభావుడైన చంద్రసేనుడు దానికి సమ్మతించి, ఎంతో గౌరవంతో ఎదురేగి వారిని తోడ్కొనివచ్చాడు. వారు క్రొత్తగా వెలసిన శివలింగాన్ని చూడగానే, వారి దురభిప్రాయాలన్నీ పోయాయి. చంద్రసేనునిమీద ఎంతో గౌరవం ఏర్పడినది. వారు అవంతీ ప్రభువును క్షమాపణ వేడుకుని, తమ పాపాలు నశించి, అతని మూలాన తరించినట్లు స్తుతించారు. చంద్రసేనుడు వారిని ఎంతో ఆప్యాయంగా బుజ్జగించాడు.

ఆ సమయంలో అక్కడ హనుమంతుడు ప్రత్యక్షమయి గొల్లపిల్లవాని భక్తిని ప్రశంసించి, వానికి శ్రీకరుడని పేరు పెట్టాడు. శివకేశవులకు అభేదమనీ, ఒకప్పుడు శివభక్తులుగా వున్నవారు విష్ణుభక్తులుగా మారుతారనీ, వచ్చే జన్మలో శివభక్తికి ఫలితంగా శ్రీకరుడు నందగోపు డయి పుడతాడనీ, అపుడు విష్ణువు నందగోపునికి కుమారుడుగా—శ్రీకృష్ణుడుగా అవతరించి కృతజ్ఞతను వెల్లడిస్తాడనీ తెలియజేశాడు. ఇలా తెలియచేసి, అతడు వెంటనే అంతర్ధానమయ్యాడు. శివపూజ ఎంతటి మహత్తు కలిగివున్నదీ అప్పుడు అందరికీ తెలిసింది. తాముకూడా చలించని మనస్సుతో శివుని ఆరాధిస్తే చింతామణులవంటి మణులను ఎన్నిటినైనా సంపాదించవచ్చునసే నమ్మకం కలిగినది- రాజులకందరికిన్నీ. వారు చంద్రసేనునివద్ద సెలవు తీసుకొని తమతమ రాజ్యాలకు వెళ్లిపోయారు.

గొప్ప శివభక్తు డయి ఉండినందున చంద్రసేనుడు ఆపదనుండి తప్పించుకో గలిగినాడు.

# ఆరాధన

లింగన సోమయాజి - ఆత్రేయ.

అరాధన శబ్దము సామాన్యముగ బూజార్థమున వాడబడుచున్నది. సంస్కృత భాషయందనేక పదములు బర్యాయపదములుగ వాడబడుచున్నను అవి యొక్క దాని కొకటి సమానార్థకములుగావు. సంస్కృత వాఙ్మయమున నిజముగ సమానార్థకములగు పదములు లేవనియే చెప్పవచ్చును. అనేక పదము లొకే యర్థమున ప్రయోగింపబడుచున్నను అట్టి యర్థముసందలి యేదో యొక విశేషమును బురస్కరించుకొనియే ప్రతిపదము ప్రవర్తించుచున్నది. ఆ పదమును వినినపు డొక విశేషార్థముదాత్త భావముతో బుద్ధికి గోచరమగుచున్నవి. బ్రాహ్మి, భారతీ, భాషా, సరస్వతీ- ఈ పదము లన్నియు సరస్వతికి పేర్లు. వీనిని బర్యాయపదములుగ వాడుచున్నాము. కాని యివి సమానార్థకములు గావు. వీనిలో ప్రతి పదార్థముసందొక విశేషార్థము భాసించుచున్నది. సరస్వతీ శబ్దముచే నా దేవతయొక్కగాని యాపదముచే నుపలక్షితమగు వాక్కు యొక్కగాని సర్వవ్యాపిత్వము సూచింపబడుచున్నది. బ్రాహ్మి శబ్దము బ్రహ్మసంబంధమును గోచరింపజేయుచున్నది. సరస్వతీదేవత బ్రహ్మసంబంధినియనిగాని వాక్కులన్నియు బ్రహ్మశబ్దార్థమగు వేదమునుండి బుట్టినవియనిగాని విశేషార్థము తోచుచున్నది. ప్రపంచము సంతయు వాగ్రూపమగు వ్యవహారము భరించుచున్నది యని భారతీ శబ్దభావము. భాషాపద మాంతరంగిక భావమును వ్యక్తపఱచు వాగింద్రియమును బుద్ధియందు లగ్నముచేయుచున్నది. భాషయందలి యిట్టి శబ్దశక్తివైలక్షణ్యమొక్క సంస్కృత పదజాలముసందు మాత్రమే కాన్పించును. బ్రాహ్మిత్యాది పదము లొకే యర్థమునందు ప్రవృత్తి నిమిత్తకము లగుటంజేసి సమానార్థకములుగ భావించుచున్నాము. రచనా సౌకర్యమును, పునరుక్తి నివారణను గోరి సమానార్థకములుగ పాటింపబడు పదముల నొకదాని బదులు మఱియొక దానిని బర్యాయముగ వాడుచుందుము. ఇంతవరకు మాత్రమే వీనికి పర్యాయపదత్వ మన్వర్థము.

అటువలెనే అరాధన, పూజ, నమస్య, సపర్య, అర్హణ యను పదము లేకార్థమునందు ప్రవర్తకములగుటంజేసి అటుల ప్రయోగింపబడి పర్యాయపదములుగ బరిగణింపబడుచున్నది. దేవతాదులను గాని గురుజనులనుగాని పెద్దలనుగాని గౌరవభావముతో నీక్షించు మానసికవృత్తి యీ పదము లన్నింటికి వినియోగ స్థానము. ఇట్టి మానసిక క్రియకు సహాయభూతములగు కాయిక క్రియలు, పుష్పాదులుగూడ నీ పదములచే నభివ్యక్తములగుచున్నవి. పూజా నమస్య శబ్దములు పూజకుని బాహ్యక్రియల నెక్కుడుగ జ్ఞాపకముచేయును. సపర్యాపదము పూజ్యవస్తువుతో గూడ మానసిక కాయికమగు సహవర్తిత్వమునకు స్ఫోరకమగును. అర్హణపద మట్టి వస్తువుయొక్క పూజార్హతను వెలిబుచ్చుచున్నది. వీని యన్నిటికంటెను విలక్షణమగు నొక విశేషార్థము నారాధన పదము బోధించును. ఈ పదమును వినినపు డారాధనకు వలయు సాధనము, అరాధనము వలన లభించు ఫలము, ఫలప్రాప్తిచే ననుభూతమగు సంతోషము—ఇవి యన్నియు నొక్కమారుగ నారాధకుని మనోవీథియందు విహరించుచున్నవి. ఉత్తముల యెడ జేయు గౌరవ ప్రదర్శనా కల్పమునం దారాధన పదమునకు గల వ్యాప్తిబాహుళ్య మద్దాని పర్యాయపదములకు లేదు.

పూజా విధానమునందు మానసిక కాయిక క్రియలు రెండు సవగతములయినను, అందు మానసిక క్రియ ముఖ్యము. పూజ్యవస్తువునందు తదేకనిష్ఠతో మనస్సును లగ్నము సేయక లక్షపత్ర ఫలాదుల నెంత యర్పించినను నిరర్థకమగును. పూజనమునందు మనస్సు ముఖ్యసాధనము. "అధీరవామలలనాహృతమానసాయ దత్తం మనో మమ ఇదం త్వరితం గృహాణ" అని యొక కవయిత్రి పూజావిధానమునందు మానసిక ప్రాముఖ్యత సతి మనోరమముగ చమత్కరించినది. అరాధన వస్తువునందన్య చింతనానంతరితమగు చిత్తము నేకాగ్ర్యముగ నిలిపి ధ్యానించుట యవసరము. ధ్యానమునకు భక్తి పూర్వాంగము. ధ్యానదార్ఢ్యత భక్తిదార్ఢ్యత కనురూపముగ నుండును. తపస్సంపన్నులగు గురుజనము, తురీయాశ్రమవాసులు, దేవతలు, వారి నిలయములగు విగ్రహములు మొదలగు నివి యన్నియు నారాధ్యములే. "ఆరాధనాయ లోకానాం ముంచతో నాస్తిమే వ్యథా" యని శ్రీరాముని లోకకళ్యాణైకపరత్వము నారాధన పదముచే భవభూతి వర్ణించినాడు. బాహ్యమగు కాయికాంశము లేక కేవల మానసికమగు నాంతరంగికారాధనముపాసనా కాండములో జేరును. చంచలమగు చిత్తము నరికట్టి యొకచోట నిలుపుటకు లక్ష్యస్థానములగు విగ్రహము లవసరము. వానియందు మంత్ర పురస్సరముగ నాహూతలగు దేవతలు పూజా విషయములు. విగ్రహారాధనము నధిక్షేపించు క్రైస్తవులు క్రీస్తు ప్రతిమల వారి యాలయముల నెలకొలిపి యారాధించెదరు. బ్రహ్మసామాజికులు రామమోహనరాయుని ఛాయా

పటముల నుపాసనా మందిరముల నిలిపి పూజించెదరు. ఈ పటములు రంగులచే చిత్రింపబడిన పట మాత్రములని వీరలు భావించుటలేదు. తమతమ పూజ్యపురుషుల సత్వముల నచట భావించియే వానికి పుష్పోపహారముల నర్పించు చున్నారు. లక్ష్యమును నిలిపి భావనా సిద్ధిని బొందుటకు సాధనస్థానమున నుండునది లోహశిలాదినిర్మితమగు విగ్రహమైననేమి! ఛాయాపటమైననేమి? ఇవి యన్నియు నర్చావిషయములకు ప్రతిభూప్రదేశములు మాత్రమగు చున్నవి. మనస్సును నివాత దీపమువలె నిలుపగల నిగృహీత చిత్తులకు విగ్రహములతో బనిలేదు. విగ్రహోపాసనలు రెండును చిత్తైకాగ్ర్యమున కభ్యాస భూములైనను ఈ శక్తి విగ్రహారాధనతో నారంభమై అభ్యాసబలముచే క్రమక్రమముగ పాటవమును బొంది యుపాసనయందు పరిపక్వము నొందును. అనన్య చింతనము కైవల్యమున కనివార్యమగు సాధనము.

మానుష బుద్ధులు బుజుకుటిలాది భిన్నస్వభావములు గల వగుటంజేసి వాని రుచులుగూడ విభిన్నము లగు చున్నవి. శ్రేయః ప్రేయస్సులు రెండును మనుజుల కత్యంత మభీప్సితములు. కొంత మంది యిహలోక సంబంధములగు గృహారామ క్షేత్రాదులను, పశుపత్ని విత్త పుత్రాదులను కాంక్షించి భగవంతుని ఆరాధించెదరు. మఱి కొందరు స్వర్గాద్యభ్యుదయము నభిలషించి యాతని భజించెదరు. అన్యులు కైవల్యము నాశించి యీశ్వరు నుపాసించెదరు. వీరందరు తమతమ మనోవృత్తుల కనురూపములగు ఫలముల బడయుదురు. కోరిన కోర్కులు నెరవేరుటయే దేవతారాధన ఫలము. కామోపహితమగు ఫలము కామసంస్పృష్టమగుటంజేసి నికృష్టము. స్వర్గాద్యభ్యుదయములు వీనికంటె నుత్తమములు. కైవల్యమును గోరి జేయు ఆరాధనోపాసనలుత్తమోత్తమములు. నిజమే! కామమే వీని యందుగూడ ప్రవృత్తికి కారణము. కాని యైహిక కామములకును పదార్థ కామమునకును మహదంతరము గద్దు. కోరికలేక ప్రవృత్తి కలుగదు. ఐహిక కామములు సాంసారికములు. అముష్మికేచ్ఛ సంసార విముఖము; మోక్ష కారణము. ఐహిక కామోపహితమగు భక్తి గూడ కైవల్య భక్తిచే నపహతమగును. కైవల్యమునందలి కోర్కె నివృత్తి మార్గమున ప్రవృత్తిని కల్పించును. వైషయిక కామమును విడనాడి యీశ్వరార్పణముగ జేయు భగవదారాధనమె నిష్కామకర్మ శబ్దార్థము. ఆరాధన మంతయు సగుణము. అయ్యది ఫలకాలమున పరిపక్వమై నిర్గుణ ఫలావాప్తికి నిమిత్తమగును. అందువలన నయ్యది మందమతులగు సామాన్య జనులకు శరణ్యమగుచున్నది. ఇదియే భాగవత మత తత్త్వము. ఈ కారణముచేతనే భారతదేశమున గణనాతీతములగు దేవాలయములు నెలకొల్పబడినవి. కుగ్రామములయందుగూడ దేవతా గృహములు గానవచ్చుచున్నవి. దేవాలయములేని గ్రామము నివాసయోగ్యము కాదని మన పెద్దల నమ్మకము. దేవతానికేతనములు భారతీయ సంస్కృతికి విశిష్టమగు నొక కేతనము. సగుణ భక్తిచే తరించిన మహనీయు లెందరో మన దేశమున గలరు.

సంసారసంతరణమే ఆరాధన ఫలము. దేవతానుగ్రహము మన కెట్లు లభించునో చెప్ప నశక్యము. భక్తుల నుద్ధరించు దేవతల గతులు మనకవగతములు గావు. "పరోక్ష ప్రియాహి దేవాః" దేవతలు సాక్షాద్దర్శనమును సామాన్యముగ ననుగ్రహింపరు. పరోక్షముననుండి భక్తుల యనన్యత్వమును పరీక్షించుచుందురు. గజేంద్రుడు తన నెంత కాలము వేడుకున్నను శ్రీ కృష్ణు డాతని మొఱనాలకింప డయ్యె. చీమ కుట్టినంత బాధ యయిన నా భక్తప్రియునకు కలుగదయ్యె. తన యేకాంతమున కాతంకము కలుగకుండ నామూలసౌధంబు దాపలనిందుకాంతోపలోత్పల పర్యంకము నందు రమావినోదియై విహరించుచుండ చిట్టచివరకు లావొక్కింతయు లేక ధైర్యము విలోలంబై "రావే యీశ్వర కావవే" యని బిగ్గరగ మొఱపెట్టుకొన్న యా విహ్వల నాగేంద్రము కుయ్యాలించి అపూర్వమగు తొట్రుపాటుతో ప్రియురాలి చేలాంచలమునైన వీడక కాంతా వినోదంబుల సాలించి యేకాకియై గగనంబున కుద్గమించెను. గజేంద్రుని యార్తభావమును దా ననుభవించి యుత్కంఠచే మైమరచి తన యనుభవమును వ్రాయుటకు మాటలు దొరకక గజేంద్రునివలెనే విహ్వలత నొందిన యా కవిరాజునకు దర్శన మివ్వక తండ్రివేషమున శారదకు కాన్పించి పద్యమును పూరించి శ్రీరాముడు కొంటెతనము చేసెను. బొక్కసము నంతయు కొల్లవెట్టి తనకును సీతమ్మ తల్లికిని బంగరు తొడుగుల దొడగి యనన్యముగ సేవించినను దరిగానక నిస్పృహచే విషము ద్రావ నాయత్తము జేసికొనిన రామదాసునకు దర్శన మివ్వక తన భక్తుని చెరపెట్టిన తానీషా కర్ధరాత్రివేళ దర్శనమిచ్చి చిన్నబిడ్డాట లాడెను. వీరలందరు చరితార్థులు మాత్రమయిరి. దేవతల నడకల నెఱుంగ నేరికి శక్యము! మోక్షమబ్బిన అయన దర్శనముతో నేమి పని! "త్వయి ప్రసన్నె మమ కింగుణేన, త్వయ్యప్రసన్నె మమ కింగుణేన" అని లీలాశుకుడు సంతుష్టి నొందెను. నేటి పిదప కాలమున నా మహనీయు దర్పించిన యాభరణముల విక్రయింప బూనిన రాజకీయ నీతినిగూడ నెఱుంగ నేరికిని శక్యము గాదు.

అనన్యము భగవదర్పితము నగు నారాధనచే సమకూరు ఫలము సంతోషము. ఈ సంతోషముగూడ ననన్యము, నిరుపమానము విజాతీయము. అదియు బ్రహ్మానంద

ద్వారము. విషయసుఖేచ్ఛ భక్తుని కెంత దూరమగునో బ్రహ్మానంద ద్వారమంత సన్నిహితముగ నుండును. విగ్రహారాధనము మోక్షమునకు పరంపరా కారణము. సంపూర్ణ విశ్వాసముతో నద్దాని నాచరించువారికి మోక్షము క్రొంగు బంగారమగును. అట్టి యానందమే బ్రహ్మానందమై అమృత రూపమున భాసించుచుండును. ఆరాధన శబ్దబోధితము లగు సాధనఫలసంతోషముల నరయు విధానముల వివరించు పత్రికకు కూడ ఆరాధన యని నామకరణము సేయుట న్యాయమె! సగుణభక్తి ప్రయుక్తమగు విగ్రహారాధనము నిర్విష యానంద ద్వార మెట్లగునో మఱియొక తూరి విచారించెదము గాక!

ఓం శాంతిః శాంతిః శాంతిః

---

# భారతీయ ధర్మము - IX

"కాశ్యప"

జీవులెల్లరు అఖండానందమునే యపేక్షింతురు, కాని నిత్యానందమును సమకూర్చు సాధనములను గుర్తించి యభీష్టము నందలేక పోవుచున్నారు. చిత్తశాంతి స్థిరముగ నెలకొనసంతవఱకు సత్యసుఖానందములు కనుచూపు మేరలో కనుపడబోవు. సామాన్యమానవుల విషయములో మోహాంధకారము సణగించు జ్ఞానము మెఱుపుదీగవలె గడుంగడు చంచలము. ఆ జ్ఞానవిద్యుల్లతను గబళింప కామక్రోధాది మేఘపరంపరలు నిరంతరము కాచికొని యుండును. చిత్తవిక్షేప కారణములలో కామక్రోధ లోభము లగ్రశేణి నలంకరించును. అవి యనివార్యములు, బలవత్తరములుననంతములు. లోభోపహతచిత్తులు కులక్షయకృత దోషమును గమనింపలేరు, మిత్రద్రోహ పాతకమును గణియింపబోరు, మనోరథనదీ పరంపరను దరియింపలేరు.

సంత్యేతె మమ దన్తినో మదజలప్రప్లానగండస్థలాః।
వాతవ్యాయతపాతినశ్చ తురగాః భూయోఽపిలప్స్యే
పరాన్।
ఏతల్లబ్ధ మిదం లభే పునరిదం లబ్ధాధికం ధ్యాయతాం।
చిన్తాజర్జర చేతసాం బత! నృణాం కా నామ శాన్తేః కథా॥

"నాకు వేలకొలది మత్తవేదండములు గలవు, వాయువేగము నధిక్షేపించు తురంగమసహస్రంబులు గలవు, ఇంకను సంపాదింపవలసినవి చాల గలవు. లోకము లన్నియు నాక్రమింపవలయును గదా!" అని చింతించు వానికి శాంతి యెటులు లభించును? తృష్ణాహింసలు లోభ సహచారిణులు. వా రొనరింప సాహసింపని యకార్యము లుండబోవు. ఆశించిన వస్తువులు లభింపనిచో క్రోధ మావేశించును.

అన్ధీకరోమి భువనం బధిరీకరోమి ధీరం, సచేతనమ
చేతనతాం నయామి॥
కృత్యం న పశ్యతి నయేన హితం శృణోతి ధీమాన
ధీతమ పి నప్రతి సందధాతి॥

కోపావిష్టునకు జగమంతయు నంధకార బంధుర మగును, బధిరత్వము సంప్రాప్తించును, కార్యా కార్యహితాహిత పరిజ్ఞానము లోపించును, చదివిన వేద శాస్త్రములు నిరుపయోగము లగును. వేయేల-చైతన్యమే నశించును.

త్వాష్ట్రంవృత్రమపాతయత్ సురపతిః। చన్ద్రార్థ చూడో
ఽచ్ఛినత్
దేవో బ్రహ్మశిరో వసిష్ఠతనయానాఘాతయత్ కౌశికః
విద్యావత్యపి కీర్తిమత్యపి సదాచారావదాతాన్యపి
ప్రోచ్చైః పౌరుష భూషణాన్యపి కులాన్యుద్ధర్తు మీశః
క్షణాత్॥

క్రోధముచేతనే కదా - దేవేంద్రుడు వృత్రుని సంహరించెను, మహాదేవుడు బ్రహ్మ శిరస్సును ఖండించెను, విశ్వామిత్రుడు వసిష్ఠుని సుతశతమును కనిమనంగెను. విద్యావివేకములు, సదాచారసంపత్తి, కీర్తి ప్రతిష్ఠలు, పౌరుష పరాక్రమములు గలిగి వానికెక్కిన వంశము లెన్ని క్రోధాగ్ని కాహుతియై పోవుటలేదు!

కేయం మాతా పిశాచీ, కఇవ జనకో। భ్రాతరః కేహికీటాః।
వధ్యోయం బన్ధువర్గః కుటిలవిట సుహృ చ్చేష్టితా
జ్ఞాతయోఽమీ॥

కుపితులకు తల్లి దయ్యము, తండ్రి నింద్యుడు, బంధువులు వధ్యులు, సోదరులు గౌరవదూరులు, జ్ఞాతులు కిరాతులు. 'క్రోధాద్భవతి సమ్మోహః, సమ్మోహాత్ స్మృతి

విభ్రమః స్మృతి భ్రంశాద్బుద్ధి నాశః బుద్ధినా శాత్ప్రణశ్యతి॥ క్రోధమువలన నకలారిష్టంబు లుత్పన్నమగును. దాన మోహ మేర్పడును. స్మృతి విభ్రమము సమకూరును, బుద్ధినష్ట మగును, తుదకు సంపూర్ణ వినిపాతము కల్గును.

మహామోహమహారాజు పరివారమున దండనాథుడు కాముడు. అతని పరాక్రమము సురాసురులకు భయా వహము.

అపి యది విశిఖాః శరాసనంవా కుసుమమయం ససురా సురంతథాఽపి ।
మమ జగదఖిలం వరోరు ! నాజ్ఞామిద మతిలంఘ్య ధృతిం ముహూర్త మేతి ॥

కుసుమమయములయిన శరశరాసనములచేతనే మన్మ థుడు దేవదానవ లోకములను శాసించుచున్నాడు. వాని యాన నతిక్రమించి దేవాధి దేవులయినను మనలేరు. 'అహ ల్యాయై జారః సురపతిరభూత్, ఆత్మతనయాం ప్రజా నాథోఽయాసీ దభజత గురోరిన్దురబలామ్ ॥ శతమఖు డైన శచీపల్లభుడు అహల్యా జారుడై అపకీర్తిపాలై సహస్రా క్షత్వము సంపాదించికొనియెను. చతుర్ముఖుడు నిజత నూజను గామించి పూజార్హత గోల్పోయెను. సుధాకరుడు గురుపత్నీగమనము గావించి నిత్యకళంకి యయ్యెను. అట్టియెడ నల్పులయిన మర్త్యులమాట తడవ బనిలేదు.

'అహింసా కైవ కోపస్య, బ్రహ్మచర్యాదయో మమ। లోభస్య పురతః కేఽమీ నత్యాస్తేయా పరిగ్రహాః॥' కోపము గలవాని యహింస యూహాతీతము, కాముకునియెడ బ్రహ్మ చర్యాదులు మృగ్యములు, లుబ్ధునియందు సత్యాస్తేయా పరిగ్రహములు గగన కుసుమములు. అనంతశక్తి సంపత్తి గల దేవతలుగూడ అరిషడ్వర్గమున కరిగాపు లగుదురు. కావున కామక్రోధాదులు దేవతాధిక పరాక్రమవంతులు. వారిని జయించుటన్న నసాధారణ విషయము. ఇష్టదేవతో పాసనా బలముచేతనే వారి నెదుర్కొనవలయును. కామ క్రోధాదులనే దేవభావమున బూజించి కృతకృత్యత నార్జింప నగును.

"సూర్యశ్చ-అగ్నిశ్చ మామన్యుశ్చ మన్యుపతయశ్చ మన్యు కృతేభ్యః" పాపేభ్యో రక్షన్తామ్॥ । సూర్యుడు, అగ్ని, క్రోధము అభిమానము గాగల దేవత, క్రోధనియామకులగు అధి దేవతలు, కోపముచే చేయబడిన పాపములనుండి నన్ను రక్షింతురుగాక. 'మన్యురిన్ద్రో మన్యురేవానదేవో మన్యుర్హోతా వరుణో జాతవేదాః॥, క్రోధమునకు ఇన్ద్రాగ్న్యాది దేవత్వము శ్రుతియాపాదించు చున్నది. 'నమస్తే రుద్ర! మన్యవే॥' మహాదేవా! నీ రుద్రస్వరూపమగు క్రోధమునకు నమస్కా రము. ఆ క్రోధమునుండి నన్ను రక్షింపుము. 'కామోఽ కార్షీన్నమోనమః । కామోఽకార్షీత్, కామఃకరోతి నాహం కరోమి । కామఃకర్తా నాహంకర్తా । కామఃకారయితా నాహం కారయితా । ఏషతే కామకామాయస్వాహా ॥' నా కన్న మిక్కిలి బలవంతుడైన కామదేవుడు బలాత్కరించి నాచే పెక్కు పాపములు చేయించుచున్నాడు. నేను బుద్ధిపూర్వ కముగ కర్తనుగాను. కారయితనుగాను. కర్తయు, కార యితయు నా కామదేవుడే. ఇది ముమ్మాటికిని నిక్కము. దేవా! శివకామసుందరా! ఈ యాహుతి స్వీకరించి కామ కృత పాతకములను భస్మము గావింపుము. 'మన్యురకార్షీ న్నమోనమః। మన్యురకార్షీత్, మన్యుఃకరోతి నాహంకరోమి। మన్యుఃకర్తా నాహంకర్తా। మన్యుః కారయితా నాహంకార యితా। ఏషతేమన్యో! మన్యవేస్వాహా ॥' శక్తిమంతుడైన క్రోధదేవుడు నాచే పాపములు జేయించుచున్నాడు. నేను కర్తనుగాను, కారయితనుగాను. కర్తయు, కారయితయు క్రోధుడే. సర్వేశ్వరా! ఈ హవ్యము గైకొని క్రోధప్రేరిత పాపములను రూపుమాపుము. 'యద్విద్వాగ్ంసశ్చావిద్వాగ్ం సశ్చైనశ్చకృమ తస్యావయజన మసిస్వాహా ॥' ఓ యగ్ని దేవా! ఎఱిగి యెఱుగక మేము చేసిన యఘములనెల్ల నంతమొందింపుము. బలవంతులు, అనితర సాధ్యులు దేవ తలు. అందుచే కామక్రోధాదులను గూడ దేవభావమున నాశ్రయించి వారి యనుగ్రహముచే దురితాచరణమునకు దూరమున నుండ యత్నింపవలయును. విఘ్నదోష శాంతికి విఘ్నేశ్వరుని యారాధించునటులే కామదోషశాంతికి కామ దేవుని, క్రోధదోష శాంతికి క్రోధదేవుని యారాధింపదగునని వేదమాత యాదేశించుచున్నది. కామక్రోధాదులకు దూరులై భగవదనుగ్రహపాత్రులగువారు భక్తాగ్రేసరులు. 'సుదూర మపి గన్తవ్యంయత్ర భాగవతాః స్థితాః' వెదకి వెదకి భాగ వతుల జాడ గనిపట్టి వారి శుశ్రూషచేయువారు ధన్యులు.

నిఖిలజగదానందకందము, నందనందన సుందర చర ణారవిందము. తచ్చరణారవిందమరందబిందుసందోహ ముచే పావనమైనది బృందావనము. వినయాది సద్గుణము లకు బుట్టినిల్లు గదాధరుడు-బృందావన నివాసి. సకల చరాచరభూతసముదాయమునందు ఆత్మభావనచేసి మెలగువాడా భక్త శిఖామణి. ఉత్తమసంస్కారము, అసా ధారణ ప్రతిభా విశేషము, సుదృఢశాస్త్ర పరిజ్ఞానము, మధురమధుర కంఠస్వరము, లలితలలిత ప్రసంగచాతు ర్యము, భావబంధురకవితావిలాసము, అనన్యసామాన్య భక్తి ప్రపత్తి, యతనికి సహజాలంకార విశేషములు. భగ వన్నామ సంస్మరణము, భక్త భాగవత సందర్శనము ఆ పుణ్యశ్లోకుని నిత్యకృత్యములు. గీ॥ తనువు రోమాంచితము గాగ, కనులహర్ష। బాష్పములుఁగార, గద్గదస్వరము గలుగ, నంజలిఘటించి తలవంచి యవశుడగుచు । హరిభజించు, గదాధరుండహరహంబు ॥

గదాధరుని యఖండభగవన్నామ సంకీర్తనము, భగవత్కథా కాలక్షేపములను వినుటకు పల్లెపల్లెలనుండి వాడ వాడలనుండి వేలకొలది జనులు సమావేశమగుచుండిరి. కల్యాణసింహుడు రాజపుత్రుడు. అతడు శ్రద్ధా భక్తులతో కథా శ్రవణము జేయుచు, గదాధరుని యనుంగుశిష్యుడై, తన యింటిని ఇల్లాలినిగూడ విస్మరించి, భగవద్గోష్ఠియందే కాలము గడుపుచుండెను. అతని గృహిణి సామాన్యపరిజ్ఞానముమాత్రము గలది. భర్తయొక్క వైరాగ్యము, గృహస్థాశ్రమవైముఖ్యము, ఆమెకు విచారకారణములైనవి. ఆమె తన దుఃఖమునకు గదాధరుడే కారకుడని నిర్ణయించెను. అతని కీర్తి ప్రతిష్ఠలకు కళంక మాపాదింప గలిగినచో, తన భర్త తనకు తిరిగి వశుడు గాగలడని భ్రమించెను. ఆ యిల్లాలు గర్భవతియైన యొక బిచ్చగత్తెను జేరజీరి, ఆమెచేత నిరువది రూపికలనుబెట్టి, యెటులయిన గదాధరుని శీలమునకు మచ్చగూర్పుమని నచ్చజెప్ప యొప్పించెను.

కథాప్రసంగము బ్రహ్మానందముగ సాగుచుండెను. సభలోని వారికి దేహభానమే లేకుండెను. జంకుగొంకు లేక భిక్షుకి హుటాహుటి గదాధరుని సమీపించెను. 'మహారాజా! ఈ నాగర్భస్థ శిశువునకు తండ్రివి నీవేగదా! ప్రసవసమయ మాసన్నమైనను వలయు నేర్పాటుచేయక యుపేక్షచేయుట నీ వంటివానికి దగునా?' అని యెల్లరు విన నెలుగెత్తి బలికెను. 'సంభావితస్యచాకీర్తిర్మరణాదతిరిచ్యతే.' అభిమానవంతులకు అపకీర్తికన్న మరణమే మేలనిపించును. 'తుల్యనిందాస్తుతిర్మౌనీ!' జితేంద్రియులకు నిందాస్తుతులు సమానములే. 'వీతరాగభయ క్రోధః స్థితధీర్మునిరుచ్యతే.' రాగభయక్రోధములను వర్జించినవాడు స్థితప్రజ్ఞుడు. గదాధరుడు ధీరాతిధీరుడు. అతని మొగమున చిరునగవు దళుకొత్తినది. సభలో గుసగుసలు బయలుదేరినవి. సభ్యులు కొందరాశ్చర్యచకితులైరి, కొందరాగ్రహావిష్టులైరి, కొందరు బాష్పపూర్ణనేత్రులైరి. క్షుద్రభిక్షుకియందుగూడ గదాధరునకు యశోదానందవర్ధనుడే పొడగట్టెను. "సోదరులారా! సంకోచింపకుడు. ఈ సాధ్వి చెప్పినమాటలు సత్యదూరములు గావు. దేవీ! నిన్ను నేనెటులు మఱచి పోగలను. ఇంత కాలమెందెందు దిరిగి యలసితివి. సమయమునకు వచ్చితివి-సంతోషము. ఈ సభ నలంకరింపుము. మన మందఱముగలిసి బృందావనవిహారి సంకీర్తనము గావింతము." అని దృఢగంభీరస్వరంబున గదాధరుడు వక్కాణించెను 'సమః శత్రౌచ మిత్రేచ తథా మానావమానయోః। అనికేతః స్థిరమతిః భక్తిమాన్ మేప్రియోనరః.' శత్రువులయందును, మిత్రులయెడలను, సన్మానమునందును, అవమానము నందును సమ స్థితికారులై యుండగలవారే భగవదనుగ్రహపాత్రులయిన భక్తవరేణ్యులు. సభాసదులకు గదాధరుని శీలమునందు సందేహము గలుగలేదు-బిచ్చగత్తె మాటలయందు నమ్మకమును గలుగలేదు-వారిలో నొక సజ్జనుడు భిక్షుకిని సమీపించి నిజమెఱిగింపుమని బ్రతిమాలెను. ఆమెయందు మానవత్వము సంపూర్ణముగ లోపింపలేదు. గదాధరుని సహనము, కారుణ్యము ఆమెను సంపూర్ణముగ వశపఱచుకొనియెను. చేసిన యపచారమునకు ప్రాయశ్చిత్తము గావించుకొన తహతహ లాడుచు, ఆమె జరిగిన వృత్తాంతమంతయు పూసగ్రుచ్చినటులు తెలియజెప్పి, గదాధరుని కాళ్లపైబడి వెక్కివెక్కి యేడువసాగెను. అతడామెనోదార్చెను. సభాస్తారులు సందేహము దొలగ ఆనందమందిరి.

కల్యాణ సింహునకు తలదిమ్మెత్తెను. కన్నులెఱ్ఱబడెను. ఒడలు కంపించెను. కోపము దుర్భరమయ్యెను. ఒఱనుండి కత్తిని దూసి యాతడు గృహాభిముఖుండయ్యెను. గదాధరు డాతని నడ్డగించెను. "ఏమి ఈ యాగడము-భక్తాగ్రేసరా! క్రోధమునకు దాసులైనవారు భగవంతునకు దూరులు గారా? ఇంతకు నీ యర్ధాంగి చేసిన యపరాధమేమి? ఆ పరమ పతివ్రత తన నాథుని దా దక్కించుకొన దలచినది. అది న్యాయము గాదా? ఆమె మార్గము నీకు నచ్చనిచో, ఆ యబలను చేతనైన నీ మార్గమునకు ద్రిప్పికొనుము. అందఱియందును పరమాత్మ గలదు. ఆమె యందును గలదు. ఆమెను నిందించి హింసింతువేని, అది సర్వాంతర్యామియైన శ్రీ మహావిష్ణువును నిందించి హింసించుటయే యగును గదా! చాలు చాలు; సాధుసజ్జనుల గౌరవము దక్కించుము." అని సమాధానపఱచుచున్న గురువునకు శిష్యుడు "స్వామీ! దేవరవారి యానతి యతిక్రమింపరానిది. అయినను అపరాధులను శిక్షించుట రాజపుత్ర ధర్మము గాదా! ఈనా డా రక్కసిని మన్నించి విడిచిపుచ్చిన ఇతరులు నామె మార్గము ననుసరింపరా? దానలోకమునకు హాని గలుగదా!" అని విన్నవించెను.

"దుర్మార్గులను శిక్షింపవలసి యున్న నది భగవంతుని కర్తవ్యముగాని భక్తుల పనిగాదు. కఠినాతికఠినములైన శిక్షలు నేరములను రూపుమాపలేవు, - సరికదా - వానిని పెంపొందించును. క్షమాసహనములే దుర్మార్గులను సన్మార్గప్రవర్తకులనుగా మార్పగలవు. ఈ గర్భవతి విషయము ప్రత్యక్షముగ జూచియు సంశయింపనేల? ఏల యీ శుష్కప్రసంగములు? భగవన్నామ సుధారసము నాస్వాదింతము లెమ్ము." అని గదాధరుడు ప్రబోధించెను. కల్యాణసింహుడు స్వస్థుడయ్యెను. అఖండ సంకీర్తనము జరుగుచుండెను. 'క్షమాశస్త్రం కరే యస్య దుర్జనః కింకరిష్యతి, ఎవనిచేత సహనమను శస్త్రముండునో వానిని దుర్జనులేమి చేయుగలరు?

గుణాయన్తే దోషాః సుజనవదనే, దుర్జనముఖే ।
గుణా దోషాయన్తే తదిదమపి నో విస్మయపదమ్ ।
మహామేఘః క్షారం పిబతి కురుతే వారి మధురం ।
ఫణీ క్షీరం పీత్వా వమతి గరళం దుస్సహతరమ్ ॥

దుర్జనులు పరుల గుణములయందు దోషముల నాపాదింతురు. క్రూరసర్పము మధురక్షీరములు గ్రోలి దుస్సహ విషము వెడల గ్రక్కును. సుజనులన్ననో పరుల దోషములనుగూడ గుణములుగ సమర్థింపగలరు. సముద్రములోని క్షారజలములను గ్రహించి మేఘుడు తీయని నీటిని వర్షించుచున్నాడు. ఘనుల మార్గమటులుండును.

గదాధరుని సంకీర్తనఖ్యాతి దూరప్రదేశములకు విస్తరించెను. ఒకనాడొక వైష్ణవస్వామి సంకీర్తనమందిరమున కరుదెంచెను. గదాధరుడాతని పలువిధముల సత్కరించి, అగ్రస్థానమున నధిష్ఠింప జేసెను. నామశ్రవణమాత్రమున సభ్యుల నేత్రములనుండి ఆనంద బాష్పములు జాలువారుచుండెను. వైష్ణవ ప్రముఖునకు మాత్రము కన్నులు చెమ్మగిల్ల లేదు. అది యతనికి అవమానకరముగ దోచెను. మఱునాడు సంకీర్తనసమయమున నాతడు మెత్తనికారము వస్త్రమున దాచి కనులకు రాచుకొనుచుండెను. అతని నయనములనుండి బాష్పములు జలజల రాలుచుండెను. సంకీర్తనానంతరమున పామరు డొకడు గదాధరుని జేరి "ఆచార్యవర్యా! మీ చెంత కూర్చుండియుండిన వైష్ణవుడు వట్టి మోసగాడు. కంటికి కారము రాచుకొని బాష్పములను రాల్చుచున్నాడు" అని కొండెము చెప్పెను. గదాధరు డాత్రముతో నా వైష్ణవుని జేరి వానికి పాదాభివందన మాచరించి, "మహాత్మా! భగవద్గుణానుభవంబుచే నానంద పారవశ్యమందని యింద్రియంబులను శిక్షింపవలయు నని శాస్త్రము ఘోషించుచున్నది. కాని నేటి వఱకటుల శిక్షించువారిని నేను జూడలేదు. సంకీర్తనావసరమున నానంద బాష్పముల వెలువరింపజాలని నేత్రములకు కారము రాచి శ్రీవారు శిక్ష విధించిరని తెలిసికొని పరమానందము నొందితిని. మీ దివ్యసందర్శనముచే ధన్యుడనయితిని." అని గాఢాలింగనము చేసికొనెను. ఇరువురి నేత్రములనుండియు నిర్మలానందబాష్పములు ప్రవహించెను. గదాధరునివంటి పరమభాగవతాగ్రేసరుని యంగసంస్పర్శముచే వైష్ణవోత్తమునకు భగవత్కల్యాణ గుణముల యందవ్యాజానురాగము గలుగుటలో నాశ్చర్య లేశమేనియు గలుగదు గదా! సత్పురుష సాంగత్యము భక్తి జ్ఞాన వైరాగ్యములను కరతలామలకములను గావించును.

'యో మాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయిపశ్యతి । తస్యాహం నప్రణశ్యామి.' చరాచరములయందన్నిటను భగవంతుని జూచుచు, పరమాత్మయందే సకలమును సమన్వయింపజేయు మహాపురుషుడు భగవంతున కత్యంతాప్తుడు.

గదాధరుని యాశ్రమమము-అర్ధరాత్రము-చోరుడొకడు ప్రవేశించి అట గల విలువగల పదార్థములన్నియు మూటగట్టుచుండెను. గదాధరుడు చూచుచునే యుండెను. అతని కాచోరుడు గోపికా గృహముల విహరించు నవనీత చోరుని రూపమున భాసించుచుండెను. కట్టినమూట యెత్తికొనలేక దొంగ బాధపడుచుండెను. గదాధరుడు తటాలున లేచి ఆ మూటను దొంగనెత్తిపై నెత్తి పెట్టెను. చోరుని యాశ్చర్యమున కంతులేకపోయెను.

చోరుడు :—మహానుభావా! ధనముపై నేమాత్రమును గాంక్షలేక దొంగిలింప వచ్చిన దొంగకు సాయపడు నీవు మానవుడవా-లేక దేవుడవా? పురుషోత్తమా! నీ దివ్య నామము నేను వినవచ్చునా?

గదాధరుడు:—సోదరా నేను నీవంటి మానవుడనే. నేను దేవుడనేని నీవును దేవుడవే కదా! ఈ జగన్నాటకమున గదాధరుడను పేరుపెట్టుకొని నటించుచున్నవాడను తండ్రీ!

చోరుడు :—పరమ భక్తాగ్రగణ్యుడవయిన గదాధర భట్టువు నీవేనా స్వామీ! ఎంతటి ఘోరాపచారమున కొడిగట్టితిని. నా తప్పిదమును మన్నించి నన్ననుగ్రహింపవో, దయామయా!

అనుచు పాదములపైబడి వెక్కి వెక్కి యేడ్చు దొంగను లేవనెత్తి గదాధరుడు బుజ్జగించుచు. "తమ్ముడా! ఇందు నీవొనరించిన తప్పిదమేమున్నది? సర్వాన్తర్యామి ప్రేరేపింప ఈ కటిక చీకటిలో ప్రాణాపాయమునైన నరకు సేయక యింతదూరము శ్రమపడి వచ్చితివి. నీవు మూటకట్టిన పదార్థములన్నియు పరమాత్మకు జెందినవేకదా! వానియందు నాకెంత యధికారము గలదో నీకును అంత యధికారము గలదుగదా! వాని నన్నిటిని గొనిపోయి ఆలుబిడ్డలగూడి సుఖముగ జీవింపుము. జగద్రక్షకుడు ఈ తన సేవకునకు గావలసిన పదార్థము లన్నియు సకాలములో తప్పక సంపాదించి పెట్టగలడు. సంశయింపకుము" అని మధురముగ బలికెను. ఆ యీ మాటల నాలించిన తస్కరుడు విపశు డయ్యెను. అజ్ఞానాంధకారము తొలగిపోవ నతనికి జ్ఞానోదయమయ్యెను; జీవితమునందు విరక్తి గలిగెను. కాలక్రమమున నతడు గదాధరుని యుపదేశము పొంది భక్తావతంసుడయ్యెను. స్పర్శవేది నంటుకొన్న యినుపముక్కయు స్వర్ణఖండమగుట యనుభవ సిద్ధమేగదా!

నాథే నః పురుషోత్తమే, త్రిజగతామేకాధిపే, చేతసా ।
సేవ్యే, స్వస్య పదస్య దాతరి, సురే, నారాయణే, తిష్ఠతి ।

యంకంచిత్పురుషాధమం, కతిపయగ్రామేశమల్పార్థదం
సేవాయై మృగయామహే నర మహో! మూఢా వరాకావయమ్ ॥

భగవత్సేవయే పరమార్థముగా భావించినవాడు గదాధరుడు. ప్రాపంచిక కార్యములన్నియు నతని దృష్టిలో నప్రధానములు. దేవపూజకు గావలసిన సామగ్రినంతయు నాతడు స్వహస్తములతో సమకూర్చుకొనుచుండెను. ఒకనాడు భగవత్ప్రసాదమునకు గావలసిన పిండిని స్వయముగ విసరుచుండెను. అపుడొక సేవకుడు సమీపించి, 'స్వామీ! ఒక మహాధనవంతుడు మిక్కిలి విలువగల పెక్కు పదార్థములు తమకు సమర్పింప దీసికొని వచ్చియున్నాడు. మీరు చేతులు కడిగికొనివచ్చి వానిని స్వీకరింపుడు.' అని సవినయముగ విన్నవింప, గదాధరుడు చిరునవ్వునవ్వి, "అమాయకుడా! ముల్లోకముల కేకైక నాథుడైన రమామనోనాథుని సేవయందు గుదురు కొనియుంటిని. ఈ పని వదలి యా ధనికుని దర్శనముచేయుట యుక్తముకాదు. వలయునేని యా సజ్జనుడే యిటకు వచ్చి తాదెచ్చిన వస్తువులను భగవత్కైంకర్యమునకు సమర్పించుచుమలే-నీవు నిశ్చింతగ నుండుము." అని సేవకుని మందలించెను. పిదప నా ధనికుడచటకు వచ్చి గదాధరుని దీక్షకు మెచ్చి తెచ్చిన ద్రవ్యమ్ములిచ్చి వచ్చిన త్రోవను మఱలిపోయెను.

జీవితాంతమువఱకు భగవత్కైంకర్యము గావించుచు, తుదకు గదాధరుడు గదాధరునియందైక్యమందెను. గోపరిపాలనమున గోపాలుడును, భక్తసముద్ధరణమున భక్తవత్సలుడును నిరంతరము వేయి కండ్లతో కనిపెట్టుకొనియుందురు.

నిధి చాల సుఖమా! రాముని సన్నిధి సేవ సుఖమా!
నిజముగ బలుకుము ఓ మనసా! నిధి చాల సుఖమా!

(సశేషము.)

---

# సమీక్ష

## "కృష్ణ సనుమానకుము బాలకృష్ణ! కృష్ణ!"

1948 సంవత్సరంలో భట్లమకుటూరు వాస్తవ్యులు శ్రీ బళ్లకొండ్రాజు అనే వేంకట్రాజుగారు "గోపీ విలాపం" అనే గ్రంథాన్ని పాఠకలోకానికి భక్తకోటికి అందజేసి వాఙ్మయ సేవాభాగ్యమును పొందగలిగినారు. ఈ గ్రంథములో 108 పద్యాలున్నవి. మకుటము శతకములందు వలెనే అన్నింటికి శీర్షికలోనున్న విధముగా "కృష్ణ! సనుమానకుము బాలకృష్ణ! కృష్ణ!" అని ఉన్నది. సీసపద్యములు. సహృత్వము దీనిని ఒక శతకమని అనలేదు. ఇందలి ఇతివృత్తమే గ్రంథమునకు పేరయి "గోపీవిలాపం" అని వ్యవహరింప బడినది. రచయిత పట్టభద్రులు. శ్రీ జె. వెంకట్రాజు నామాంకితులు. ఈ గ్రంథము రచనా కాలము తెలియదుకాని ప్రకాశకులు దీనిని 1948 లో మాత్రం సారస్వత లోకానికి అందజేసినట్లు ప్రకటితమైనది. భక్తితోకూడిన శృంగారరసము ప్రధానముగా పద్యములలో గోచరించును. ఈ మధురభావన కొన్నికొన్ని పద్యములలో తారస్థాయిని అందుకున్నట్లు ప్రస్ఫుటమౌతున్నది. బహుశః కవి అంతఃకరణ ప్రమాణముగ ఈ భక్తిరసము ప్రకటితమయినట్లు ఊహింపవచ్చును. శ్రీ నండూరి వెంకటసుబ్బారావుగారు తమ అభిప్రాయములో వెలిబుచ్చినట్లు "ఈ కవి మిత్రుడు తనకుగల అపార కృష్ణభక్తిని కడు స్వతంత్ర బుద్ధితో ప్రకటించినట్లు" పాఠకులకుకూడా తోచక మానదు. ఈకవి పరమ లక్ష్యములుగ ముద్దుపళని - పానుగంటి - పోతన - జయదేవుడు - లీలాశుకుడు మున్నగువారి మధురభావావేశములను గైకొన్నట్లుకూడా శ్రీ సుబ్బారావుగారు అభిప్రాయము నిచ్చినారు. భక్తి శృంగారభావములను చిత్రించుటలో అదే లక్ష్యము కావచ్చు - అందులకే కవి తన కవితోపాసనలో ప్రేమరసపాయి - ప్రభువు - గురుడు - భర్త - భగవంతుడు అయిన కృష్ణమూర్తికే తానొక గోపికతో తాదాత్మ్యమయి ఆత్మసమర్పణగా ఈ కవితాంజలిని ఆర్తితో సమర్పించాడు - ఈలాటి మధురభావన కలగడానికి భగవాన్ రమణ మహర్షులవారి ఆశ్రమ ప్రభావంకూడా కారణమని గ్రంథకర్త ఒక మాటలో వ్యక్తం చేశారు - ఆనందో బ్రహ్మయటన్న ప్రాజదువు ఈ కవి లేఖినిలో ఆనంద రసంగా ఉత్పన్నమయి "గోపీవిలాపం" అనే గీతాస్రవంతిగా ఉద్భూతమై బ్రహ్మోపాసనా కాండమును ఘోషిస్తూ కావ్యజలధిలో సంగమించింది - ఉత్తమస్థాయీ భావాన్ని అందుకుని. ఈ కావ్యంలో ఇతివృత్తం - ఈ భావప్రకటనగాక వేరే కథ ఉండదు. వాకోవాకము - నాటకశిల్పము అంతగా ఉండే అవకాశము లేదు. కాబట్టి కవి కష్టపడిన మాట వాస్తవమే.

"అక్కడక్కడ మేరమీరి శృంగార దృశ్యాలు చూపెనేమో నని జంకు - అయితే కేవలం అసభ్యం గాదని ధైర్యం." ఇవి కవిసూక్తులు. ఇందులో మొదటి వాక్యానుసారంగా మేరమీరి శృంగార దృశ్యాలు చూపిన మాట వాస్తవమే గాని రెండవ వాక్యంలో సూచించినట్లు అవి "కేవలం అసభ్యం కాదని ధైర్యం" అనడం మాత్రం సాహసం.

"బిడాల శాస్త్రి" అనే గ్రంథాన్ని అశ్లీలాలకు—అసభ్యతకు గురి చేసి ప్రభుత్వందావా తెచ్చింది. కవి అందులో నుంచి బయట పడేందుకు తలప్రాణం తోకకు వచ్చింది. అలాటి సందర్భములో మన భారత సంస్కృతి చిహ్నమైన రాధా కృష్ణ మధుర భక్తిగాని భాగవత గోపి గీతలనుగాని అంతరార్థము వదలి పట్టి బాహ్య సౌందర్యమును జావళీ సాహిత్యభావ ములతో తేట తెల్లముగ సీసములో సాగతీసి బట్టబయలు చేయడం సినలైన ప్రేమసూత్రాలను వ్యక్తం చేయబోయి సిద్ధ హస్తులు కాకపోవడమే అవుతుంది. లీలాశుకుడు—జయదేవుడో అంటారా వారికి మనకు హస్తిమశకాంతరం—శ్రవణానంద ములో చెప్పినట్లు అస్మదాదులకించి దృక్తిని వారితో పోల్చి అంతవారమే అనుకొనుట చాల అంతరము గల విషయము. నక్కకు—దివిజాధ్యకాలయమునకు గల వాసి. వారి జీవితానికి—మధురభావాలు—భావప్రకటనకు గల వాఙ్మయానికి చాలా వ్యత్యాసం ఉన్నది. శృంగారాన్ని అరచాటుగా చిత్రించడమే మంచిదిగాని కేవలం బట్టబయలు చేయడం ఆంధ్ర కవితా పితామహుల ఉపదేశంకూడా కాదు గదా.

శ్రీ వెంకట్రాజుగారిలో గల ఆర్తికూడా పద్యములలో కనబడుచున్నది. భాష ఎక్కడా వెదుకుటకుకూడా కనపడని నారికేళపాకము గలది. సరళమైన జాను తెనుగు భాష. సులభగ్రాహ్యం - శబ్దవైచిత్రి - భావవిన్యాసం ప్రకటించే భాష ప్రకటించారు. తమ ఆర్తిసంతా 92, 93, 95, 104, 108 మొ॥ పద్యాలలో సంక్షిప్తం చేసి కృష్ణ పరమాత్మపై తమకు గల అచంచల భక్తి విశ్వాసాన్ని ప్రకటించారు. 106 వ. పద్యములో జావళీ (మధురా నగరిలో) లోని భావాన్ని వర్ణించారు. 89 వ. పద్యంలో మతాధి దేవతగా ఆరాధించేరు. 86, 87, మొ॥ కొన్ని పచ్చి శృంగార వర్ణనకు కారణం కవితను 96 వ పద్యంలో చెప్పినట్లు "పచ్చి శృంగారముల్ బల్కినా నాలుక యేచిన భక్తి కాయెగువులయ్యో" ప్రాయశః భక్తి యెగు వులే అని విశ్వసించాలి పాఠక లోకం. అంతేకాని 'గోపీవిలాపం' పేరిట శృంగార రసాన్ని విశృంఖలంగా జుగుప్సాకరంగా తేట తెనుగు భాషలో దేవాలయంమీది బూతు బొమ్మలలా వాఙ్మయాలయంలో ప్రవేశ పెట్టడానికి లేఖినీ విన్యాసం జరిపించ దలచినట్లు కవి బుద్ధి పూర్వకంగా వ్రాసినవి కావని పాఠకలోకం భావించాలి. దేవాలయాలలో ఈలాంటి పచ్చిశృంగార పద్యాలుమాత్రం కావ్యపఠన చేయుటంలో వదలిపెట్టి మిగిలిన రసవంతమైన ఎన్నో భక్తి పద్యములు శ్రావ్యకంఠముతో చక్కగా కృష్ణగానం చేసి శ్రోతలకు కృష్ణభక్తి - మధురభావన కలగజేయాలి. ఈ కావ్యాన్ని ప్రసాదించిన శ్రీ జె. వెంకట్రాజుగారు ధన్యులు. వారి కావ్యప్రసాద గుణము భక్తిప్రదము - అటువంటి కవులు - భాగవతులు - కృష్ణభక్తులు - దేవాలయధికారులగుట శ్రీ కృష్ణుని అనుగ్రహ చిహ్నము. వేదములలో చెప్పబడినట్లు ఆ భగవంతుడు మంత్రములలో నుండి ఆ మంత్రములు బ్రాహ్మణాధీనమై యుండుట అట్టివారిని భక్తి తాత్పర్యములతో త్రికరణ శుద్ధిగా తమ కవితా శక్తితో ఆరాధించి శ్రీ కృష్ణుని యనుగ్రహమునకు పాత్రులై ఇంకను దేవాలయములలో పఠింప దగు కావ్యములను హరిహర నాథప్రీతిగా ఆంధ్రావళి మోదమందునట్లు వ్రాయుదురని ఆశించుచు వారి మధురభక్తి భావనకు నా ప్రశంసాంజలులను సమర్పించుచున్నాను. ప్రచారములేని సత్కావ్యము పూజ లేని దేవాలయ మని విజ్ఞులెరుగనిది కాదు గదా!

**పామర్తి వేంకట రమణరావు**
నన్నయపీఠం, తణుకు.

# వార్తలు

## శ్రీ సింహాచల స్వామివారి కళ్యాణ మహోత్సవము

**11-4-57** తేదీ చైత్ర శుద్ధ ఏకాదశినందు శ్రీ స్వామివారి కళ్యాణ మహోత్సవము అత్యంత వైభవముగా జరుప బడెను. సాయంకాలము శ్రీ ద్వారం నరసింగరావుగారు,—విజయరామ సంగీత కళాశాలాధ్యక్షులు తమ బృందముతోకూడ, అత్యంత మనోహరముగ, అసాధారణమగు రీతిని వాయులీన వాద్యమున శ్రోతల నానందపరచిరి. రాత్రి 10 గంటలకు శ్రీ భూదేవేరులతోకూడ శ్రీ స్వామివారి ఉత్సవరులను అలంకృతమగు రథముపై నధిష్ఠింపజేసి రథోత్సవము జరుపబడెను. అనంతరము కళ్యాణ మంటపమునందు శ్రీ స్వామివారి కళ్యాణ మహోత్సవము అత్యంత వైభవముతో జరుపబడెను. కళ్యాణ మహోత్సవమునకు ధర్మకర్తలగు శ్రీ విజయనగరం రాజావారి తరపున శ్రీ దివానుగారు స్వయముగ విచ్చేసి కళ్యాణ మహోత్సవమునందు పాల్గొనిరి.

ఉత్సవమునకు వలయు యేర్పాట్లన్నియు ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు శ్రీ డి. ఎల్. ఎన్. రాజుగారు తమ సిబ్బందితో కూడ నక్రమంగా నిర్వహించిరి. దేవాదాయ పరిపాలనాశాఖ అసిస్టెంటు కమిషనరు వారగు శ్రీ కృష్ణారెడ్డిగారు తమ సిబ్బందితోకూడ ఉత్సవమునందు పాల్గొని సర్వవిధముల సహకారము నొసర్చిరి.

**12-4-57** తేదీన శ్రీ కర్రి శ్రీరామమూర్తి శాస్త్రిగారి (విజయనగర మహారాజ సంస్కృత కళాశాలాధ్యక్షులు) అధ్యక్షతను పండిత సభ జరుపబడెను. పండితోపన్యాసముల అనంతరము పండితులకు ఉచిత రీతిగ సన్మానము చేయ బడెను—రాత్రి 7 గంటలు మొదలు 10 గంటలవరకు శ్రీ పెద్దింటి సూర్యనారాయణ దీక్షితర్‌గారిచే రమ్యముగ హరికథ చెప్పబడెను. పండిత పామరరంజకమగు వారి కథాశ్రవణమున శ్రోతలందరు ముగ్ధులైరి.



రథోత్సవము



కళ్యాణమంటపమునందు శ్రీ స్వామివారి కళ్యాణ మహోత్సవము.



శ్రీ ద్వారం నరసింగరావుగారి వాయులీన సంగీత కచేరి

# MUCHUKUNDA'S PRAYER TO SRI KRISHNA

(From Srimad Bhagavatam)

"Lord, deluded by thy Maya
People know thee not,
Nor do they worship thee,
But remain attached to this world,
The source of sorrow and suffering.

"Some renounce the pleasures of life
And practise austerities,
Hoping to find greater pleasure in their lives to come.
Thus attached to Karma and to fleeting things,
They never know the joy supreme.

"But when, O Lord, through thy grace
A wandering, restless mind perceives the evanescence of worldly pleasure,
And seeks the company of holy men,
Then in that sacred companionship
There comes to it abiding love for thee,
Thee who art the Lord of Love,
The supreme goal and final refuge of all.

"O thou compassionate One,
Through thy grace I have no yearning for enjoyment;
No consciousness have I of a personal self.
My sole desire is to serve thee:
I seek no other boon.

"O thou, Lord of all free souls,
Thou art the giver of freedom
What fool finding thee would ask of thee aught
Save attainment of thy being and of thy freeedom?
O thou, the pure, without attributes, without form,
Supreme Brahman, the One without a second,
Renouncing all, I take refuge in thee.

"O thou, the refuge of all,
Long have I suffered from unquenchable desires;
Many a life have I wandered from birth to death,
And from death to birth.
Of peace have I found none;

Therefore do I take shelter at thy Lotus Feet.
Those who seek refuge in thee
Become free from fear, free from grief;
Verily they attain the Truth.
O Lord of the universe, I seek thy freeedom!"

*(With the kind courtesy of Sri Ramakrishna Math)*

# ANDHRA ARCHITECTURE

*By*

V. V. TONPE, M. A.

IV - APPRECIATING HINDU ARCHITECTURE.

Nothing is more natural to man than to admire what is good and great. Unfortunately, the first foreign admirers of India found that there was neither any thing good nor great in Indian art. (1) The fault did not lie in them nor in the art they tried to appreciate but in the approach they made to it. They saw at it through their European spectacles so that they not only felt that Indian art was unnatural but also bizarre. On looking at a photograph of the Java-Buddha exhibited at the Royal Society of Arts, Sir George Birdwood proclaimed it as "the senseless similitude, by its immemorial fixed pose, is nothing more than an uninspired brazen image, vacuously squinting down its nose to its thumbs, knees, and toes. A boiled suet pudding would serve equally well as a symbol of passionate purity and serenity of soul."

To sight another example, Prof. Westmacott, in his "Handbook of Sculpture"(2) observed that—

"There is no temptation to dwell at length on the sculpture of Hindustan. It affords no assistance in tracing the history of art, and its debased quality deprives it of all interest as a phase of Fine Art, the point of view from which it would have to be considered. It must be admitted, however, that the works existing have sufficient character to stamp their nationality, and although they possess no properties that can make them useful for the student, they offer very curious subjects of enquiry to the scholar and archaeologist. The sculptures found in various parts of India at Ellora, Elephanta, and other places are of a strictly symbolical or mythological character. They usually consist of monstrous combinations of human and brute forms, repulsive from their ugliness and outrageous defiance of rule and even possibility."

Such statements might be collected from many writers of authority on the history of Indian art, Europeans as well as Indians educated on European lines, old as well as modern. But on a dispassionate study of it it will be evident that these critics of Indian art were seriously engaged in judging it by something which was not inherent in it; they took the Grecian point of view as the standard of value in their judgment and there is no wonder they failed to get at the real value of Indian art, for these two values are almost diametrically opposite to each other.

It was not without a cause that these critics judged Indian art with Hellenic standards. They first recognized traits of Grecian art in the sculptures and architecture of Gandhara and were misled to believe that it was a faint immitation of the master minds of old Greece. They could not, because of their prejudiced minds, know that it was Graeco-Buddhist art of Gandhara, which was the comming-ling of the two schools of art, the Hindu and the Grecian.

Men like Havell, Dr. Coomaraswamy and Marshall applied new and correct stand-

1. References to art in this chapter include architecture.

2. Ed. 1864. P. 51

ards of judgment to it and tried their best to disperse clouds of misapprehension. They proved that Indian art was as persistent of its excellence and as powerful in rendering the soul and the mind of men as Egyptian or Greek art was, if not greater.

As the religion and the philosophy of the East and the West differed their arts too differred; they developed on their cultural sustenance and as we have seen already the culture of the West was engrained in reason and intellect while that of the East in spirituality. (1) Birdwood and his school tried to seek trends of Western art in Indian art and their disappintment at not finding them made them vituperate the very cannons of the art of the East. It was not political prejudice or biased view on art which they could not understand; it was not even intellectual antipathy to every thing Indian but it was a mere human error which could be forgiven. That is why as soon as the truth was known, the English mind corrected itself and tried to persue Indian art in its own light. But being completely alien to it, it found it rather difficult to educate itself to the perfection which was essential for appreciating it.

I would like to make it clear here that when I speak of the human error of the English, I am not blind to some English writers like Osbert Sitwell and William Archer who really meant what they said. In his Book, "Escape with Me", Mr Sitwell expressed that "the idea of India, despite its manifold and diverse marvels, continued to be repellent." Referring to Indian art he wrote of "that repulsive, greasy quality that so often mars Hindu works of art."

William Archer attacked Indian civilization and culture in all its domains, there by voicing the general attitude of the European mind of his days. Fortunately for us, Sri Aurobindo undertook to reply him in the "Arya—A Defence of Indian Culture" (1918-1921). Though this was left unfinished, it voiced the strong protest of the Indians as a counterblast to Archer's criticism of Indian culture.

Two instances of Archer's criticism and Sri Aurobindo's reply will suffice here to show the shallowness of the foreigners criticism and the depth and correct approach made by Sri Aurobindo, the champion of our culture. In his own words: "The Indian ideal figure of the masculine body insists on two feautures among many, a characteristic width at the shoulders and slenderness in the middle. Well, an objection to broadness of girth and largeness of belly—allowed only where they are appropriate as in sculptures of Ganesha or the Yakshas—is not peculiar to the Indian aesthetic sense; an emphasis on their opposites is surely intelligible enough as an aesthetic tradition, however some may prefer a more realistic and prosperous presentation of the human figure. But Indian poets and authorities on art have given in this connection the simile of the lion, and lo and behold Mr. Archer solemnly discoursing on this image as a plain proof that the Indian people were only just out of the semi-savage state! It is only too clear that they drew the ideal of heroic manhood from their native jungle, from theriolatry, that is to say, from a worship of wild beasts: I presume, on the same principle and width the same stupefying ingenuity he would find in Kamban's image of the sea for the colour and depth of Sita's eyes clear evidence of a still more primitive savagery and barbaric worship of

1. Vide: "Aradhana" Vol II. No 8. Aug. 1956 P. 192.

inanimate nature, or in Valmiki's description of his heroine's "eyes like wine" *madireksana*, evidence of a chronic inebriety and the semi-drunken inspiration of the Indian poetic mind."(1) This is one example of Archer's criticism.

The other is about the philosophy in Indian art:

"...The whole basis of Indian artistic creation, perfectly conscious and recognised in the canons, is directly spiritual and intuitive. Mr. Havell rightly lays stress on this essential distinction and speaks in passing of the infinite superiority of the method of direct perception over intellect, an assertion naturally offensive to the rationalistic mind, though it is now increasingly affirmed by leading western thinkers. Mr. Archer at once starts out to hack at it with a very blunt tomahawk. How does he deal with this crucial matter? In a way which misses the whole real point and has nothing whatever to do with the philosophy of art. He fastens on Mr. Havell's coupling of the master intuition of Buddha with the great intuition of Newton and objects to the parallel because the two discoveries deal with two different orders of knowledge, one scientific and physical, the other mental or psychic, spiritual or philosophic in nature. He trots out from its stable the old objection that Newton's intuition was only the last step in a long intellectual process, while according to this positive psychologist and philosophic critic the intuitions of Buddha and other Indian sages had no basis in any intellectual process of any kind or any verifiable experience. It is on the contrary the simple fact, well known to all who know anything of the subject, that the conclusions of Buddha and other Indian philosophers (I am not now speaking of the inspired thought of the Upanishads which was pure spiritual experience enlightened by intuition and gnosis,) were preceded by a very acute scrutiny of relevant psychological phenomena and a process of reasoning which, though certainly not rationalistic, was as rational as any other method of thinking. He clinches his refutation by the sage remark that these intuitions which he chooses to call fantasies contradict one another and therefore, it seems, to have no sort of value except their vain metaphysical subtlety. Are we to conclude that the patient study of phenomena, the scrupulous and rigidly verifiable intellectual reasonings and conclusions of Western scientists have led to no conflicting or contradictory results? One could never imagine at this rate that the science of heredity is torn by conflicting "fantasies" or that Newton's "fantasies" about space and gravitational effect on space are at this day in danger of being upset by Einstein's "fantasies" in the same field. It is a minor matter that Mr. Archer happens to be wrong in his idea of Buddha's intuition when he says that he would have rejected a certain Vedantic intuition, since Buddha neither accepted nor rejected, but simply refused at all to speculate on the supreme cause. His intuition was confined to the cause of sorrow and the impermanence of things and the release by extinction of ego, desire and *Sanskara*, and so far as he chose to go, his intuition of this extinction, Nirvana, and the Vedantic intuition of the supreme unity were the seeing of one truth of spiritual experience, seen no doubt from different angles of vision and couched in different intellectual forms, but with a common intuitive substance. The rest was foreign to Buddha's rigidly

1. "The Significance of Indian Art"—Sri Aurobindo. Pp 3-5.

practical purpose. All this leads us far afield from our subject, but our cirtic has a remarkably confused mind and to follow him is to be condemned to divagate." [1]

These controversies must have made good headlines in their times. But these do not make history; they are only the autumn-leaves and floating funguses that cover the surface of the stream. Now, from this distance of time, we can perceive the slow, impalpable currents work their way below the surface and penetrate to the depths. These deep and slow undercurrents make history. And when the sensational events have lost their news value, in perspective, to their true proportions, we come to learn the truth of history.

English rule in India proved that inspite of their Imperialistic administration of the country, they were not altogether antagonistic to us. That is the reason why without their intention they enriched our culture to a great extent. [2] Individuals and government, no doubt, tried to exploit Indian innocence and straightforwardness; but the human element in them did not fail to strike the cord of the human relations in the East. That again is the reason why, inspite of many misunderstandings and bickerings the East and the West have met. [3] They have almost realized that they cannot progress in isolation. "The rapid degradation of Asia is an evil portent for the future of Western social idealism of which the beginnings are already recognisable. If, either in ignorance or in contempt of Asia, constructive European thought omits to seek the co-operation of Eastern philosophers, there will come a time when Europe will not be able to fight industrialism, because this enemy will be entrenched in Asia....What has to be secured is the conscious co-operation of East and West for common ends, not the subjection of either to the other, nor their lasting estrangement."[4]

Thus we find that though in proximity of events what the English did in India was not only hostile but sometimes even humilating to us, from the point of view of the ultimate results of the encounter between civilizations the English rule in India was a wrong approach made to India but as time went on they realized their fault and finally even gave up their hold on the Empire, thereby recognising India as a Republic. The British policy in India can be, in the light of the present arguement, justified by the aphorism—To err is human. And by the same aphorism, India's attitude towards England can also be justified: India's culture and civilization have proclaimed her religious attitude to life in many words and ways. Does it not become a religious-minded nation to forgive her neighbours and distant friends if due to their shortsightedness they misunderstand her? History tells us again that India many times before forgave many countries and civilizations that made wrong approaches to her; as a result of which almost all that came to rule India left her not as life-long enemies but as intimated friends. They unconditionally acknowledged her moral supremacy and her spiritual superiority over themselves as a mark of honour unto themselves. Wherever they went, they carried a little bit of Indian culture with them and among their natives,

1. "The Significance of Indian Art"—Sri Aurobindo Pp. 5—8.
2. Vide: "Aradhana" Vol III No 1. Jan. 1957;
3. Vide: "do"
4. "The Dance of Shiva"—Ananda Coomaraswami.

who were strangers to it, they strove to popularize and adopt it to their advantage. In the time of Xerexes the Persians not only joined Indians in their armies but also improved their modes of warfare on Indian lines. Inspite of a Nadir Shah or two, the relations of India and Persia went strong until Persia could proudly present India with a Taj. (1) The Greeks and the Indians were friends even from the very dawn of civilization. They exchanged trade, improved art and shaped architcture to mutual advantage until they manifested themselves in the Gandharan - culture. (2) Buddhist missionaries and tourists like Fa-Hien, Hiuen-Tsang and I-Tsing carried Buddhism from India to China and made it one of the three forces that moulded their culture, the other two being Confucianism and Taoism. Taoism gave China its mystical trend; Confucianism developed the family pattern and social relationship ;but Buddhism with its philosophical and metaphysical framework gave it a spiritual quality which made the Chinese too a nation of nobelity: they cultivated elements of tenderness and compassion and delicacy of feeling in the face of recurring catastrophes; they became philosophically serene. History repeats itself: the English too shall enjoy the previlages of a century and odd contact with India.

Certain of the immediate influences are evident even in our own times: Indian philosophy has to a great extent tempered the scientific outlook of the English. They, as well as others, who belong to their school of thought have been forced to accept that ploitics does not mean scoundrelism. It need not always be the last resort of a scoundrel. Even a Mahatma can be a politician without becoming a scoundrel. It is one of the many walks of life that God has thrown open to man and therefore it is as noble as religion. The drawback is not in politics but in the politicians.

Indian philosophy has found its place in English literature. To sight only one example, "the Waste Land" of T. S. Eliot, the harbinger of 20th Century literature, ends with the resonance of Upanishadic philosophy,

> These fragments I have shored against my ruins
> Why then Ile fit you. Hieronymo's mad againe.
> Datta. Dayadhvam. Damyata.
> Shantih shantih shantih.

Even in Music, art, architecture and other cultural fields of English life Indian influence can be traced out. (3) And English influence on Indian culture is so predominant due to its bureaucratic and imperialistic nature that it is needless for us to trace it out.

It is too early to think of the remote and substanial influences of the English and the Indians on each other. Before one thinks of such a study one has to equip oneself with the fundamentals of the two arts. And to appreciate Indian art one must know some of the characteristics of it. In the next article we shall deal with them.

*(to be continued)*

---

1. Vide: "Aradhana" Vol II No 7. July. 1956.
2. Vide: "Aradhana" Vol II NO 8. Aug. 1956.
3. When we come to these subjects we shall deal with them in detail.

# TEMPLES - XXIII

*By*

YATHARTHAVADI

RAMAVATARA-DIVYAMANUSHA SAMBHAVA.
(7) "ONE WHOSE DEEDS MAKE HISTORY"
"चारित्रेण च को युक्तः ?"

After enumerating six characters starting from 'Gunavan' and ending with 'Drudha Vrata', Valmiki puts in a very pertinent question to Narada, before going further into other characters. He has practically exhausted in the previous six characters the absolute requisites for making Rama the Sarvalokasaranya (सर्व लोकशरण्य). There are many great men, who have been born on earth and who have disappeared with their deeds being remembered not for long. Sometimes they had come and gone unknown, unsung and unwept. They are, however, not any less for that. To leave an unforgettable record of one's deeds beneficial to all beings is rare. Rama's story is one such. His deeds do not depend upon history writers to be remembered. Even the books that have been written about his deeds might get destroyed, but the strong impressions left in the minds of every human soul can-not be erased by time or any other factor. It is handed down to posterity from man to man and every small act of goodness that man sees, he can-not but bring to his mind the deeds of Rama. Rama lived the life of a perfect human soul, while undergoing the effects of the bondage of Samsara. The principles he practised and the truths that he expressed by actual demonstration remain as an encyclopedia for reference for every human soul in this world. He never did propaganda or talked eloquently about the practice of morals. He demonstrated to the world that it is possible to live through all the turmoils of Samsara, at the same time remembering the mahavakya, 'अहं ब्रह्मास्मि'. (Aham Brahmaasmi). If anybody asks, if the Karmas laid down by the Vedas should necessarily be done, the only answer is Rama did them. The story of Ramayana takes care to tell us that Rama did Sandhyavandanas, that he did the japas, he practised the daily worship of the Devas, Dwijas, parents and Gurus, that he did the Vaidika karmas laid down by the Sastras carefully and so on, so that the Ramayana is more an enunciation of all the Karmas that have to be done as per the Sastras. Being a 'कांता सम्मिता' (Kanta Sammita), the text of Ramayana does not make any attempt to force the rules on us. It simply says that Rama did them and it is left for you to do them or not. In many forms God has come down on earth as Rishis and did enough hitopadesa through the Vedas, puranas and Smritis. But in Ramavatara, he took care to practice himself carefully what required to be advised to others by the Smritis. "जोषयेत्सर्व कर्माणि विद्वान्युक्तः समाचरेत्" is the Gita Vakya that has come out from the mouth of God in his Krishnavatara, after actually demonstrating the tenet in his Ramavatara. A survey of the various avatars of God would reveal that each avatara was with a set purpose of destroying some Asura or other and establishing some truths. But, the full meaning of the Gita sloka, "परित्राणाय साधूनां..." has been put into perfect action in every detail in Ramavatara. In the Taittiriyopanishad (तैत्तिरीयोपनिषद्) the teacher tells the student in his convocation address "यथा ते कर्म-

विचिकित्सा वा वृत्तविचिकित्सा वा स्यात्। ये तत्र ब्राह्मणाः संमर्शिनः। युक्ता आयुक्ताः। अलूक्षा धर्म कामास्युः। यथा ते तत्र वर्तेरन्। तथा तत्र वर्तेथाः "— that, "If you have any doubt about the observance of Vrutta (वृत्त) or karma (कर्म), which could not be answered by your study of Vedas, don't worry. Follow the paths shown by the Brahmanas who are characterised by अलूक्षत्व i.e., (not harsh) soft-heartedness or Daya (दय) and whose only desire in life is to establish Dharma. You live where they live. You do as they do." This advice is also in accordance with the Bhagavat Gita Sloka, "एवं ज्ञात्वा कृतं कर्म पूर्वैरपि मुमुक्षुभिः। कुरु कर्मैव तस्मात्त्वं पूर्वैः पूर्वतरं कृतं॥"— "knowing fully the lines of action shown by our fore-fathers, who lived with the only desire of getting relief from the bondage of Samsara(i.e., the Rishis), you do karma in the same way as was done by your ancestors and theirs in turn. And this is what is called 'Sanatana Dharma' (सनातनधर्म). God came on earth as Rama to establish and mark out the full details of practice of this Sanatana Dharma. Hence Ramayana had come to stay as a practical illustration of the various tenets of the Vedas, the truths of which cannot be understood easily by all. It would look as though that Sri Maha-Vishnu planned, programmed and enacted the story of Ramayana, with his consort, Maha Lakshmi and all the Devas in various forms of monkeys, which is only a practicable edition of the tenets of the Vedas. What all is to be taught to a human being for the attainment of his perfection is contained in the Ramayana and Rama, remaining and behaving like a mortal individual, proved to the world that every detail of the Vedas is workable. Thus Ramayana is not a story emanating from the fertile imagination of a poet nor is it the history of a king of the Ikshavaku Vamsa. It is shown in the Ramayana itself that the various acts of the Ramayana were all revealed to Valmiki by Brahma himself and Saraswati gave the capacity of poetry to him and had the Vedas rewritten in the form of Ramacharita through the medium of Valmiki. The Ramayana was taught to Kusa and Lava and Rama heard it in his Court. Thus starting with a plan and programme from Mahavishnu, propagated by Brahma, Saraswati and Narada, written by Valmiki, enacted by Mahavishnu and all the Devas as avatara rupis (अवताररूपी), sung by Kusa and Lava, approved by all the great Maharshis and Devarshis and finally having obtained the seal of Rama himself for the veracity of the statements contained therein, Ramayana is as great and beautiful as avatar of the Vedas as Ramavatara of Mahavishnu and keeping all this in mind the pertinency of Valmiki's question 'चारित्रेण च को युक्तः?' (Charitrena Cha Ko Yukthaha) could be easily appreciated.

The story of Ramayana is the story of every human soul. It is going on forever. It is for each individual to find out for himself at what stage of the story one is. An empherical formula for the story of Ramayana as it runs in every human body is depicted below, in the form of 'Yoga Ramayana'

The heart is Ayodhya. There the Paramatma (Rama) resides. The Guru, Viswamitra appears in the heart, takes Rama to Mithila, through the Tatakavana. Mithila is 'Manipuraka'. There resides the Chit Shakti (चित्शक्ति) Sita. The pathway between the heart (Anahata Chakra) and the nevel i.e., the manipuraka, is cleared by Viswamitra with the help of Rama. Rama in the heart represents the first Charana of the Gayatri 'तत्सवितुर्वरेण्यं'. Sita in Mithila or the Chit-Shakti in the manipuraka, represents the second

Charana of the Gayatri 'भार्गोदेवस्य धीमहि'. Viswamitra represents the Guru indicated by the third Charana of the Gayatri 'धियो यो नः प्रचोदयात्'. Thus the three charanas of the Gayatri are expanded in the story of the Balakanda of the Ramayana with Rama in Ayodhya being taken to Mithila and uniting him with Sita and reestablishing Rama and Sita in Ayodhya again. The various details of the story enumerated in the Balakanda, will fit-in perfect sequence with the Yogic history of a human being in understanding the Paramatma Chitshakti and the Guru. This is the first part of Yoga and it is also the first part of the Ramayana. The second part starts in trying to perceive the immortality of the soul and realising the same with the help of the mind. The mind, however powerful it may be, fails to achieve it, because it is beyond the powers of the mind. Dasaratha represents the mind and his attempt and failure to achieve Rama Pattabhishekam illustrates the above truth. What could not be achieved by Dasaratha, was achieved by Bharata, after undergoing certain purification ceremonies. Bharata saw Rama on the throne, but only after undergoing a Tapas for fourteen years, along with an Upasana of Rama-paduka.

The Aranyakanda begins with the entry of Rama, Sita and Lakshmana into the Dandakavana. This represents in yoga the entry of Paramatma (Rama), Chitshakti (Sita) now representing the Jiva and the Adisesha (Lakshmana) representing Kundalini Shakti, at the Mooladhara (मूलाधार) into the Veena Danda, (the spinal column starting with the Mooladhara and leading to the Sahasrara (सहस्रार) in the head). Now. starts the fight between the Yogashakti and the Indriya Vruttis. It may be mentioned here that the Veena-Danda is composed of the Sushumna Nadi (सुषुम्ना नाडी), which runs from the Mooladhara (मूलाधार) straight to the Sahasrara. On either side of this Sushumna nadi run the two Nadis (the solar and the lunar) Ida (इडा) and Pingala (पिंगल). They run parallel to the Sushumna throughout, but crossing each other in three places, one in the neck region, another opposite to the heart and the third opposite to the Nabhi. This crossing of the Nadis brings about three Grandhis (ग्रन्थी), opposite to the neck is Lobha (लोभ), the one opposite to the heart is Kama (काम) and the third opposite to the Nabhi or novel being Krodha (क्रोध). The travelling of the Atma Shakti with jiva and Kundalinishaktis causes the detruction of the three Grandhis. The Krodha grandhi corresponds to the fourteen thousand Rakshasas headed by Khara and Dushana. These are destroyed by the Atmashakti, that is, by Rama. The second grandhi i.e., the Kama grandhi is represented by the golden deer, Maricha and its destruction is brought about by Rama. The third grandhi i.e., the Lobha, represented by Vali, who is finally destroyed by Rama. So far is one part of the yoga. During the sojourn of the jiva with the Paramatma and kundali, which is always in jagrath condition, the jiva i.e., Sita, becomes a captive to the Mahamoha (Ravana) and is carried away by him and placed safely in Lanka, i.e, the head. Now, starts the search for the jiva by the Paramatma. The Kishkindhakanda represents the liberation of the mind (Sugriva) from the eternal threats of Ahamkara (Vali) and its union with Buddhi (Tara) and Chittam (Ruma) and its activity turned towards service to God i.e., service to Rama. From now onwards the Manasshakti (मनश्शक्ति) and the Pranashakti (प्राणशक्ति) also join the Kundalini Shakti in serving the Paramatma. The Pranashakti is represented by Hanu-

man and his crossing the ocean and entry into Lanka is a part of Khechari Yoga, whereby all the Shaktis of the Yogi get transferred to the head.

"मूर्ध्नि आधाय आत्मन: प्राणं आस्थितो योग धारणां..."
*(Bhagavat Gita Chapter VIII Sloka 12)*

This divine Prana Shakti (Hanuman) now becomes capable of destroying the forces of the Dasendriyas (दशेन्द्रिय) (the Lanka of Ravana). It is at this stage that the Yogi is able to realise that the Jiva and Paramatma, which are two separate things are in reality counter parts of the same Tatva.

"तुल्य शील वयो वृत्तां तुल्याऽभिजनभाषितां ।
राघवोऽर्हति वैदेहीं तं चेयमसितेक्षणा ॥"
*(Sundara Kanda)*

That is how Hanuman found Sita, an exact counterpart of Rama, in Lanka. The two Tatwas, apparently separate, are in reality one. The last part is the Yuddhakanda, where the Yogic force (Monkeys) fight against the Indriya Vrittis (Rakshasas). Ravana, (the Mahamoha) and Indrajit, (the Aviveka) are destroyed respectively by Rama and Lakshmana, and the Viveka (Vibheeshana) is made king of Lanka. The same is also shown in the Yogasutras as 'विवेक निम्नं कैवल्य प्राग्भारं'. Now the Baddha Jiva represented by Sita in the Asokavana is freed and made to unite with the Paramatma. The last part of Yuddhakanda illustrates the return of the Jiva from the Sahasrara to the heart passing through the Ajna Chakra (आज्ञा चक्र). The Ajnachakra is in between the two brows in the lalata (ललाट) just in the same place, where the third eye, the eye of fire, is placed. The Agni Parisuddhi (अग्नि परिशुद्धि) of Sita is only a representation of the Jiva passing through the eye of fire to the abode of God (the heart). Now comes the final summation of all the Shaktis under the control of Paramatma, with an absolute annihilation of all the Indriya Vrittis. This is the Moksha (मोक्ष) as conceived by the Yogis and the starting of the Paramatma from the heart (Ayodhya) and coming back to the same place through the courses indicated above, makes a complete circuit and this current is incessently running in every human body and that is the story of Rama. A realisation of this Yogic Ramayana in relation to the details of the drama of Valmiki Ramayana enacted by Lord Mahavishnu and his consort, in the Ramavatara, would help to realise the great truth of the mahavakya 'अहं ब्रह्माऽस्मि'. Rama's life is every individual's life. Do as he did and follow his foot-steps through the circuit in your body, till the Pattabhishekam is achieved. This will, however, help you to be with Rama at all times. There is no greater objective in life. Read the Ramayana thoroughly and search for your own place in it.

*(To be continued)*

*Author's note*:—The details of Yoga have not been touched for fear of exercising the readers' minds too much. Those who are interested can easily learn the details from their nearest Gurus or those who are well-versed in it.

శ్రోతయు, నాగస్వరమును వినగోరువారికి సన్నాయి నాదమై వినబడుచుండెడిదట. మరియు నిన్నటి రోజున వినబడిన పాతమునకు ప్రక్రమభంగము లేకుండా, తరువాత గ్రంధము వినఁబడుట మహచ్చిత్రము. ఇందును యెవరిపాతముయొక్క మిగిలిన అనుబంధ గ్రంధము వారికే వినఁబడుట స్వామియొక్క అనంతత్వమును భక్త వాత్సల్యమును చాటుచున్నవి. ఇట్లు స్వామివారియొద్ద సంగీతమును విని నేర్చుకొనిన పరమభక్తు లప్పుడుండెడి వారని లోకల్ రికార్డ్సు (Local Records) బందరు కైఫీయతులోఁ గలదు. అట్టి మహత్తరమైన క్షేత్రము కను కనే, కీర్తిశేషులైన కిళాంబి రామానుజాచార్యులు, బుర్రా రాఘవాచార్యులు మున్నగు వారును జన్మించిరి. నేటికిని వారణాసి బ్రహ్మయ్య శాస్త్రిగారు, సుసర్ల నరసింహశాస్త్రి గారు, దాలిపర్తి పిచ్చిహరిగారు, దాలిపర్తి సూర్యనారాయణ గారు నాట్యకళాపాకశాసన "శ్రీమాన్ సర్" (Sriman Sir) అను అనుమకొండ వెంకట్రామయ్యగారి పంటి విద్వత్ప్రకాండులును దశిక పార్వతీదేవిగారు, నబ్బీసు మాలతీదేవిగారు, మరంగంటి రంగమణిగారు, అన్నావఝుల శారదాంబగారు, సుమతీదేవిగారు, మొదలగు మహిళామ తల్లులును అపరసరస్వతీ స్వరూపులై యలరారుచుండిరి.

## గిరిధరదాసు - బాగీరథీబాయి

బలరామభక్తుని తరువాత స్వామికి ధూపదీపనైవేద్య ములు జరుపువారు లేక యాగిపోయినవి. ఇట్లు కొంత కాలము జరిగినతరువాత యిప్పటికి సుమారు 300 సంవ త్సరముల క్రిందట శ్రీస్వామి తన కంతరంగభక్తుడైన, గుజ రాతుదేశముననున్న గిరిధరదాసను గుజరాతీగృహస్థునకు స్వప్నమున కనపడి తనకాలయాదులు లేవనియు, పూజలు నల్పుటాగిపోయినదనియు 'నీవు బందరువచ్చి జీర్ణోద్ధర ణముఁ గావింపు'మని శాసించిరట. అందువలన నా పరమ భక్తుఁడగు గిరిధరదాసును, ఆయన భార్య భాగీరథి బాయమ్మయు వచ్చి స్వామినిఁగాంచి యిప్పుడున్న దేవా లయప్రాకారాదులను నిర్మించి గోపాలోపాసకులును, మహ విద్వాంసులునగు దీవి వెంకటాచార్యులవారను వైఖానస శాఖీయులను రావించి వారిచే ప్రతిష్ఠజేయించి, వారినే అర్చకులుగా కూడ యుంచి పూజాదికములు చేయించు చుండిరి. నేటికిని వారివంశీకులే అర్చకులుగా నుండిరి. ఉత్సవాదులు వైఖానసభగవచ్ఛాస్త్రప్రకారమే జరుపఁబడు చున్నవి. ఆ గిరిధరదాసు వళంద (Dutch) వారితోఁ గలసి విదేశవ్యాపారమునుఁ జేసి గోపాలదేవుని కరుణచే మహదైశ్వర్యవంతుడయ్యెను. వారి కోటయుండుతావునే, నేడు గొడుగుపేటలో "కోఠీ"యని పిలుచుచున్నారు.



శ్రీ ఆంజనేయస్వామి - బలరామునిపేట

అతని యైశ్వర్యము స్వదేశసంస్థానములకుకూడ అప్పు యివ్వజాలినంత యుండెడిదట.

## గురజ జమీందారు - భూదానము

తరువాత స్వామిమహిమను విని శ్రీయుతులు గురజ జమీందారుగారు స్వామికి భూవసతి యేమియు లేదని తెలుసుకుని గుడివాడ తాలూకా డోకిపర్రు గ్రామంలో ఎను బది యకరముల సుక్షేత్రమును భూదాన మొసంగిరి. ఇది చాలా ఫలవంతమైన భూమి. స్వామికి చక్కని ఆదా యము వచ్చుచున్నది.

## విగ్రహములు - ఉత్సవములు

శ్రీస్వామివారి మూలవరులు (ధ్రువబింబము) యెప్పు డెవరివలన నిర్మింపబడినదో తెలియరాదు. కాని దివ్య సుందరమూర్తి. లావణ్యచక్రవర్తి. (ఆరాధన సంపుటము III సంచిక 3 యందు ప్రకటింపబడిన ముఖచిత్రముఁ జూడుడు) స్వామి కిరుపార్శ్వముల రుక్మిణీసత్యభామలుఁ గలరు. ఇచ్చట ధృవోత్సవ కౌతుకస్నపనబలిబేరములు కలవు. ఇవియు సుందరతరములైనవే. గరుడ, హను

మంత, గజ, సింహ హంసవాహనములు యిత్తడివి కలవు. స్వామివారికి సర్వాంగరజతకవచమును ఫాలభాగమున వజ్రములు పొదిగిన వడపులోర్ధ్వపుండ్రమునుఁ గలవు. ఆ నవమోహనాంగుని దివ్యమంగళవిగ్రహమును చూచిన కొలది తనివి తీరక యుండును.

## సత్యభామా సంవాదము - ఛత్రపురి జావళీలు

సీ॥ రాజు సత్రాజిత్తు - రంగుకూతురువయ్యు
పెనిమిటి విడిచిన - పేరుఁ గలదె?
యెశోదతనయుని - నెడబాటుఁ జేసిన
వన్నెవాసియు నీకు - వచ్చునటవె?
నల్లని వాడని - నను నీవు పలికిన
నగుబాటు గాదటే - నళిననేత్రి
గొల్లవాడని నన్ను - కోమలి పిలిచిన
చులకనఁ గాదటే వో - సుందరాంగి

గీ॥ యెంత పాపంబుఁ జేస్తినే - యిందువదన
నిలచి నేనుండఁ గలనటే - నీరజాక్షి
రత్నముల మూట యిల బల-రాముపేట
బాలగోపాలుఁడందురే భామ నన్ను॥

సీ॥ ఇంటి బయటనుంచి - యెంచుట పని కాదు
నీటుగా తిరుగుట - నీకుఁదగును
నీ తోటి పపళింప - నీతి లేదే నాకు
నీతి లేక తిరుగ - నీకె తగును
నరసంబు లాడంగ - నవతు లున్నారు లే
నా తోటి పని యేమి? నళిననయన
ఇంటి భార్యను మాని - యింతులఁ జేరంగ
మర్యాద కాబోలు - మగల కెపుడు.

గీ॥ వద్దు వద్దుర నా తోటి - వాదమేల
రాను చాలుర పోర నా-రాధఁ జేర
రత్నముల మూట యిల బల - రాముపేట
బాలగోపాల రాధికా - ప్రాణలోల.

సీ॥ పెనిమిటి తాచాల - పేద వాడైనను
ముసలి వాడైనను - మూర్ఖుడైన
రంకువాడైనను - రవ్వవాడైనను
తెలివి చాలగలేని - దేబెయైన
బలహీనుడైనను - పాప కర్ముఁడునైన
కుంటివాడైనను - గ్రుడ్డియైన
కళలేని వాడైన - కలహ కారైనను
భంగుడైనను మాన - భంగుఁడైన

గీ॥ భర్తయే దైవమని యెంచు - భామ భామ
అత్తకొడుకని నీ కింత - యలుక దేల?
రత్నముల మూట యిలబల - రాముపేట
బాలగోపాలు డందురే - భామ నన్ను॥

సీ॥ పేదవాడవ? నీవు పేర్మితో శ్రీ లక్ష్మి
వక్షస్థలంబున - వాన ముండ
కళలేని వాడవా? కాంతలఁ గూడంగ
చతురతఁ జూపించు - జాణవౌర।
కుంటివాడవ? నీవు - కుబ్జనుఁ జేకొని
సుందరాంగినిఁ జేయు - సొగసు కలదె?
ముసలివాడవ నీవు - మోహంబు పదియారు
వేలభామలఁజేరి - వేడఁగలవె?

గీ॥ నరనకత్తెలఁ గూడియు - సరసమాడ
భళిరనేనింక భువిపైన - బ్రతుక నేల?
రత్నముల మూట యిలబల రాముపేట
బాలగోపాల! రాధికా ప్రాణలోల॥

ఇట్టి రసవత్తరములైన పద్యములను అరువది నాల్గింటి నీ కవి రచించెను. మకుటము రత్న మకుటమే. ఇందు విప్రలంభ శృంగారము బంగారమువలె వర్ణింపఁబడినది గాని పచ్చి బూతుల బుంగవలెనున్నది. నాయిక కలహాంతరిత, కవి నిందాస్తుతి యొనర్చెను. తన అసుభవము నంతయు వర్ణించినట్లు కనఁబడుచున్నది. కవి పేరెవ్వరో? యేకాలపువాడో తెలియదు—ఛత్రపురి జావళీలనునవి యీ గోపాలునిమీదనే అంకితములయ్యెను. ఈ పదములు-మొవ్వ గోపాల పదములకే మాత్రమును తీసిపోవు. పూర్వమీ పదములను వారకాంతలు ప్రసిద్ధముగ నభినయించెడి వారు. అందున్న వన్నియు రత్నములే, "రమణీమణి నా స్వామిని తేవే" అను ప్రసిద్ధపద మీ ఛత్రపురి జావళీల లోనిదే. గొడుగు పేటకే, "ఛత్రపుర" మని కవి పేర్కొనెను. ఈ కవి పేరును తెలియుటలేదు. ఈ పుస్తక ప్రతులును నేడు దొరుకుట లేదు.

## సీతారామాలయము - శ్రీ ఆంజనేయాలయము

శ్రీస్వామివారి ముఖమండపములో దక్షిణపార్శ్వమున సీతారామాలయమును శ్రీవల్లమన్నాటి నారాయణమూర్తి గారును, శ్రీ ఆంజనేయాలయమును భట్లపెనుమర్తి ప్రకాశ రావుగారును కట్టించి ప్రతిష్ఠించిరి. వాటి నిర్వహణమును నేటికిని వారే చూచుకొనుచుండిరి.

## శ్రీ సర్వాసూర్యనారాయణగారు-ప్రస్తుతపు ధర్మకర్త

ఈ దేవాలయమునకు హెచ్చు ఆదాయము రాకగి యున్నను దానిని రాబట్టకయు, వచ్చినసొమ్మును సక్రమ

ముగా వినియోగింపఁబడనందువను, H. R. and C. E. బోర్డువారు స్కీముచేసి ఆస్తికులును, ఆర్షాచారపరాయణులును, భక్తశిఖామణులును సుప్రసిద్ధన్యాయవాదులునగు శ్రీ నర్వాసూర్యనారాయణ పంతులుగారిని ట్రస్టీగా నియమించిరి. వీరు పరిపాలనకు వచ్చినతరువాత నీ దేవాలయముముందు సింహద్వారమును కొట్లును కట్టించిరి. ఆలయమంతయు కడప రాయి పరిపించిరి. ఆలయమంటపాదులన్నియు జీర్ణోద్ధరణమునుఁ గావించిరి. ధ్వజస్తంభమునకు యిత్తడిరేకు తొడుగువేయించిరి. పైన పేర్కొన్న కొన్నివాహనములను, స్వామికి రజతస్వర్ణకవచాదులనుఁ జేయించిరి. ఆదాయమును నెంతయో అభివృద్ధికిందెచ్చిరి. ఆలయమున నిత్యము గొప్పపండితులను రావించి పురాణకాలక్షేపమో, ఉపన్యాసములనో యిప్పించుచు వారికి నన్మానముల నొనంగి గౌరవించుచుండిరి.

నిత్యము స్వామి సన్నిధిని వేదపారాయణ, మంగళవాయిద్యములు, భజనకాలక్షేపములను చేయించుచూ భక్తిప్రపత్తుల నభివృద్ధిపరచుట కెంతయో పాటుపడుచుండిరి. వీరికి గోపాలదేవుఁడాయురారోగ్యైశ్వర్యముల నిచ్చి చిరకాలము మనుచుగాత. ఇట్టి సమర్థులగు ట్రస్టీలుయున్ననే ఆలయములు పునరుద్ధరింపబడి ఆకర్షణీయములై అపవర్గప్రదములగును. ఇట్లే ఖాజిల్లిపేట నాగేశ్వరస్వామివారి దేవాలయమును శ్రీయుతులు అవటపల్లి హనుమంతరావు పంతులుగారును, కన్యకాపరమేశ్వరి నగరేశ్వరదేవాలయములను ఆర్యవైశ్యశ్రేష్ఠులగు శ్రీయుతులు మోటమఱ్ఱి లక్ష్మీనారాయణగారు, దయానిధిగారు మున్నగు పాలకవర్గమువారును నిరంతర కృషిసలిపి ఆలయముల నెంతయో అభివృద్ధికిం దెచ్చుచుండిరి. వీరు ఆయాదేవులనుగ్రహమున సిరిసంపదల తులతూగుదురు గాక!



ఉత్సవ మూర్తులు - బలరామునిపేట

# ఉత్సవములు - వ్రతములు

## (జ్యేష్ఠమాసము నందలివి)

జ్యేష్ఠ మాసమునందుకూడ త్రివిక్రమ ప్రీతికొరకు చందనము, వ్యజనము (విసనికఱ్ఱ) ఉదకుంభము - మొదలగు నవి వైశాఖమాసమునందువలెనే దాన మొసంగవలయునని శాస్త్రసమ్మతము.

**31-5-57** జ్యేష్ఠశుద్ధ ౨ విదియా శుక్రవారమున ప్రాచీన పద్ధతిచే మొదటి తేదీ రాత్రి కన్యయందు గురుప్రవేశ మనియు, అందుచే యీ దినమునందు కృష్ణా పుష్కరమనియు ప్రాచీన జ్యోతిష సిద్ధాంతము ననుసరించెడు విజయ నగరం పిడపర్తివారు తమ పంచాంగమునందుదహరించిరి.

**19-6-57** జ్యేష్ఠ బహుళ ౭ సప్తమీ బుధవారం కృష్ణాపుష్కరమని మరికొంతమంది దాక్షిణాత్యులు నిర్ణయించిరి.

**21-6-57** జ్యేష్ఠ బహుళ ౯ నవమీ శుక్రవారమున కృష్ణాపుష్కరము అరంభమని కృష్ణా, గుంటూరు మండ లములందలి జ్యోతిష్కులు నిర్ణయించినందునను అధికారికముగకూడ ఈ దినమే కృష్ణాపుష్కరమని ప్రకటింప బడినందు నను - పుష్కరకర్తవ్యమును - ఈ దినమునందే సామాన్యముగ యాచరింతురు.

పుష్కరమును గురించిన విశేష వివరములు పుష్కర ప్రత్యేకసంచికయగు తరువాతి సంచికయందు ప్రకటింప నుద్దేశముతో యిట వ్రాయబడలేదు.

**7-6-1957** జ్యేష్ఠ శుద్ధ ౧౦ దశమీ శుక్రవారము - ఈ దినమునందు "దశపాప హరా" వ్రతము నాచరించుట శాస్త్రసమ్మతము. ఈ దినమునందే గంగోత్పత్తియగుటచే గంగనుద్దేశించి యీ వ్రత మాచరింపబడును.

**8-6-1957** జ్యేష్ఠ శుద్ధ ౧౧ ఏకాదశీ శనివారము - నిర్జలైకాదశి - ఈ దినమునందుపవాస మొనర్చిన 24 ఏకాదశులందు ఉపవాసఫలము లభించునని పురాణప్రసిద్ధము.

**10-6-1957** జ్యేష్ఠ శుద్ధ ౧౩ త్రయోదశీ సోమవారం - నమ్మాళ్వార్ తిరునక్షత్రము - వైష్ణవాలయములందు జరుపబడును.

**11-6-1957** జ్యేష్ఠ శుద్ధ ౧౪ చతుర్దశీ మంగళవారము - వైష్ణవ శ్రీ నృసింహజయంతి.

**12-6-1957** జ్యేష్ఠ శుద్ధ ౧౫ పౌర్ణమీ బుధవారం - సావిత్రీ వ్రతము స్త్రీలచే సంపత్సౌభాగ్యముల కొరకాచరింప బడును. ఈ దినమునందుకూడ ఉదకుంభము - తిలపాత్ర - మొదలగు దానములు చేయనగును.

**14-6-1957** జ్యేష్ఠ బహుళ ౨ విదియా శుక్రవారము - మిథున సంక్రమణము.

**23-6-1957** జ్యేష్ఠ బహుళ ౧౧ ఏకాదశీ ఆదివారం - స్మార్త ఏకాదశీ.

**24-6-1957** జ్యేష్ఠ బహుళ ౧౨ ద్వాదశీ సోమవారం - మాధ్వ వైష్ణవ ఏకాదశీ.

**26-6-1957** జ్యేష్ఠ బహుళ ౧౪ చతుర్దశీ బుధవారం - మాసశివరాత్రి.

**27-6-1957** జ్యేష్ఠ బహుళ ౩౦ అమావాస్యా గురువారము - అమావాస్యా ప్రయుక్త కార్యము లాచరింప నగును. ఈ దినమునందు వటసావిత్రీ వ్రతము స్త్రీలచే సౌభాగ్య సంపదలకొరకు ఆచరింపబడును.

---

# తీర్థమహిమ

బులుసు - వేంకటరమణయ్య.

భారతదేశం పుణ్యస్థలాలకు పుట్టిల్లని అందరికీ తెలుసును. ప్రతీ స్థలమూ ఏదో ఒక మహిమ కలిగి వుంటుంది. కొన్ని క్షేత్రాలు నవీనంగా నిర్మింపబడినా, ఏదో ఒక మహత్తు దానికి అంటగట్టబడుతూనే వుంటుంది. కొన్నిచోట్ల స్థలం ముఖ్యం; కొన్నిచోట్ల దేవతకు ప్రాధాన్యం వుంటుంది. కొన్నిచోట్ల తీర్థం ప్రసిద్ధికెక్కివుంటుంది. దేవతకూ, స్థలానికీ, తీర్థానికీ—ఈ మూడింటికీ ప్రాధాన్యం వున్న క్షేత్రమే గొప్ప క్షేత్రంగా పేరుపడివుంటుంది. అట్టి సుప్రసిద్ధ క్షేత్రాల్లో పౌండరీకక్షేత్రం ఒకటి. అక్కడ వున్న పద్మతీర్థం తీర్థాలన్నిట్లోనూ చాలా గొప్పదనీ, గొప్ప మహిమ గలదనీ పేరు పడినది. ఈ తీర్థంలో స్నానంచేసినా, కొంచెం నీరు త్రాగినా పంచమహాపాతకాలవంటి ఘోరమైన పాపాలు కూడా పటాపంచలవుతాయి. ఈ తీర్థముయొక్క మహత్తును గురించి పాండురంగ మాహాత్మ్యంలో చక్కని వివరణం వున్నది. పద్మతీర్థం మహత్తును తెలుసుకోవడానికి సుశర్మ వృత్తాంతం ఎంతో ఉపయోగిస్తుంది.

సుశర్మ అనే పేరు చాలా చక్కగా వున్నది. కాని ఆ పేరుగలవాడు ఒక కిరాతుడు. మృగాలనూ, పక్షులనూ వేటాడడం అతని కులవృత్తి. కాని సుశర్మ ఆ మాత్రంతో తృప్తిపొందక దారులు కాచి, జనాన్ని చంపి వారి వస్తువాహనాలనూ, ధనధాన్యాదులనూ అపహరిస్తూ వుండేవాడు. పంచమహాపాతకాలూ అతనికి లెక్కలోనివేకావు. సుశర్మ పేరు వినేసరికి ఆ చుట్టుపక్కలవున్న జనం అంతా గడగడలాడేవారు. వాడికి పాపపుణ్య విచక్షణ కొంచెమన్నా లేదు. మంచి చెడ్డల వివేకమనేదే లేదు.

ఒకనాడు సుశర్మ తన అనుయాయులైన మరి నలుగురు కిరాతకులతోకూడా బయలుదేరి దారులు కాచాడు. కావలసిన ఆయుధాలన్నీ వాని దగ్గరనే ఉన్నాయి. అనుకున్నట్లుగానే జనంకూడా వీళ్లు కాచుకుని వున్న మార్గాన రావడం సంభవించింది. జనంకూడా కొంత బందోబస్తులో వుండడంవల్ల ఈ దొంగలకు సులభంగా లొంగడంలేదు. రెండు పక్షాలకూ కొంతసేపు పోరు. జరిగిన తర్వాతనే వారు లొంగిపోయారు. ఈ పోరాటంలో సుశర్మ అనుచరులకు గట్టి దెబ్బలు తగిలాయి. సుశర్మ బాగా అలిసిపోయాడు. చివరకు బాటసారులు లొంగిపోయినా—వాళ్లు మొదట చాలా చిక్కులు పెట్టడంవల్ల సుశర్మ వాళ్లను నిర్దాక్షిణ్యంగా చంపివేశాడు. బాగా అలసిపోవడంవల్ల అతనికి ఎక్కువ దప్పి కలిగింది. శరీరం బాగా చెమటపట్టింది. మంచి నీటికోసం వెతికివెతికి చివరకు పద్మతీర్థాన్ని చేరాడు.

నిర్మలమైన ఉదకంతో ఆ తీర్థం మిక్కిలి ఆకర్షకంగా ఉన్నది. సుశర్మ దాన్ని చూసి మిక్కిలి సంతోషించి, తన బడలిక పూర్తిగా పోయేటట్లు దానిలో స్నానంచేసి, చల్లని తీర్థాన్ని తనివితీరా తాగి, సేదతేరి తనదారిని పోయాడు. తర్వాతకూడా వాడు తనకలవాటయిన దోపిడులూ, హత్యలూ మొదలైనవి చేస్తూనే జీవితాన్ని గడపి కొంత కాలానికి మరణించాడు.

ఇతరులు చూడకుండా మనం ఏమి తప్పుచేసినా, వాటిని అంతగా లెక్కించము. ఇది మనుష్యులకు పరిపాటి. సుశర్మ - తాను గడించిన పాపంవల్ల ముందు ఎలాంటి గతి కలుగుతుందో అని ఒకప్పుడయినా ఆలోచించలేదు. కాని, ఎవరు ఏమాత్రపుపాపం చేసినా, వెంటనే అది చిత్రగుప్తుడి చిఠాకు ఎక్కిపోతూనేవుంటుంది. అలా ఎక్కకుండా చెయ్యడానికి ఎవ్వరికీ తరంకాదు. సుశర్మ చేసినన్ని పాపాలు భూలోకంలో మరెవ్వరూ చెయ్యనందున చిత్రగుప్తునికి యితనిపేరు బాగా జ్ఞప్తికి వస్తూవుంటుంది. చిత్రగుప్తుడికి ఎప్పుడూ ఇతనిమీద ఒక కన్ను వుండనే వుంటుంది. ఆయువు మూడి యెప్పుడు యితడు తన దగ్గరికి వస్తాడా, ఎప్పుడు వీని పని పడదామా—అని అతడు ఎదురు చూస్తూనేవున్నాడు.

సుశర్మ ఎన్ని పాపాలు చేసినా, అతడు పరమపవిత్రమైన పద్మతీర్థంలో స్నానంచేసి, ఆ తీర్థాంబువును త్రాగడంవల్ల—నలునిలో ప్రవేశించిన కర్కోటకవిషము కలి దోషాన్ని నశింపచేసినట్లుగా, ఆ జలం యీతని పాప సమూహాన్ని నశింపజేసినది. ఆ తీర్థసేవనవల్ల అతని ఆగామి పాపాలు కూడా నశించి, ప్రాణాలుపోయే సమయంలో ఎటువంటి పాపాలూ లేకుండా ఉండినాడు. అయినా, ప్రతీ ప్రాణీ—ప్రాణాలు పోయిన తర్వాత యమలోకంలోకి వెళ్లడం అనివార్యం కనుక - సుశర్మ యమలోకం చూడవలసివచ్చింది.

సుశర్మ రాకకై ఎదురు చూస్తూవున్న చిత్రగుప్తుడు—ఇతడు కనబడగానే తన చిఠా తీసి—ఇతని పాపాలు ఎన్నివేలున్నాయో, యమధర్మరాజుకు విన్నవిద్దామని నిశ్చయించుకున్నాడు. కాని, చిఠాలో పుటలు తిరగవేసి ఎంత చూచినా సుశర్మ పాపాలపద్దు కానరావడంలేదు. తాను వ్రాసిన పట్టిక తనకే కానరాకపోవడంవల్ల—అతనికి ఎంతో ఆశ్చర్యం కలిగింది. అతడు వెంటనే యమునిదగ్గరకు పోయి ఇలా అన్నాడు.

"ప్రభూ! నేడు మనలోకానికి వచ్చిన సుశర్మ అనే వ్యాధుడు చేసిన పాపాలు ఇన్ని - అన్నీ కావు. వాటి నన్ని

టినీ నేను నా చిఠాలో జాగ్రత్తగా వ్రాసివుంచాను. ఇప్పుడు చూతునా- ఆ పద్దు కానరావడం లేదు. సుశర్మ ఒక్క పాపం చేసినట్లుగా ఇప్పుడు సాక్ష్యం చూపలేము. ఇది ఎంతో ఆశ్చర్యంగా వుంది. దీనికి కారణం ఏమిటో తెలియకుండా వున్నది.''

చిత్రగుప్తుడు చేతులు జోడించుకొని వినయవిధేయతలతో యిలా చెప్పగా యమధర్మరాజుకూడా ఆశ్చర్యపడి "ఇది చాలా వింతగా వున్నదే! నీ దగ్గరనే సదా వుండే పద్దుపుస్తకంలో నీవు వ్రాసిన లిపి కానరాకపోడమేమిటి? ప్రతి పుటా జాగ్రత్తగా పరిశీలిస్తూ చూడు. కానరాక యేమవుతుంది?'' అని అన్నాడు. అప్పుడు చిత్రగుప్తుడు ప్రభుని ఆజ్ఞ ననుసరించి ప్రతిపుటనూ పరిశీలించిచూడ ప్రారంభించాడు. ఇదివరలో సుశర్మ పాపాలు వ్రాసియుండిన కడితం మీద అతనికి ఒక క్రొత్త వ్రాత కానవచ్చింది. అది తన దస్తూరీ కాదనీ, మరెవ్వరో వ్రాసి వుంటారనీ అతడు గ్రహించి జాగ్రత్తగా చదివాడు.

అందులో ఇలా వ్రాసివున్నది—''సుశర్మ అనే వ్యాధుడు చాలా క్రూరస్వభావుడై పంచమహాపాతకాలవంటి పాపాలను లెక్కలేనన్నింటిని చేశాడు. అంతేకాదు. వెనకటి జన్మలో కూడా అతడు చేసిన పాపాలు లెక్కలేనన్ని వున్నాయి. ఇలా పాపాలు చేసినా, యితడు ఒకసారి పద్మతీర్థంలో స్నానం చేసి, ఆ తీర్థోదకాన్ని త్రాగాడు. ఆ తీర్థసేవవల్ల యితడు యీ జన్మలో చేసిన పాపాలే కాకుండా వెనకటి జన్మలలో చేసిన పాపాలుకూడా సర్వమూ నశించాయి. ఇతని పద్దులో ఒక్క పాపమూ ఉండడానికి వీలులేదు.''

తర్వాత చిత్రగుప్తుడు యమునివద్దకువెళ్లి తన చిఠాలో యివిధంగా వ్రాతవున్నదనీ, దాన్ని యెవరు వ్రాశారో బోధపడడం లేదనీ మనవిచేశాడు. పద్మతీర్థంయొక్క మహత్తు యమునికి బాగా తెలియును. ఆ తీర్థం విష్ణువునకు మిక్కిలి అభిమానమైన తీర్థమనీ, ఆ దేవదేవుడు సదా అక్కడ నివసిస్తూ వుంటాడనీ, అక్కడ స్నానపానాలుచేసే వారి పాపాలు సమస్తమూ నశించడమే కాకుండా ఉత్తమ గతులుకూడా కలుగుతాయనీ యముడు ఎరుగును. చిత్రగుప్తుడు యీ సంగతి తెలియజెయ్యగానే అతడు పద్మతీర్థ ప్రభావాన్ని వివరిస్తూ - యిలాంటి వ్రాతను వ్రాసినవాడు దేవదేవుడైన విష్ణువే అయివుంటాడని తెలియజేశాడు.

ఆ తర్వాత యముడు సుశర్మ దగ్గరకుపోయి, అతని శరీరాన్ని నిమిరి బుజ్జగించి, చందన పుష్పమాలికా తాంబూలాదులతోను, నూతన వస్త్రాలతోను గౌరవించాడు. ఇంతలో అక్కడికి దేవలోకంనుంచి సపరివారంగా విమానం వచ్చినది. ఆ పరిచారకులు సేవిస్తూ వుండగా సుశర్మ దాని మీద కూర్చుండి స్వర్గలోకానికి వెళ్లిపోయెను. స్వర్గానికి రాగానే, ఇంద్రుడాతనికి యెదురుగావచ్చి గౌరవంతో తీసుకొనిపోయి తన ప్రక్కనే సింహాసనంమీద కూర్చుండ బెట్టుకొనెను. సుశర్మ అక్కడ కొంతకాలం వుండి యింద్ర భోగాలు అనుభవించెను. తదుపరి భూలోకంలో బ్రాహ్మణ వంశంలోపుట్టి పాండురంగ విఠలుని నగరంలోనే నివసిస్తూ, ఆ దేవదేవునే సేవిస్తూ వుండెను. దేవదేవుని నిలయాన్ని ఊడ్చి బాగుగా అలంకరించడం అతని నిత్యకృత్యం. ఈ విధంగా చేసిన భగవత్సేవకు ఫలితంగా మరుజన్మంలో అతడు సుకీర్తి అనే పేరుతో ఒక రాజై జన్మించాడు. సుకీర్తికి జన్మాంతరవాసనవల్ల భగవద్భక్తి అమితంగా వుండినది. ప్రతిదినమూ అతడు హరిపూజ తప్పక చేస్తూ వుండేవాడు. ప్రపంచ సుఖాలపైని అతనికి రోత కూడా కలిగింది. నిండు వయస్సులోనే అతడు సన్యసించి, భగవత్సాన్నిధ్యాన్ని పొందడానికి ఘోరంగా తపస్సు చెయ్య పూనుకున్నాడు.

ముక్కుమూసుకున్నవాళ్ల తపస్సును విఘ్నం చెయ్యడానికి ఇంద్రుడు ఏవిధంగా పూనుకుంటాడో, విరాగులను సరాగులనుగా మార్చడానికి మన్మథుడు సర్వవిధాలా ప్రయత్నంచేస్తూ వుంటాడు. అందువల్ల సుశర్మను.— అంటే- సుకీర్తిని వైరాగ్యంనుంచి తప్పించడానికి విశ్వప్రయత్నం చేశాడు. కాని అతని ఆయుధాలూ, బలగమూ సుకీర్తిని చలింపజేయలేకపోయాయి అందువల్ల మన్మథుడికి తనవారి మీదనే విపరీతంగా కోపం వచ్చింది. అతడు తన చెరకు వింటిని నిలువుగా విలిపించివేశాడు. శరాల వృద్ధిని అణచివేశాడు; తన వింటినారిగా వున్న తుమ్మెదలు అరుస్తూ వుండగా, నశింపజేశాడు. తనకు మూలబలమైన శుకపికాములను చెట్లకు కట్టించివేసెను. సేనాధిపతి అయిన మలయమారుతాన్ని కంచుకివశం చేసెను. సహచరుడైన వసంతుణ్ణి మండుటెండలో నిలబెట్టెను. హితుడైన చంద్రుడు శత్రుపక్షంలో చేరినవాడని భావించి తరిమివేశాడు. తనకు ధ్వజమైన మీనాన్ని బురదలో తోయించివేశాడు. న్యాయంగాచూస్తే వీని తప్పేమీలేదు. తమ ప్రభువు శత్రువుకు ఓడిపోవాలంటూ వీరెవ్వరూ కోరినారు గనకనా? తనకు చేతకాకపోతే- వీళ్ళేమి చెయ్యగలరు? లోకంలో యజమానికి కష్టం కలిగిందంటే—అతని సేవకుల దురదృష్టమే దాని కారణం! అతడికి సుఖం కలిగితే వీళ్లకి సుఖం కలగకపోయినా—కష్టం కలిగితే మాత్రం సేవకులకుకూడా కష్టం కలిగితీరుతుంది.

సుశర్మ యీ విధంగా నిశ్చలమైన నిష్ఠతో భగవంతుణ్ణి ధ్యానంచేస్తూ కొంతకాలానికి ఆ పరాత్పరునిలో ఐక్యాన్ని పొందాడు. లెక్కలేని పాపాలుచేసిన ఆ కిరాతుడు ఈ రీతిగా మోక్షాన్ని చూరగొనడానికి ఆ పద్మ తీర్థంలో స్నానపానాలు తప్ప మరోకారణం లేదు. ఆ తీర్థంయొక్క మహిమ అట్టిది. పద్మతీర్థంలో స్నానపానాలు చేసేవారికి సమస్త పాపాలూ నశించడమే కాకుండా దివ్యమైన జ్ఞానం కలుగుతుంది. దానివల్ల మోక్షమూ కలుగుతుంది.

# భారతీయ ధర్మము _ X

"కాశ్యప"

జీవుల యధర్మ ప్రవృత్తికి రాగద్వేషములు మూల కారణములు. రాగద్వేషముల కతీతుడైయుండువాడు భగవదనుగ్రహపాత్రుడు.

ఇన్ద్రియస్యేన్ద్రియస్యార్థే రాగద్వేషౌ వ్యవస్థితౌ।
తయోర్న వశమాగచ్ఛేత్ తౌ హ్యస్య పరిపన్థినౌ ॥

జీవుల నాయా కార్యములయందు బ్రవర్తింపజేయు శక్తి రాగద్వేషములకు గలదు. రాగద్వేషోత్పత్తిని వారించుట మిగుల కష్టము. అధర్మ సంస్కారముపలన పరధర్మాచరణమునందు రాగ ముదయించును. స్వధర్మాచరణమునందు ద్వేషము జనించును. అనుకూల చిత్తవృత్తి రాగము. ప్రతికూలచిత్తవృత్తి ద్వేషము. రాగద్వేషములు శ్రేయోమార్గములకు ప్రతిబంధకములు. చోరులవలె వేటకాండ్రవలె అవి నమ్మించి మోసగించును. రాగద్వేషముల నతిక్రమింపవలెనన్న- శాంతి వైరాగ్యములను, విమర్శన జ్ఞానమును సంపాదించుకొనవలెను.

ఒకరినిజూచిన నిర్నిమిత్తముగ రాగము గలుగును. ఒకరినిగాంచిన హేతురహితముగ ద్వేష మంకురించును. ఆ రాగద్వేషములకు ప్రత్యక్షకారణము గోచరింపకపోయినను, స్వీయసంస్కారమున వానికి బీజములు పరోక్షముగ నిక్షిప్తములయి యుండును. మనకు దెలియనంత మాత్రమున కార్యకారణ సంబంధము లేదన జెల్లదు. బీజరూపమున ప్రత్యక్షముగ పత్ర పుష్ప ఫలాదులు కనుపట్టకపోయినను, ఆ పత్రపుష్ప ఫలాదులకు బీజము కారణమని నమ్ముచున్నాము. అవిధముగనే బీజాకారముననున్న సంస్కారమునందు సుఖదుఃఖ రాగద్వేష స్వరూపమును గమనింపలేకపోవుచున్నాము. ఒకవస్తువునుగాని యొక వ్యక్తినిగాని మనము ప్రేమించుచున్నచో నది తెలియరాని మన పూర్వకృత్యమును ప్రేమించుట యగును. అటులనే మనము ద్వేషించుచో మన పూర్వ కర్మములను అబుద్ధిపూర్వకముగ ద్వేషించుట యగును. తత్తన్నిష్ఠములైన గుణదోషములు మన రాగద్వేషములకు కారణము లనుటకంటె మన సంస్కార గుణదోషములే ఆ రాగద్వేషములకుకారణమనుట నమంజనము. పరిశీలించినచో ఒకని గుణములు ఎల్లరకు ననురాగస్థానము లగుట లేదు. ఒకని దోషములు ద్వేషస్థానములు నగుటలేదు. సుగుణములకు పుట్టినిల్లైన ప్రహ్లాదుని, అతనితండ్రి హిరణ్యకశిపుడు ఆ సుగుణములనే పురస్కరించుకొని ద్వేషించెను. ఆ ద్వేషమునకు కారణము హిరణ్యకశిపుని యధర్మ సంస్కారమే కదా! చోరులు చోరులను గౌరవింతురు. చౌర్యము దోషమేయైనను చోరులకు నభిమానస్థానమే యగుచున్నది.

కారణము గానిదానిని కారణమని భ్రమించి మెలగుట యవివేకము. అతర్కితమయిన శుభమును దెల్పు నుత్తరముదెచ్చు వార్తాహరుని సత్కరించుచున్నాము. ఆ శుభమునకును ఉత్తరము దెచ్చినవానికిని సంబంధములేదు. అటులే అశుభవార్త గొనిదెచ్చినవారిని నిందించుటయు ద్వేషించుటయు సంభవించుచున్నది. వార్తాహరులు శుభాశుభ ఫలములకు కారకులు కారు గదా! విషయ విమర్శనము గావించినచో మన రాగద్వేషములకు మూలకారణము మన సంస్కారముననే కనవచ్చును.

ధనధాన్యంబుల భోగభాగ్యముల భద్రత్వాధిపత్యంబులన్।
మనసైపమ్మము దైవమేర్పఱచి యన్యాయంబు గావించెనం।
చనగాజెల్లునె? వైద్యుడామయగుణంబావ్యంత మీక్షించియుం।
తనగూర్చున్ మధురామ్లతిక్తకటు పథ్యంబుల్ హితాకాంక్షియై ॥

తీయని మందిచ్చు వైద్యుడు గౌరవ భాజనుడగుచున్నాడు. చేదు మందిడువాడు నిందాస్పదుడగుచున్నాడు. రోగిహితము గోరియే వైద్యుడొక్కయెడ తీయని మందిచ్చుటయు, మఱొక్కయెడ చేదుమందొసంగుటయు సంభవించుచున్నది. ఔషధ భేదమునకు రోగలక్షణము కారణముగాని రాగద్వేషములు కారణములుగావు. సుఖదుఃఖములకు ఐశ్వర్య దారిద్ర్యములకు దైవము కారణమని వదరుచున్నాము. అది స్వీయకర్మదోషమనియు దైవము సాక్షిమాత్రమనియు విబుధుడు గ్రహించును.

పనిగొని యెల్లవేళల శుభంబె ఘటింపక అష్టకష్టముల్
మనకొనగూర్చు దైవమను మాటల కర్థములేదు- బీజలక్షణములె తత్ఫలంబులను గన్పడు నామ్రఫలంబు నింబమీ।
యనియెడ దోటమాలి నపహాస్య మొనర్చెడి ప్రాజ్ఞులుందురే!

వేపచెట్టున వేపకాయలే కాయును. కాని మామిడిపండ్లు కాయవు. ఆమ్రఫలంబు నీయకపోవుట నింబవృక్షమునకు

దోషమనరాదు. అందు దోటమాలి యపరాధ మావంతయు లేదు.

సుకృతనికరంబు సమకూర్చు శుభసమృద్ధి।
దుష్కృతచయంబు చేకూర్చు దుఃఖవృద్ధి।
తలప దాగర్త సుఖదుఃఖములకునెల్ల।
నట్టియెడ దైవమును దూర న్యాయమగునె ?

పుణ్యసంస్కారముగల వారికి సుఖాదులు లభించును. పాపసంస్కారముగలవారికి దుఃఖాదులే సమకూరును. విరుద్ధఫల ప్రాప్తికి దైవము కారణ మను మాట తగదు.

పూర్వసుకృత దుష్కృత జన్యములై సుఖదుఃఖములు గలుగునేని వర్తమాన పురుషప్రయత్నము నిరర్థకము కాదా యని సందియము జనించుట సహజము. ఈనాటి మన సుఖదుఃఖములలో కొన్ని పూర్వకృతజన్యము లను మాట సత్యము. మఱికొన్ని వర్తమాన కర్మజన్యములనియు ననుభవమువలన గ్రహింపవచ్చును. పూర్వకృత ఫలము ప్రారబ్ధస్థితినంది అనివార్యమగును. దానిని తప్పింప వలను గాదు గనుక సహనముతోడను వైరాగ్యముతోడను ప్రాజ్ఞు డనుభవించి, ఆ కర్మబంధమును వదలించుకొనును.

"నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటి శతైరపి" ఎంత వారికైనను ప్రారబ్ధ కర్మఫల మనుభవింపక తప్పదు. సుకృత జన్యసుఖ ఫలమును సంతోషము తోడను గర్వాభిమానములతోడను అనుభవించుచున్నాముగదా! అటులనే దుష్కృత జన్యఫలములనుగూడ సహనవైరాగ్యములతో ననుభవింపవలసియున్నను అజ్ఞాన ప్రాబల్యముచే నటు లొనరింపలేక పోవుచున్నాము. విచారించిన మన యొకనాటి యకృత్యములను దుఃఖరూపమున సేవగించుకొనుచున్నాము. ప్రస్తుతసుఖదుఃఖములలో గొన్నిటికి వర్తమాన కృత్యములు కొంతవఱకు కారణములని యొప్పుకొనుచున్నాము. గనుక తగిన ప్రయత్నముచేసి అకార్యకరణమునకొడిగట్టక సత్కార్యాచరణమునందే తాత్పర్యము గలిగియుండుట విజ్ఞత యనిపించుకొనును. కొన్ని కార్యముల ఫలమీనాడనుభవింపక పోవుచున్నను, కాలాంతరమునందు తప్పక యనుభవింప వలసి వచ్చును. కావున భావిసుఖ దుఃఖముల దలంచి, వివేకము గలిగి పుణ్యఫలప్రదములైన పరోపకారాది సత్కృత్యములనే యాచరించుచు, పాపఫల ప్రదములగు పరహింసాది కృత్యములను విడనాడుట శ్రేయస్కరము.

కొందఱు నిర్నిమిత్తముగ మనకపకారము కావించుచున్నారని వారిని ద్వేషించుచున్నాము. విచారింప మన యకార్య సంస్కారమే వారి రూపమున మనకు శిక్ష విధించుచున్నది. అది గమనింపలేక ఆ దోష మొరుల కంటగట్టుచున్నాము. ఈనాటి మన నేరములను విచారించి ధర్మాధికారి మనకు శిక్ష విధించినపుడు దానిని కాదని ప్రతిఘటింపలేకపోవుచున్నాము. కాని యనధికారి యపకారము గావించిన సహింపలేక పోవుచున్నాము. ప్రతీకార వాంఛతో అపకారికి మించిన యపకారము గావించుచున్నాము. దాన దాన మఱల మఱల నతిశయ దుఃఖము నందుచున్నాము. ఈ విషచక్ర భ్రమణమున కంతు గనలేక పోవుచున్నాము.

ఉపకారికి నుపకారము విపరీతము గాదుసేయ
వివరింపంగా।
అపకారికి నుపకారము నెపమెన్నక సేయువాడు నేర్పరి
సుమతీ! ॥

అపకారికిగూడ నుపకారము సేయుట యుచితమని శాస్త్రములు ఘోషించుచున్నవి. అపకారులను ద్వేషించుటయు నింద్యమగుచున్నది. ఆత్మీయు లొనరించిన యనల్పాపరాధాపచారములను ఉపేక్షాభావముతో జూచి సహించుచున్నాము. పరులు గావించిన తప్పిదములను గోరంతలు కొండంతలుచేసి యుద్ధముచేయ తలపడు చున్నాము. పరిశీలించిన స్వపరభేదబుద్ధియే సహనప్రతీకారములకు మూలమగుచున్నది. ఒక సమయమున మనము నాలుక కఱచుకొందుము; దాన బాధ కలుగును. అపచారము చేసినది దంతపంక్తి - బాధ ననుభవించినది నాలుక. న్యాయ విచారణ జరిపి నేరముచేసిన దంతములకు గట్టి శిక్ష విధింపవలసియున్నది. కాని శిక్ష విధింపలేక పోవుచున్నాము. ఎందుచేత ?—తప్పుచేసినది మనశరీరాంతర్భాగమే కనుక సహించి యూరకొనుచున్నాము. చంటిబిడ్డ పోరుపెట్టి రాత్రి యంతయు నేడ్చుచుండును. మనకు నిద్రాభంగము, కష్టము కలుగును. అయినను ఆ బిడ్డ నేమియు ననక లాలించి బుజ్జగించుచున్నాము. అప్పటికిని బిడ్డ పోరు మాననిచో, బిడ్డతోపాటు మనముగూడ విలపింప మొదలిడెదము. ఏలనన-మన బిడ్డయేయని సమాధానము చెప్పికొందుము. ఒక గుడ్డి యీగ గాని, యొక చిన్న దోమగాని మన చెవిచెంత జేరి నృత్యగీతముల వినోదము గూర్ప నుపక్రమించును. మన కెక్కడలేని యాగ్రహము కలుగును. విశ్వప్రయత్నముచేసి శక్తి నంతయు వినియోగించి దాని యాటగట్టించిన కాని మనకు దృప్తి గలుగదు; నిద్రపట్టదు. ఎందుచే నందురా ?—మనకును ఆ మశక మక్షికములకును ఆత్మీయత లేదని నమ్ముచున్నాము-కనుక యటు లొనరింపగలుగుచున్నాము. అనాత్మజ్ఞానము- అనగా- స్వపరభేదబుద్ధియే రాగద్వేషములకు మూల కారణము. నిర్హేతుకముగ నుపకారులని భ్రమించి గౌరవించినచో ప్రమాదము లేదు కాని, అకారణముగ నపకారులని విశ్వసించి ద్వేషదృష్టితోజూచి ప్రతీకారా గౌరవములను సమకూర్చిన ముప్పు తప్పక కలుగును. స్వపరభేదబుద్ధి

తగదనియు, రాగద్వేషములు వర్జింపవలయుననియు, ప్రారబ్ధ కర్మ మనుభవింపక తప్పదనియు పదేపదే విను చున్నాము. వీలుచిక్కినపుడెల్ల పరుల కుపదేశించు చున్నాము. శ్రవణమననోపదేశములు సులభతరములు. తత్తద్ధర్మాచరణము మాత్రము కష్టాతికష్టతమము.

అనుభవించుటకన్న గత్యంతరంబు।
లేనిమాట యథార్థంబె, కాని, కష్ట।
కాలమున మాత్రమా వివేకంబుదొలగి।
అవరించును మౌఢ్యంబు దేవదేవ!॥

"ఎన్ని కంతులు కోసినను నా కంతి కోసినపుడు గలిగి సంత బాధ యితరుల కంతులు కోసినపుడు కలుగలేదు." అని యొక్క వైద్యశిఖామణి యన్నాడట. ఉపదేశము వేరు. ఆచరణము వేరు. ఎవనియందుపదేశాచరణము లేకరూపత సందుచున్నవో అతడే యాచార్యపురుషుడగు చున్నాడు. ప్రవాహమునబడి కొట్టుకొనిపోవుట చాల తేలిక. ప్రవాహమున కెదురీదుట మిగుల కష్టము. మాయాజ్ఞాన ములకులోనై యకార్యములు చేయుట మానవ స్వభావము. నిగూఢజ్ఞానము గలిగి నింద్యకార్యముల నాచరింపకుండుట సాధారణుల కత్యంత దుర్లభము. యుక్తాయుక్త వివేకము కలిగి, అకార్యములను విడనాడి సత్కార్యముల నాచ రించిననాడే మనుజుడు సార్థకనాముడై కృతకృత్యుడగును. అందుబాటులోనున్న వానికై ప్రయాసపడవలసిన పనిలేదు. అందుబాటులో లేనివానికొఱకే యత్యంతప్రయాసము నకును లోనై ప్రయత్నించి కార్యసిద్ధి నందవలయును.

ఈ బ్రహ్మాండమంతయు నొక మహానాటకరంగము. పిపీలికాది బ్రహ్మపర్యస్త జీవకోటులన్నియు నందు నటించు పాత్ర విశేషములు. అపుడపుడు అస్మాదృశులకు లోకవ్యవ హారముగూడ నొకనాటకమువలె భాసించును. ఆ జ్ఞానము స్థిరముగ నిలువకపోయినను, దాని ననుభవవిరుద్ధమని త్రోసిపుచ్చలేము. నామరూపముల సదా శివంకరులు, సర్వ మంగళ ప్రదులు, ఆదిదంపతులునైన పార్వతీపరమేశ్వ రులు ఆనందతాండవముచే నఖిలలోకముల నలరించు నా మహాపర్వకాలమున తత్సత్సంకల్పమాత్రమున నఖిల శాస్త్రంబులు, నిఖిలకళలు ప్రాదుర్భవించినవి. అవి యన్నియు మానవుని మాయామోహపారావారమును దరింపజేయుట కక్కఱకువచ్చు తరణివిశేషములు. వానిలో నాట్యము వేదమై, శాస్త్రమై, కళయై, జ్ఞానోపదేశ ప్రసంగమున నుత్తమమై విరాజిల్లుచున్నది. రావణుడు సీతనపహరించెను. రాముడు యుద్ధముచేసి దశకంఠుని సంహరించెను. రామపాత్రధారి రావణపాత్రధారిని ద్వేషించు చున్నాడా?—లేదు. కాని నాటకమున నుగ్రుడై ప్రతిపక్షిని హతమార్చునటుల నటించును. ఆ వైమన స్యము తాత్కాలికమైన నటనమాత్రమే గదా! యథార్థంబు గమనింప నా యిరువురికిని సౌమనస్యముగూడ గోచ రించును. ఆ యిద్ధఱును అటు నటించుటలో పరస్పరము సహకరించి నాటకప్రదర్శనము విజయవంతమగుటకు తోడ్పడుచున్నారు. దుశ్శాసనుడు ద్రౌపది వస్త్రముల నపహ రించును. ద్రౌపది విలపించును. ఇక నాటకమున దుశ్శా సన పాత్రపోషణమునకు ద్రౌపదీ పాత్రధారియు, ద్రౌపదీ పాత్రపోషణమునకు దుశ్శాసన పాత్రధారియు, సహాయము చేయుదురు. నాటకము రక్తి గట్టుటకు ఇర్వురును ద్వేష భావమునే ప్రకటించుచున్నటుల ప్రేక్షకులను నమ్మింప వలయును. లేకున్న నాటక మాభాసమగును. హరిశ్చంద్ర పాత్రధారి కుమారుడు గతించినటులును వానికై తాను విలపించుచున్నటుల సామాజికులను భ్రమింపజేయును. కాని పాత్రధారికి మాత్రము తన పుత్రుడు సజీవుడే యనియు ఆ దుఃఖము నటనయే యనియు తెలియును.

ఒకనాడు పురుషులే స్త్రీ పురుష పాత్రధారణము చేయు చుండిరి. మఱియొకప్పుడు స్త్రీలే సర్వపాత్రధారణము చేయుచుండిరి. నాయికా నాయక పాత్రధారణము చేసిన ఆ వ్యక్తులు పరస్పరము వలచి వలపించుకొనినటులు నటించినను యథార్థముగ వారి నడుమ నట్టి భావోదయ మున కవకాశమే లేదుకదా! పాత్రధారణము పురస్క రించుకొని వ్యక్తము చేయవలసివచ్చిన రాగ ద్వేషములు పాత్రధారణము చేయని సమయమున తమ యస్తిత్వ మునే గోలుపోవుచున్నవి. రోగికి శస్త్రప్రయోగము చేయు చున్నటులు బాహ్యముగ పొడగట్టినను ఆ శస్త్ర చికిత్స రోగము నుద్దేశించి జరుగుచున్నది కాని రోగి నుద్దేశించి జరుగుటలేదు. దేహధారణ సమయముసందే రాగ ద్వేష ములు గోచరించును. 'మరణాంతానివైరాణి' దేహపాతముతో వైరాదులంతరించును. దేహతాదాత్మ్యముండుదనుక రాగ ద్వేషములు సముచితములు, అని వార్యములు. దేహాతీత మైన సర్వాత్మత్వ పరిజ్ఞానము గలుగునేని రాగద్వేషములు ఎండమావులవంటివని తోచును. నిర్వికారుడైన యాత్మ వికారాస్పదమయిన దేహమును ధరించి - పాత్రధారణ మొనరించు వ్యక్తివలె - రాగద్వేషములకు సుఖదుఃఖము లకు లోనైనటులు నటించును. కాని పాత్రధారణము చేయక స్వస్థుడైన వ్యక్తి తత్తద్రాగ ద్వేషాదులకు దూరుడై యుండునటులు - ఆత్మయు ద్వంద్వములకు సతీతుడై యుండుననుట యుక్త్యనుభవములకు సులభగ్రాహ్యము.

వేదాన్తానామశేషాణా మాదిమధ్యావసానతః।
బ్రహ్మాత్మన్యేవ తాత్పర్యమ్.

జ్ఞాతాజ్ఞాత సమస్తభూతములయందంతటను పర మాత్మయే నిండియున్నాడని విశదముగ దెలియజెప్పు నదియే విద్యలలోనెల్ల నుత్తమమయిన విద్య.

పరమాత్మాద్వయానంద।
పూర్ణః పూర్వం స్వమాయయా।
స్వయమేవ జగద్భూత్వా।
ప్రావిశజ్జీవరూపతః ॥

ఈ జగన్నాటకపాత్రధారులయిన జీవులెవరు? "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్." జగన్మాయానాటకమునకు సూత్రధారి పరమాత్మ. ఆ పరమాత్మ తానై సర్వపాత్రధారణముచేయును. అనగా పాత్రధారులయిన వ్యష్టిజీవులందఱు సమష్టిపరమాత్మస్వరూపములే యని తాత్పర్యము. పరమాత్మ యెట్టివాడు? స్వపరభేదశూన్యుడు, పరిపూర్ణుడు, పరమానంద స్వరూపుడు పరమాత్మ. కనుక జీవులందఱుగూడ వస్తుతః భేదరహితులు, పరిపూర్ణులు, ఆనందనిలయులు. వారియందు భిన్నత్వాదులు కల్పితములేగాని యథార్థములుగావు. 'ద్వితీయాద్వై భయం భవతి'. తనకన్న నన్యమున్ననాడుగదా భయాదులు, రాగద్వేషాదులు గలుగును. తన్ను తా ద్వేషించుకొనుట అసంగతము. కారణప్రాబల్యముచే తన రూపాంతరమయిన మఱియొక జీవిని ద్వేషింపవలసి వచ్చునెడ ఆ ద్వేషము తాత్కాలికమనియు, భ్రమప్రమాద జన్యమనియు, స్వాస్థ్యము చేకూరినంతనే సమసిపోవునదియనియు శాస్త్రాధ్యయనమువలనను, గుర్వనుగ్రహమువలనను ప్రాజ్ఞుడు తెలిసికొనుచున్నాడు. తనకుతానై యొరులను ద్వేషింపకున్నను, ఇతరులు తన్ను ద్వేషించి బాధించుచున్నపుడు ద్వేషాదులుదయించుట లోక ధర్మమని యొప్పికొనక తప్పదు. కాని తానై పరులను ద్వేషింపకుండుట యుత్తమ ధర్మము. ద్వేషించువారినిగూడ ద్వేషింపక సమాధానపఱచుట యత్యుత్తమ ధర్మము.

క్రోధాన్ధకార వికటభ్రుకుటీ తరంగ।
భీమస్య సాంధ్య కిరణారుణరౌద్ర దృష్టేః।
నిష్కంప నిర్మలపయోధిగభీర వీరా ధీరాః
పరస్యపరివాదగిర స్సహన్తే॥

గాంభీర్యముచే పారావారమును సైతము ధిక్కరించు ధీరాగ్రేసరులు క్రోధావేశదుర్నిరీక్షులయిన దుర్జనమూర్ఖుల పరివాద ప్రలాపములను సహింప గలుగుచున్నారు. అట్టి వారిక్షమాగుణ మెంతేని ప్రశంసాపాత్రము. 'క్షమా శస్త్రం కరే యస్య దుర్జనః కిం కరిష్యతి' ఓర్పుగలవాని మ్రోలనెంతటి తుంటరియైనను తలయొగ్గక తప్పదు.

క్రోధే, స్మేరముఖావధారణ మథావిష్టే, ప్రసాదక్రమః।
వ్యాక్రోశే, కుశలోక్తి, రాత్మదురిత చ్ఛేదోత్సవస్తాడనే।
ధిగ్జన్తైరజితాత్మనోఽన్య మహతీ దైవాదుపేతావిపత్।
దుర్వారేతి దయార్ద్రసార్ద్ర మనసాం క్రోధవ్యతిక్రోదయః॥

రాగద్వేషములు మానసిక వ్యాధులు; మనస్సు దుర్బలమయిననాడవి ప్రకోపించును. భవరోగవైద్యులు ఆ జాడ్యములకు చికిత్స నిర్దేశించియున్నారు. కోపముచే మొగము ముడుచుకొనియున్న వానిని చిరునగవుతో పలుకరించిన వాని యాగ్రహము కొంత చల్లారును. అది పూర్తిగ దొలగకున్నను వృద్ధి మాత్రము పొందదు. తామసముచే నొదలు మఱచిన వానిని మృదుకరస్పర్శచే దేర్పవచ్చును. దుర్భాషలాడువారిని సామవచనములచే శాంతి నొందింపవచ్చును. ఆ గ్రహగ్రహావిష్టుని జూచి జాలినందవలయును గాని వానికి ప్రతీకారము తలపెట్టరాదు. దయార్ద్రమానసులైనవారి పట్ల కోపము వహించుట దుష్కరము.

హింసాక్రోధపారుష్యాద్యాసురలక్షణములు అప్రయత్నముగనే లభించును. అవి సర్వ జీవసాధారణములన్నను తప్పులేదు. వానిని వదలించుకొనుటకు భగీరథప్రయత్నము చేయవలసివచ్చును. అహింస, అక్రోధము, సత్యసంసిద్ధి దైవలక్షణములు. ఎంతప్రయత్నముచేసినను అవి లభింపవు. లభించినటులు గనుపట్టినను ఉత్తరక్షణముననే అవి యంతర్ధానమగును. క్రోధరహితులు, క్షమాసంపన్నులు, అహింసాతత్పరులు, సత్త్వగుణప్రధానులు, కోటికొక్కరైనను గానరారు. కారణ జన్ములయిన సాధుసజ్జన పురుషోత్తములయందే ఆ యపూర్వదైవలక్షణములు గోచరించును.

సకలకల్యాణ సంప్రదత్న రత్నాకరము అలవైకుంఠపురము. అందు శ్రీ శ్రీనివాస విలాస సుందర మందిరము అమందానందకందము. అట భోగిభోగశయనీయము. దాన రమారమణి యంకము నుపధానముగ శయనించి జగన్నాథుడు సుఖలీలావినోదప్రసంగముల నోలలాడుచుండెను. అతర్కితంబుగ నెటనుండియో యూడిపడి భృగుమహర్షి యమర్షావిష్టుడై లోకేశ్వరుని కౌస్తుభాలంకృత వక్షస్స్థలంబును వామపాదంబున బిట్టుదన్నె. క్షీరసముద్రరాజతనయ నయనయుగళము ప్రళయార్కబింబసదృశమయ్యె. భోగిరాజశిరస్సహస్రంబు కంపించె. నక్షత్రగ్రహగణంబులు చలించె. అకాల ప్రళయ మాసన్నమయినటులు దోచె. గరుడగమనుడు వినయవినమితశిరస్కుడై ఆ తపోధనుని పవిత్రచరణంబుల వ్రాలి మ్రొక్కి, లేచి నిలబడి బద్ధాంజలియై "మునీంద్ర చంద్రా! మీ రాక గురుతింపలేక తప్పిద మొనరించిన నన్ను మన్నింపుము. ఈ భద్రాసన మధిష్ఠింపుము. అభయ ప్రదానము చేసి యీ దాసుని రక్షింపుము. భవత్పాద తీర్థంబుచే లోకస్థులు, లోకేశులు పవిత్రులగుచున్నారు. ఇటుమీద నేను యుష్మత్పాదతాడనాంకమునే భూషణవిశేషముగ గౌరవింతును. గురువరేణ్యుల యాగమనముచే మా భవన

మును పావనము లయినవి. మే మెల్లఱమును చరితార్థుల మయితిమి.'' అని మృదుమధురాలాపంబుల తపస్వి ననునయించెను. ఆ మునిజనమూర్ధన్యుడును పరమానందము నంది ముకుందుని నభినందించి యెందే జనియె.

నేటికి మూడువందల యేబది యేండ్లకు బూర్వము మహారాష్ట్రదేశమున జన్మించిన ఏకనాథమహారాజు - సత్కుల సంజాతుడు, సర్వశాస్త్ర విశారదుడు, తపస్సంపన్నుడు, ఉద్గ్రంథ రచయిత, నిరంతర భగవన్నామ జప తత్పరుడు, విశేషించి క్షమాశీలుడు, సాధుస్వభావుడు. నిత్య మా నియతవ్రతుడు త్రికాలములయందును గోదావరీ పాపనోదకముల స్నానమాడ బోవుచుండెను. నదికి బోవు త్రోవలో ఒక తురుష్కజనపదముండెను. అందొక ముష్కరుడు నదికి వచ్చిపోవువారిని పలువిధముల బాధించుచుండెను. ఏకనాథుడు స్నానముచేసి తిరిగివచ్చు సమయము కనిపెట్టి ఆ మూర్ఖుడు మీద నీరు చిమ్ముచుండెడివాడు. ఏకనాథుడు పెదవి కదుపక మఱల గోదావరికేగి స్నానముచేసి వచ్చెడివాడు. మ్లేచ్ఛుడు తిరిగి నీళ్ళుపోసెడివాడు. అందుచే బ్రతిదిన మేకనాథునకు పెక్కుసారులు స్నానమునకై గోదావరి కేగవలసివచ్చెడిది. ఒకనాడా దురాచారి యత్యాచారము మేర మీరినది. ఏకనాథున కానాడు నూటయెనిమిది సారులు స్నానము చేయవలసి వచ్చెను. కాని యతని సహనము సడలలేదు. ప్రసన్నత సన్నగిల్లలేదు. యవనునకు ఆశ్చర్య ముదయించెను. సిగ్గుకలిగెను. తలతిరిగివచ్చెను. పశ్చాత్తాప మంకురించెను. జ్ఞానోదయ మయ్యెను. అత డేకనాథమహారాజుపాదములపైబడి శరణు వేడెను. కోపమెఱుగని యా మహాత్మునకు జాలిగలిగెను. నాటినుండి యా ముసల్మానుని జీవితము ప్రశంసాస్పద మయ్యెను. ఏకనాథుని ప్రవృత్తి యాదర్శప్రాయము; అతని యమూల్యగ్రంథములు మహారాష్ట్రులకేకాక యావద్భారత వాసులకు పఠనార్హములు.

ఆధునికకాలమునందును సత్యాహింసలు ఆచరణసాధ్యములేయని నిరూపింప నవతరించినవాడు మహాత్ముడు. స్వదేశీయుల పారతంత్ర్యశృంఖలములను దొలగింప యత్నించుచున్నాడను నేరమాపాదించి నాటి యాంగ్లేయ ప్రభుత్వము మోహనదాసుని కారాగారమునకు బెక్కుమారులు పంపెను. పలువిధముల బాధించెను. కాని యా సాధుపుంగవుడు తన్ను శిక్షించి బాధించినవారిని ద్వేషింపలేదు; పై పెచ్చు ప్రేమించెను. పట్టాభిషేకమునకై పిలువబడినపుడు రాముదుప్పొంగలేదు. అడవులకు బంపబడిననాడు దాశరథి దుఃఖింపలేదు. రామదాసదాసుడు గాంధీజీ కృష్ణ జన్మస్థానము ప్రవేశించునపుడు విచారలేశము నందలేదు. కారాగారవిముక్తి కలిగిననాడు సంతోషాతిశయమును బొందలేదు. అతని యాగ్రహము సత్యాగ్రహముగాని దురాగ్రహము కాదు. క్రోధవర్జితునకు ద్వేషము గలుగదు. ద్వేషరహితునకు హింసాభిలాష యుద్భవింపదు. విశ్వమానవ ప్రేమ యలవఱచుకొన్న వారి ప్రవర్తనము [illegible] మార్గదర్శకమగునుగదా!

"దుర్జన స్సజ్జనోభూయాత్" దురాచారులు సదాచారులు గావలయుననియు, దుర్జనులు సజ్జనులుగా మాఱవలయుననియు ఆర్యులపేక్షింతురు. "పతితులు పాపాత్ములు నివసించు నరకలోకమునందే - దయామయా! పతితపావనా! పరమేశ్వరా! - నీ యునికి యపేక్షితము. సుజనులు తమ సౌజన్యబలముననే యభ్యుదయము నందగలరు. నీ సాయము లేక దుర్జనులు మేలుగాంచ లేరు.'' అని యొక యాధునికతత్త్వవేత్త నుడివినాడు. మనోదౌర్బల్యమువలన దౌర్జన్య మేర్పడును. బలవంతులకు సాయపడుటలో నబ్బురములేదు. బలహీనులకు సాయము చేయుటయే ప్రశంసాపాత్రము.

సర్వే భద్రాణిపశ్యన్తు - మా కశ్చిద్దుఃఖ భాగ్భవేత్ ॥

అందఱు సుఖమందవలయుననియు, ఏ యొక్క జీవికిని కష్టము కలుగకూడదనియు భారతీయులు నిత్యము శివసంకల్పము చేయుచున్నారు. సకలలోకశాంతి సపేక్షించు జాతి భారతజాతి యొక్కటియేయను ఖ్యాతి నేటికిని చెక్కుచెదఱక నిలిచియున్నది. స్వీయాభ్యున్నతి మాత్రమే యాసించి యీనాటి నాగరికజాతులన్నియు వింత వింతరీతుల అస్య జాతుల వంచింప జూచుచున్నవి. కాని భారతీయులొక్కరే సకలదేశయోగక్షేమములకు పాటుపడుచున్నారు. భారతీయ వైదేశికనీతి సామ్రాజ్యవాదులకు, 'పెట్టుబడిదారి' ప్రభుత్వములకు, కంటకముగనున్నది. భారత ప్రభుత్వముయొక్క సహనమునకును, శాంతికాముకత్వమునకును ముప్పుదెచ్చిపెట్ట పెద్ద పెద్ద రాజ్యములు విశ్వ ప్రయత్నము చేయుచున్నవి. వానియండ జూచుకొనియే పోర్చుగీసువారు గోవాలోను, పాకిస్తానీయులు కాశ్మీరులోను, దురాగతమున కొడిగట్టుచున్నారు. దుర్యోధనాదులు ధర్మరాజును ద్వేషించిరి. ధర్మరాజు మాత్రము వారికి తనకు దానై యపకారము దలపెట్టలేదు. శలభము తను దాన సగ్నిలో బడును. అగ్నికి హింసాభిలాష లేకపోయినను శలభము తన యకార్యకరణదోషముచేతనే నమసిపోవును.

అన్నిమతములవారికిని, అన్నిజాతులవారికిని, జనకుడు సంరక్షకుడునగు భగవంతుడొకడే. జగదేకకారణుడయిన యాపరమేశ్వరుని దలచి, ద్వేషము విడనాడి, అందఱి మేలు కోరుటయే ప్రాజ్ఞులకర్తవ్యము.

(సశేషము)

# సత్యమేవజయతే

శ్రీమతి మరంగంటి సీతమ్మగారు
కార్యదర్శిని - యతిరాజసేవామహిళామండలి - గొడుగుపేట - బందరు

"సత్యమేవ జయతె నాఽనృతమ్" అను నుడి ఉపనిషద్వాక్యము. సత్యమే సమస్త ధర్మములకు మూలము. సత్యమే జగత్సృష్టికి కారణము. అసలు సత్యమననేమి? దీనికి లోకమున స్థానమేది? అనునవి ప్రస్తుత విమర్శనాంశములు. వ్యవహారమున సత్యమనగా నిజమును పలుకుట అను అర్థమందు లోకమున పలుకుచున్నారు. కాని యిది పరమార్థసత్యమని, వ్యావహారికసత్యమని రెండు విధములు. ఇందు పరమార్థసత్యము నిత్యుఁడైన బ్రహ్మనుఁగూర్చి చెప్పునది. వ్యవహారసత్యము లోకము వాకొనునది. లోకము మిథ్యయైనను, సత్యము మాత్రము నిత్యముగనుండును. అనగా త్రికాలాబాధితమై, బ్రహ్మపదార్థమువలె అద్యంతములు (చావుపుట్టుకలు) లేక శాశ్వతముగనుండు వస్తువని యర్థము. కనుకనే బ్రహ్మ సచ్చిదానందస్వరూపుడందురు. అనగా "సత్-చిత్-ఆనందము"లే బ్రహ్మకు ముఖ్య లక్షణములు. ఈ గుణత్రయమునందును "సత్తు"నే ప్రధానముగా పేర్కొనిరి. మతత్రయాచార్యులైన శంకర మధ్వరామానుజాచార్యులలో, రామానుజమధ్వులు బ్రహ్మతోపాటు జగత్తుకూడ సత్యమైనదే యని నిర్ణయించినను, జగన్మిథ్యావాదియగు శంకరుఁడుకూడ బ్రహ్మమాత్రము సత్యమని అంగీకరించి సిద్ధాంతీకరించెను. కనుక బ్రహ్మమనగా సత్యమని తెలుచున్నది "బ్రహ్మసత్యంజగన్మిథ్యా" అను వాక్యమున, బ్రహ్మమే సత్యపదార్థమని అభేదాధ్యవసాయము బోధపడుచున్నది. కనుక బ్రహ్మమనగా "సత్య" మని రూఢార్థము. బ్రహ్మమనగా శ్రీమన్నారాయణుఁడు. ఇతఁడే అచ్యుతుఁడు; అదిమధ్యాంతరహితుఁడు. అనగా నాశముగాని మార్పుగాని లేక యెల్లప్పుడునుండువాడని ఉపనిషత్తులు ఘోషించుచున్నవి. శ్రీమన్నారాయణుఁడే సృష్టిస్థిత్యంతకారకుడగుటచేతను, "నారాయణాద్బ్రహ్మ జాయతే, నారాయణాదింద్రో జాయతే, నారాయణాద్రుద్రో జాయతే" అను యుపనిషత్ప్రమాణములచేతను స్వామి బ్రహ్మదుల సృష్టికే కారణుఁడని తెలుచున్నది. కనుక జగత్సృష్టికికూడ కారకుఁడు నారాయణుఁడే-అనగా యీ సత్యమే సృష్టికి జీవకర్ర. దాని శక్తివల్లనే జగత్సృష్టిస్థితితిరోధానాదివ్యాపారములు జరుగుచున్నవని తాత్పర్యము. కనుక ప్రభుసమ్మితములైన వేదములు "నాఽసత్యంబ్రూయాత్, నాఽనృతంవదేత్, సత్యంవద, ధర్మంచర" అను విధివాక్యములను శాసించి చెప్పినవి. మరియు, నీ విషయమున భ్రమప్రమాదములకు వశ్యులు కావలదని "సత్యాన్నప్రమదితవ్యమ్" ధర్మాన్నప్రమదితవ్యమ్" అనికూడ "శిక్షావల్లి"లో శాసించినది. ఇంక యీ సత్యముయొక్క స్వరూపమేమి? అను నిర్ణయమునకు "జయస్వరూపమని ధర్మస్వరూపమని" స్మృతులు నిర్ణయించినవి. ఈ వాదమును "సత్యంవద, ధర్మంచర, యతోధర్మస్తతోజయః" అనియు, "సత్యమేవ జయతేనాఽనృతమ్" అను సూక్తులు బలపరుచుచున్నవి. అనగా సత్యమే ధర్మస్వరూపమనియు, ఆ ధర్మ మేవైపుననున్నవైపున జయము చేకూరుననియు, యెప్పటికైనను సత్యమే జయించును కాని అనృతము జయింపదనియు స్పష్టముగ చెప్పుచున్నవి. కనుక యీ జయాపజయములే ధర్మాధర్మములని, సత్యాఽసత్యములని యౌగికార్థము కుదురుచున్నది. అటులైన వీని నెవరాచరించిరి? వారికెట్టి ఫలితములు కలిగినవి? అను ప్రశ్నలు విమర్శాపేక్షాంశములు. సద్గుణములను పేర్కొనునప్పుడు "దయాసత్యం చ శౌచంచ" అని స్మృతులు పలికినవి. ఇందు సత్యమేల మధ్యను పేర్కొనఁబడిన దనగా, దయా శౌచములకు సత్యమే మూలకారణము. దీని సన్నిహితము రెంటికిని సమానముగా నుండవలెను. కనుక త్రిమూర్తులను పేర్కొనునప్పుడు సృష్టిలయకారులగు బ్రహ్మేశానులను నిరుగడల నిలిపి, వారి యుభయుల స్థితినిఁగూడ తానుఁ గాంచుచు మధ్యనుండి, తనకు సృష్టిలయము లవగతములైనను, వాటిని వారిరువురకుఁ బ్రసాదించి జగన్నాటకమును నడిపించు నారాయణునివలె చెప్పిరి. (బ్రహ్మవిష్ణుమహేశ్వరులనునప్పుడు విష్ణువు మధ్య పేర్కొనఁబడెను) "దయాసత్యశౌచము" లందు, సత్యము మధ్యను పేర్కొనఁబడెను. ఇందువలన యీ రెంటికిని మూలమును కారణమైనదనుట సూచించుచున్నది.

మున్నుహరిశ్చంద్రుడు కృతయుగమున సత్యవ్రతముచేతనే జయమునుఁ గాంచెను. సత్యవాక్యపరిపాలనకై తన రాజ్యమునంతయుఁ గోలుపోయి భార్యాపుత్రాదులను సేవకులుగా విక్రయించి, తాను చండాలదాస్య మొనరించి, తన సత్యవ్రతమును విడనాడనందున తిరిగి తన రాజ్యమునుఁ జేకొనఁజాలి, స్థిరతరమైన కీర్తినిఁగాంచి దేవతలకుఁగూడ పూజ్యుఁడైయుండెను. ఇంతేట్లు నల, బలి,

మాంధాతాది మహీపతు లెందరో సత్యమార్గము నవలంబించి రాజ్యపరిపాలనముఁజేసి, చిరస్థాయియగు కీర్తిని సంపాదించిరి.

ఇంక త్రేతాయుగమున రామరాజ్య విధానమును పరిశీలింతము. రామచంద్ర పరమాత్మ కొకమాట, యొక బాణము, ఒక పత్ని యనునవి ప్రధానధర్మములు. అవి తప్పుటెటువంటిదో యాయన యెరుగడు- సరికదా - రామరాజ్యమున యనత్యవాదులకు స్థానమేలేదు. ప్రతిజ్ఞా భంగులకు బహిష్కరణమే శిక్ష. అనత్యము పలికిన వారి నాలుకలు వేయి చీలికలు చేయుదునని లక్ష్మణస్వామి వారి బిరుదు (ప్రతిజ్ఞ). స్వామి హనుమంతుని సీతాన్వేషణము కొరకు లంకకు పంపినపుడు హనుమంతుఁడు సీతా ఏరాట్టిని (దేవేరిని) చూచి లంకా పట్టణమంతయు తిరిగి, పౌలస్త్యుని వైభవమును గాంచి వచ్చి రామచంద్ర ప్రభువునకు నివేదించునపుడు, "అగ్నిహోత్రాశ్చ వేదాశ్చరాక్షసానాం గృహే గృహే" అనియు, "క్రతు ప్రవరయాజినాం" అనియు విన్నవించునరికి శ్రీ రామచంద్ర పరమాత్మ హనుమత్, లక్ష్మణ, సుగ్రీవులతో అటులైన మనము రావణుని గెలువ నేరమని పలికిరట. అంతనా హనుమంతుఁడు "దయా సత్యంచ శౌచంచ రాక్షసానాం స విద్యతే" యని చెప్పగా సత్యదూరులను గెలుచుట సులభ సాధ్యమని నిర్ణయించిరట. అట్టులే స్వామి రావణసంహార మొనర్చిరి. రావణుఁడు బ్రహ్మవంశసంభవుడై, మహాతపంబొనర్చి, బ్రహ్మాదులచే ననేక వరంబులంబొంది, శైవవైదికాదురంధరుఁడై, అఖండ భక్తికలిగి, అఖండలుని సైతము తృటిలో జయించిన నిర్వక్రపరాక్రమశాలికి అపజయమును చేకూర్చినదీ "అనత్యమె - అధర్మమే"; కనుక నత్యమునకు జయమునకు యెంత సన్నిహిత సంబంధమున్నదీ దీని వలన తెలియుచున్నది.

మరియు ద్వాపరమున "ధర్మజుని" సత్యసంధతను గురించి విననివారుండరని నమ్మకము. సత్యవాక్పరిపాలనకై రాజ్యభ్రష్టులై అరణ్యవాసమొనరించి, యజ్ఞాతమునుఁజేసి పడరానిపాట్లుపడి తన సత్యసంధానమువల్లనే పరమేశ్వరుని యనుగ్రహమునకు పాత్రుడై అనేక అక్షౌహిణుల సైన్యమునుగెల్చి, యుద్ధమున జయమునుఁగాంచెను. కనుకనే భారతమున శేషధర్మములలో ధర్మరాజు సత్యముయొక్క శక్తిగౌరవములను కొనియాడుచు నిట్లు శ్లాఘించెను. భారతము శకుంతలోపాఖ్యానమున దుష్యంతుఁడు తాను శకుంతల నెరుగనని పలికినప్పుడు, శకుంతల యిట్లు పల్కెను.

క॥ వెలయంగ నశ్వమేధం
బులు వేయియు నొక సత్యంబును నిరుగడలం
తుల నిడి తూపఁగ సత్యము
వలనన ములు సూపు గౌరవంబున పేర్మిన్ ॥

అని వెండియు భీష్ముఁడును సత్యవ్రతమునుఁగూర్చి ధర్మజునితో

చం॥ సుతజల పూరితంబులగు - నూతులు నూటిటికంటె సూనృత
వ్రత యొక బావిమేలు, మఱి - బావులు నూటిట కంటె నొక్కన
త్క్రతువదిమేలు తత్క్రతుశ - తంబున కంటెను తుంయుడుమేలు త
త్సుత శతకంబు కంటెనొక - సూనృత వాక్యము మేలు చూడగన్ ॥

మరియు భారతములోనే

"సర్వ తీర్థాభి గమనంబు - సర్వవేద
సమధిగమము సత్యంబుతో - సరియుఁగావు
యెఱుగుమెల్ల ధర్మంబుల - కెందుఁ బెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞు - లైన మునులు ॥ అని

కలదు. ఇందువలన సర్వపుణ్య తీర్థాటనము కంటెను, వేద వేదాంగాది విద్యాభ్యాసము కంటెను సత్యమే పెద్ద ధర్మమనియు, దీని కేవియు సరికావని ధర్మజ్ఞులైన మునుల యభిప్రాయమని తెలుచున్నది. మనదేశమున పూర్వము నుండియు జన్మించిన మతప్రవక్తలందరు ఈ సత్య విషయమున యేకాభిప్రాయులే కాని భిన్నులుకారు. ప్రథమాచార్యుఁడైన బుద్ధదేవుఁడీ సత్యమున కిచ్చిన స్థానమనిర్వచనీయమైనది.

అతని జీవితములో "నాఽనత్యంబ్రూయాత్ సత్యమేవ జయతే" అను వాక్యములు వినుటయేగాని, అనత్యమన్న నెట్లుండునో యెరుగనే యెరుగడు. నేడు ప్రాయశః యెరుగని వారులేరు. కనుకనే అయన యుపదేశములలో ప్రథమవాక్యమే "సత్యంవద" రెండవవాక్యము "ధర్మంచర" అని ప్రచారము చేయుచుండువాఁడు. కనుక బౌద్ధులు "సత్యంగచ్ఛామి- ధర్మంగచ్ఛామి, బుద్ధంగచ్ఛామి" అని పలుకుచుందురు. ఇవియే వారి ప్రమాణవాక్యములు. తరువాత శంకరమధ్వరామానుజులందరు సత్యప్రచారమునకే ప్రాధాన్యతనిచ్చిరి. మతాంతరప్రవక్తలైన క్రైస్తవ మహమ్మదీయులుకూడ తమ పవిత్రగ్రంథములని చెప్పు బైబిలు, ఖురానులలో, "అబద్ధమాడకూడదు" అను ధర్మమునే ప్రధానముగ పెట్టుకొని రచించియుండిరి. మిగతాధర్మముల విషయములో దేశకాలజాతులనుబట్టి అభిప్రాయభేదములున్నను యీ విషయమును మాత్రము యేకకంఠముగనే పలికిరి.

తరువాత వ్యాప్తమైన బ్రహ్మజ్ఞాన సమాజము, దివ్య జ్ఞాన సమాజము" మున్నగు పలు మతకర్తలందరు "సత్యాన్నాస్తి పరోధర్మః" అను వాక్యమునే యాదర్శ ముగ పెట్టుకొని ప్రచారమును చేసియుండిరి. పూర్వము నుండియు మతప్రవక్తలే రాజులకు నీతులుఁ గరపి సత్యానుష్ఠాన పరులనుఁజేసి రాజ్యముల సేవించిరి. అందువలననే అశోకుడు మున్నగు వారి రాజ్యము లజేయ ములై చిరకాలము మన్ననఁగాంచినవి. భారతదేశము ననేఁగాక విదేశములలోఁగూడ ప్రభువులీ ధర్మమును అతిపూజ్యమని గ్రహించి యాచరణలోఁ బెట్టుకొనిరి. అజ్మీరు సంస్థానాధిపతి తొలుఁదొలుత, తన జాతీయ పతాకము మీద "సత్యమేవ జయతె" అను వాక్య మును లిఖించి సత్యమునందు తనకుఁగల భక్తిగౌరవ ములను దర్శించెను.

బ్రిటీషు ప్రభుత్వ కాలములోకూడ ప్రభువులు పట్టాభి షిక్తులైనప్పుడుగాని, మంత్రులు, దండనాయకులు న్యాయాధికారులు, శాసనసభ్యులు, తమతమ పదవీ స్వీకార సమయములందుగాని ప్రమాణవాక్యములు "దేవుని యందు ప్రభువుయందు విశ్వాసము కలిగి సత్యముగ ప్రవర్తింతును"ని పలికించు టాచారముగ నున్నది. ఇంత వరకేల ? న్యాయస్థానములందు అభియోగములను దెల్పు కొను వాది ప్రతివాదులుగాని, సాక్షులుగాని విచారణ జర్పుటకు ముందు వారిచేత "దేవుని యెదుట ప్రమాణము చేసి అంతయు నిజముచెప్పెదను. అబద్ధము చెప్పను" అను ప్రమాణవచనములు పలికించుట న్యాయశాస్త్ర బద్ధ మున్నూ, సదాచారమున్నూ నేటికిని జరుగుచున్నది కదా ? అనగా నేటి కోర్టులమాట యెట్లున్నను పూర్వమునుండియు సత్యపక్షము జయించుననుమాట పాటియైనది. ఇంకను సత్యముచేత సాధింపబడిన విజయములను చూతము.

మహాత్మ గాంధీజీకి సత్యము, అహింస, దీక్ష, శౌచము లనునవి వెన్నతోఁబెట్టిన గుణములు. ఇందు సత్యము మొదటిది. ఇవియే యతనికి ఇంగ్లీషు వారితోఁ గలిగిన పోరులో శాంతి సమరమున ప్రథమాయుధము. సత్యమను సమ్మోహనాస్త్రము చేతనే పర (శత్రు) ప్రభువులకు వాగ్బం ధన మొనర్చుచూ, వారాడిన మాటను నిలబెట్టుకొనుడని హెచ్చరించుచు, ఉభయపక్షములను ఆయుధములనుఁ బట్టనీయక, ప్రజానష్టములేకుండ స్వరాజ్య సంపాదన మునుఁ గావించెను. ఇదియే సత్యము సాధించిన అఖండ విజయము.

ఇప్పుడు మనకు ప్రధానమంత్రియైన "పండిత జవహర్ లాల్ నెహ్రూ" మహాశయులుకూడ, శ్రీ మహాత్మాజీ యడుగుజాడలనే నడుచుచు అమెరికా, రష్యాప్రభుత్వ ములకుగాని, ఉత్తర దక్షిణ కొరియా దేశముల వివాదము లలోగాని, పాకిస్థాన్ కాశ్మీరు సంధిలోగాని, యింతవరకు తాను మధ్యవర్తిగ యుండి నడిపిన రాయబార కార్యము లలో యుద్ధవిరమణము వరకు తెచ్చి, బుల్గాన్, కృశ్చేవు క్రామేడులు మనదేశమునందు పర్యటించుచున్నప్పుడు వారితో సంధి కలిపి వారిని సత్యగుణ ప్రధానులుగను, సత్యమార్గానుసారులుగను చేసి సుహృదులుగా చేసు కొను సందర్భమునఁ గాని, తాను వినియోగించిన ముఖ్య సాధనమేది ? సత్యమే ! సత్యముచేతనే సర్వరాజ్య సమైక్య తను సాధింపఁగల్గెను. ఇందువలన తేలిన దేమనగా సత్యము చేత సాధింపరానిదేదియును లేదనియు, సత్యమే జయించు ననియు, రాజ్యపాలనకు సత్యమే సాధన మగుటంచేసి, 'సత్యమే జయ'మను సూక్తిని పాటించుచు, ప్రభువులు ప్రజలుకూడ సత్యసంధులగుదురు గాక ! యని యాసిం చుచు, లోకమునకట్టి సద్గుణమును ప్రసాదించుటకై శ్రియః పతిని ప్రార్థించుచున్నాను.

సత్యం తపః...............
సత్యేన లోకాః ప్రతిష్ఠితాః
సత్యే సర్వం ప్రతిష్ఠితమ్ ॥

# TRUTH IS ONE: SAGES CALL IT BY VARIOUS NAMES.

(From Srimad Bhagavatam)

"Our salutations to Hrishikesa, the Lord of the senses,
Who is manifest in all that is good.
Thou art the Lord of all work,
The Lord of all knowledge,
The Lord of the mind and the Lord of all objects.
Thou art the embodiment of the Vedas,
Thou art life, Thou art immortality,
Thou art all in all.
Thou art courage,
Thou art the vigour of the senses,
Thou art the strength of the body,
Thou art desire,
We salute thee:
Thou art our beloved Lord."

Our salutations to thee, in thy divine aspect of Matsya,
The manifester of all strength, physical and mental.
Thou art within all beings, thou art also outside of all.
None knows thy nature.
Thou art the ruler of this universe.
Thou art the support and refuge of all."

"Our salutations to Kurma!
Thou art omnipresent and the support of all.
Thou art beyond all space and time,
Thou art expressed in every being and in everything in this manifold universe,
Thy forms are innumerable,
Thy names are many,
Thou art that knowledge which gives awareness of unity.
We salute thee!"

"Our salutations to thee!
Thou art the Word, thou art the Truth,
Thou art the sacrifice, and thou art the sacrificial work;
Thou art the Soul of all souls;
As fire doth exist hidden in the wood,
So dost thou exist hidden in the body and the senses.
With their hearts and minds purified by spiritual discrimination and by virtuous deeds,
The wise seek thee,
By thy power, the divine Maya,
It is thy Self that has become manifest as this manifold universe.
In deep contemplation the self-controlled realize thy absolute aspect.
We salute thee!"

*(With the kind courtesy of Sri Ramakrishna Math)*

# ANDHRA ARCHITECTURE

*By*

V. V. TONPE, M. A.

## IV–APPRECIATING HINDU ARCHITECTURE.

### (i) CHARACTERISTICS OF HINDU ARCHITECTURE.

Everything in this world has certain characteristics which determine its existence. Art when compared with other forms of expression like literature can be identified with the help of certain characteristics of it which differenciate it from the other. Each kind of art has its own characteristics which identify it. Architecture too has its own characteristics. It being the mother of arts, it takes into its gamut all other arts like sculpture, painting, dance etc. Therefore when we try to identify certain characteristics of architecture, we indirectly try to establish the characteristics of other arts as well. To start with we shall take up sculpture.

Many visitors have travelled from far and wide to this country to see and appreciate the architectural beauty of this ancient seat of humanity. Even a casual visitor to any centre of architecture in India would have noticed that sculpture plays a prominent part in Indian architecture. Every wall, every pillar, every gate and every stone is carved into "scenes" from the life of the Buddha or from the Puranas, into human forms, especially female, in some dance posture or other, into *Dhwara-palakas* or the gate-keepers, or into some flower or recurring designs of animal and birds. Commonsense would have told him that all these works of art could not have been the handiwork of a super-crank who for want of a better work to do carved every stone and wood and cave into a meaningless mass of something. A closer study of them would have showed him that ther was a method in the madness that if he strained a bit to follow them critically, they would have thrown open to him magic casements of beauty. But unfortunately the casual visitor stopped there and passed his verdict on Indian Sculpture as something wonderfully beautiful and great because it was unintelligible to him. It is pardonable if a foreigner who had no idea of Indian culture and Indian religion made such a statement. But unfortunately, more often than not, even an educated and cultured Indian took pride in such utterances. Apart from revealing his ignorance of his culture, his statements proclaim the gravity of the situation, the extent to which Indian art has fallen on evil days in the country of its very inception. The outstanding reason for it is English conquest of India. Now, when we have gained our Freedom, it is up to us to strive to learn to appreciate our culture and arts and open a fresh page in the Diary of our Nation.

*Distortion in Indian Art*

When we look at a Sculpture done in Indian style, the most outstanding feature we notice is that it is not natural; that is to say, it is not the phothgraphic representation of a human being. Its limbs and its features seem to resemble human features and limbs yet there is a difference between them. The eyes extend from the nose to very near the ears, the ears elongate downwards and hang like pendants, the hands descend lower than the knees, the shoulders broaden in the case of male figures while the breasts take

## ऋषभः - राजर्षिः ॥

मनोः सूनोः प्रियव्रतस्य पौत्रो नाभिः अनपत्यः सर्वानप्यर्थान् निरर्थकं मेने। दैवानुग्रहेण विना आत्मनो मनोरथस्य सिद्धिः न भवेदिति मत्वा गुरून् आहूय तैस्सह देवायतनेषु सविशेषं पूजाः प्रार्थनाश्च कर्तुं प्रावर्तत। भगवान् केवलं पूजाभिः, प्रार्थनाभिश्च प्राप्तुमशक्योऽपि आत्मानं भक्तिभावेन य आराधयति तस्मै अत्यन्तं सुलभः। नाभिः भगवति अतीव भक्तिमान्। अतः यदा आलयेषु पूजाः प्रारम्भन्त तदैव तस्मै नाभये भगवान् प्रत्यक्षोऽभवत्। नाभिः आचार्यश्च प्रत्यक्षीभूतं भगवन्तं दृष्ट्वा आनन्दनिर्भरहृदयाश्च तं विविधैः स्तोत्रैः अस्तुवन्। एवं स्तुतः परमेश्वरः नाभये पुत्रप्राप्तिरूपं वरं अनुगृह्य अन्तरधात्। कालक्रमेण नाभेः सर्वलक्षणलक्षितः पुत्रोऽजायत। दिनदिनप्रवर्धमानः स बालः बाल्य एव सकलाः कलास्सम्पाद्य विद्यानां सारं तत्वज्ञानमात्मसंयमनंच अलभत। दर्शनीयाकृतिः स गुणवान् पित्रा ऋषभ इति सार्थकं नाम च लेभे। एवं ऋषभः तत्वज्ञानेन एक एव देवस्सर्वभूतान्तर्वर्तीति विज्ञाय सर्वानपि आत्मना समभावेन पश्यन् सर्वेषामत्यन्तं प्रीतिपात्रमभवत्। अनन्तरमात्मनः पित्रा नाभिना स राज्येऽभ्यषिच्यत। राज्यभारेण निर्मुक्तो नाभिः जायया सह विश्रान्त्यर्थं हिमालयेषु प्रसिद्धं बदरिकाश्रमं जगाम। तत्र च नाभिः जायया सह नरनारायणरूपं देवं ध्यायन् अन्ते च तदैक्यतामाससाद। राजा ऋषभश्च ऐन्द्रीं जयन्तीं नाम कन्यां परिणीय तस्यां बह्वपत्यमलभत। तस्मिन्नपत्ये ज्येष्ठो भरतः अत्यन्तं धीमानासीत्। स्वत एव विवेकज्ञानवान् ऋषभः निर्मलेन मनसा ध्यानेन च परमात्मैक्यज्ञानं सम्पादयन् ब्रह्मानन्दमनुभवन्नासीत्। अथापि स प्रजानां सौख्याय शान्तये च लोकव्यवहारेषु प्रावर्तत। प्रजानामत्यन्तं प्रीतिपात्रं सः धर्माननुपदिशन् सर्वा अपि तत्वज्ञानमार्गे प्रवर्तयामास। तस्य राज्ये सर्वेऽपि सुखिनो बभूवुः। एवं तस्य जीवितमितरेषामादर्शप्रायमभूत्। कदाचन ऋषभो राजर्षिः तत्रतत्र पर्यटन् ब्रह्मावर्तं देशं जगाम, तत्रैव तस्य पुत्राः विद्यामभ्यस्यन्तः आसन्। स तान् कुशलं पृष्ट्वा एवं धर्मानुपादिशत्। "जन्मसु मानवजन्म दुर्लभं धन्यतमं च। मानवः इन्द्रियविषयैराकृष्य वश्यो मूढश्च न भवेत्। ऐहिकसुखानि केवलं अधमानि नश्वराणि च। कथमपि दुर्लभमात्मनो जन्म मानवः निष्फलं न कुर्यात्। मनुष्येण तप आचरितव्यम्। येन तस्य हृदयं निर्मलं भवेत्। निर्मलहृदयैः तत्वज्ञानं संपाद्य सत्यमानन्दमनुभवितुं शक्ताः धन्यात्मानो भवन्ति। पूतचरितैस्संगतिः महात्मनां परिचर्या च पुरुष मात्मसाक्षात्कारं नयति। नीचजनसाङ्गत्यं केवलमात्मनाशाय कल्पते। त एव धन्या महात्मानश्च ये खलु सर्वमात्मनः साम्येन पश्यन्ति, ये च कामक्रोधादिवर्जिताश्च भवन्ति। तेषामेव चरितं उत्तममादर्शप्रायंच। ते तु सर्वदा दैवमात्मानि चिन्तयन्तः प्रापञ्चिकविषयेष्वनासक्ता भवन्ति। प्रापञ्चिकविषयैराकृष्टो मानवः नश्वरस्य तत्सुखस्य हेतोः दुश्चरितेषु आत्मानं प्रवर्तयन स्वयं च नश्यति। अतस्सर्वथा दुश्चरिते मनो न निवेशयेत्। अज्ञानेनाविवेकेन च मानवः दुःखमनुभवति विवेकवांस्तु परमं सत्यं जानन् आत्मानं दुःखान्मोचयति। पुत्राः! आत्मानं परमात्मभावेन पश्यत। स्वार्थान त्यजत। द्वन्द्वातीताश्च भवत। श्रवणमनन निदिध्यासैश्च आत्मानं जानीत। सद्भिः सह साङ्गत्यं कुरुत भगवतो दिव्यचरितानि कीर्तयत। सर्वप्राणिषु दयां सौहार्दंच कुरुत। मनोनिग्रहेण अहंकारममकारौ परित्यजत महामुनीन्मानयत। तेषां वचनानि श्रृणुत। आत्मनः कर्तव्यं निर्वहत। वाचं नियच्छत। सर्वत्र चात्मानं आत्मनि सर्वं परमात्मस्वरूपं पश्यत।" इति

# శ్రీ సత్యదేవ మాహాత్మ్యము

(దశావతార వర్ణనము)

*తటవర్తి సూర్యనారాయణమూర్తి*

చతురాస్యుం గికుటించి వేదసమితిన్ జౌర్యంబు గావించి క్షి
ప్రత బర్వెత్తిన సోమకాసురుని బారావార మధ్యంబునన్
మృతుగావించి విరించికిన్ మఱలఁ బ్రామిన్కుల్ సమర్పించి త
న్నుతులంగాంచిన మత్స్యమూర్తిహరినిన్ యోజింతు మత్స్వాంతమున్.

గిరి మంథానముజేసి రజ్జువుగ భోగిస్వామి గావించి హె
చ్చరికన్ క్షీరపయోధి నిర్జరులు రక్షస్సంఘమున్ ద్రచ్చుచో
బరువై యాగిరి మున్గఁ జొచ్చుటయు నాపై నిన్ను బ్రార్థింపఁ జె
చ్చెఱబైకెత్తిన కూర్మమూర్తి హరినిన్ సేవింతుమత్స్వాంతమున్.

పరగర్వాతిశయ ప్రమత్తుఁ బ్రకృతి ప్రత్యర్థితానేక దు
ర్భరదౌష్ట్యాచరణ ప్రవృత్తు ధరణీభార ప్రతీకాశు ని
ర్జరవిద్వేషు హిరణ్యనేత్రు దిగధీశశ్రేణి మోదింప స
త్వర మందించినక్రోడమూర్తి హరినిన్ ధ్యానింతు మత్స్వాంతమున్.

డింభా లేఁడుర లేడు విష్ణు'ఁడన' దండ్రీ యున్నవా'ఁడెందు' నీ
స్తంభంబందున జూపరా, యనుచుఁ జేతం గొట్టగాఁ బుట్టి యా
దంభోద్రిక్తు హిరణ్యకశ్యపు నెడందం జీల్చి ప్రహ్లాద చి
త్తాంభోజంబు జిగుర్పజేసిన నృసింహా గొల్తు మత్స్వాంతమున్.

అతిధర్మాత్మకుఁ డయ్యు దేవతల రాజ్యంబున్ సిరుల్‌లాగి ప
ల్వెతలంబెట్టి త్రిలోకనేతయయి పాలించంగ నీ వర్థివై
క్షితి మూడడ్గులుగోరి దాత బలి వాసిన్‌నిల్పి పాతాళ భూ
స్థితుగాజేసిన వామనాకృతి హరిన్ సేవింతు మత్స్వాంతమున్.

ఘనధానుష్కులు చండశాసనులు దుష్కర్మానురక్తుల్ కళం
క నిధుల్ గోద్విజహంతలున్ నిజబలాఖండాభిమానోగ్ర వ
ర్తను లాహైహయ వీరులం బరశుతీవ్రస్ఫారధారన్ వధిం
చిన శ్రీభార్గవరామమూర్తి హరినిన్ సేవింతు మశ్రాంతమున్.

సురకాంతా కచకర్షణాధిక విలాసుం గిన్నరీ మాన త
స్కరధౌరేయు మునీశయాగశిఖి వర్షాకల్పుఁ బ్రాపంచికాం
తర శాంతిస్థిర ధూమకేతువును లంకానాథునిం దత్సహో
దరునిం జంపిన రామమూర్తి హరినిన్ధ్యానింతుమశ్రాంతమున్.

దితివంశోద్భవ రాజలోకము సమందీభూత హింసా ప్రకం
పిత భూనాకము జేదిభోజ మగధోర్వీవల్లభానీకమున్
స్మృతిమార్గ వ్యతిరేకమున్ వసుమతీక్షేమంబు గాంక్షించి దు
న్మితివా యాదవకృష్ణమూర్తి హరినిన్సేవింతు మశ్రాంతమున్.

బలిపీఠంబున నోరులేని పసులన్ బంధించి బాధించు య
జ్జ్వాల హింసారతమైన దుర్మత దురాచారంబులన్మాన్పి జీ
వులఁ బ్రేమించి పవిత్రశాంతి కరుణాంబుస్నాతులంజేసి ధ
న్యులుగాజేసిన బౌద్ధమూర్తి హరినిన్ యోజింతుమశ్రాంతమున్.

ఆశాపాశ నిబద్ధి తాత్ముల ధనవ్యాపారకాంతా సుఖా
వేశోల్లాసకలంకవర్తనుల బృథ్వీనేతలం జంపి యీ
దేశం బెల్లెడ పర్వధర్మ విధులన్ దీపించి భాసిల్లు నే
యాశుండాతని గల్కిమూర్తి వరదాయింగొల్తుమశ్రాంతమున్.

# అమరావతి క్షేత్రము - అమరేశ్వరుఁడు

కవిరాజశిరోమణి, పండిత, దీవి నరసింహాచార్యులు, అష్టావధాని, అవనిగడ్డ.

**అమరావతి** పంచారామక్షేత్రములలో నొకటి. మరియు నిదియే మొదటిది. ఈ క్షేత్రము గుంటూరు పట్టణమునకు యిరువదియొక్క మైళ్ల దూరమున, కృష్ణానదికి దక్షిణతీర మందు కలదు. ఈ క్షేత్రము శ్రీశైలమునకు యీశాన్యభాగమున, కృష్ణానదికిదక్షిణతీరమందున్నట్లు పురాణములలో

"శ్రీ గిరీశాన్యదిగ్భాగె, కృష్ణాయా దక్షిణే తటే
అమరేశమితి ఖ్యాతం తీర్థంత్రైలోక్య విశ్రుతమ్"

అని వర్ణింపబడినది. కనుకయిదిపురాణప్రసిద్ధమైన దివ్యస్థలము. దీనికి "క్రౌంచక్షేత్ర"మని కూడ పేరు. మునేరు యిచ్చటనే కృష్ణానదిలోఁ గలియుచున్నది.

## అమరావతి - పురాణయుగము

ఈ క్షేత్రమునుగూర్చి స్కాందపురాణము సహ్యాద్రిఖండములోను, బ్రహ్మాండపురాణము పూర్వఖండము నందును, పద్మపురాణము ఉత్తరభాగములోకూడ ప్రశంసింపఁబడియున్నది. తొల్లి స్కాందపురాణములో తారకాసురవధ ఘట్టమున క్షేత్రమాహాత్మ్యమిట్లు వర్ణింపఁబడినది. తారకుని గురించి దేవతలు యీశ్వరునితో మొఱపెట్టుకొనగా,

"మద్భక్తస్తారక స్సత్యం భవంతశ్చ తథైవ మె
ధర్మద్రోహీ తారకస్తు మదన్యాంస్తాడయన్ స్థితః
అభీక్ష్ణంసేవతే నిత్యం మామేవనకథం త్యజే
కింత్వహం నోత్సహె హన్తుం స్వహస్తై నైవ తారకమ్"

అని చెప్పెను.

అనగా నా భక్తుడైన తారకాసురుఁడు మిమ్ములను నా కంటె అన్యులను, ధర్మద్రోహియై కొట్టుచున్నమాట వాస్తవము. కాని వాడెల్లప్పుడు నన్ను సేవించుచుండును. అందువలన నతనిని నా హస్తములతో చంపుటకు నిచ్చగింపను. అని యర్థము; కాని,



అమరేశ్వరాలయము - అమరావతి



ఆలయ దృశ్యము - (దగ్గరనుండి)

" మత్సుతోమత్సమో యుద్ధే షణ్ముఖః పరవీరహా
తం సేనానాయకం కృత్వాప్రజధ్వంయోద్ధు మాహవె"

నా కుమారుఁడు కుమారస్వామి శత్రువులను యుద్ధము నందు జయించుటలో నాతో సమానుఁడే. కాన నతనిని సేనానాయకుని చేసికొని యుద్ధము సేయుఁడని చెప్పెను. కాని దేవతలకు జయము సమకూరలేదు. అప్పుడు మహ దేవునితో తిరిగి విన్నవించుకొనగా పరమేశ్వరుడిట్లు చెప్పెను. " తొల్లి సముద్రమథనమున క్షీరసాగరమున అమృతలింగ ముద్భవించెను. దానిని తారకాసురుఁడు దేవతల కందనీయక బలవంతముగఁ గొనిపోయి, యతి భక్తితో దానిని పూజింపుచు తన కంఠమున ధరించు చుండెను. అందువలన నతఁడు మహబలోపేతుఁ డయ్యెను; కాన యమరగణమును రక్షించుటకు నా కుమారుఁడైన షణ్ముఖుడే తగినవాడు. కాని యతని కంఠమున నా యమృతలింగమున్నంత కాలము వాఁడు వధ్యుఁడు కాడు. ఆ లింగమును త్రుంచిన కాని యతని జయించుటకు వలను పడదని కుమారునితో చెప్పవలసి నదిగా దేవతలతో

" తారకస్య గళే లింగం వర్తతె ప్రాణదైవతం
లింగభేదేన తన్నాశొ భవిష్యతి ననంశయః" అని చెప్పెను. ఈ విషయమును కుమారస్వామితో దేవతలు విన్నవించినట్లు

" ఏవం శృత్వా సురాస్తూర్ణమాగత్య శరజన్మనె
విజ్ఞాప్య తం వధోపాయమీశ్వరోక్తం సురద్విషః"

అను శ్లోకమువలన తెలియుచున్నది. అంత నా కుమార స్వామి తారకునకు తారకమగు యాయమృతలింగమును నిశితబాణములచే భగ్నమొనర్చెను. అంత నాలింగము పంచఖండములై, దేవేంద్రుని యుద్యానవనమునఁబడెను. దాని కాచ్ఛాదనమై యొక గొప్ప వటవృక్షము పెరిగెను. ఇట్లాఖండపంచకము సంతర్హితమై చాలకాలముండెను. అంతనొక నాఁడింద్రుఁడు "ఐరావతము" నెక్కి తన నందనోద్యానమున విహరించుచుండ నాదేవదంతావళమీ యమృతలింగ శకలము లున్న చోటునకుం జేరి, యా వట వృక్షమునకు ప్రదక్షిణమొనరించి నమస్కరించుచుండెను. అప్పుడు దేవేంద్రుఁడా వారణరాజమును నమస్కరింపు చున్నందుకు కారణమడిగెను. గజేంద్రుఁడీ యుదంత

మును( జెప్పెను. ఆ ఖండపంచకమును తనకు చూపమని దేవేంద్రుడడుగ వటవృక్షమును తన తొండముచే పెకలించి చూపించెను. కాని యందు నాలుగు ఖండములు మాత్రమె కానవచ్చెను. ఐదవ ఖండము కనుపించలేదేమని యింద్రుఁడడుగ నా వారణేంద్రమింద్రునితో "నీవహల్యాజారుఁడవైన కారణమున నాఖండము నీకు కనబడ"దని చెప్పెను. అందుల కింద్రుఁడు పశ్చాత్తాపమునొంది తన పాప పరిహారమునకై మొదటి ఖండమును( గైకొనిపోయి కృష్ణాతీరమున "క్రౌంచగిరి" పై ప్రతిష్ఠించి పూజించుటచే తనకు మునిపత్నితోకలసిన పాపము పరిహరించుకొనెను ఇది అమరపతిచే ప్రతిష్ఠింపఁబడుటవలన "అమరేశ్వరుఁ డనియు అమరపతి వాసమువలన నీక్షేత్రమునకు "అమరావతి" అనియు పేర్లు కలిగెను. ఇట్లే యొక ఖండమును కుమారస్వామి "సామర్లకోట" లోను, వేఱొక ఖండమును సూర్యభగవానుఁడు "దాక్షారామ" మందును, మరియొక ఖండమును చంద్రుఁడు "గుణిపూడి" లోను ప్రతిష్ఠించిరి. మిగిలిన ఖండమును "క్షీరారామము" (పాలకొల్లు) లో శ్రీ జనార్దనుఁడే ప్రతిష్ఠించెను".

ఈ లింగపంచకమును సంతపరకు వటచ్ఛాయచే కాపాడబడినందున యావటవృక్షమును మహామహిమాన్వితమైనదయ్యెను. "దానిని పెకలించితివి కనుక యిది వ్యర్థము కానూడదు. ఇది పితృ ముక్తిహేతువైనదనియు దీనిని నా పాదక్షేత్రమైన "గయ" యందు స్థాపించు"మని విష్ణువు దేవేంద్రుని కాజ్ఞాపించెను. అప్పుడా పాకశాసనుఁడా వృక్షమును( గొనిపోయి "విష్ణుపాదక్షేత్రమగు గయ" యందు అక్షయమని స్థాపించెను. ఇందువలన దీనికి "అక్షయవట"మను పేరు కలిగినది. జనార్దన దేవుని యనుగ్రహమువలన నీవటచ్ఛాయ పితృ ముక్తి హేతువైనదని సూత్రకర్తలందరు "అక్షయ వటచ్ఛాయేయమ్" అని కంఠోక్తి పలికిరి.

ఇదియే బుద్ధభగవానునకు జ్ఞానోపదేశ మొసంగిన వృక్షరాజము. అందువలన దీనిని "మహా బోధివృక్షమ"ని నాడుచుందురు. ఇది నేటికిని "గయా" క్షేత్రమున కలదు. ఇట్లు తారకాసురవధానంతరమునాడు ముప్పది మూడు కోట్ల దేవతలును దేవేంద్రునిచే ప్రతిష్ఠింపఁబడిన "అమరేశ్వరు"ని సేవించుటకై దేవలోకమునుండివచ్చి యా క్షేత్రమున నివసించుటచే దీని కీపేరు కలిగినదని,



సంపూర్ణాలయ దృశ్యము

"త్రయస్త్రింశత్సురాస్తత్ర స్థిత్వేమాసహితం శివమ్
యజంతస్స్వేవ మూనాశ్చ వాసంచక్రుశ్శివాజ్ఞయా
తస్మాదేవ పురీయంస్యాదమరావత్యభిఖ్యయా"

అని కూడ క్షేత్రమాహాత్మ్యమున నిరూపింపఁబడినది. దేవతల కావాసమైన కతమున, యీ పట్టణమునకు "అమరావతి" యను పేరు సార్థకమగునట్లు వ్యాకరణ పండితులచే నామకరణము చేయబడినట్లు,

"ప్రాపాఽమరావతీ త్యేషా సంజ్ఞాంతచ్ఛాబ్దికైః కృతామ్"

అను శ్లోకమువలన తెలియుచున్నది. మరియు నీ పట్టణము పూర్వము కాంతిచేతను, సంపదలచేతను, పండితుల చేతను దేవరాజధానియగు అమరావతితో తుల్యముగనే యుండియున్నట్లు,

"తస్మిన్పురాజేధృత దేవరాజ
ధాన్యశ్రియా భూస్తపభి ఖ్యయాచ
సారాజధానీ వసునా వికాసమ్
బభూవనిత్యం సుమనస్సుపృద్ధా" అను ప్రమాణము వలన స్పష్టమగుచున్నది.

## బృహస్పతి - శుక్రాచార్యుఁడు

ఈ లింగమును దేవేంద్రుఁడు ప్రతిష్ఠించుటకు ముందు బృహస్పతి యీ క్షేత్రమర్హమైనదని నిర్ణయించి, లగ్నమును పెట్టి ప్రతిష్ఠింపఁజేసెను. ఈ సంగతి విని శుక్రాచార్యుఁడు దేవగురునితో "నీవీక్షేత్ర మర్హమైనదని యెట్లు నిర్ణయించితివి? శ్రీ మహావిష్ణువు సహ్యగిరియందు స్వయముగా కృష్ణానదియై జన్మించి యీ ఆలయమును తన గర్భమున జీర్ణించుకొనును. కాన యిది దోషమని చరలగ్నమని యెఱుగవా?" అని పలికి హేళనచేసెను. అందుకు దేవగురుఁడది "క్రౌంచాద్రి" యనియు నక్కడ ప్రతిష్ఠించిన లింగమును కృష్ణవేణి పెకలింపఁ జాలదని చెప్పినట్లు క్షేత్రమాహాత్మ్యమునని ట్లు వర్ణింపఁబడినది.

"కస్మిన్నేవంగతె కాలే కృష్ణానామ మహాపగా
సహ్య పర్వత సంజాతా విష్ణురూపాసనాతనీ
అనేనైవ ప్రదేశేన సమాయాస్యతి వేగతః
తవాగమన కాలేపి నదీపాతో భవిష్యతి" అని శుక్రుని ఆక్షేపము. శుక్రాచార్యునిచూచి నవ్వుచు,

"క్రౌంచాఖ్యగిరి రాజోఽత్ర ప్రచ్ఛన్నోమవి తిష్ఠతి
ఆ పాతాళమభివ్యాప్య తస్యాగ్రేచాయ ముత్థితః
తస్మాత్కృష్ణా చాగతాఽపి నభేత్స్యతి గిరింశివమ్"

అని బృహస్పతి సమాధానము. అనగా యీ "క్రౌంచగిరి" పాతాళలోక పర్యంతము వ్యాపించి ప్రచ్ఛన్నముగానున్నదనియు, దానిమీదనే యీ అమరేశ్వరుఁడున్నూ, దేవాలయమున్నూ స్థాపింపఁబడినందువలన యీ క్షేత్రమునుఁగాని యీయమరేశలింగమునుగాని కృష్ణానది యేమియు చేయఁజాలదని చెప్పెను. ఇందువలన నిది "క్రౌంచనగాగ్ర"మున యున్నట్లు స్పష్టమగుచున్నది. మరియు నీ యమరేశ్వరస్వామి" ఆశ్వీయుజ శుద్ధ దశమి తిథియందు ప్రతిష్ఠింపఁబడినట్లు

"ఆశ్వీయుజసితేపక్షె - దశమీసర్వసిద్ధిదా" అని ప్రారంభించి, "అంగీచకార దేవేశో గురుప్రోక్తం శుభంత్వితి। గురుప్రోక్త విధానేన స్వర్ణశంకుం నిధాయచ। అన్వర్థమమరేశాఖ్యం నామకృత్వాఽఖిలేశతుః" అను శ్లోకరత్నములవలన తెలుచున్నది.

## సిద్ధక్షేత్రము—ముక్తక్షేత్రము

ఈ క్షేత్రము మహోత్తమమైనదనియు, యిందు తపంబొనర్చి సిద్ధిని పొందినట్టియు ముక్తినిఁ గాంచినట్టి భక్తులును, మునీశ్వరులును పెక్కుఁరు కలరని యిది సిద్ధుల చేతను, చారణాది గంధర్వులచేతను నిత్యము సేవింపఁబడుచుండుననియు,

"కృష్ణవేణీ నదీ రమ్యా సిద్ధచారణ సేవితా
అమరేశం మహాపుణ్యం తీర్థానాముత్త మోత్తమ్"

"అమరేశం మహాదేవం లోకనాథం జగద్గురుమ్
తయోర్దర్శన మాత్రేణ సిద్ధిమాప్నోతి మానవః"-స్కాందము



గంగా పార్వతీ సమేత అమరేశ్వరస్వామి - ఉత్సవమూర్తి

"ఇంద్రాదయస్సు రాస్తత్ర సిద్ధాశ్చ కపిలాదయః
వసంతి మునితాం ప్రాప్య తత్ర తత్ర తపఃకృతే"
-పాద్మము

"అమరేశసమం తీర్థం నభూతం నభవిష్యతి
అమరేశం మహాదేవం సర్వదేవమయం శుభమ్
దృష్ట్వా తత్ర తపః కుర్యాద్భుక్తి ముక్తి ఫలప్రదమ్
అత్రస్నాత్వా పునర్జన్మ నగచ్ఛంతీహ మానవాః"
-బ్రహ్మాండ పురాణము

"అస్మిన్ కోటి శతం తీర్థం సదా సన్నిహితం భవేత్
జన్మత్రయార్జితం పాపమమరేశ్వర దర్శనాత్
సకృన్నాశయతి క్షేత్ర మగ్నిప్రాప్తం తృణం యథా"

అని బ్రహ్మవైవర్తమందును కలదు. ఈ క్షేత్రమున నూరు కోట్ల తీర్థములు యెల్లప్పుడు సన్నిహితములై యుండును నిన్ని, యిందు నొక్కసారి స్నానము చేసినందువలనను అమరేశ్వరుని దర్శనమువల్లను మూడు జన్మములనుండి సంపాదింపఁబడిన పాపములన్నియు, నిప్పువలన తృణరాశి దహింపఁబడినట్లు హరించిపోవునని చెప్పఁబడినది.

## అమరేశ్వరుడు—క్రౌంచనాథుడు

కుమారస్వామిచే అమృతలింగము యైదు ఖండములుగా కొట్టఁబడెను కదా! అందు శిరోలింగము క్షీరారామమున నున్నట్లును, ఆదిలింగము యమరారామమున ప్రతిష్ఠింపఁబడినట్లు పురాణములు వర్ణించుచున్నవి కదా! ఈ శిరము లేని మొండె ఖండములకు పూజ్యత యున్నదా? వాటికి అవయవ స్ఫూర్తి లేదు కదా? అవి యెట్లు ప్రతిష్ఠించుట కర్హము లగునని పాఠకులకు సందేహము కలుగవచ్చును. దీనికి శ్రీ స్వామివారి లింగము ఈశ్వరుని పంచవింశత్యవతారములలో నొక యవతారమూర్తి యనియు స్వామివారి సర్వావయవములునందు అంతర్హితములై యున్నవనియు, (తామెలుపలె) బ్రహ్మాదులకు సహితము అవ్యక్తమై తేజోమయమై, (శుద్ధతేజస్సే రూపముగా కలిగి) అనగా ఆదిమధ్యాంత శూన్యమైన యవతారమనియు శ్రీ మహావిష్ణువుకు యేకవింశత్యవతారము లెట్లో, యట్లే యీశ్వరునకు పంచవింశత్యవతారములు "శివభాగవతము"న కలవనియు, అనగా "దిగంబరత్వము" "గంగాధరత్వము" "చంద్రరేఖధారణము" "గజాంబరధారణము" "నీలకంఠత్వము" యెట్లో, అట్లె కేవలము "లింగస్వరూప" మొక యవతారమని, "కూర్మపురాణము"న వర్ణింపఁబడియున్నది. అది యెన్ని ఖండ ఖండములైనను దాని తేజస్సు అన్నిటియందు సమముగనే యుండును. కాని లింగమునకు తల యని హస్తములని పాదములని వేఱుగా యంగము లుండనక్కరలేదు. యీ విషయమే స్కాందమున శివుఁడు స్కందునితో

"యూపంతి భేదనె లింగశకలాని పతంతి హి
ప్రాదుర్భవిష్యంతి తాని శివలింగాన్యసంశయమ్"

అనియు "తాని లింగాని సేవధ్వం శత్రునాశనహేతవే" అనియు దేవతలకు నుపదేశించినట్లు చెప్పఁబడెను. ఇచ్చట లింగము సుమారు 3 అడుగులకై వాటము (circumference) కలిగి 5 గజముల యెత్తుండును. శుద్ధస్ఫటికము వలె తెల్లగా నున్నది. ఈ లింగమును పూజించుటకు మూడు అంతస్తుల మేడ కట్టింపబడినది. మూడవ అంతస్థులోఁగాని శిరోదర్శనము కాదు. మరియు శ్రీ స్వామివారి అధోభాగము భూమిలో సంతర్హితమై యున్నది. ఇందువలన స్వామి మానవులకు "శిరఃపూజ"యు, దేవతలకు "పాదపూజ"యు ప్రసాదించెనని చెప్పుదురు. శిరోభాగమున నొక చిన్న గుంట కలదు. ఇది కిరాత వేషమున నున్నప్పుడు యర్జునునిచేత కొట్టఁబడినదని ప్రతీతి. మరియు శిరోభాగమునుండి క్రిందివరకు దక్షిణోత్తరముల (యిరువైపులను) అంగుష్ఠప్రమాణమున చారలు కలవు. అవి బాణములచే కొట్టబడినపుడు యొకటి రక్తధార యనియు,



అమరేశ్వర లింగము

మరియొకటి పాలధార యనియు చెప్పుదురు. వీరు "క్రౌంచ గిరి" మీద నిలిచియుండుటచే "క్రౌంచనాథుఁడ"ను పేరుఁగూడ వహించిరి. ఈ విషయమును,

"శంభు శ్శుంభత్ప్రమథ నిచయైః క్రౌంచ నాథోఽ
వతస్థే"

అను పురాణ ప్రమాణము ధృవపరచుచున్నది.

కొంతమంది సంస్కృతకవులు యీ స్వామిని గూర్చియు యీ ధాన్యవాటికాపురమును గురించియు, వారణాశీ క్షేత్రముతో పోల్చి అమరేశ్వరుఁడె విశ్వనాథుఁడనియు, ధాన్యవాటి కాపురము "కాశి" యనియు, కృష్ణ నదియే "గంగా" నది యని

"అమరేశోహి విశ్వేశస్సా కాశీ ధాన్యవాటికా
కృష్ణవేణ్యేవ సా గంగా సత్యమేవ ననంశయః"

అని వర్ణించిరి. మఱికొంద రీ లింగముయొక్క యౌన్నత్యమును, శ్వేతవర్ణమును, వర్తులత్వమును గురించి యిట్లు ఉత్ప్రేక్షించిరి.

"స్తంభో బ్రహ్మాండగేహైకము విరచితో నిస్తులో నైవ
హాతుం
దండో ద్యావాపృథివ్యోః కిముబుధవిహితో నైవ
చాద్యంతశూన్యః
ధారామందాకినీకిం పతతిహినభసోనస్రవ త్యేవ నిత్యమ్
నో! నో! జ్ఞాతం! సుధియాముకృత మితి జనైర్మన్యతే
క్రౌంచనాథః"

అనగా యీ లింగము సకలబ్రహ్మాండమను యింటికి మధ్యస్తంభముగా బ్రహ్మచే నిర్మింపబడెనా? ఇది దేనికిని యంటలేదు. లేక భూమ్యాకాశములను కొలుచుటకు మానదండమా? కాదు. దీని కాద్యంతములు లేవు కనుక. లేక శుద్ధమైన ఆకాశ గంగ పై నుండి ధార గా పడుచున్నదా? లేదు. నిత్యము స్రవించుట లేదు. కనుక యిది జ్ఞానుల నుద్ధరించుటకు నవతరించిన "క్రౌంచనాథుఁడు" కాని మఱొండు కాదు. అని అర్థమును చెప్పిరి.

## అమరావతి—బౌద్ధయుగము

క్రీస్తుపూర్వము ఆరవశతాబ్దములో "హిందు" సంఘము నందు మతవిషయములను గూర్చి అశాంతి ప్రబలెను. ఈ యశాంతిని పోగొట్టుటకు "వర్ధమాన వీరుఁడు" "గౌతమ బుద్ధుఁడు" అను యిరువురు మహనీయు లవతరించిరి. వీరిలో మహావీరుఁడు జైనమతమును, గౌతముఁడు బౌద్ధమతమును బోధించిరి. మహావీరుడు "వైశాలీ" నగర సమీపమున "కుండ" గ్రామమున జన్మించెను. ఇతని తండ్రి "సిద్ధార్థుఁడు." తల్లి "త్రిశల" దేవి. క్షత్రియ కులస్థుఁడు. బాల్యమున సకల విద్యల నభ్యసించి "యశోద" యను కన్యను వివాహమాడి తరువాత సన్యాసి యయ్యెను. ఇతను యింద్రియములను జయించిన వాడగుటచే "జినుఁడ"ని పేర్వడసెను. ఇతను క్రీ॥పూ॥ 618 సం॥రములో జన్మించి, క్రీ॥పూ॥ 516 లో మరణించెను. వీరు బోధించిన సిద్ధాంతములలో "అహింస" ప్రధానమైనది. వీరితోఁ బాటు గౌతముఁడు నేపాళ దేశములో "కపిలవస్తు" నగరమున క్రీ॥పూ॥ 623 సం॥రములో శాక్యవంశములో "శుద్ధోదను"నకు, "మాయాదేవి" కిని జన్మించెను. వీరు 16 వ సంవత్సరమున "యశోధర" యను యామెను వివాహమాడి ఆమెయందు "రాహులుఁడ"ను పుత్రుని గనెను. ఇతఁడు ప్రపంచములోని మానవుల కష్టములనుగూర్చి విషాదము నందెను. "వృద్ధత్వము, రోగము, మృత్యువు"లను గురించి సదా తలపోయుచు, 29 వ యేట సన్యాసియై, "గయ"కుఁ బోయి యచ్చట నున్న "వట వృక్ష" చ్ఛాయనుఁ గూర్చుండి, దివ్యజ్ఞానముకొరకు ధ్యానించి యారేండ్లు తపస్సు చేసెను. అప్పటి కతనికి జ్ఞానోదయమయ్యెను. అప్పటినుండి యతఁడు "బుద్ధుడని" పిలువఁబడెను. ప్రజలకు తన ధర్మములను బోధించుటకై కాశి, మగధ, కోసల దేశములందు సంచార మొనర్చి క్రీ.పూ. 543 సం॥రములో దేహమును చాలించెను. గౌతమ బుద్ధుని యనంతరము, బౌద్ధమతమునకు రాజాదరణము మెండయ్యెను. హిందుదేశ మంతటను వ్యాపించెను. అశోకుని కాలమున విదేశములకుకూడ వ్యాపించెను. చివరకు అశోకుడు బౌద్ధమతమును స్వీకరించి బౌద్ధమత గురువగు "ఉపగుప్తుని"తో క్షేత్రములన్నింటిని సందర్శించెను. అప్పుడే ప్రధానధర్మములను శాతిపలకలపై చెక్కించెను. ప్రచారకులను యేర్పాటు చేసెను. బౌద్ధసన్యాసులుండుటకు పర్వతములలో గుహలను మంటపములను తొలిపించెను. "సాంచి" "శ్రీశైలము" మున్నగు చోట్ల స్కంధావారములను నిర్మింపఁజేసెను. అప్పుడే కృష్ణామండలములోని, ఘంటసాల, గుడివాడ, గుంటూరు మండలమున "ఉండవల్లి" "భట్టిప్రోలు" మున్నగు చోట్ల కొన్ని స్తూపములు నిర్మింపఁబడినవి.

శాతవాహనులు బ్రాహ్మణులు. వీరు పరమతసహనము కలవారు కనుక బౌద్ధమతమునుకూడ వీరంగీకరించి తగు పోషణ మొనర్చిరి. బౌద్ధులు యీ క్షేత్రమును కేంద్రముగా నేర్పరచుకొని దక్షిణభారత మంతయు ప్రచారమునుసల్పిరి. నానాటికి బౌద్ధులప్రభ హెచ్చుటకాఁజొచ్చెను. వారు బుద్ధుని పేర నిచ్చటొక గొప్ప స్తూపమును నిర్మించిరి. దీని శిల్ప చాతుర్యము అతులితము. మరియు నిచ్చట పెక్కు సంఘారామములను నిర్మించుకొనిరి. వీరొక గొప్ప విద్యాపీఠమును, (విశ్వవిద్యాలయమును) కూడ స్థాపించిరి.

దానికి "ధనదపుర విద్యాపీఠమ"ని పేరు. ఇది దేశదేశము లందును కీర్తివహించినది. ఇందు అరువదినాలుగు కళలు నేర్పబడుచుండెను. ఇంతవరకేల—యిది సమస్త కళలకు పుట్టినిల్లుగా పరిగ్రహింపఁబడెను. అప్పటికి యమరావతి పన్నెండు చదరపుమైళ్ల పట్టణముగా నుండెడిది. ఈ మహా పట్టణమున జనసంఖ్య ముప్పది లక్షలపైన యుండయున్న ట్లును, ఈ పట్టణమునకు మధ్యభాగమున కృష్ణానది ప్రవ హించుచున్నట్లును, యీ నగరము సమస్త సంపదలతో తులతూగు చుండెడిదనియు, నీ పట్టణమునఁగల విద్యాల యములో ఆకాలమున అరువేలమంది విద్యార్థులుండి సమస్త కళల నభ్యసించినట్లును, రెండువేలమంది ఉపా ధ్యాయులు బోధించుచున్నట్లును, వీరుకాక మరి అరువేల మంది బౌద్ధమత ప్రచారకులుకూడ నిందే యుండెడివా రనియు చరిత్రసాధనములవలన తెలియుచున్నది. వెండియు ని విశ్వవిద్యాలయమునందు భారతీయులేఁగాక, చీనా, టిబెట్టు, బర్మా, సయాం, సింహళము, జపాను మున్నగు విదేశస్థులుకూడ వచ్చి సమస్త శాస్త్రములందును, లలిత కళలయందును, శిక్షితులైరి. ఉత్తరభారత దేశమున, తక్షశిల, నలందా విద్యాపీఠములవలె, దక్షిణ భారతమున నీ విద్యాపీఠము పేరుఁగాంచినది. ఇందు సర్వతంత్ర స్వతం త్రుడైన "సిద్ధనాగార్జునాచార్యుఁడు" ప్రధానాచార్యుఁడు. ఇతనిపేర నీ మండలమున నొక "కొండ" కూడ కలదు. ఇతని కాలమునకూడ నిచ్చట అఖండ శిల్పకళాసృష్టి జరిగినది. దానికి గాంధర్వ శిల్పమనిపేరు.

దీనికి నాగార్జునుఁడు చుట్టుప్రాకారమును కట్టించెను. ఇచ్చట స్తూపమును త్రవ్వించినప్పుడొక "యెముక" (Bone) దొరికెనట. అది బుద్ధదేవునిదని యెంచి బౌద్ధులు "సారనాథము"నకుఁ గొనిపోయి, "మూలగంధకుటీ విహారము" నందుంచి పూజించుచున్నారు. ఇచ్చట అశో కుఁడుకూడ కొన్ని కట్టడములను కట్టించెను. కాని శాసన నిదర్శనము లేమియులేవు. స్తూపమునందలి ప్రతిభాగము దేనికో చిహ్నమని బౌద్ధుల భావమట. ఇచ్చట రాతిఫల కముపై మూడుఁ "ఛత్రములు" కలవు. ఇవి దేవమానవ నిర్వాణపద చిహ్నమట. అసలు స్తూపమే "మేరువు"కు చిహ్నమట.

ఈ అమరావతి స్తూపము B. C. 200 నాటిదనియు నాగార్జునుని సుహృల్లేఖయందు వివరింపబడిన దానపతి అయన మిత్రుఁడగు, ఆంధ్రరాజైన వశిష్ఠపుత్ర శాతవాహ నుని మనుమని పుత్రుడని పెక్కురు అభిప్రాయపడిరి. ఈ స్తూపమును నాలుగుసారులు నిర్మించినట్టు ప్రతీతి.

బౌద్ధులకాలములో యీ అమరేశ్వరుని "అవలోకితే శ్వరుఁడ"నియు, అమ్మవారిని "తారాదేవి" యనియు కొలుచుచుండెడివారు. ఇదిపరమ రహస్యము. అనేక బౌద్ధ చిహ్నములు, ధర్మచక్రములు మున్నగునవి కల ఆరామ మునకు "దీపాల తిన్నె" యని పేరు. ఇది అమరావతి లోనే యొకభాగము. ఇచ్చట దొరికిన బహు శిల్పములు విగ్ర హములు మదరాసు మున్నగు పట్టణములకుఁ గొనిపోయి దొరతనమువారు వస్తుప్రదర్శన శాఖలలో పదిలపరిచించిరి. కాక అనేక ప్రాచీన శిల్పములు పాలరాతితో చెక్కఁబడినవి యిప్పుడు గవర్నమెంటువారు నొక వస్తు ప్రదర్శనశాలను ఆ "దీపాల తిన్నె" స్థానముననే నిర్మించి అందు జాగ్రత్త పెట్టించిరి. ఆ శిల్పములు కొన్ని లండను పట్టణమునకు కూడఁ గొనిపోయిరి.

### ఆంధ్రరాజులు - అమరావతి

చంద్రగుప్తుడు క్రీ. పూ. 322 సం॥రములో మౌర్య రాజ్యమును స్థాపించెను. ఇతఁడు జైనమతావలంబకుఁడు. మగధ సామ్రాజ్యమునకు పాటలీ పుత్రము రాజధాని. ఇతని కుమారుఁడు బింబసారుఁడు. బింబిసారుని కుమా రుఁడు అశోకచక్రవర్తి. ఇతఁడు బౌద్ధమతమును ఆదరిం చెను. అతఁడే అమరావతిలో స్తూపమును కట్టించెను. మౌర్యరాజ్యము క్షీణింపగనే ఆంధ్రులు ప్రబలులైరి. ఆంధ్రులకు ప్రథమ చక్రవర్తి శ్రీ ముఖశాతకర్ణి. ఇతఁడు శ్రీకాకుళమును రాజధానిగా చేసుకొని పాలించెను. (ఇది కృష్ణామండలమున చల్లపల్లి జమీనులో కలదు) వీరి వంశమునకు "శాతవాహను"లనిపేరు. శాతవాహన వంశ ములో "గౌతమీపుత్ర శాతకర్ణి" కడునమర్థుఁడు. ఇతఁడు క్రీ.వె. 90 మొదలు 120 సం॥రము వరకు ఆంధ్రరాజ్య మును పాలించెను. ఇతని కాలములోనే "అమరావతి"లో పెద్దకోటను కట్టించి రాజధానిగా చేసుకొనెను. దానికే "ధాన్యకటకమ"ని పేరు. ధాన్యకటకమునకు "ధన కట కము, ధనదపురము, ధాన్యపత పురము, ధాన్యాంకపుర" మని పేర్లు. ఇది యిప్పుడు శిథిలమై "అమరావతికి" అరమైలు దూరములో పశ్చిమముగా నున్నది. "వశిష్ఠ పుత్రపులుమాలి" తరువాత ఆంధ్ర రాజులలో కడపటి వాడును ప్రసిద్ధిఁగాంచినవాడును "యజ్ఞశ్రీ". ఇతనికి గొప్ప నౌకాదళముకూడ యుండెడిది. ఇట్లు ఆంధ్ర రాజులు దక్షిణమున తంజావూరు పర్యంతము విశాల సామ్రాజ్యమును స్థాపించి నాలుగువందల సంవత్సరములు పాలించిరి. ఆంధ్రమహాసామ్రాజ్యమునకు "అమరా వతి"యు తరువాత ఏలూరు సామీప్యమునయున్న "పెద వేగి"యు, కొంతకాలము "దెందులూరు"ను రాజధానులుగ నుండెను. వీరికాలమున అమరేశ్వరుని దేవాలయము పున రుద్ధరింపఁబడెను.

## ఆలయ నిర్మాణము - పరివార దేవతలు

శ్రీ స్వామివారి దేవాలయమునకు చుట్టు 3 ప్రాకారములు కలవు. ఆలయము ప్రాఙ్ముఖము, గోపురము దక్షిణాభి ముఖముగా నున్నది. ఈ గోపురమునకు అయిదంతస్థులు కలవు. గర్భాలయము 3 అంతస్థుల మేడ. దానిపైన విమానము "ఇది చతురంగకోల" విమానము. ఇట్టిది ప్రాగ్దేశమున జగన్నాథ (పూరి) క్షేత్రమునందును, దక్షిణ దేశమున "తిరుమల్లవాలి" క్షేత్రములోను కలవు. అమరేశ్వరునికి వామభాగమున "శ్రీ బాలచాముండీ" దేవియు, (చూ॥ ముఖచిత్రము.) దక్షిణపార్శ్వమున భద్రకాళి వీరభద్రులును కలరు. గర్భాలయమునకు ఉత్తరభాగమున మేడపైననే " శ్రీ వేణుగోపాలస్వామివారు " ప్రతిష్ఠింపఁబడియుండిరి. వీరు క్షేత్రపాలకులు. ఈ గోపాలమూర్తి అత్యంత భువనమోహనమూర్తి. అంతరాళికమున రెండు నందులు కలవు. భోగమంటపములో శ్రీ రాజావాసిరెడ్డి వెంకటాద్రినాయుఁడుగారి లోహవిగ్రహమొందుకలదు. ఆ విగ్రహ మిప్పటికిని సజీవప్రతిమవలె కన్పట్టుచున్నది. ఆలయమునకు ప్రథమావరణములో తూర్పున మహిషాసురమర్దని, అగ్నేయమున వీరభద్రుఁడు, నైరుతిమూల



శ్రీ వేణుగోపాలస్వామి - క్షేత్రపాలకుడు

ప్రణవేశ్వరుఁడు, పశ్చిమదిశను " జ్వాలాముఖీదేవి " వాయవ్యభాగమున అగస్త్యేశ్వరుఁడు, ఉత్తరపు దిక్కునందు పార్థివేశ్వరుఁడు, ఈశాన్యభాగమున సోమేశ్వరుడు ప్రతిష్ఠింపఁబడియుండిరి. ద్వితీయావరణమున మేడపైన నలుదిక్కులను నాలుగు యీశ్వరాలయములు కలవు. అందు అగ్నేయ మూలను " చండీశ్వరుఁడు " నైరుతి మూలను "కాళహస్తీశ్వరుఁడు వాయవ్య దిశను " మల్లేశ్వరుఁడు, యీశాన్య దిశను విశ్వేశ్వరుఁడు స్థాపింపఁబడియుండిరి. ఈశాన్య మూలను క్రింది యావరణములో నొక్క గొప్ప ఆంజనేయ విగ్రహముండెను. ఆలయమునకు దక్షిణముగా ప్రథమావరణములోనే యొక చిన్నమంటపము కలదు. అందు కొన్ని శిలాశాసనముల ఫలకములు కలవు. ఈ మంటపముననే శ్రీ రాజావాసిరెడ్డి వెంకటాద్రి నాయుఁడుగారు బంగారుతో తులాభారమును తూగిరి. ఆలయమునకు దక్షిణోత్తర మంటప స్తంభములమీద కొన్ని శిలాశాసనములు కలవు. 6 శిలాశాసన ఫలకములు భోగమంటపమున పదిలపరుప బడినవి. అగ్నేయమూలను పెద్ద కల్యాణమంటపమును, గోపురము బయటను గొప్ప రథశాలయు కలదు.

## దానములు - శిలాశాసనములు

"స్వస్తిశ్రీ శకవర్షంబులు ౧౦౧౧ అగు నేటి విషువ సంక్రాంతి" అని ప్రారంభించి "కొమ్మునాయకుండు శ్రీమదమరేశ్వర మహాదేవరకు నఖండవర్తి దీపమున కిచ్చిన గొఱియలు ౫౫ నిత్యము మానెండు నెయ్యిపోయుంగలవాండు" అని క్రీ. శ. 1089 సం॥రములో కొమ్మనాయకుని శాసన మొకటి కలదు. శా. శ. ౧౧౧౧ క్రీ శ. 1189 సం॥రములో "కోటకేతరాజు" యీ ధరణి కోటను రాజధానిగా చేసుకుని రాజ్యపాలన మొనర్చిరి. వారి శాసనము **At the entrance to the main shrine pillar to the right.** అనువానిలో మూడువైపుల కలదు. 159 పంక్తులు చెక్కించెను. ఇందు "స్వస్తిచతుస్సముద్ర ముద్రిత నిఖిల వసుంధరా పరిపాలక శ్రీమత్త్రిణయన పల్లవ ప్రసాదాసాదిత కృష్ణవేణ్ణానదీ దక్షిణ షట్సహస్రావనీ వల్లభ భయలోభదుర్లభ చోడచాళుక్య సామంత మదానేక సమ్మగేంద్ర విభవామరేంద్ర శ్రీమదమరేశ్వరదేవ దివ్య శ్రీ పాదపద్మారాధక, పరబలసాధక, శ్రీ ధాన్యకటక పుర వరాధీశ్వర, ప్రతాప లంకేశ్వర, గండరగండ గండభేరుండ భగమెచ్చుగండ నన్నిమూతాఱంత నామాది సమస్త ప్రశస్త సహితుండైన శ్రీ మన్మహా మండలేశ్వర కోటకేత మహారాజు మహాదేవులు, 106 భోగపు స్త్రీలు "కనవాసాని" శ్రీ మదమరేశ్వర మహాదేవరకు అఖండ వతిఱకి నిచ్చిన ఇన్ప యొద్దు ౫౫ వీనింజేకొని" అని కలదు. 126 పంక్తిలో

యీ కోటకేతరాజు ముక్కంటి కాడ్వెట్టి తొల్లి - సప్తగ్రామములను విచ్చిన్నమైనవానిం ఆచంద్రాకర్కముగా నిచ్చితిమి" అని వ్రాయించెను. 142 పంక్తిలో భోగపు స్త్రీలు. "చోడమదేవి శ్రీమదమరేశ్వర మహాదేవరకు ఆ చంద్రార్కముగా ౫౫ అన్న యెడ్ల నొసగినట్లు కలదు. ఇది యిండియన్ ఇన్స్క్రిప్షన్సు 6 వాల్యూములో నె 228 రుగా ప్రకటింపఁబడినది. 1897 సం॥రములో నె 261 రుగా ఆర్క్యాలాజికల్ రిపోర్టు చేయుబడినది మరియూ 215 మొదలు 248 నెంబర్లువరకు ముప్పదిమూడు శాసనములు ప్రకటింపబడియున్నవి. ఇవ్వి అన్నియు ఆర్క్యాలాజికల్ డిపార్టుమెంటు వారిచే 1897 సం॥రములో 272 నెంబరు వరకూ రిపోర్టు చేయుబడియున్నవి. ఇందు ముఖ్యమైన వాటిని కొన్నింటి నిట యుదహరింతును. ఇందు నె 216రు శాసనము "ఇష్టకామేశ్వరస్వామి" కిచ్చినట్లును, 218 లో "చాగిదోరభూపతి" "కమలేశ్వరున"కు యిచ్చినట్లును కలదు. ఈ రెండు దేవాలయములు యిప్పుడు కానవచ్చుట లేదు. విశ్వకర్మ వంశోద్భవులు. "పంచాననంవారు" మరి కొన్ని దానములనిచ్చిరి. నె 221 రు శాసనము "వాగిగాని వయ్యో మహారాజు" యిచ్చెను. "అనవేమారెడ్డి శకవత్సరములు 12 8 3 లో క్రీ. శ. 1361 లో "భక్త్యా సంపూజిత స్తేన సదేవై రమరేశ్వరః" అనియు "అమరేశ్వరదేవ శ్రీచరణ సరసీరుహవత్త పంచారామంబులకుం బ్రథమా రామంబైన అమరారామంబును శ్రీ ధాన్యవాటీ పురంబునకు నధీశ్వరుంబైన అమరేశ్వర శ్రీమన్మహాదేవరకు ఆ చంద్రార్కముగా సమర్పించిరి." అని యున్నది. ఇది (A. R. 259 of 1897 లో) 148 పంక్తులు వ్రాయించిరి. కనుక దీనికి "ధాన్యవాటి" పురమని శాసనములందు పేర్కొనిరి.

### No 248. A. R. 272. of 1897.

శుభమస్తు శ్రీ కృష్ణదేవ మహారాయుల శాసనము 75 పంక్తులు కలదు. "స్వస్తిశ్రీ శ్రీమన్మహారాజాధిరాజ రాజ పరమేశ్వర" అని ప్రారంభించి "జయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు ౧౪౩౭ నేటి యువసంవత్సర ఆషాఢ బ ౧౨ భానువారమునను కృష్ణవేణీ నదీతీరము నందు అమరేశ్వరదేవుని సన్నిధిని తులాపురుష మహాదానం శేయ నవధరించి తమ దేవులు చిన్నాదేవమ్మ చేతను రత్నధేను మహాదానమున్ను, తిరుమలదేవి అమ్మ వారిచేతను సప్తసాగర మహాదానమున్ను సేయించ నవధరించి" అని అనేక గ్రామములను బ్రాహ్మణులకు దానమిచ్చినట్లు కన్పట్టుచున్నది. తమ తల్లి నాగాదేవమ్మ పుణ్యముగాను అమరేశ్వర దేవునికి నైవేద్య మహాపూజల కనేక మాన్యములనిప్పించినట్లును కలదు.

నె 225 రు శాసనములోని గ్రామములును భూములును పూజారుల కిచ్చినట్లు కలదు. ఇది శకవర్షములు ౧౨౧౦లో నున్నది.—ఇంకను హంద్రికె పెద్దప్పంగారి శాసనమొకటి కలదు. ఇది శకవర్షంబులు ౧౫౪౮ క్రీ॥శ 1626 లో "స్వస్తిశ్రీ మద్భువి గురుభక్తి పరాయణ ఏకవాక్య ప్రతిష్టాపనాచార్య! అనవరత భూసురాశీర్వాద సంపన్న చతుర్వేద పారాయణ, శ్రీ అమరేశ్వర వరప్రసిద్ధ భారద్వాజ గోత్ర పవిత్ర కౌనయ గర్భపరిపూర్ణ, నరసమాంబ ప్రియ కుమారులైన హంద్రిక, వంశోద్ధారకులైన పెద్దప్పంగారును వీరి దేవులవారు గౌరీ వరప్రసాదకులగు కొండాయమ్మ, వెంకాయమ్మ వీరు జజ్జూరునుండి వచ్చి శాశ్వత మగునని ఈశ్వరాజ్ఞచే శా॥శ॥ ౧౫౪౮ అగునేటి అక్షయ సంవత్సర శ్రావణ బ ౧౦ లు ఆదివారమునాడు ధరణికోట శ్రీ అమరేశ్వర లింగమును మూడో ప్రతిష్ఠ చేసెను" అని కలదు. అందు క్రింద యీ పద్యమున్ను చెక్కఁబడియున్నది.

ఉ॥ ఇంద్రుడు ధాన్యవాటి నమ్ర - తేనుఁ బ్రతిష్ఠ యొనర్చె వంటరె
డ్డీంద్రుడు అన్నవేమ ధరణీశుఁడు చేసె పునః ప్రతిష్ఠ ఆ
చంద్రదినేంద్ర తారకము - శాశ్వత మౌనని యీశ్వరాజ్ఞచే
హంద్రిక పెద్దమంత్రి సుగుణాంబుధి నిల్పెను సుప్ర
తిష్ఠయున్ ॥



ఆలయము ముందున్న శిల్పము - (కాళియమర్దనుడు)



కృష్ణానదీ తటమునుండి - ఆలయ దృశ్యము

ఇందువలన మొదట దేవేంద్రుడును, తరువాత "అనవేమ భూపాలుండును, మూడవసారి "హంద్రిక పెద్ద మంత్రియు ప్రతిష్ఠించినట్లుస్పష్టమగుచున్నది. ప్రతిష్ఠచేసిన కాలమును

చం॥ వరవసు వేదబాణ శశివర్తితమౌ శక వత్సరంబులన్

అరయగ యక్షయాబ్దమున - హంద్రిక కోసయ పెద్ద మంత్రి, యి
ద్ధర రవిచంద్ర తారకము - దన్నల కోట మరేశలింగమున్
స్థిర తర భక్తితోడుత ప్ర - తిష్ఠ యొనర్చెను పుణ్య శాలియై."

దీనినే సంస్కృతములో కూడ

"శాకాబ్దె వసువేద బాణ పృధివీ సంఖ్యేక్షయే వత్సరే
మాసె శ్రావణికె సితేగ్రహపతేర్వారె దశమ్యాంతి ధౌ
శ్రీమాన్ హంద్రిక పెద్ద యాఖ్య విభునా శ్రీ ధాన్యవాటీ పురె
సంస్థాప్యాహ్య మరేశ్వరో విజయతే సౌస్వె గృహె శంకరే"

శ్రీ అమరేశ్వరునికి రాబడిన కానుకలున్ను, క్షేత్రాల వల్ల వచ్చిన ఫలమున్ను కలసి మూడు పాళ్లును పూజార్లకు యొనిమిది యిళ్ల భాగాలకు పాళ్లు పెట్టిరి. స్వామికి యిచ్చిన ఆవుల నెయ్యి ఉపారాధనలకు, ఆవుల కోడెలు స్వామికి క్షేత్రాలు దున్నను, అమరేశ్వరాలయములోను కాపురా లుండి గుడికి పచ్చువందుసాని ధారణవారి ఎదుకపాలు, మేళగాండ్లకు, కరణాలకువీసంపాలున్ను గుడి కాచే బచ్చుకు అరవీసం—రికి చిరుకపాలు" అని శాసనములో కలదు. ఇందువలన యీ పెద్దన మంత్రి ప్రతిష్ఠ చేసిన కాలము శకవర్షములు 1648 అని తెలుచున్నది. దీనికి సరియైన అక్షయ సంవత్సర శ్రావణ బహుళ దశమి ఆది వారమునాడు ప్రతిష్ఠించెను. శాసనస్థములైన మిగతా హంక ములు స్పష్టముగా తెలియుచునే యున్నవి.

శ్రీ రాజావాసిరెడ్డి వెంకటాద్రి నాయుడుగారు

వీరు చింతపల్లి జమీంవారులు. తరువాత వీరు అమరా వతికిం జేరి పట్టణమును అభివృద్ధి చేయించి, వైశ్యులను పిలిపించి, వీధులను తీర్చి దిద్దించి, అమరేశ్వరుని దేవాల యమునకు దక్షిణమున 5 అంతస్థుల గోపురమును కట్టిం చిరి. మరియు నిత్యభోగములకు కట్టడులు చేయించి, శిల్పముతో కూడుకొన్న పెద్ద రథమును వాహనములున్ను చేయించి ప్రాకార మంటపాదులను కట్టించి అలయ విమా నముపై బంగారు శిఖరముల నెత్తించి యనేక ధర్మములను

చేయించిరి. వీరికి కలియుగ దేవేంద్రుడని బిరుదు కలదు. వీరు అమరావతిని అమరావతిగను, వైకుంఠపురమును వైకుంఠపురముగా చేయవలెనని సంకల్పించి స్వర్ణధ్వజ శిఖర ప్రతిష్ఠాదులను చేయించిరి. వీరు క్రీ॥శ 1783 సం॥ రమునుండి పరిపాలించిరి. వీరు కట్టించిన కట్టడములలో "మంగళగిరి" లక్ష్మీ నృసింహస్వామివారి యెదుట నున్న పెద్ద గోపురము ప్రసిద్ధమైనది.

శ్రీ స్వామివారికి అమూల్యములైన యనేక రత్నాభరణములున్నూ, అన్ని వాహనములున్నూ కలవు.

### అర్చన - సాంప్రదాయము

అదివరకు యీ దేవాలయము అవిశైవ సంప్రదాయము గానో, వీరశైవ సాంప్రదాయముగానో పూజింపబడు చుండెడిదట. ముక్కంటి రుద్రుని కాలములో అష్టశివ క్షేత్రములందు వైదిక బ్రాహ్మణులను పిలిపించి పండితులకు శివదీక్షనిప్పించి అర్చకులనుగా యేర్పాటు చేసినప్పుడు పంచారామక్షేత్రములందు వెలనాటి యర్చకులను నియమించినట్లు "పంచారామేషు కేషాంచిత్ బ్రాహ్మణానాం మహాత్మనాం" అను ముక్కంటి రుద్రభూపతి శాసనస్థ శ్లోకమువలన తెలియవచ్చుచున్నది. ఇప్పుడు వెలనాటి అర్చకులచేతనే వేదాగమప్రకారము నిత్యార్చనాదులు ఉత్సవములు జరుగుచున్నవి. "అన్నింటికంటె పురాతనమైన శాసనములో" అస్తి శ్రీ ధాన్య కటకపురం సురపురాత్పరమ్. యత్రామరేశ్వర శ్శంభురమరేశ్వర పూజితః" అని యుండుటచే క్రీస్తు వెనుక 1182 సంవత్సరములో నిక్కడ ధరణికోట వ్యవహారమున్నట్లు తెలియుచున్నది.

# ఉత్సవములు - వ్రతములు

(భాద్రపదమాసము సంపలివి)

**28-8-57** భాద్రపద శుక్ల 3 తదియా బుధవారం ౧౦-౩౯ (**10-39** గం॥లు) వరకు. తరవాతను చతుర్థీతిథి- వినాయక చతుర్థి.

**29-8-57** భాద్రపద శుక్ల ౪ చతుర్థి గురువారం. ౮-౨౭ (**8-27**-గం॥లు) వరకు. తరవాత పంచమీ తిథి. ఋషి పంచమి.

**4-9-57** భాద్రపద శుక్ల ౧౧ ఏకాదశీ బుధవారం. మతత్రయైకాదశీ.

**7-9-57** భాద్రపద శుక్ల ౧౪ చతుర్దశీ శనివారం. అనంతవ్రతము.

**9-9-57** భాద్రపద శుక్ల ౧౫ పౌర్ణమీ- ౯-౨౫ (**9-25**-గం॥లు) తరువాతను ౧ పాడ్యమీ తిథి. మహాలయపక్ష ప్రారంభము

**16-9-57** భాద్రపద బహుళ ౭ సప్తమి సోమవారం- రాత్రి కన్యాసంక్రమణ ప్రవేశము- మధ్యాహ్నమునకు పూర్వకాలము పుణ్యకాలము-

**20-9-57** భాద్రపద బహుళ ౧౧ ఏకాదశీ శుక్రవారం- మతత్రయైకాదశీ-

**23-9-57** భాద్రపద బహుళ 30 అమావాస్యా సోమవారం- మహాలయామావాస్యా- అమావాస్యా సోమవార వ్రతముకూడ-

# విశేషపూజలు - ఉత్సవములు

( 1957 ఏప్రిల్ సంచిక తరువాయి )

మార్గశీర్షమాసము :-వేదాంగజ్యోతిష రీత్యా మృగశీర్ష నక్షత్ర మొకప్పుడు నక్షత్ర పరిసంఖ్యానమునందు ప్రాథమ్యము వహించినట్లు తెలియుటచే వైఖానసభగవచ్ఛాస్త్రసంహితలందు చెప్పబడెడి కాలవిశేషము మార్గశీర్షమాసమందు మొదలు చేయబడుచున్నది. ఇట్లే శ్రీ భగవద్గీతయందును 'మాసానాం మార్గశీర్షోఽహం' అని శ్రీ కృష్ణపరమాత్మచే విభూతియోగ ప్రశంసయందు మాసములకు మార్గశీర్ష ముత్తమమని చెప్పబడియున్నది.

'మార్గశిరశుద్ధ ద్వాదశీముద్దిశ్య ఏకాదశ్యాం ఆచార్యో యజమానశ్చ త్రిషవణస్నానం కృత్వా ఆచమ్య సంధ్యాముపాస్య దేవాదీనద్భిస్తర్పయిత్వా బ్రహ్మయజ్ఞం చ కృత్వా ఆలయ మావిశ్య ప్రదక్షిణం ప్రణామంచ కృత్వా దేవాభిముఖమాసీనో ధ్యాయన్నష్టాక్షరీమన్త్రం యథోక్త విధినా అన్యామృచం వైష్ణవం యథాకామం జప్త్వా వేదాధ్యయనం చకారయేత్. అథవా వైష్ణవీం కథాంవా శ్రావయేత్. మధ్యాహ్నే సాయేచస్నానాదీని కృత్వా రాత్రౌ సర్వభోగరహితో దేవం ధ్యాయన్నాసీత, శయీతవా. ద్వాదశ్యాం ప్రభాతే స్నాత్వా దేవేశస్య మహతీం పూజాం కృత్వా గౌల్యం హవిర్నివేద్య పానీయాచమన ముఖవాసం దత్వా ఆచార్యో హస్తాభ్యాం పుష్పమాదాయ 'సహస్రశీర్ష మేకాక్షరం వైష్ణవం విష్ణుసూక్తం పురుషసూక్తం చ జప్త్వా ప్రతిమన్త్రం పుష్పాంజలిం బహుశో దద్యాత్. తథైవార్చకాః పరిచారకాశ్చ దక్షిణపశ్చిమోత్తరేషు స్థిత్వా పుష్పాంజలిందద్యుః. తత్కాలే చతుర్దిక్షు వేదానధ్యాపయేత్. యజమానో నృత్తగేయ వాద్యైః వినోదం కారయిత్వా స్తోత్రైః జయశబ్దైశ్చ సంస్తూయ ఆచార్యాయ దక్షిణాం దత్వా వైష్ణవాన్ సంపూజ్య అశ్నీయాత్. అస్మిన్కాలే నిత్యం గౌల్యం హవిర్నివేదయేదితి కేచిత్, ఏతేన సంవత్సరే యన్న్యూనం తత్సర్వం పూర్ణంస్యాత్ సంవత్సరార్చన ఫలం లభేత్' (మరీచి విమానార్చన కల్పం ౪౬ వ పటలం).

(మార్గశిరమాసమున శుక్లపక్షమందు వచ్చెడి ద్వాదశితిథి ఈ యుత్సవమునకు ఉచితమైనది. ద్వాదశినాటి ఉత్సవము నుద్దేశించి ముందునాడు ఏకాదశి తిథియందు ఆచార్యులు యజమానునితో కూడి త్రిషవణస్నానము (అనగా ఉదయమధ్యాహ్న సాయంకాలములను మూడు వేళలందును) చేసిన వారలై ఆచమనము సంధ్యావందనము దేవర్షి పితృతర్పణములు బ్రహ్మయజ్ఞము చేసికొని శ్రీ స్వామివార్ల ఆలయమునకు వచ్చి విమాన ప్రదక్షిణము ప్రణామములను గావించి భగవానున కభిముఖముగ గూర్చుండి భగవద్ధ్యాన తత్పరతతో అష్టాక్షర మహామంత్రమును జపించి యథోక్తవిధిగా ఇతరములగు వైష్ణవమంత్రములను అధ్యయనము చేయుచు వేదాధ్యయనమును చేయవలయును. అంతటి పూర్ణాధ్యయనము జేయ నవకాశము లేనంతట భగవత్కథలను పారాయణము చేయవలయును. అట్లే మధ్యాహ్నసమయమునను సాయం సమయమునను స్నానాది నిత్యవిధులను నిర్వర్తించుకొని ఆ రాత్రి యంతయు విషయభోగములను విసర్జించి భగవద్ధ్యానమునే చేయుచు కూర్చొనవలయును. లేదా పరుండియు కాలక్షేపము చేయవచ్చును. ఆ రాత్రిని నియమబద్ధుడై నడిపి మరుదినము ద్వాదశినాడు ఉదయకాలమునందే లేచి స్నానాది నిత్యకృత్యములను తీర్చికొని ఆలయమునకువచ్చి భగవానునకు విశేషపూజ గావించి గుడాన్నమును నివేదనముచేసి పానీయాచమన ముఖవాస పూర్వకములగు నుపచారములను సమర్పించి ఆచార్యులు తన రెండు చేతులలోను అర్చనార్హములగు పుష్పములను తులసీపత్రములను తీసికొని 'సహస్రశీర్ష, ఏకాక్షరమంత్రములను వైష్ణవము, విష్ణుసూక్తము పురుషసూక్తములను మంత్రభాగములను జపించుచు ఒక్కొక్క మంత్రాంతము నందును పలుమారులు పుష్పాంజలిని భగవత్పాదకమలములందు సమర్పించుచు రావలెను. ఆచార్యులు, వారి వెనుకనే అర్చకులును, అర్హులగు పరిచారకులును దక్షిణ పశ్చిమోత్తర పార్శ్వములందు నిలచి పుష్పాంజలిని సమర్పించుచు రావలయును. అట్టి శుభసమయమున వేదాధ్యయన సంపన్నులగు వేదవేత్తలు నాలుగు ప్రక్కలను నిలచి వేదాధ్యయనము చేయుచుండవలయును. అట్టి సమయమున కృత కృత్యుడగు యజమానుడు విశేషములగు నృత్తగేయ వాద్యములచే భగవన్ముఖోల్లాసకరమగు వినోదమును చేయుచు స్తోత్రములచేతను జయశబ్దములచేతను భగవానుని స్తుతి చేయవలయును. పూజాంతమందు ఆచార్యాదులకు యథాశక్తిగ సమ్మానము దక్షిణాదానములను చేసి ఆదరించి విష్ణుభక్తులగు నభ్యాగతులను పూజించి తదీయారాధనము గావించి తానును భగవద్భాగవతశేషమును భుజించవలయును. ఈ మార్గశీర్ష మాసమున ప్రతి దినము ఉదయముననే గుడాన్నము (పొంగలి ప్రసాదము)ను భగవానునకు నివేదనము చేయించవలయునని కొందఱు పెద్దలు చెప్పుదురు. పైచెప్పిన ఈ

మాన కైంకర్య విశేషము చేయుటవలన ఆ సంవత్సర మున నితర కైంకర్యములలో ఏ న్యూనత కలిగినను అది యంతయు నా న్యూనతలేక పరిపూర్ణముగనే నెరవేరిన ఫలము కలుగగలదు. ఒక సంవత్సరము సక్రమముగ అర్చనచేసిన ఫలముకూడ సిద్ధించును).

ఈ యుత్సవమున రెండు దినముల కాలము ఆరంభావ సానముల కుపదేశింపబడినది. ద్వాదశితిథి యొక్క దినమే ఉత్సవాచరణమునకు సాక్షాత్తుగ నుద్దేశింపబడినను తత్పూర్వ దినమగు ఏకాదశి ఉత్సవాంగముగ ఆచార్య యజమానులకు వ్రతాచరణమునకై ఉద్దేశింపబడినది. ఏకాదశీ వ్రతాచరణము నిత్యమైనను ఉత్తరదిన కృత్య మందు భగవత్కైంకర్యాంగముగ విశేషనియమములతో సంధానము చేయబడినది. ఈ యుత్సవము ప్రచురముగ ననుష్ఠానమందు అన్ని దేవాలయములందును జరుపుట లేదు.

ఈ యుత్సవమును అధ్యయనోత్సవమని వ్యవహరించు టను సంప్రదాయజ్ఞులు తలచుచున్నారు. 'చతుర్థిమ వేదా నధ్యాపయేత్' 'అనుసరించి వచనము ఈ వ్యవహారమునకు సాధకమై యొప్పుచున్నది. ఈ సందర్భమున రామానుజ సంప్రదాయజ్ఞులు ఆచరణలోనికి తెచ్చిన కొన్ని సంకేతము లను వివరించుట అవసరమైయున్నది. ఆ సంకేతములు నిరాధారములును సాపాయములును అప్రయోజకములును అయినను వానిలో కొన్నిటియొక్క వ్యాప్తి బాహుల్యముగ సాగుచుండుటచే అందలి తత్త్వము తెలియవగిన దను టలో ఆక్షేపములేదు.

విష్ణుదేవాలయములు వైఖానసాగమరీతి ననుసరించి గాని పాంచరాత్రాగమరీతి ననుసరించిగాని పూజింపబడు చున్నవి. ఈ యాలయములు పాంచరాత్రమైనను వైఖాన సమైనను స్వతః ఉపాదేయములుకావు. వీనిలో ఏ ఒక్క పూజ కలిగిన గుడిగాని దివ్యస్థలముగా కావలెను. కేవలా గమపూజ జరుగునవి దివ్యస్థలములు కాజాలవు. ఇట్టివి ప్రాకృతస్థలము లనబడును. దివ్యస్థలములనగా రామానుజ మతమువారు ఆదరించెడి ఆళ్వార్లు ఆచార్యులనను వార లలో అందరియొక్కగాని కొందరియొక్కగాని విగ్రహ ములు ప్రతిష్ఠింపబడి వారిచే ప్రసాదింపబడిన అరవప్రబంధ ములయొక్క పాఠము (సేవాకాలము) ప్రతినిత్యము చేయ బడెడి స్థలములు. ఈ రీతిగ అరవ ప్రబంధము సేవచేయ బడెడి ఆలయములు మాత్రమే దివ్యస్థలములనబడును. ఒకప్పుడు పూర్వకాలమందు ప్రాకృతస్థలములుగ నుండి అరవ ప్రబంధసేవలేని స్థలములలో పైరీతిని విగ్రహ ప్రతిష్ఠ చేసి ప్రబంధసేవ చేయబడవచ్చును. అట్లు చేయబడిన యెడలగాని ఆ యాలయములలో రామానుజ మతావలంబు లగు శ్రీ వైష్ణవులు భగవద్దర్శనమునకు పోవుటగాని అచ్చట తీర్థప్రసాదములను స్వీకరించుటగాని చేయరాదు. ఇట్లు చేయబడిన స్థలములు మాత్రమే ప్రత్యేకముగ రామా నుజ మతస్థులకేగాక ఇతరమతస్థులు లేక సకల మతస్థులు తీర్థప్రసాదములను స్వీకరించుటకును సేవించుటకును అర్హములగును. అట్లుకాక ప్రాకృతములుగనే లెక్క చేయబడినప్పుడు భక్తుల కెవ్వరికిగాని సేవ్యములు కాజా లవు. 'అట్లు మీరిచేసిన వారలకు సద్గతి కలుగదు.' అను నది యొక సిద్ధాంతము. ఈ సిద్ధాన్తము ననుసరించి అక్క డక్కడ కొన్ని ఆలయములు సంస్కరింపబడి జరుగు చున్నవి. ఇట్టి చోటులందు కొన్నిటియందు ఈ యధ్యయ నోత్సవము ప్రకారాంతరముగ ఆచరింపబడుట కానవచ్చు చున్నవి. క్రొత్తగా నిర్మింపబడే ఆలయములను దివ్యస్థల ములుగానే ప్రతిష్ఠించుటకుగాని ప్రాకృతములని సంకేతింప బడిన ప్రాచీన స్థలములను దివ్యస్థలములుగా మార్చుటకు గాని చేయవలసిన కర్మకాండకూడ ఎంతో వింతగా సమ కూర్చబడియున్నది. ఇది శాస్త్రనిబద్ధము కాకపోవుటచే ఇందలి ప్రక్రియగాని అనుపానముగాని ఏకరూపముగ నుండుటకు సాధ్యములేక ఆయా పరిసరములందలి వాతా వరణము ననుసరించి బహుముఖముగ నడవడికలో నున్నది. ఈ వివరములను వ్రాయ నారంభించినచో పరస్పర సంబంధములేక ఆయా చోటులందలి ఐతిహ్యములను పురస్కరించికొని ఒక పెద్ద గ్రంథము కాగలదు. ఆ వివ రమువలన ప్రయోజనము లేశము లేనందున విస్తరించ లేదు. ఆ మతమున మార్గశిరశుద్ధ ఏకాదశినాడు సంకల్పింప బడిన ఈ యధ్యయనోత్సవము ప్రాయికముగ ముక్కోటి ఏకాదశి దినముగ నిర్ణయించబడుచున్నది. ముక్కోటి ఏకాదశియు ప్రకృతాచరణమునుబట్టి చాంద్రమానైకాదశి కాక సౌర ధనుర్మాసమందలి శుక్లైకాదశియైనది. ధనుర్మాస మందు వచ్చెడి శుక్లైకాదశి ఒకప్పుడు చాంద్రమార్గశీర్ష మందును ఒకప్పుడు చాంద్రపుష్యమందుకూడ రావచ్చును. ధనుర్మాస శుక్లైకాదశిని అవధిగా నిర్ణయించి అంతకు ముందు పదిగాని పదకొండుగాని దినములలో ఆరంభించి ముక్కోటి నాటివరకు పది లేక పదకొండు రోజులు ద్రమిడ ప్రబంధము పారాయణము చేయబడును. ద్రమిడ ప్రబం ధము నాలుగువేల పాశురములు కలది. ఈ పది దినము లలో ముగియునట్లు చేయబడును. లేదా మూడువేల పాశురములు మాత్రమే పారాయణము కావింపబడును. ద్రమిడ ప్రబంధము ఆ సంకేత రీతిని వేదమే యగుచున్నది. ద్రమిడ ప్రబంధమునకు వేదత్వమును పెద్దలు స్థాపించి యున్నారు.

'భక్తామృతం విశ్వజనాను మోదనం
సర్వార్థదం శ్రీ శఠగోప వాఙ్మయమ్
సహస్రశాఖోపనిషత్సమాగమం
నమామ్యహం ద్రామిడ వేదసాగరమ్' అనునది శ్రీ నాథమునుల ప్రశంసా వాక్యము.

ముక్కోటి ఏకాదశిముందు దినముతో ఈ ద్రామిడ వేద పారాయణము పూర్తికాబడి ఏకాదశినాడు సంస్కృత వేదారంభము కాబడి నాటినుండి రాగల పదిదినములలో సంస్కృత వేదపారాయణమును అందుతోపాటుగ నమ్మాళ్వారుల తిరువాయ్‌మొళి పారాయణము పూర్తికావింప బడుచున్నది. ఏకాదశికిముందు పదిదినముల పారాయణ మునకు 'పగల్‌పత్తు' అనియు తరువాతి పదిదినములకు 'రాపత్తు' అనియు సంకేతము చేయబడి ఈ యధ్యయనోత్సవము ఆచరింపబడుట కలదు. మొత్తముపైన యథా విధిగ ఈ యుత్సవము జరుపబడవలసిన దినసంఖ్య ఇరువది దినములుగ చేయబడుచున్నది. ఇంతకాలము చేయుటకు విభవము చాలని చోటులందు యథాశక్తిగ కాలపరిమాణమును హ్రాసముచేసి ఆచరించుటయు అనుమతించ బడుచున్నది. ఉత్సవ కార్యక్రమమున ఆయాస్థలములలో యేర్పడిన ప్రత్యేకములగు పురాతన చారిత్రక గాథల ననుసరించి అవాంతరములగు నెన్నియో మార్పులు తీరులు అనుష్ఠానమునందు వచ్చుచున్నవి. వాటి నన్నిటిని ఇక్కడ ఉదహరించవలసిన అవసరముగాని న్యాయముగానిలేదు గనుక ఆ అంతర భేదములను గూర్చి యెరుగ గోరెడి వారలా యా ప్రదేశములకు వ్రాసి తెలిసికొన వచ్చును.

మరీచి మహర్షి శ్రీ సూక్తి ననుసరించి ఈ శుక్లైకాదశి నాడు సంకల్పింపబడి ద్వాదశినాడు చేయవలసిన ఉత్సవము వేదపారాయణమును ప్రధానముగ జేసికొని 'అధ్యయనోత్సవము'గ వ్యవహరింపబడి ద్రమిడ వేదాధ్యయన సహకృతమై విస్తరింపబడిన దనుటయే అయియున్నది.

దివ్యస్థల ప్రాకృతస్థల విభాగములేక ఈ యుత్సవము శాస్త్రోదితముగ అన్ని విష్ణ్వాలయములందును నిత్యముగను నైమిత్తికముగగూడ సంకల్పించి తప్పక చేయబడ తగినదై యున్నది. దివ్యస్థలప్రాకృత స్థలాది వ్యవహారము కేవలము నిరాధారమగు సంకేతము మాత్రమే.

ఇట్లు అధ్యయనోత్సవ మధ్యభాగమున వచ్చెడి ముక్కోటి ఏకాదశికిముందు దశమిరోజున స్వామివార్లకు మోహిని అలంకారమును సమర్పించుటయు తక్కిన అన్ని దినములలో భక్తుల ఇష్టానుసారముగ ఒక్కొక్కనాడు ఒక్కొక్క భగవదవతార విశేషమును సమర్పించుటయు ఆచారమునందు వచ్చుచున్నది. ఇట్లే ఏకాదశిరోజున అరుణోదయ కాలమునకు ముందుగా నిత్యారాధనము విశేషారాధనములను పూర్తిజేసికొని ఉదయకాలమునకు ఉత్తర ద్వార పర్యసమను పేరిట భగవానుని ఆలయమునుండి గ్రామోత్సవమునకై వెలుపలికి వేంచేపు చేయుటకలదు. ఆ సమయమున నాయా యాలయపు అలవాటుల ననునరించి శ్రీ రామానుజాచార్యులువారు ప్రసాదించిన గద్యత్రయ సంస్కృత ప్రబంధమును పారాయణము చేయుటయు కలదు. ఉత్తరద్వారమున భగవానుడు ప్రవేశించినపుడు వారిని దర్శించుట మోక్షఫలప్రదమని చెప్పుదురు. మురుడను రాక్షసుడా దినమున భగవానునిచే సంహరింపబడి అతని కోరికె ప్రకారము ఆ దినము అతని జ్ఞాపకార్థముగ పుణ్యదినముగ నగులాగున భగవానుడాతనికి వరప్రదానము చేయుటచే ఈ ఏకాదశి సర్వోత్కృష్టమైనదిగ కొన్ని గ్రంథములందు చెప్పబడుచున్నది.

ఈ యధ్యయనోత్సవమునకు 'తిరు' అను నొక్క పదమును చేర్చి 'తిరువధ్యయనోత్సవ' మని వ్యవహరించుటయు కలదు. 'తిరువధ్యయన శబ్దము' ప్రాయికముగ ప్రతి సాంవత్సరిక కృత్యమగు శ్రాద్ధమునుకూడ చెప్పుచున్నది. ఈ యుత్సవానంతరము ద్రామిడవేద ద్రష్టయగు శ్రీ నమ్మాళ్వార్లు అవతారము చాలించిన పుణ్యదినముగ కొనియాడబడుటచే 'తిరువధ్యయన' శబ్దవ్యవహారము అర్థవంతమగుచున్నది. ఈ యుత్సవమునకు పరాకాష్ఠను జెందిన యనుష్ఠానము విశేషించి శ్రీరంగ క్షేత్రమున నున్నది.

సౌరమాన రీతిని 'కార్తిక' నెలలో పూర్ణిమదిన మారంభించి ముక్కోటి ఏకాదశివరకును దక్షిణదేశమందలి కొన్ని విష్ణ్వాలయములలో 'తైలకాప్పు' అను నొక సంస్కారము జరుపబడుచుండును. 'తైలకాప్పు' అనగా శ్రీస్వామివార్ల మూలవిరాట్టు విగ్రహములకు ఆభరణములు వస్త్రములు ఆయుధములు ఇతర సకల అలంకారములను తీసివేసి పునుగు తైలము, సాంబ్రాణి తైలము మొదలగు పరిమళ తైలద్రవ్యముచే నిర్వాణబింబములను లేపనము చేయుట యగును. ఈ యాచారముకూడ సార్వత్రికముగ కానవచ్చుటలేదు. 'తైలకాప్పు'కు అరం భావసానముల కాలావధియు ఏకరీతిగ లేదు. ప్రతివిభేదమునకును ఒక్కొక్క ఐతిహ్యము ప్రామాణ్యమును కల్పించుచుండును.

(సశేషము)

# పరతారణము

బులుసు - వేంకటరమణయ్య

భగవద్భక్తులయినవారు తమకు ఎన్ని కష్టాలు కలిగినా సహించి, తమపై విరోధం సాధించేవారినికూడా దయ తలచి, తమతో పాటు వారికి కూడా ఉత్తమగతులు కలిగేటట్లు చేస్తారు. ఇది వారికి స్వభావసిద్ధమైన ఉదారగుణం! ఈ అంశాన్ని మనకు సుప్రసిద్ధుడైన ఉపరిచర వసువు వృత్తాంతం స్పష్టపరుస్తూ వున్నది.

అతిప్రాచీనమైన కాలంలో ఉపరిచర వసువనే పేరు గల రాజు ఉండేవాడు. అతడు దేవాంశ సంభూతుడు. గొప్ప విష్ణుభక్తుడు. అతడు విమానంలో ఆకాశంలో ఉపరి భాగంలో చరిస్తూ వుండడంవల్ల అతనికి ఈ పేరు వచ్చినదని అంటారు.

వసుచక్రవర్తి గొప్ప విష్ణుభక్తుడయినా కర్మమార్గాన్ని ఉపేక్షించలేదు. దేవతల ప్రీతికోసం అతడు యజ్ఞ యాగాదులు జరిగిస్తూనే వుండేవాడు. ఒకప్పుడు అతడు పెద్ద యాగాన్ని తల పెట్టి, దానికి దేవగురువైన బృహస్పతినే అధ్వర్యునిగా ఏర్పాటు చేసుకున్నాడు. మహర్షులందరూ ఆ యాగానికి ఆహ్వానింపబడ్డారు. ఈ యాగంలో మరో విశేషంకూడా ఉన్నది. అదేమిటంటే—పశు విశసనం లేక పోవడం!

సాధారణంగా అన్ని యజ్ఞాల్లోనూ, పశువులను మంత్ర పూర్వకంగా చంపి, హోమం చెయ్యడం కలదు. కాని, వసుచక్రవర్తి పశువును చంపకుండానే—అనగా—పశువుతో అవసరం లేకుండానే ఆ యాగాన్ని జరిగించ ప్రారంభించాడు. మహర్షులందరూ దీన్ని అభినందించారు. ఆరాధ్య దేవత స్వయంగా వచ్చి, హవిస్సును అందుకుని ఆ రాజునకు ఎంతో సంతృప్తి కలిగించాడు. కాని అతడు తక్కినవారి కెవ్వరికీ కానరాకుండా ఒక్క వసురాజునకు మాత్రమే కనబడ్డాడు.

ఈ సంగతి బృహస్పతి కనిపెట్టాడు. యాగం నడిపిస్తున్న తనకు కానరాకుండా ఆరాధ్యదేవత రాజునకు మాత్రం దర్శన మిచ్చి, హవిస్సు గ్రహించడంవల్ల అతనికి ఎంతో కోపం కలిగినది. మహర్షుల కెవరికైనా కనబడ్డాడేమో అని వారిని ప్రశ్నించాడు. తమ కెవ్వరికిన్ని కానరాలేదని వారు చెప్పినారు. అందువల్ల బృహస్పతికి వసురాజుమీద విపరీతపు కోపం వచ్చినది. అయినా—ఈ విషయంలో రాజుచేసిన తప్పు యేమిన్నీ కానబడనందున అతని నేమీ అనలేక—అతనిమీద వున్న కోపాన్ని లోలోపలే దిగమ్రింగాడు. సమయం చూచి అతడిని అణచివేద్దామనే అభిప్రాయంమాత్రం బృహస్పతి మనస్సులో బాగా నాటుకొని వున్నది.

ఒకప్పుడు ఉపరిచరవసువు ఆకాశ మార్గంలో తన విమానంమీద కూర్చుని వినోదంగా విహరిస్తూ వుండగా బృహస్పతి చూడడం సంభవించినది. అతడిని అణచి వెయ్యడానికి కూడా తగిన ఉపాయాన్ని బృహస్పతి సిద్ధంగానే వుంచుకొన్నాడు. రాజును చూడగానే బృహస్పతి, "అతన్ని క్రిందికి దిగి రావా"లని కోరాడు. వసురాజు మారుపలుక్కుండా క్రిందికి వచ్చి, విమానంనుంచి దిగి, బృహస్పతికీ, అక్కడ వున్న మిగిలిన మహర్షులు మొదలైన వారికీ నమస్కారంచేసి, చేతులు కట్టుకుని నిలుచున్నాడు.

అప్పుడు బృహస్పతి యిలా అన్నాడు—"ఓ రాజా! నీవు సర్వసమర్థుడవు. యాగపశువుతో ప్రమేయం లేకుండా యాగాన్ని నిర్వహించి, అనన్యలభ్యమైన ఆరాధ్యదేవతా దర్శనాన్ని సంపాదించి, స్వయంగా హవిస్సు తీసుకునేటట్లు చేశావు. నిన్ను ప్రశంసించడం అసాధ్యం. అదీకాక నీవు దేవతలవలె ఆకాశంమీద స్వేచ్ఛగా సంచరిస్తూ వుంటావు. ఇలా సంచరించడం ఇతరులకు సాధ్యంకాదు. మరిన్ని నీవు సకల శాస్త్రవేత్తవు. యజ్ఞ యాగాల తత్త్వం తెలిసిన వాడవు. నీవు—ఇప్పుడు వివాదగ్రస్తమైన ఒక విషయాన్ని పరిష్కరించాలి. ఆ విషయం నిర్ణయించడానికి నీకంటె సమర్థుడు కానరావడంలేదు."

బృహస్పతి యిలా అనగానే వసురాజు మనస్సులో కొంత సంతోషించాడు. బృహస్పతివంటివాడు తన్ను ప్రశంసిస్తూ వుండడంవల్ల తన పరిష్కారమే ఘనమై వుంటుందనే నమ్మకంకూడా అతనికి కలిగింది. కాని బృహస్పతి దురుద్దేశంతో ఇలా అడుగుతున్నాడని భావించలేదు. వెంటనే వసురాజు 'ఆ సందేహ మేమిటో తెలపా' లని కోరాడు.

"యజ్ఞ విషయంలో అభిప్రాయ భేదాలున్నాయి. "అజైర్యష్టవ్యం" అనే విధికి "అజములనే పశువులను యాగం చెయ్యా"లని దేవతలంటున్నారు. 'అజములనే వ్రీహితో యాగం చెయ్యా'లని మునుల అభిప్రాయం. ఈ యిరుపక్షాల అభిప్రాయాలలో ఎవరిది సమంజసంగా ఉన్నదో విచారించి నిర్ణయించాలి" అని బృహస్పతి తెలియజేశాడు.

వసురాజు బాగా ఆలోచించాడు. మునులమాట త్రోసి వెయ్యడానికి వీలులేదు. దేవతల మాటా కాదన వీలులేదు.

కాని, పరిశీలిస్తే మునులకంటే దేవతలకు కొంత గౌరవం ఇవ్వడం ధర్మం. కాబట్టి దేవతల అభిప్రాయమే సరిగా ఉన్నదని తెలియజేశాడు. ఇలా సమాధానం వస్తుందని బృహస్పతికి మొదటనే తెలుసు. ఈ సమాధానానికే అతడు ఎదురు చూస్తున్నాడుకూడా. వసురాజు ఈ విధంగా తీర్పు చెప్పగా—మునులతోపాటు బృహస్పతికి అతనిమీద విపరీతమైన కోపం కల్గింది. వెంటనే బృహస్పతి అతన్ని పాతాళ లోకంలో అసురులమధ్య నివసించేటట్లు ఘోరంగా శపించాడు. ఆ శాపప్రభావంవల్ల ఉపరిచరవసువు పాతాళానికి పోయి, రక్కసుల మధ్య నివసించవలసి వచ్చింది. కాని మహాభక్తుడైన వసురాజు సర్వదా విష్ణువునే ధ్యానిస్తూ - తాను రాక్షసులమధ్య ఉన్నట్లు భావించనైనాలేదు. ఇతడెవ్వరో - తమ విరోధియైన దేవత అనీ, తమకు ఉపద్రవం కలిగించడానికి వచ్చాడనీ చాలామంది అసురులు భావించి, ఇతన్ని అనేక విధాలుగా బాధించసాగినారు. కాని, ఇతడు వేటినీ లెక్కచెయ్యలేదు. భగవంతుని ధ్యానిస్తూ వున్నంత కాలమూ అతనికి ఎవ్వరూ ఎలాటి కష్టమూ కలగించడం సాధ్యంకాదు. అందువల్లనే వసురాజు సతతమూ హరి నామస్మరణ చేస్తూ, ఎట్టి బాధలూ లేకుండానే వుండేవాడు.

తమ ప్రయత్నాలన్నీ వ్యర్థం కావడంచూచి రాక్షసులందరూ తమ గురువైన శుక్రాచార్యుడివద్దకు పోయి మొరపెట్టుకున్నారు. అలా మొరపెట్టుకోగా—అతడు విషయాలనన్నింటినీ అవగాహన చేసుకుని అన్నాడుగదా—"అబ్బాయిలూ! అతను భగవంతుని ధ్యానిస్తూవున్నంతకాలమూ మీరు ఎంత యత్నించినా అతనిని సాధించలేరు. అతని మనస్సును భగవంతునినుంచి మళ్లించినప్పుడే మీయత్నాలు సఫలాలు అవుతవి. అందుకోసం మీరు సర్వవిధాలా ప్రయత్నించడమే ముఖ్యకర్తవ్యం" అని.

గురువుగారిలా చెప్పగా అసురులు మారువేషాలు వేసుకుని అతనితో పరిచయం చేసుకుని, మనస్సు మార్చడానికి హితబోధలు చెయ్యసాగినారు. వాళ్లలో కొందరు బ్రాహ్మణ వేషం వేసుకుని అతనిని కలుసుకుని ఎంతో ఆప్తులయినట్లుగా నటించి యిలా అన్నారు.

"ఓ వసురాజా! నీవంటి అమాయకుడిని మేము ఎక్కడా చూడలేము. నీవు ఎప్పుడూ భగవంతుడిని ధ్యానం చేస్తూ—ఎన్నో శ్రమలు పొందుతూ వున్నావు. నీవు నమ్మిన భగవంతుడికి నీమీద ఏమాత్రమూ వాత్సల్యంగాని, దయగాని ఉన్నట్లు కానరాదు. అలా వున్నట్లయితే యీ విధంగా ఉపేక్షించి వుంటాడా? నీవే ఆలోచించు. మా మాటలు విని - యికనైనా నీవు ఆ భగవంతుడినుంచి నీ మనస్సు మరల్చుకొంటివా-నీకు మేలు కలుగుతుంది. ఇంత నిర్దయుడైన దేవుని ధ్యానించడం దేనికి? మేము అలాంటివన్నీ మానుకొనబట్టే ఇప్పుడు ఎంతో సుఖంగా కాలం గడుపుతున్నాము."

ఈ మాటలు విని వసురాజు ఎంతో ఆశ్చర్యపడ్డాడు. "బ్రాహ్మణులేమిటి? ఈ నాస్తిక వాదనఏమిటి? ఇందేదో మోసం ఉన్నది. వీళ్లు నిజంగా విప్రులుకారు. ఆవేషంలో వున్న అసురులే అయివుంటారు." అని వసురాజు తెలుసుకున్నాడు. ఇలా తెలుసుకుని వాళ్లను పల్లెత్తుమాటకూడా అనకుండా భగవంతుని గురించే ఇలా ప్రార్థించాడు.

"ఓ ప్రభూ! వీరంతా అజ్ఞానులు. నీయొక్క మహా మహిమను సుతరామూ గ్రహించలేరు. అందువల్ల ఏమేమో అవాచ్యాలు పలికారు. దయామయుడవైన నీ తత్త్వం మూఢులకు ఎలా తెలుస్తుంది? నీవు వీరిమాటలను తప్పుగా గ్రహించక—వీరిని దయార్ద్రదృష్టితో చూచి, క్షమించాలని మరీమరీ ప్రార్థిస్తున్నాను. వీరు నీ విషయంలో ఇలా పలికినందున—నీవు ఏదైనా శిక్ష విధిస్తే, దాన్ని నాకే విధించు. ఏమంటే - నామనస్సు మార్చడానికే వీరు ఇలా నిన్ను అనవలసి వచ్చినది."

వసురాజు ఇలా ప్రార్థించడం చూచి మారువేషాలతో ఉన్న అసురులు చాలా చకితులయ్యారు. వారు తమ నిజ రూపాలతో అతని యెదుటకి వచ్చి తమ తప్పుల నన్నింటినీ క్షమించాలని ప్రార్థించారు. అప్పటినుంచీ వారు అతనిని ఎంతో గౌరవంగా చూచేవారు. వసురాజుకూడా వారిని ఎంతో దయతో ఆదరించేవాడు.

కొంత కాలానికి భగవంతునికి ఉపరిచర వసువుమీద అనుగ్రహం కలిగి, ప్రత్యక్షమయి ఊర్ధ్వలోకానికి తీసుకు వెళ్లదలచాడు. అప్పుడు వసురాజు తనతోపాటు—తన్ను ఆశ్రయించుకుని వున్న అసురులనుకూడా తీసుకువెళ్లితేనే తాను రావడానికి సాధ్యమవుతుందని విన్నవించాడు. అతని కోరిక ప్రకారమే భగవంతుడు వారందరికీకూడా ఊర్ధ్వ లోకవాసాన్ని అనుగ్రహించాడు.

ఈ విధంగా ఉదార స్వభావుడైన ఉపరిచర వసువు గొప్ప విష్ణుభక్తుడైనందున, ఎన్నో బాధలోర్చి, తాను తరించడమే కాకుండా తనతోపాటు అసురులనుకూడా తరింపజేశాడు! ఇతని సాహచర్యంవల్లనూ, సాంగత్యంవల్లనూ కఠిన హృదయులూ, క్రూర స్వభావులూ అయిన రాక్షసులు కూడా నవనీత హృదయులూ, సరళ స్వభావులూ అయినారు. విష్ణుభక్తుల విషయంలో "స్వయం తీర్త్వాపరాంస్తారయతి" అనే మాట ముమ్మాటికీ సార్థకమయి వుంటుంది.

# లింగస్వరూపము

జ్యోతిష విద్వాన్, ఆగమవిశారద, తంగిరాల సుబ్రహ్మణ్యశాస్త్రి

హిమాలయమునుండి కన్యాకుమారివరకు వ్యాపించి వేదచోదితధర్మమునకు స్థానమై స్వర్గాపవర్గముల నొసగు భారతదేశము అతిప్రాచీనమైనదనియు పవిత్రమైనదనియు నొప్పుకొనక తప్పదు. ఇట్టి భారతదేశమున నివసించువారు భారతీయులు. భారతీయులనగా అధ్యాత్మవిజ్ఞానవిదులు. పరమేశ్వరుడొక్కడున్నాడనియు ఆ భగవంతుడే సర్వ బ్రహ్మాండములకు కర్తయనియు సృష్టియందు గల సర్వ జీవులు ఆ పరమేశ్వరుని అంశమనియు సాధనద్వారా ఆ పరమేశ్వరుని తెలుసుకొనుటకు వీలుగలుగుననియు అట్టి సర్వజ్ఞుడగు బ్రహ్మను వేదములలోగల ఉపనిషత్తులను సాధనముచే తెలుసుకొని అభేదజ్ఞానము పొందుటయే అధ్యాత్మవిజ్ఞానము. ఈ అధ్యాత్మవిజ్ఞానము కర్మ, భక్తి జ్ఞానము అను మూడువిధములుగా ఉపనిషత్తులు నిర్ణయింపబడినవి. సర్వజ్ఞుడగు పరమేశ్వరుడు ఇంద్రియ గోచరుడుగాడు గనుక ముందుగా మనకంటె గొప్పవాడగు పరమేశ్వరు డొక్కడున్నాడని తెలియజేయునది కర్మము. తెలిసినతరువాత ఆపరమేశ్వరుని ఆరాధించి ఆతని అనుగ్రహము పొందుటకు సాధనము భక్తి. ఇట్లు భక్తితో ఆరాధించగా భగవంతునకు జీవునకు అభేదమును కలిగించునది జ్ఞానము. కావున జీవులను సంసారమను దుఃఖము నుండి ఉద్ధరించి అద్వయానందమును కలిగించునది అధ్యాత్మవిజ్ఞానము. ఈ విజ్ఞానమే వేలకొలది వత్సరముల నుండియు భారతీయులకు ముఖ్యమై యలరారుచున్నది. మరియు యీ విజ్ఞానభాండాగారములో పరమేశ్వరుడే బ్రహ్మాండరూపుడై యున్నట్లు అనేకశృతులద్వారా తెలియుచున్నవి. చూ॥ "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్". కావున పరమేశ్వరునకు నిర్గుణ సగుణ రూపములు రెండును గలవు. నిర్గుణరూపము సత్తామాత్రము చైతన్యరూపము, సగుణరూపము బ్రహ్మాండము. నిర్గుణరూపము ఇంద్రియ గోచరము కాదు గనుక సగుణరూపమును ఆరాధించుటచే క్రమముగా నిర్గుణరూపము గోచరించును. అందుచే భగవంతుని సగుణరూపమగు బ్రహ్మాండమును లింగరూపముగా అర్చించుట భక్తిశాస్త్రములు శాసించియున్నవి. ఈ హేతువుచే ఆసేతుహిమాచలపర్యంత భారతీయులు లింగార్చనము విధిగా ఆచరించుచున్నారు "లింగమనగా చిహ్నమని అర్థము" "శాస్తృత్వాచ్ఛివః" అను వ్యుత్పత్తివలన సర్వజ్ఞుడగు శివుని చిహ్నమే శివలింగము. ఇట్టి లింగమును పూజించువారు శైవులు. ఈ పూజావిధులు బోధించునది శైవమతము. ఈ శైవమతము అన్నిమతములకంటె ప్రాచీనమైనదనుటకు దృష్టాంతము భారతదేశమందే గాక యితరదేశములందుకూడ మూర్తికళకు మొట్టమొదటి రూపమగు శివలింగములు అసంఖ్యాకములుగా నుండుటయే. కావున పరమేశ్వరుని సగుణరూప బ్రహ్మాండచిహ్నమగు లింగముయొక్క విశేషరూపమును గురించి తెలుసుకొనుట మనకర్తవ్యమై యున్నది.

బ్రహ్మాండము గోళాకారముగా నున్నట్లు వేదపురాణములే గాక నూతనపరిశోధకులు నైతము నిర్ణయించి యున్నారు. అట్టి గోళాకారమే లింగరూపము. ఎట్లనః- నర్మదానదిలోని యిసుకలో దొరకు గోళాకారశిలలే బాణలింగములని విజ్ఞులు పూజించుట గమనార్హము. మరియు బ్రహ్మాండపిండాండములకు అభేదము గాన సృష్టికర్తయగు పరమేశ్వరుడు బ్రహ్మాండరూపగోళమును సృష్టించి అందు తాను ప్రవేశించి మరియు వివిధరూపములను పొందినట్లు పిండాండములు గూడ అనగా సర్వజంతువులు తల్లి గర్భములో గోళాకారముగా నుండి భగవంతుని అంశమగు చైతన్యముతో గూడి శీర్షము, కాయము, పాదములు, హస్తములు అను వేరువేరు అవయవములతో పరిపూర్ణత పొందుచున్నారు. కావున బ్రహ్మాండగోళరూపమగు నర్మదా బాణలింగము అవ్యక్తరూపము. పిండాండరూపమగు పంచసూత్రలింగము (పానుపట్టముతోగూడిన) వ్యక్తలింగము. మరియు మానవశరీరమును బట్టి శిల్పకళ యేర్పడి యున్నది. మానవశరీరము మొట్టమొదట గోళాకారముగా నుండి తరువాత అవయవములు యేర్పడినవి. అట్లే శిల్పకళ మొదట గోళాకారలింగములతో ఆరంభింపబడి తరువాత క్రమముగా అవయవవిశిష్టరూపకల్పనలతో పరిపూర్ణమగు రూపమును పొంది యున్నది. కావున విగ్రహారాధనకు మొదలు లింగపూజనమే గాన, శైవమతము ప్రాచీనమై యున్నది. బ్రహ్మాండమంతయు మొదలు- చివర- మధ్యము- అను మూడువిధములుగా విభక్తమై యున్నది. మొదలు శిరస్సు - అనగా ద్యులోకము (నక్షత్రములు, సూర్యుడు, చంద్రుడు). మధ్యము - భూమి - మానవులు జంతువులు. చివర - అంధకారమగు పాతాళము, సముద్రములు). ఇట్లు శిరస్సులో కాంతిగలదేవతలు మధ్యలో కొంతమాత్రమే కాంతిగల మానవులు చివరలో కేవలఅజ్ఞానమయమగు జలచరములు మొదలగు జంతువులు గలిగి మూడువిధములగు రూపముతో నున్నది. అట్లే

పిండాండమగు దేహముగూడ (జీవజంతువులన్నియు) తల, మధ్యదేహము, పాదములు అను మూడువిధములై యున్నవి. దేవతలకు అధిష్ఠానమగు జ్ఞానేంద్రియము లన్నియు తలలోనే యున్నవి. గాన దేహములో శిరస్సు— ద్యులోకము. మానవులకు ముఖ్యమగు అంతఃకరణము (మనస్సు) మధ్యదేహములో గలదు గాన దేహములో మధ్యభాగము భూలోకము. జ్ఞానము లేని కర్మేంద్రియములు పాదములను చివరభాగములో నుండుటచే పాతాళము చివర భాగము. ఇట్లు దేహబ్రహ్మాండములకు అవినాభావము గలదు. అట్లే లింగమునకు గూడ మూడుభాగములు గలవు. లింగము- పానుపట్టము- పీఠము- వీనిలో లింగము శిరస్సు. పానువట్టము- అనగా- బాహువులతో గూడిన నాభి వరకు గల మధ్యభాగము పీఠము- అనగా పాదములతో గూడిన నాభికి క్రిందభాగము. ఇట్లు దేహలింగములు ఒక్కటే రూపము గాని వేరుగాదు. జీవునకు స్థూలరూపము దేహము. ఈశ్వరునకు స్థూలరూపము బ్రహ్మాండము. నిర్గుణుడగు పరబ్రహ్మయొక్క సగుణరూప బ్రహ్మాండ పిండాండచిహ్నమే లింగరూపము గాన యిట్టి లింగమును పూజించుటవలన ఈశ్వరుని సగుణ నిర్గుణ రూపములు తెలియుటకు గాను లింగావిర్భావము కలిగినది. మరియు బ్రహ్మాండమే లింగమనుటకు అభిజ్ఞులు యిట్లు ధ్యానింతురు-

శ్లో॥ ఆ పాతాళ సభస్థలాంత భువన బ్రహ్మాండమా విస్ఫురద్ జ్యోతిస్ఫాటిక లింగమౌళివిలసత్పూర్ణేందు వాన్తా మృతైః॥ ఇట్లు చెప్పుటచే లింగమనగా బ్రహ్మాండమని యర్థము :—

మరియు మానవునకు ప్రేమింపతగినది జన్మభూమి గాన భారతీయులకు మాతృరూపమగు భారతదేశము యొక్క చిహ్నమే లింగము. భారతదేశముగూడ ఉత్తర భారతము, మధ్యభారతము, దక్షిణభారతము అను మూడు భాగములుగా నున్నది. ఉత్తరభారతము శిరస్సు. మధ్య భారతము పిండిక యను పానువట్టము. దక్షిణభారతము పీఠభాగము. ఇట్లు భారతదేశము లింగరూపమై యున్నది. గాన లింగపూజనము మాతృదేశపూజన మగుచున్నది. ఉత్తరభారతములోని హిమాలయములు లింగరూపుడగు శివునకు శిరస్సు. మధ్యభారతములో ప్రవహించు నదులు ప్రాక్పశ్చిమములుగా ప్రవహించుటచే లింగరూపుడగు శివుని పానువట్టములోని ప్రణాళిక (లింగమునకు అభిషేకించు జలము పోవు మార్గము గాన ప్రణాళిక యని పేరు). విష్ణు పదమను ఆకాశమునుండి వర్షధారలచే హిమాలయమున గల కైలాసశిఖరమను శివుని శిరస్సున వర్షింపబడి గంగా నది అచ్చటనుండి జారి మధ్యభారతమున ప్రవహించి సముద్రమున కలియుసట్లు భక్తులు నదీజలమును లింగము యొక్క శిరమున అభిషేకింపగా ఆజలము పానువట్టము నందలి ప్రణాళికామూలమున ప్రవహించుటచేతను భారత దేశమే లింగరూపము. మరియు హిమాలయశృంగమున చంద్రోదయమగుటవలనను గంగాదినదులు ఉత్పత్తి యగుటవలనను నదీధారలు హిమాలయశృంగములయందు మెలికలు తిరిగి ప్రవహించుటచేతను యీశ్వరుని ప్రకృతి రూపమునకు గంగాధరుడనియు చంద్రశేఖరుడనియు సర్ప హారుడనియు అనేకనామములచే పిలువబడుచున్నాడు. అట్టి ప్రకృతిరూపుడగు శివునకు చిహ్నము లింగరూపము గాన లింగపూజనము ప్రకృతిరూపుడగు శివునియొక్కయు మాతృభూమియొక్కయు పరమేశ్వరునియొక్క సగుణ రూపపూజనమున్నూ అగుచున్నది.

## లింగపూజనము

భక్తిశాస్త్రము విగ్రహారాధనమును బోధించుచున్నప్పుడు అనేక విగ్రహములుండగా గోళరూపమగు లింగమును అర్చించుట యేల యను సందేహము గలుగవచ్చును. బ్రహ్మాండమందు ఉత్పన్నమగు చరాచర పదార్థము లన్నియు గోళాకారపిండమునుండి ఉత్పన్నమగుచున్నవి. వృక్షములు బీజములనుండియు నదులు బిందువులనుం డియు జంతువులు మానవులు గోళాకారపిండముల నుండియు పకులు అండరూపమగు గోళములనుండియు ఉత్పన్నమగునవియే. మరియు వాఙ్మయములోని అకారాది క్షకారాంత వర్ణములు అన్నియు అనుస్వారమగు బిందు వులోనుండి పుట్టినవియే. గణితశాస్త్రములోని భాగము లన్నియు సున్నలోనుండి పుట్టినవియే. కనుక సర్వ బ్రహ్మాండములన్నియు గోళరూపములగుటచే బ్రహ్మాండ కర్తయగు శివుడు గోళరూపముగా నున్నట్లు తెలియుటకు గాను గోళరూపమగు లింగపూజనము ముఖ్యము. బీజ ములయందు వృక్షమును ఉత్పత్తిచేయు శక్తి కలదుగదా, ఆశక్తి నేత్రమునకు గోచరించునా? కాని మన కంటికి కనుపించకపోయినను ఆ బీజమునందు వృక్షమును ఉత్పత్తిచేయు శక్తి గలదు. అట్లె గోళరూపమగు లింగ మందు నిర్గుణబ్రహ్మరూపము మన నేత్రములకు గోచ రింపకయె గలదు గాన పరమేశ్వరుని స్థూలరూపమగు లింగమును అర్చించుటచే నిర్గుణబ్రహ్మను ఉపాసించునట్ల గును. అందువలన లింగపూజనము ముఖ్యమై యున్నది.

మరియు బ్రహ్మాండము అగ్నీషోమాత్మకము. లింగము గూడ అగ్నీషోమాత్మకమే. ఇవియే రుద్రునకు రెండు తనువులు. ఈ రుద్రునకు కాలాత్మకత్వము గలదు. గోళము పగటిరూపము, పిండిక రాత్రిరూపము గాన రాత్రిపగళ్ల సంధికాలమగు ప్రభాతప్రదోషకాలములయందు శివశక్త్యా

త్మక లింగదర్శనము, లింగార్చనము ముఖ్యమని చెప్ప బడియున్నది. లింగరూపుడగు రుద్రునకు రెండు రూపములు గలవు. మొదటిది అగ్నిరూపము, రెండవది సోమరూపము. అగ్నిరూపమగు మొదటితనువు ఘోరమైనది. రెండవ తనువు సోమరూపముగాన శాన్తమైనది. ఘోరమగు అగ్నితనువును శాన్తినొందించుటకు రుద్రునకు స్థూలరూపము బ్రహ్మాండముగాన బ్రహ్మాండరూపునిగా రుద్రుని వర్ణించు శతరుద్రీయ మంత్రములతో అభిషేకించుటను శృతి చెప్పియున్నది. ఇట్లు అభిషేకముచే శాన్తిపొందిన రుద్రుడు రెండవ తనువగు సోమరూపుడగును. అంత "వసోర్ధారా" మంత్రములచే పూర్ణాభిషేకము చేసి కావలయు కోరికలను పొందవచ్చును. అందువలన లింగరూపుడగు రుద్రునకు అభిషేకము ముఖ్యము. ఈ విషయము తైత్తిరీయ సంహితయందు విపులముగా వర్ణింపబడియున్నది. చూ॥ తై॥ సం॥ శృతి॥ రుద్రోహవేష యదగ్ని స్తస్యైతె తనువౌ ఘోరాన్యాశివాన్యాయచ్ఛతరుద్రీయం జుహోతి యైవాస్య ఘోరా తనూ స్తాం తెన శమయతి యద్వసోర్ధారాం జుహోతి యైవాస్య శివా తనూ స్తాం తేన ప్రీణాతి". కావుననే "అభిషేక ప్రియశ్శివః" అను ఆర్యోక్తి లోకమునందు ప్రసిద్ధమై యున్నవి.

బ్రహ్మాండము యెట్లు పంచభూతాత్మకమో అట్లె లింగము పంచబ్రహ్మాత్మము గలది. లింగరూపుడగు శివునకు పంచబ్రహ్మలు పంచముఖములు. తూర్పుముఖము తత్పురుషముఖము. దక్షిణముఖము అఘోరముఖము. పశ్చిమముఖము సద్యోజాతముఖము. ఉత్తరముఖము వామదేవముఖము. ఊర్ధ్వముఖము ఈశానముఖము. ఇట్లు పంచముఖములతో లింగము ప్రకాశింపుచున్నది. ఈ బ్రహ్మాండస్థూల లింగరూపుడు నూటయేబదికోట్ల యోజన విస్తీర్ణమై పదికోట్ల యోజనప్రమాణ సద్యోజాత ముఖముతో యిరువదికోట్ల యోజన విస్తీర్ణ వామదేవముఖముతోను ముప్పదికోట్ల యోజన ప్రమాణ అఘోర ముఖముతోను నలుబదికోట్ల యోజన విస్తీర్ణ తత్పురుష ముఖముతోను యేబదికోట్ల యోజనాయుతమగు యీశానముఖముతోను ప్రకాశింపుచు సూర్య చంద్ర అగ్నిరూప త్రినేత్రములతో వెయ్యియెనిమిది బ్రహ్మాండములు ఆవరించి పీఠభాగమున ధర్మమను వృషభము అధారముగా గల మహాశక్తియను పిండికయందు కోటిసూర్యప్రకాశముతో కోటిచంద్రశీతలకాంతితో నర్వదా హిమనంకాశధవళరూపుడై నర్వబ్రహ్మాండోర్ధ్వ విష్ణుపదమునుండి స్రవించు సప్తపథారూప వియన్నదీ పవిత్రశిరస్కుడై సప్తప్రసర్పన్నదీ కంకణదేహుడై అజ్ఞాన జన్మమృత్యు భయంకర వ్యాఘ్రాజిన ధారియై ప్రకాశింపుచున్నాడు. ఈ లింగరూపుడగు రుద్రుడే సర్వబ్రహ్మాండకర్త, సర్వజ్ఞుడని శృతులు బోధింపుచున్నవి. చూ. తై. సం. "ఏక ఏవ రుద్రో న ద్వితీయాయతస్థే" కావున యిట్టి సర్వోత్కృష్ట లింగపూజనము ఐహికాముష్మిక సౌఖ్యప్రదమని తెలియుచున్నది.

## శివలింగపూజామహిమ

శ్లో॥ లింగెతు పూజితె సర్వం అర్చితం స్యాచ్చరాచరం।
తస్మాత్సర్వార్చనం కార్యం లింగస్య సుమహాత్మనః ॥

అను పురాణవచనముచే శివలింగపూజనము సర్వదేవపూజనము, ఐహికాముష్మికసౌఖ్యప్రదము. మరియు బ్రహ్మ విష్ణు ఇంద్రాదిదేవతలు లింగార్చనమహిమవల్ల ఉత్కృష్ట పదవులు పొందినట్లు పురాణములు బోధింపుచున్నవి. ఒకప్పుడు విష్ణువు సహస్రకమలములతో లింగరూపుడగు శివు నర్చించుచుండగా శివుడు విష్ణువుయొక్క భక్తిని పరీక్షింప నెంచి ఒక్క కమలము తక్కువగునట్లు జేయ విష్ణువు తన నేత్రకమలముతో సహస్రకమలపూజ నొనర్చెను. అంత ప్రీతుండై శివుడు విష్ణువునకు సుదర్శన చక్రమును యిచ్చినట్లు శివపురాణకథనమును బట్టి శివపూజ ముఖ్యముగా సర్వవర్ణంబులవారు జేయనగునని తెలియుచున్నవి. శివపూజ సర్వపాపహరము సర్వసంపత్ప్రదము శివసాయుజ్యప్రదము.

నహి లింగార్చనాత్కించిత్ పుణ్యమభ్యధికం క్వచిత్
ఇతి విజ్ఞాయ యత్నేన పూజనీయ స్సదా శివః ॥

ఇట్లు శివలింగములను పూజించుటలో తరతమభేదములు గలవు. పాదరసముతో జేసిన లింగము అన్నిటి కంటె ముఖ్యము. రత్నములతో చేయబడిన లింగములు ధాతువులతో జేయబడిన లింగములు మృత్తికతో జేయబడిన లింగములు ముఖ్యములు. మరియు కామ్యముల ననుసరించి మృత్తికతో పచ్చకర్పూరము, పిష్టము, పసుపు మొదలగు వస్తువులు కలిపి లింగములను జేసి పూజించుటయును శాస్త్రములు విధించినవి. ఇట్లు తయారు జేసిన లింగములను ప్రాణప్రతిష్ఠాదుల నాచరించి పంచామృతములను రుద్రసూక్తములతో నభిషేకించి విభూతిరుద్రాక్షలతో నలంకరించి బిల్వపత్రములతో పూజించి రుద్రుని సహస్రనామములతో మల్లికా ద్రోణ పుష్పములతో అర్చనము గావించి షడ్రసోపేతచతుర్విధాన్నములను నివేదనము గావించి ఆరార్తిక మంత్రపుష్ప ప్రదక్షిణస్తోత్రముల నాచరించి తీర్థప్రాశనము చేయవలయును. ఇట్లు సర్వజనులు శ్రద్ధాభక్తిపూర్వక లింగార్చనము నాచరించి శివసాయుజ్యమును పొందుదురు.

లింగార్చనము నిత్యము ఆచరించుట ముఖ్యము. అశక్తులకు అర్చనాముఖ్యకాలములను శాస్త్రములు నిర్ణ

యించి యున్నవి. రుద్రునకు రెండు రూపములు గలవని యిదివరలో చెప్పబడియున్నది. అందులో మొదటి రూపము అగ్నిరూపము గాన కార్తికమాసములో రుద్రార్చనము చేయుట ముఖ్యము. కృత్తికానక్షత్రముతో గూడిన పూర్ణిమ వచ్చు మాసము కార్తికమాసము. కృత్తికానక్షత్రము అగ్ని అధిదేవతగా గల నక్షత్రము. శృ॥ "కృత్తికానక్షత్ర మగ్నిర్దేవతా॥" రుద్రుడు అగ్నిరూపుడు గాన (రుద్రోవా ఏష యదగ్నిః) కృత్తికానక్షత్రముతో గూడిన కార్తిక మాసము రుద్రునకు ప్రియము గావుననే నేటికిని విజ్ఞులు కార్తికమాసమున నక్తవ్రతములు ఆచరించుచు ప్రదోష సమయమున లింగపూజనము గావించుచున్నారు. రుద్రు నకు రెండవరూపము సోమరూపము. సోమునకు విష్ణువని గూడ పేరు గలదు. గాన శ్రావణమాసమున రుద్రార్చనము ముఖ్యము. శ్రవణనక్షత్రముతో గూడిన పూర్ణిమ వచ్చు మాసము శ్రావణమాసము. శ్రవణనక్షత్రమునకు అధిదేవత విష్ణువు. శృ॥ "శ్రోణానక్షత్రం విష్ణుర్దేవతా॥" రుద్రుడు సోమరూపుడు గనుక శ్రావణమాసమున రుద్రార్చనము చేయుటయు ముఖ్యము. మరియు వారములలో సోమ వారము ముఖ్యము. కార్తికమాసమున వచ్చు సోమవార ములు విశేషపర్వదినములు. ఏలననగా కార్తికమాసము నకు అధిదేవత అగ్ని. సోమవారమునకు సోముడు. ఈ రెండును కలియుటవలన అగ్నిషోమాత్మక రుద్రార్చనము విశేషఫలమును యిచ్చును. మరియు నక్షత్రములలో ఆర్ద్ర ముఖ్యము. ప్రతిమాసమున కృష్ణచతుర్దశి ప్రదోష సమయము శివునకు ప్రియమగు కాలమగుటచే మాసశివ రాత్రి యని చెప్పబడుచున్న విశేషపర్వ కాలము. మాఘ మాసమున కృష్ణచతుర్దశి అర్ధరాత్రి కాలము మహాశివరాత్రి యను మహాపర్వకాలము. ఇట్టి అలభ్యయోగము లింగా ర్చనమునకు చాల విశిష్ట పర్వదినము. ఇట్టి పర్వకాల ములయందు మానవులు శ్రద్ధాభక్తిగలవారై శివలింగ పూజనము గావించి పరమేశ్వరుని అనుగ్రహమునకు పాత్రులై శివుని సాలోక్య సారూప్య సామీప్య సాయుజ్య ములను పొందుదురుగాన శివలింగ పూజనము ముఖ్యమై యున్నది.

---

# భారతీయ ధర్మము _ XII

"కాశ్యప"

స్వస్వరూప పరిజ్ఞానము సమకూర్చి, జీవులను జన్మ స్థానమునకు జేర్చునది ధర్మము. పశుత్వమునుండి మాన వత్వమునకు, నటనుండి దేవత్వమునకు, నందుండి బ్రహ్మ త్వమునకు గొనిపోవునది ధర్మము. చావులేని జీవితము, కొఱతలేనిజ్ఞానము, అంతులేని యానందమును బొంద వలయునని, ప్రాణులు నిరంతరము నపేకించుచుందురు. నేటి కామోపాసకుడగు జీవు డొకనాడు పరిపూర్ణకాముడైన బ్రహ్మమే. సచ్చిదానందములు తమ కీనాడు లేవనియు, బ్రహ్మయత్న మొనరించి, వానిని సాధింపవలయుననియు అస్మత్సగోత్రులు భావించుచున్నారు. సకలదుఃఖనిరాస పూర్వకమగు నిరతిశయానందము నందుటయే మోకము. ఆ మోకమే పరమపురుషార్థము.

మోక్షార్థులు లోకమునకు నిరుపయోగకరులు మాత్రమే కాక, చీడపురుగులవంటివారని చీదరించుకొను నవనాగర కులు లేకపోలేరు. ముముక్షువులకు ధర్మమే శరణ్యమనియు, అర్థకామములు సర్వధా పరిత్యాజ్యములనియు నొక యపోహ యాధునికులకు ప్రబలముగ గలదు. అర్థకామ ములు పరిత్యాజ్యములు కాకపోయినను, పరమార్థములు మాత్రము కాజాలవు. జీవన్ముక్తి పరమలక్ష్యమందుము. భయరాహిత్యము ముక్తి. "అభయం వై జనకప్రాప్తోఽసి." భయమెఱుంగనివాడు, భయకారణములనే గురితింపని వాడు ముక్తుడని స్థూలముగ నిరూపింపవచ్చును. కాని ప్రాణములకు దెగించి దురాగతముల కొడిగట్టు అత తాయులను ముక్తులనరాదు. 'ద్వితీయాద్వై భయం భవతి' తనకన్న నన్యమున్నదని భావించువానికి భయము గలు గును. 'ఆత్మవత్సర్వాభూతాని.' తమయందు నఖిలభూత ములందు నొక భంగి వర్తించువారికి భయము లేదు. భయము గలవానికి శాంతి యుండదు. శాంతి లేనిచో సౌఖ్యము సమకూరదు. కాన ప్రాణులు సర్వాత్మనా వాంఛించు పరమానందమునకు, అశాంతి, దానికి మూల కారణమైన భయము ప్రతిబంధకములు. భయకారణ ములు, భయస్థానములు, ఆనందభంజకములు. అర్థము సాధనమే కాని సాధ్యము కాదు. కామావాప్తి తాత్కాలిక సుఖహేతువు కాని నిత్యానందకారణము కాదు. ధర్మ

విరుద్ధములయిన అర్థకామములు భయసంకోచస్థానములు, కావున నవి సుఖసంపాదకములు కాజాలవు. ధర్మావిరుద్ధము లగు నర్థకామములు ప్రతిష్ఠాకరములు, ఆనందమునకు ఖరంపరా కారణములు. అందుచే నర్థకామములకు ధర్మ పరాధీనత్వమే కలదు. వానికి స్వతంత్రవ్యవహారయోగ్యత లేదు. పరమానందప్రాప్తికి ధర్మమే ప్రధానసాధనము. ధర్మాచరణమునకు అర్థకామములు సాధనవిశేషములు మాత్రమే కాగలవు. కామమున నైహిక శారీరికసుఖమనియు, అర్థమున తత్సంపాదనసమర్థమయిన ధనసంపత్తి యనియు సామాన్యమానవుల యభిప్రాయము. ధర్మమున-నిజకర్తవ్యనిర్వహణమనియు, ఆపన్నులకు, ఆశ్రితులకు ధనధాన్యాది సహాయము చేయుట యనియు బహుజనాభి మతము. కాని ధర్మస్వరూపనిరూపణము కడుంగడు దుష్కరము.

ధర్మములు సామాన్యధర్మము లనియు, విశేషధర్మము లనియు రెండు విధములు. దేశకాలసంపర్కములచే వికారము చెందనిది సామాన్యధర్మము. అదియే సనాతన ధర్మము, విశ్వజనీనము, ముముక్షుజనోపాస్యము. సంద ర్భానుసారముగ పరివర్తనము నందునది విశేషధర్మము. స్థూలదృష్టికి అది మారుచున్నటు లగుపట్టినను, సూక్ష్మ పరిశీలన గావించిన, సనాతనధర్మమునకు విరుద్ధముగ నుండజాలదు; మార్పులు తాత్కాలికములే. ప్రాప్యవిషయ మున మతభేదములు లేవు. ఒకే యొక ప్రయత్నమున గమ్యస్థానమును జేరలేనివాడు అంచెలంచెలుగ ప్రయాణము సాగించి తుట్టతుదకు గమ్యమును జేరవచ్చును. సాధనసంపత్తి విషయమునను వైవిధ్యము గోచరించును. హరిద్వారమును జేరదలచిన యాత్రికుడు కాలినడకను గాని, లేక విమానము మీదగాని ప్రయాణము సాగింప వచ్చును. వెనుక ముందుగ గమ్యస్థానమును ప్రవేశింప వచ్చును.

అన్యే కృతయుగే ధర్మాః త్రేతాయా మపరే మతాః
ద్వాపరే త్వన్య ఏవోక్తాః కలావన్యే ప్రకీర్తితాః ॥

అయా యుగముల భిన్నభిన్నములుగ గోచరించు ధర్మములు విశేషధర్మములు గాని సామాన్యధర్మములు గావు. ద్వైతభావనచే దుఃఖపరంపరలు గలుగును. అద్వైత వాసనచే నిరతిశయ నిత్యసుఖము గలుగును. 'ఈశ్వరానుగ్రహా దేవ పుంసా మద్వైతవాసనా.' అద్వైతదృష్టి, దాని వలన బ్రాహ్మీస్థితి నందదలచు సాధకుడు సర్వేశ్వరానుగ్రహము నంపాదించుకొన వలయును. అదియే సనాతన ధర్మము. ఈశ్వరానుగ్రహమును నంపాదింపగల సాధనములు యుగధర్మములచే భిన్నభిన్నములుగ నున్నటుల గోచరించును.

కృతే యద్ధ్యాయతో విష్ణుం త్రేతాయాం యజతో మఖైః
ద్వాపరే పరిచర్యాయాః కలౌ తద్ధరికీర్తనాత్.

కృతయుగపురుషులు నిశ్చలధ్యానసమాధినిష్ఠచే విష్ణుదేవుని సుప్రీతుని గావించుకొనిరి. త్రేతాయుగము నందు ధ్యానైకతత్పరత గొఱవడుటచే మానవులు శ్రుతిప్రతిపాదితమఖవిశేషములు గావించి యజ్ఞపురుషుని యజించిరి. ద్వాపరమున మనుజులకు యజ్ఞాచరణ సామర్థ్యము సన్నగిల్లుటచే హరిపరిచర్యాప్రధానమే శరణ్యమయ్యెను. ఇక కలియుగసంజాతులమయిన మనము సర్వథా అల్పశక్తులము, మందభాగ్యులము. అచంచలధ్యాన సామర్థ్యముగాని, క్రతునిర్వహణ పాటవము గాని, హరి పరిచర్యాప్రావీణ్యముగాని మనకందరాని ద్రాక్షపండ్లుగ నున్నవి. కాన కలియుగమున హరిసంకీర్తనమొకటియే సులభసాధ్యము. బహిర్గతమై విషయాభిముఖమైన మనస్సును, అంతర్ముఖము చేసి భగవదభిముఖము గావించుట సనాతనధర్మము. భగవదాభిముఖ్యమునకు సాధనములయిన ధ్యాన మఖ పరిచర్యా సంకీర్తనములు విశేషధర్మములు. దేశ కాల శక్తి సామర్థ్యానుసారముగ సాధనధర్మములు మార్పు జెందును. సాధ్యధర్మములు మాత్రము సర్వదా నిర్వికారముగ నుండును.

"అంతర్ముఖుడైన బ్రహ్మజ్ఞాని వలన బ్రపంచమున కేమి లాభము గలుగును? 'చిన్ని నాపొట్టకు శ్రీరామరక్ష' అన్న చందమున నతని దారి నాతడు చూచుకొన్నచో జూచుకొనుగాక; తోడి మానవుల కెటు లుపకరింపగలడు.'' అను సందియము కలుగుట సముచితమే. దుఃఖించు చున్నవారిని జూచినపుడు దుఃఖము, నవ్వుచున్నవారిని గాంచినపుడు నవ్వు, సహృదయులకు గలుగుట యనుభవ యూథము. 'ముసలః కిసలాయతే,' యశోదానందవర్ధనుని మధురమురళీనినాదము సోక జడములగు శుష్కదారు దండంబులు చిగిర్చిన వన నది ద్వాపరయుగ వృత్తాంతమని చప్పరించు వారుందురు గాక, శ్రీకృష్ణచైతన్యప్రభువు బ్రహ్మానందపరవశుడై 'రామ! కృష్ణ! హరి! బోల్,' అని దివ్యనామసంకీర్తనము చేసెను. ఆ యమోఘధ్వని ప్రసరించిన భూమండలమున గల పండితపామరులెల్లరు దివ్యానుభూతి నందిరి. ఇది కలియుగ చారిత్రిక సంఘటనము. దీనిని గాదనుట కష్టమే. అరవిందుని యాశ్రమవాసము గాని, రమణమహర్షి సాన్నిధ్యభాగ్యము గాని, శివానందుని సేవావిశేషముగాని పడసినవారు, సాధు సజ్జన శక్తిపాత ప్రభావము గూర్చి శంకింప జాలరు.

నహ్యమ్మయాని తీర్థాని న దేవా మృచ్ఛిలామయాః
తే పునన్త్యురుకాలేన దర్శనాదేవ సాధవః

చిరకాలసంసేవచే గంగాది తీర్థములు ఫలప్రదము లగును. యావజ్జీవపరిచర్యచే దేవతామూర్తులు సుప్ర సన్నము లగును. సాధు సజ్జను లన్ననో దర్శన మాత్రముననే అజ్ఞానాంధకారము నణగించి జ్ఞానప్రకాశమును ప్రసరింప జేయుదురు. అంతర్ముఖుడయిన బ్రహ్మజ్ఞాని జంగమ దేవాలయము, సద్యఃఫలప్రదమయిన భవ్యతీర్థరాజము, వేయేల - పంచోపనిషన్మయదివ్యమంగళవిగ్రహము— 'బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి.' బ్రహ్మవేత్త బ్రహ్మయే. అత నికి సర్వము ఆత్మస్వరూపమే. అతని యాశ్రమోపాంతము లన్నియు ప్రశాంత వాతావరణ సమన్వితములే. తాపృశ యోగీంద్రుల గంభీర మౌనముద్ర సర్వ వేదాన్త సిద్ధాన్త ప్రత్యక్షసులభతమవివరణవిశేషము. తద్బ్రహ్మ తేజము ద్వైతాంధకారమును బటాపంచ గావించును, అద్వైతా ఖండజ్ఞానమును సమకూర్చును. సర్వభూత సౌభ్రాతృత్వ మే పుణ్యాత్మునకు సిద్ధించునో, అతని ద్వేషభావములు నశించును, భయభ్రాంతులు నమసిపోవును, దురితదుఃఖ ములు తొలగిపోవును, శాంత్యానందములు కరతలామల కము లగును. అకాలవిలయతాండవ నద్వశమయిన నేటి ప్రబల మారణాస్త్ర విజృంభణము సరికట్ట యత్నించు చున్న లౌకైక శాంతిదౌత్యము, భారతీయ బ్రహ్మవేత్తల యుపదేశసార సంజాతముకదా! అంతర్ముఖుడయిన బ్రహ్మజ్ఞాని స్వార్థపరుడుకాడు, లోకోపకారి యగును గాని లోకాపకారి మాత్రము కాబోడు.

ఊర్ధ్వబాహు ర్విరౌమ్యేష నచ కశ్చిత్ శృణోతి మే
ధర్మాదర్థశ్చ కామశ్చ న కిమర్థం న సేవ్యతే॥

"కేవలము అర్థకామములను నమ్ముకొని యున్న వారికి ధర్మము సిద్ధింపకపోయిన పోవుగాక, ధర్మమును నమ్ముకొని యున్నవారికి మాత్రము అర్థకామములు తప్పక లభింపగలవు. నెత్తిన నోరు పెట్టుకొని మొత్తుకొనుచున్నను నా యీ మాట నెవరును వినిపించుకొనుట లేదు." అని కరుణాపారీణుడయిన వ్యాసనారాయణుడు వాపోవుచు న్నాడు. ధర్మానుబంధములయిన అర్థకామములు శాంతి సౌమనస్యములను చేకూర్చును. ధర్మవిరుద్ధములైన అర్థ కామములు దురాశాదురాగతములకు దారితీయును. ఐహికైశ్వర్యసంపన్నులయిన భారతీయేతరులు సర్వథా సుఖశాంతి సమన్వితులని చెప్ప వీలు లేకున్నది. అర్థా శ్రయములయిన సుఖశాంతులు తాత్కాలికములు పరి ణామవిషయములు. ధర్మసంభవములగు ప్రశాంత్యానంద ములు, సుస్థిరములు, పరిపూర్ణములు.

అర్థాపేక్ష నేడు పెచ్చుపెరిగినది. అర్థాపేక్షకులెట్టి యన్యా యమునకైన నొడిగట్టుచున్నారు. వారు తోడిమానవులను బీడించుటకైన వెనుకాడుట లేదు. ధనమదాంధులు సోదరమానవకంకాళముల మీదుగ పాపపుబండిని దోలుకొని పోవుచున్నారు. సకలమానవలోకము తన చెప్పుచేతల లోనే యుండి తీరవలయుననిని, ఏదేశమున కాదేశము, ఏజాతి కాజాతి బద్ధకంకణమయి యున్నది. దాన యుద్ధ మేఘములు భూలోకమునంతయు నావరించి యున్నవి. ఆ కారణముచే నశాంతి భయాందోళనములు ప్రజలను బాధించుచున్నవి. ఆధునిక భోగవిలాస వ్యామోహముచే తత్సంపాదకమయిన ధనమునందత్యాశ యేర్పడినది. అత్యాశామూలకముగ నిత్యావసరవస్తువుల ధరలు గగన మండలము నంటినవి. ధరల పెరుగుదలతో బాటుగ సాధారణజనుల ధనార్జనశక్తి పెరుగలేదు. అందుచే ప్రజ లలో నసంతృప్తి, నైరాశ్యము, అకార్యకరణాభిముఖ్యము, తెగువ, మొదలగు ననర్థబీజములు మొలకెత్తి పెచ్చు పెరుగుచున్నవి. వానిని వెనువెంటనే తుదముట్టింపగల శాసనములు గాని యధికారముగాని కనుపట్టుట లేదు. హింసయనిన శారీరకహింస మాత్రమే యని జెల్లదు. అశక్త సామాన్య జనులకు నిత్యాహార వస్త్ర సుఖ సంతృప్తు లను లోపింపజేసినను, అది హింసయే యనక తప్పదు. అహింస పరమధర్మము, హింస కేవలము అధర్మమే. ధర్మవిరుద్ధమయిన యర్థసంపాదనమునకు నేడు ప్రాధా న్యము లభించుచుండుటచే నిట్టి విషమస్థితి సంభవించినది. అత్యాశ ప్రబలానర్థకారణము.

ఏనాటిమాటలో—ఒకమహనీయుడు ధనము కొఱకు ధనము నపేక్షింపనివాడు యజ్ఞములుచేసి యజ్ఞపురుషుని యనుగ్రహము సంపాదింప దలచెను.

అర్థీ సమర్థో విద్వాన్ - విద్యావంతుడు, బలవంతుడు ధనవంతుడు నగు వాడు మాత్రమే జన్నము జేయ సర్హుడు. కావున నాటిదబాపడు యజ్ఞార్థమై ధనమాసించి ఘోర తపము గావించెను. "శ్రేయాంసి బహువిఘ్నాని"— మంచిపనులు చేయదలచువారికి విఘ్నములు బహుళ ముగ సంఘటించును. ఆ తపమునకు ధనసంపత్తి తగినఫలము కాజాలదని యెంచి కాబోలు, తపఃఫలప్రదాత యాత డపేక్షించిన ధనము నొసగడయ్యె. దేవరహస్య మెఱుగనేరని విప్రుడు విసుగు జెంది విచారాక్రాంతు డయ్యెను.

దైవగతి చిత్రవిచిత్రము. తత్స్వరూపము దేవతలకు నవిదితమే. అట్టియెడ బ్రాకృతమానవులమాట తడవ బనిలేదు. ఒక్కయెడ సాధు సజ్జన యోగీశ్వర సంప్రార్థ నము గూడ జగజ్జనకుడు పెడచెవిని బెట్టును. ధన లుబ్ధుల చందమున లక్ష్మీకాంతుడు గూడ దయావిరహిత చిత్తుడేనా యని సంశయము తోచును. "—బ్రహ్మకృపా హి కేవలమ్—" విధిదయానిధి, భక్తులపాలి పెన్నిధి. భగ

వంతుడు భవరోగ వైద్యుడు. అతడు నిజాశ్రితుల హిత మును మాత్రమే కోరును, కాని వారపేక్షించు తాత్కాలిక ప్రియమును ప్రసాదింపడు. రోగగ్రస్తుడు అపథ్య వస్తువుల నపేక్షించును. వైద్యు డంగీకరింపడు. అంతమాత్రమున వైద్యుడు కఠినాత్ము డనరాదు, అప్పటికప్పుడు తృప్తి గలిగించునది ప్రియము. చిరసంతృప్తిని చేకూర్చునది హితము. ఎవనిపై భగవంతునకు దయగలుగునో, వానికి లౌకికసంపదలు దూరమగును.

ఆ మహాదేవుని దైన్యము గాంచి దేవదేవుడు జాలి చెందెను. భగవత్సాక్షాత్కారమును గూడ నుపేక్షించి యజ్ఞ సాధనమగు ధనమును మాత్రమే కోరు ఛాందసుని భ్రాంతి దొలగింప భక్తవత్సలుడు సంకల్పించెను. తత్సంకల్ప ప్రేరితుడై కుబేరానుచరుడు కుండధారుడు భూమీసురుని మ్రోల నిలిచెను. విప్రు డాశ్చర్యచకితుడై విధివిహితముగ నాగతుని బూజించెను. కుండధారుడు సుప్రసన్ను డయ్యెను. కృతఘ్నత మహాపాతక మని భావించి తన్ను బూజించిన శ్రోత్రియున కుపకృతి గావింప దేవానుచరుడు నడుంకట్టెను.

ప్రొద్దు గ్రుంకినది. సంధ్యాద్యనుష్ఠానములను నిర్వ ర్తించి ధరణీసురుడు నిద్రించెను. కుబేరానుచరుని మహి మచే నతనికి స్వప్నము కలిగెను. అది లోకాంతరము. అందు యథోచితాసనంబుల దేవత లాసీనులై యుండిరి. వారి ప్రభువు మాణిభద్రుడు మణిమయ సింహాసనమున నుపవిష్టుడై యుండెను. రాజాదేశానుసారము దేవతలు తాపసులకు తత్తత్తపఃప్రభావానుగుణముగ వివిధైశ్వర్య ములను బ్రసాదించుచుండిరి. కుండధారుడు మాణిభద్రు నకు సాష్టాంగవందన మాచరించి, "దేవా! నాయందు మీకుగల యనుగ్రహ మపారము. ఈ విప్రోత్తముడు మహాతపఃసంపన్నుడు. ఇతని యభీష్టమును నెరవేర్చి నా మాట దక్కించుపుడు." అని విన్నవించెను. మాణి భద్రుడు వల్లె యని యా యజ్ఞార్థికి నవరత్నరాసులను బహూకరించెను. కుండధారునకు సంతృప్తి కలుగదయ్యె. అతడు చేతులు జోడించుకొని, 'సర్వజ్ఞసార్వభౌమా! ధన మువలన సౌఖ్యము గలుగు ననుట నమ్మరాని మాట. మానవజీవితము గడు పరిమితము. జీవుడు తన వెంట ధనమును లోకాంతరమునకు గొనిపోలేడు. జీవించి యుండ గనే ద్రవ్యము ద్రవించి పోవును. ధనికులు మమకారా హంకారములకు లోనై ధర్మమార్గమును బరిత్యజింతురు. కావున ధనమిచ్చి సుఖము గూర్పలేము. ధర్మాచరణము వలననే యథార్థమయిన సుఖము చేకూరును. అఖండ భూమండలాధిపత్యము నీతని కొసంగినను నాకు దృప్తిగలు గదు. ఇతడు ధర్మతత్పరుడు గావలయు ననియే నా యాశయము. ఆభిజాత్య సౌందర్య సౌశీల్య సౌభాగ్య స్వారాజ్యాదులన్నియు ధర్మమువలననే సిద్ధించును. అవి యివి యన నేల? మోక్షసామ్రాజ్యము గూడ ధర్మాత్ము లకు గరతలామలకమే. స్వామీ! నా యీ మనవి చేకొని మదాశ్రితుని ధర్మైకతత్పరుని గావింపుడు," అని ప్రార్థిం చెను. మాణిభద్రు డెంతగ బ్రయత్నించినను కుండ ధారుడు భూదేవునకు ధనాదివరప్రదానము వలదని నిరోధించెను. కుండధారుని ధర్మతత్పరతకు దేవతలందఱు నచ్చెఱువందిరి. వారంద ఱేకగ్రీవముగ—మహీసుర వర్యుడు ధర్మనిబద్ధచేతస్కుడే యగు గాక—యని వర మొసగిరి. దేవానుచరుడు సంతుష్టుడయ్యెను. అంతతో స్వప్నము ముగిసెను. విప్రుడు మేల్కాంచెను.

సుప్తోత్థితుని దృష్టి ప్రక్కనున్న కౌపీనముపై బడెను. అదియె దేవతాప్రసాదమని భావించి, కౌపీనధారియై అతడు విపినమునకరిగి ఘోరతరతపశ్చరణమున కుపక్రమిం చెను; కందమూలఫలములను అతిథులకు నభ్యాగతులకు నొసగుచు, మిగిలినశేషమును దానారగించుచు గొంత కాలము తపించెను, పిమ్మట కేవలము జలాహారియై తపస్సు చేసెను. తదుపరి పవన మాత్రాహారుడై తపము సాగించెను. దాన నాతని మనసు నిర్మలమయ్యెను. చిత్తము ధర్మాయత్త మయ్యెను. కాని వానికి మఱియొక క్రొత్త కోరిక కలిగెను. తా ననిమేషపదమునకు గావలయు ననియు, తా నెవరి కేవరమొసగిన నావరము వారికి సిద్ధింపవలయు ననియు సంకల్పము చేసి మఱల తపమునకు గడంగెను.

కుండధారుడు తనభక్తుని ప్రవృత్తి నొక కంట గనిపెట్టు చునే యుండెను. అతనికి జనించిన క్రొత్త యుబలాటము గమనించి, వాని మ్రోల నిలచి దేవానుచరుడు, "భూసుర వర్యా! తపోవిశేష సంజాత దివ్యదృష్టిని బ్రసరింపుము. అల్లదే నరకలోకము. అందు యమయాతనల ననుభవించు వారెవరు? రాజులు, మహారాజులు, సామ్రాట్టులు, సార్వ భౌములు, ధనాఢ్యులు, లక్షాధికారులు, కోటీశ్వరులు, ఉద్యోగులు, నిరంకుశాధికారులు, నియంతలు ఏకచ్ఛత్రాధి పతులు. వారెంతకాలమునుండి యమయాతనల ననుభ వించుచుండిరో! ఇంకెంతకాల మనుభవింపవలయునో? వారిధనము, వారిరాజ్యము, వారి యధికారము, వారి సిరులు, వారికిపుడేమైన నుపయోగపడుచున్నవా? నీ తపశ్శక్తిచే నెవరినైన రాజును జేయుదువుగాక, అనంత ధనసంపన్నుని గావింతువు గాక. వారు సర్వవిధముల సుఖమునే పొందుదురను నమ్మక మేది? భౌతికదేహము ధనాదులచే యత్కించిద్భోగము ననుభవించిన ననుభ వించును గాక, ఆ భౌతిక శరీర మెంతకాలము నిలుచును. పరిపూర్ణాయుర్దాయము శతసంవత్సర పరిమితమేకదా!

శరీరపతనానంతరము జీవులను వెంబడించునది ధనమా? కాదు, ధర్మము. శాశ్వతసుఖము నొసంగు ధర్మము నుజ్జగించి క్షణిక సుఖాభాసము చేకూర్చు ధనము నాసించుట నీవంటి ప్రాజ్ఞునకు దగునా? నీకై నీవు కోరని మాట నిజమే. ఇతరులు సుఖపడగలరను విశ్వాసముచే వరదాన శక్తి నర్థించుచుంటివి. నీ విషయమున నక్కఱకు రాని ధనము ఇతరుల కుపయోగపడగలదని తలచుట వెఱ్ఱితనము. నీవు నన్ను నమ్మి యాశ్రయించితివి. అట్లయ్యు కుమార్గమున బ్రవర్తింతువేని నా సాహచర్యమున నీకు గలుగు లాభమేమి? సిద్ధులు గలిగిననాడు సత్యధర్మమార్గములు నిరుద్ధము లగును. ఒక్క తప్పు చేసిన, దానిని సమర్థించుటకు వేయి తప్పులు చేయవలసి వచ్చును. తత్ఫలముగ కామక్రోధలోభమోహములు చుట్టుముట్టును. ఈశ్వరానుగ్రహము లేక ధర్మమార్గమున నెవరును సుఖముగ సంచరింపజాలరు. ఇప్పటికిని నీమనస్సు సిద్ధులమీదనే యున్నదా? ఉన్నచో నీయభీష్టసిద్ధిని బ్రసాదించుచున్నాను. గైకొనుము. నీయిచ్చవచ్చిన వారిని వరప్రసాదముచే ననుగ్రహింపుము." అని హెచ్చరించెను.

కుండధారుని చరణంబులకు సాగిలి మ్రొక్కి విప్రుడు, "దయానిధీ! నీ సౌజన్య మనన్యము. నా దృక్పథము కేవల మైహికము, సంకుచితము. సిద్ధివాంఛచే నాహృదయము కలుషిత మయినది. నీ యవ్యాజానురాగము గ్రహింపలేనైతిని. నా యీ మహాపరాధము క్షమింపుము. నన్ను గనికరింపుము." అని వేడుకొనెను. దేవానుచరుడు సాదరంబుగ విప్రుని గౌగిలించుకొని, "సోదరా! ఇందు నీ తప్పేమి గలదు. కోరికలు గోరుట సర్వప్రాణులకు సహజము. సహజాపరాధములకు పశ్చాత్తాపమే ప్రాయశ్చిత్తము. అర్థకామాభిలాష సదుపులో బెట్టుకొని ధర్మమార్గానువర్తివై ఈశ్వరానుగ్రహపాత్రుడవు కమ్ము." అని దీవించి తిరోహితుడయ్యెను. ఆ బ్రాహ్మణునకు సర్వసిద్ధులు సమకూరెను. కాని వాని నాతడుపయోగింప లేదు. పరమపురుషార్థమయిన బ్రహ్మజ్ఞాన మలవఱచుకొని యా ధన్యుడు పరమపదము నందెను.

ధనాఢ్యులను, కామకింకరులను ప్రాజ్ఞులెవ్వరు సేవింపరు. యక్షకిన్నర కింపురుష దేవగణములు గూడ ధర్మాత్ముని సేవ నభిలషింతురు. ధర్మనిబద్ధబుద్ధికి సర్వము సిద్ధించును. మోక్షము గూడ వానికి కరతలామలకమే. సర్వేశ్వరుడు సర్వదా యాతని వెంబడించును. ధర్మమే సాధ్యము, ధర్మమే దైవము. ధర్మముకంటె నన్యశరణ్యము లేదు, లేదు, ముమ్మాటికి లేదు, లేదు.

ధర్మం శరణం గచ్ఛామి.

"ధర్మఏవ హతో హంతి
ధర్మో రక్షతి రక్షితః।"
ఏవం జ్ఞాత్వా వివేకేన
సదా ధర్మం సమాచరేత్॥

# LIFE OF SRI SANKARACHARYA

## PREFACE

I do not claim to be a scholar, and neither do I claim any authoritative knowledge of Sri Sankara's life and teachings. My only qualification for undertaking a task of such importance as writing a short life and teachings of Sankara, the Advaitic teacher, is that I am one of the large number of admirers of Sankara who consider him to be an intrepid thinker and logician of world proportions. I belong to no other sect or creed except that to which my own convictions and conscience lead me. But as one interested in the pursuit of the higher values of life, I have had occasion to study the systems of thought that have developed in our country and elsewhere, and, to my limited intelligence, it appears as if the last word has been said by Sri Sankara. It is as an expression of the reverence and admiration that I feel for a teacher of such proportions, that I have edited this critical biography in English of Sri Sankara, and his teachings. I am not a literary man either; but rather a bedouin, and I have no rank or prestige to lose except the name that my parents have given me.

I should also add that the main idea of drawing up a critical biography of Sri Sankara's life and teachings emanated from His Holiness Sri Jagadguru Sankaracharya of Kanchi Kamakoti Peetham for whom I have the highest devotion and reverence. This idea of his was worked upon by another devotee of His *viz*. Sri A. Kuppuswami Iyer, Headmaster of the Aryan Secondary School, Trichinopaly, who spared no pains to collect all the materials and the illustrations necessary for this. The first draft is his, and all that I claim to have done is just to shape it in proper language and edit it critically. If the book has any merit it belongs to Sri Kuppuswami Iyer, but its defects are mine. I seriously debated within myself about admitting my indebtedness to my friends, but the more I thought over it, the more I felt that any such thing was more likely to compromise their position, in as much as the final shape that has been given to the book is mine. Hence, I take the odium and responsibility for the publication of the book, but its material and source have been supplied by my friend, Sri A. Kuppuswami Iyer.

I must also add that the draft has been perused by His Holiness Sri Jagadguru Sankaracharya of Kanchi Kamakoti Peetham, but this does not mean that either He or the Mutt are in any way responsible for the opinions expressed here, which are wholly mine. The only claim for the manuscript is, that it has been perused by one of our leading scholars, and a living Jeevan Mukta, whom we have the good fortune of having in our midst. Thus, the reader can be assured that the book, especially the portions dealing with the pristine teachings of Sankara are not far off the mark.

I hope, God willing, a day will come when the whole effort will be seeing the light of the day in a book form.

*Hevalambi Vyasa Purnima*
**11th July, 1957.** N. RAMESAN

# LIFE OF SRI SANKARACHARYA

*by*

N. RAMESAN, M. A.,

*(Indian Adminstrative Service.)*

## CHAPTER I.

### SANKARA—THE TEACHER OF ADVAITA

It is a common belief of all Hindus, that, the prime aim of man's life on earth, is not mere acquisition of learning or wealth, but realisation of his oneness with the supreme God-head. A Hindu is said to have lived his life usefully, only if he makes this as the aim of his life, and strives one-pointedly towards realisation of this goal. There are times when spiritual awakening among the people is high, and *Jivanmuktas* and *Parivrajakas* abound the land, giving guidance and illumination to the aspirants. And there are also times, when the spiritual truth suffers a partial eclipse, and spiritual darkness descends on the land. On such occasions it is the belief among the Hindus, that the Lord himself descends in a human form in order to uplift the people and in order to revitalise their spiritual aspirations. The Lord in the Gita has said:

" यदा यदा हि धर्मस्य ग्लानिर्भवति भारत ।
अभ्युत्थानमधर्मस्य तदात्मानं सृजाम्यहम् ॥

"Whenever there is any dimunition of the eternal Dharma, then I take on a human form to uplift the people and to put down Adharma ".

This truth, namely, that man has only this supreme aim to unite with the Godhead within him, is a fundamental tenet of Hindu life, and he, that has any aspirations to this ideal of freeing himself, must seek reverently and ask the way of freedom from a Guru that is himself free. The Sivarahasya says:

" करिष्यत्यवताराणि शंकरो नीललोहित: ।
श्रौतस्मार्तप्रतिष्ठार्थं भूतानां हितकाम्यया ॥"

"Thus, Lord Siva, the blue-necked one will undertake a number of Avatars to establish the orthodox traditions, out of his boundless grace to help the people in the world "

Bhagavat Pada Sri Sankaracharya, the revered leader of all Hindus and the establisher of the profound truth of Advaitic doctrine, is believed to be one such *Jagadguru*. Sankaracharya is held to be an *Amsha Avatar* of Lord Siva himself. There are many references in the Puranas and other works to this effect, that Lord Siva himself took on a human form and came to earth as Sri Sankara. Thus the Vayu Purana says:

" चतुर्भि: सह शिष्यैस्तु शंकरोऽवतरिष्यति ॥"

"Sankara will take the form of a teacher along with four disciples ".

The Soura Purana, which is an important work, which gives us many details about the life of Sankara also has the following:

" व्याकुर्वन् व्याससूत्रार्थं श्रुतेरर्थं यथोचिवान् ॥
श्रुतेन्यर्थ्य: स एवार्थ: शङ्कर: सवित्राननः ॥"

"The Lord Surya himself will take on the form of an Avatar writing suitable commentaries on the Vyasa Sutras to spread the meaning of the Vedas."

In addition to the above Puranic references we have other references also about Sankara's being born as an incarnation of Lord Siva. Bhaskaracharya, the celebrated commentator of the Lalita Sahasranamastotra, speaks of Sankara in the following sloka.

"श्रीरामं प्रतिपुष्कराभिधमहायक्षेण वेदत्रयव्याख्यानावसरे
विशिष्य कथितं श्रीविष्णुधर्मोत्तरे ।
एतां धेनुमुपाह्वयामि सुदुघामित्यूगतं शंकराचार्यं शिष्य-
चतुष्टयेन सहितं वन्दे गुरूणां गुरुम् ।"

Sri Bhaskaracharya, in the above words, refers to another work called "Vishnu-dharmottara", which embodies the teachings of a '*yaksha*' called '*Pushkara*', to Sri Rama. In explaining one of the hymns of the Rig-Veda, it is stated, that, when the Advaitic Philosophy is forgotten in this world, Sri Sankara will incarnate to revive it, even like a cow that runs to its calf to give it milk.

Even apart from the references given above, it is clear that Sri Sankara, who has had such a remarkable career, within the short period of 32 years, could not have been an ordinary person but one divinely endowed.

The influence of Sankara upon the Hindu life and thoughts, can best be understood by reviewing the state of affairs in the country, just before his birth. The times were such, that the eternal truths of the Vedas and the Upanishads were all but forgotten. Buddhism and Jainism were at the height of their influence. The cult of '*Bhakti*' was spreading wherever there was any spiritual awakening. The merely outward ritualistic symbolism connected with a personal god and his worship, which were the product of Puranic Hinduism, were spreading everywhere. As a reaction against the ascetic discipline of the Buddhists, and the extremely emotional appeal of the '*bhakti*' cult, the *Meemamsakas* were exaggerating the importance of the Vedic rituals and rites. Kumarila and Mandanamisra, denounced the value of '*Jnana Marga*' and the institution of '*Sanyasa*' and were exaggerating the importance of the scrupulous observance of the external Vedic rites. People were getting confused everywhere, in these divergent claims of the religious leaders. The times were therefore ripe, for an invigorating leader to appear upon the scene, and lead the people back to a better understanding of the Upanishadic texts.

At such a time, Sri Sankara came, and tried to bring back the age, from the luxury of the mythology of Puranic days, back to the mystic truth of the Upanishads. The times were such, that, the theists were losing track of the ultimate truth in the hazy mists of '*bhakti*', whereas the *Purvamimamsakas* were trying to evolve a system of ritual, totally devoid of the spirit. It was, therefore, necessary to reconcile both, and re-establish the eternal '*Dharma*' and the truths of the Upanishads, and establish them on a foundatin of logic and reasoning, that will stand the severest tests from the dialectical experts. To this difficult task, Sankara applied himself with remarkable success, and he produced a stupendous system of philophy, that to this day, leaves one aghast with wonder at the brilliance of its logic, and the scintillating greatness of its universal conception.

But Sankara was not a mere intellectual philosopher alone. He was also an ardent devotee and a mystic poet of a very rare calibre. His "*Anandalahari*" and "*Soundaryalahari*" are perhaps the last word, on the song of the soul, singing in ecstacy over the bliss and beauty of the Divine Mother. Sankara has combined in himself, not merely the austere and serene philosophy of the Upanishads, but also the mystic ardour and fervour of the theists, and he has given a balanced system to the people, which to this day stands unrivalled in its brilliance of exposition and strength of innate spiritual fibre.

It is difficult to determine, as to who is greater, Sankara the lovable and gentle mystic poet, or Sankara the great founder of the super-rational, and austere Advaitic

doctrine. There have been few souls in the history of thinking in the world, that have produced such a remarkable combination of qualities. Dr. Radhakrishnan has the following to say of Sankara: "It is impossible to read Sankara's writings, packed as they are with serious and subtle thinking, without being conscious that one is in contact with a mind of very fine penetration and profound spirituality. With his acute feeling of the immeasurable world, his stirring gaze into the abysmal mysteries of the spirit, his unswearing resolve to say neither more nor less than what could be proved, Sankara stands out as a heroic figure of the first rank in the somewhat motley crowd of the religious thinkers of medieval India. A master of the strictest logic, he is also the master of a noble and animated poetry which belongs to another order. The rays of his genius have illumined the dark places of thought and soothed the sorrows of the most forlorn heart. And whether we agree or differ, the penetrating light of his mind never leaves us where we were".

## CHAPTER II.

### SOURCES FOR SANKAR'S LIFE

The sources for the life of Sankara are very scanty and meagre, as is the case with almost the life of every early great Indian.

Sankara himself was a great writer, and has left us a remarkable collection of writings, which reflect the power of his thought, and the greatness of his conception. The most noteworthy of his works, are his classic commentaries on the Brahma Sutras, the Gita, and the Upanishads. The 'Upadesha Sahasri' and 'Vivekachudamani' are composite works by Sankara, which reflect his general tenets. But unfortunately for us, these works of the master, do not contain much of useful biographical material. We have, therefore, mainly to depend upon the works of his disciples.

A number of biographies of Sankara, called 'Sankara Vijayas' have been written by his disciples, the most important of them being Madhava's "Sankara Digvijaya" and Anandagiri's "Sankara vijaya". There are other works which are not as authoritative as the above, as for example the 'Brihadvilaseeya Sankara vijaya,' 'Keraleeya Sankara Vijaya,' "Child-Vilaseeya Sankara Vijaya and the Brihat Sankara Vijaya.' Of the above, Anandagiri's biography is generally held to be the most authoritative. Anandagiri is held to be the same as 'Thotakacharya' who was one of the four important disciples of Sankara.

'Advaita Samrajya Lakshimi,' a commentator upon the Madhaveeya Sankara Vijaya, holds that Anandagiri was a direct and dear disciple of Sri Sankara. He says:

> "शङ्करस्य भगवतो भाष्यकारस्यायं शाङ्कर: आनन्द-गिर्यभिध: तस्य तत्प्रियशिष्यस्य वाक्यसार:"

The Dindima commentary on the Madhaveeya Sankara Vijaya gives a list of the prominent disciples of Sri Sankara as following: "अथ अनन्तरं पद्मपाद, हस्तामलक, समित्-पाणि, चिद्विलास, विज्ञानकन्द, विष्णुगुप्त, शुद्धकीर्ति, भानु-मरीचि, कृष्णदर्शन, बुद्धिवृद्धि, विरिञ्चिपाद, शुद्धानन्द, गिरिप्रमुखै:" Anandagiri's Sankara Vijaya also gives the same list of the disciples in the following words: "पद्मपाद, हस्तामलक, समित्-पाणि, चिद्विलास, विज्ञानकन्द विष्णुगुप्त, शुद्धकीर्ति, भानु-मरीचि, कृष्णदर्शन, बुद्धिवृद्धि, विरिञ्चिपाद, शुद्धानन्द, गिरिप्रमुखै:"

So, we may assume that Anandagiri was a contemporaneous and direct disciple of Sri Sankara and that his biography would contain the most accurate information about the life of the great Acharya.

Speaking on Anandagiri's work, Professor Wilson writes in the Indian Antiquary, Vol. V. as follows: "It bears internal evidence of being the composition of a period not far removed from that at which he (Sankara) may be supposed to have flourished and we may, therefore, follow it as a very safe guide".

The authorship of 'Madhaveeya Sankara Vijaya' which also known as 'Sankshepa Sankara Vijaya' is held by some to be due to Sri Vidyaranya the celebrated Acharya of the Sringeri Peetha. But this work gives only a succint and abridged edition of a certain older 'Pracheena Sankara Vijaya'. The Keraleeya Sankara Vijaya and the Chidvilaseeya Sankara Vijaya are very later works. Hence, among the written biographies, that of Anandagiri can be taken to be the most authoritative.

Among the sources, other than regular biographies of the Acharya, "Siva Rahasya" is the most important. This is an '*Ithihasa*' and an '*Arsha Grantha*' and written manuscripts of this are to be found in various libraries like, the Rama Taraka Mutt at Benaras, the Oriental Manuscript Library at Mysore etc. The "Patanjali Vijaya" is another work, which gives a detailed account of the Guru of Sri Sankara, and also gives a very brief account of the life of Sankara also at its very end. The 'Naishadha' of Sri Harsha also has certain implied references to certain facts about Sankara's life and doings. The 'Markandeya Samhita,' a Puranic work, gives a short and interesting account of Sankara and deals with the distribution of the five Sphatika Lingas got by Sankara from Kailas. The 'Sankarabhyudaya,' by Raja Choodamani Deekshitar and the Dindima on Madhava Sankara Vijaya, also throw interesting light on certain points concerning the life of the Acharya. Sadasiva Brahmendra's 'Gururatna-malika,' also gives us important details of Sankara's life.

Apart from the above, there are the traditional accounts written and obtainable in the Sankara Mathas all over the country. As is wellknown, Sankara established four Mutts, one at Badari in the north, one at Puri in East, one at Dwaraka in the West, and one at Sringeri in the south, and established the fifth Mutt at Kancheepuram for himself. In all these Mutts, traditional accounts of the '*Guru Parampara*' are avaible, and we are able to get some information from these also. Of these, the most important is that of the Kanchi Kamakoti Peetham, because it is only in that Mutt that an uninterrupted lines of Acharyas have been holding sway, dating right back to the Adi Sankara himself. Putting all the material together, we will be in a position to arrive at a fairly correct appreciation of the life of the Acharya.

# ANDHRA ARCHITECTURE

*By*

V. V. TONPE, M. A.

## IV APPRECIATING HINDU ARCHITECTURE.

### (i) CHARACTERISTICS OF HINDU ARCHITECTURE.

*Buddhist Sculpture in Andhra*

*(continued)*

In the previous article we dealt with Buddhist sculpture in the north Deccan and in that connection it was made clear that Buddhism was not diverse to Hinduism in worship and dedication and that it accepted the religion of the forests of the Vedic seers, though it adapted it to its times and surroundings. The world-famous cave-temples are the greatest unifying force that binds man to Nature. The caves in Ajanta which lie in the lap of a capturing bevy of hills and in the neighbourhood of the river Ajanta which descends from the heights in the shape of an impressive waterfall and the caves in Ellora over-hung by a rock over which in the rainy season torrents leap down into the water courses at its foot, present an enchanting spectacle of scenic and artistic beauty where human life is conceived in terms of the drama of the blue skies and the blue waters and the beautiful craftsmanship of man in the glorious silence of the setting sun. The names of the artists who at the sweat of their brow created these centres of Indian culture lie in oblivion, for here man's vanity is dwarfed by the magnificance of Nature and he is lost not in glorifying over his artistic achievement but in identifying himself with the Devine in Nature. It was the greatest sacrifice that man could do while expressing the essential harmony of man with nature and the universe.

*Buddhist Sculpture in Coastal Andhra*

Thus in the North Deccan a number of places become culturally important in Buddhist times due to their rock-cut architecture and sculpture while in the coastal Andhra, which was the heart of Andhra sovereignty, too, many places became famous for their Buddhist stupas and sculpture.

The coastal Andhra was situated midway between Magadha and Ceylon to which place Buddhism migrated, and so became a strong hold of Buddhism for sometime. At several places in the region between the Krishna and the Godavari a number of Buddhist sites had a mushroom growth. Places of Buddhist importance have discovered between Saligundum in the north and Chinnaganjam in the south. The stupas at Bhattiprolu, Amaravati and Nagarjuna-konda in the Guntur district and at Jagayyapeta, Gudiwada and Ghantasala in the Krishna district date between the 2nd Century B. C. and the 3rd Century A. D. They were embellished at the base with sculptured white marble panels richly carved in low relief.

*The Earliest Sculpture in Coastal Andhra*

Though the origin of the Andhras is traced by historians to prehistoric times, the earliest sculpture in Andhra dates only about the third Century before Christ. The stupas of Bhattiprolu, Amaravati and Jaggayyapeta are assigned to this century on the strength of the inscriptions in the Mauryan script and sculptures of an archaic style. A pali inscription of a nun who constructed the steps leading to a monument helps in fixing the date of

Guntapalli remains in the 2nd Century B.C. From archaelogical evidences some other stupas may also be assigned to the same category as those mentioned above in point of date. From the rare use of stone and absence of sculpture, the presence of dagaba in the place of the image in the apse of a chaitya and its approximation to the Teli when compared with the Buddhist buildings of the Krishna Valley, give Ramatirtham, a Buddhist tirtha, an early enough date. The nearness to the Teli beyond which the *Andhaka* monks lived according to the early Buddhist books and the Asokan monoliths and the absence of the usual rail and the chaitya window show that Sangharama belongs to the hoary past. The stupas of Guntapalli, Gudivada and Ghantasala may also be said to be as old as the others mentioned above from the nature of the structures. There are many other stupas of which no reliable evidence is as yet available to trace their origin.

From this evidence it will be possible for us to authoritatively say that the earliest sculpture in Andhra dates from about the 3rd Century before Christ.
The earliest sculpture of Coastal Andhra are of two types: (1) The archaics which are affiliated in style to those of Bhilsa and Sanchi and (2) the sculptures of the 2nd and 3rd Century A.D. which show the Graeco-Roman influence.

*1. The Archaic Sculpture*

Without getting into the details, it might be pointed out that the archaic sculptures were few and far between; at least the sculpture unearthed was not much. But that which is available for study is enough to give us a general idea of the archaic style. A few marbles were found at Bhattiprolu, Jaggayyapeta and Garikapadu of which not much of a definite nature is known. But they are evidence enough to show that sculpture was not altogether absent in the early Andhra architecture. Of these marble slabs, which encased the basement, only those at the projections were sculptured.

*Bhattiprolu Sculptures*

In 1892, A. Rea conducted excavations at the ruined stupas at Bhattiprolu, Gudivada and Ghantasala. He found at Bhattiprolu some valuables from the archaeological point of view among which was a pilaster capital with horses and riders (Fig. 1) and a portion of large slab



Fig. 1.

carved portion of a draped (Fig. 2.) The portion of the drapery that remains is a little elivated from the surface.

It will be in the fitness of things to say here that to this day Bhattiprolu is a mine of unexplored ancient sculpture.



Fig. 2.

The villagers who own lands round about this small town, very often come across a carved image or a marble slab with figures embossed on them which might have been a part of the ancient stupa situated in the place, when they plough or dig the land for agricultural purposes. The pity is that no archaeologist with enthusiasm and resoruces for excavations and practical work is coming forth that much lies hidden within the womb of mother earth. A Schliemann, an Evans and a Thompson of archaeology is yet to be born who will give us the key to the lost civilizations of ancient India.

*Jaggayyapeta Sculptures*

Jaggayyapeta sculptures are done in flat relief and are spacious and large. The elongated human figures seem to closely relate to the early Ajanta paintings. The slabs at the base of the stupa are not sculptured but pilasters upon them are carved in the style of Pital Khora and early Amaravati. The figures are larger than those of later Amaravati and are not in high relief. Their head-dress and ornaments like the ear-rings seem to resemble those at Ajanta. They lack the style and rapid movement of the later Amaravati and Nagarjunkonda sculptures. Some of the specimens found here are preserved in the Madras Museum.

One of them, a shrine or *Punyasala slab* (No. 14 in the Jaggayyapeta section of the Buddhist antiquities of the Madras Government Museum) is of architectural and sculptural interest. The shrine is supported by four pillars and is divided into three compartments. In the central compartment the *Buddha-padas* or the Buddha's feet are depicted as placed on an altar under an umbrella. The two compartments are occupied by women and one of them on the right has a vessel in her hand. The pillars support two storeys which have a barrel-shaped roof above them with a huge caitya-window. On the roof four finals are to be found. On the left a date palm is shown beyond which is a pilaster with a man standing on an aquatic animal. A man is shown standing on a pillow on the right with flowers in his hand.

Garikapadu is in Vinukonda Taluk of Guntur district. The carving of a Raja by his horse found here is a good specimen of art of the early Amaravti school. Though not much is known of this place, it might rightly be presumed that there must be

భక్తులలో అగ్రగణ్యురాలైన అక్కమదేవి చరిత్ర స్మరించదగినది. ప్రభవించినది మొదలుగా ఆ మహాభక్తురాలు మల్లికార్జున స్వామి అర్ధాంగినని తలుస్తూ ఆ స్వామి పాదసేవకే తనువు అర్పణచేసుకొన్నది. వక్రమార్గంలో చరిస్తూన్న రాజుకు జనులకు శరీరసౌఖ్యం కాంక్షించడం ఎంతటి నిరర్థకమైనదో ఆమె తెలిసివచ్చేటట్లుగా చేశారు. లింగధారణకు నిజమైన అర్థం ఏమిటో వివరించారు. సుందరమైన కన్నడభాషలో ఆమె నుడులు ఎన్నో ఉన్నవి. అవి గంభీర తత్త్వ ప్రతిపాదకములు అయిన నుడులు. ఆ మహాభక్తురాలు చివరికి శ్రీశైల క్షేత్రంలోనే శివసాయుజ్యంపొంది శాశ్వతకైవల్యపదం చేరుకొన్నారని చెప్పుకుంటారు.

శివరాత్రి సందర్భంలోను, ఉగాదికి కన్నడప్రాంతంనుంచి వేలాదిభక్తజనులు ఈ క్షేత్రానికి వచ్చి స్వామి దర్శనం చేసుకుంటూ ఉంటారు. శైవపీఠాలలో ఒక ప్రధానమైన పీఠానికి అధిపతులు శ్రీ శ్రీ శ్రీ జగద్గురు పండితారాధ్య సూర్య సింహాసన పీఠాధిపతికి ఈ పుణ్యక్షేత్రంలో కొన్ని ప్రత్యేకమైన హక్కులు ఉన్నవి. వారు శ్రీశైల దేవాలయ పునర్నిర్మాణ సంఘానికి అధ్యక్షులుగా కూడా ఉన్నారు. శ్రీశైలానికి ఏర్పడిన మొదటి బస్సు మార్గానికి మైసూరు ముఖ్యమంత్రి శ్రీ ఎస్. నిజలింగప్పగారు ప్రారంభోత్సవం జరపడం ముదావహంగా ఉన్నది.

ఈ రహదారి సుందరమైన ప్రకృతి దృశ్యాలమధ్యనుంచి సాగిపోతుంది. చమాలోయ, కృష్ణానది, శిఖరేశ్వరం, హాటకేశ్వరం కన్నులపండువుగా కనుపిస్తాయి. శరీరదార్ఢ్యం కలిగిన యాత్రికులు తమ పూర్వులను అనుసరించి పెచ్చెరువు మీదుగా శ్రీశైలం చేరుకుని యుగయుగాలనాటి మార్గం అనుసరించిన తృప్తిపొందవచ్చు. వారి శ్రమకు తగిన ప్రతిఫలం లభిస్తుంది. శరీరదార్ఢ్యం లేనివారికి, అంత ఎక్కువకాలం ఈ ప్రయాణానికి వినియోగించలేనివారికి, రహదారి ఉపకరిస్తుంది.

మార్కాపురం రైల్వేస్టేషన్‌నుంచి శ్రీశైలానికి 60 మైళ్ళ దూరం ఉన్నది. రైల్వేస్టేషన్‌వద్దనుంచి దేవాలయానికి వెళ్ళే ప్రయాణీకుల బస్సు ఈ దిగువ సూచించిన వేళల్లో ప్రయాణం చేస్తుంది:

మార్కాపురం రైల్వేస్టేషన్ విడిచే వేళ : ఉ॥ 5 గంటలు.
మార్కాపురం పట్టణం చేరుకొనే వేళ : ఉ॥ 5-15.
మార్కాపురం పట్టణం విడిచేవేళ : ఉ॥ 5-30.
తోకపల్లి చేరుకొనడం-ఉ॥ 6-30.
తోకపల్లి విడిచి పెట్టడం-ఉ॥ 6-40.
డోర్నాల్ చేరుకొనేవేళ-ఉ॥ 7-0
డోర్నాల్ విడిచేవేళ-ఉ॥ 7-15.
శ్రీశైలం చేరుకొనే వేళ-ఉ॥ 9-45.

కర్నూలునుంచి నంద్యాలమీదుగా రహదారిమీదుగాకూడా శ్రీశైలం చేరుకొనవచ్చు. తెలంగాణనుంచి కూడా మరొక రహదారి ఉన్నది. కాని, శ్రీశైలం చేరుకొనడానికి కృష్ణానది దాటవలసి వస్తుంది.

శివరాత్రికి, ఉగాదికి శ్రీశైలం దర్శించే యాత్రికులకు లెక్కఉండదు. ఇతర దినాలలోకూడా స్వామికి నిత్యపూజా పునస్కారాలు జరుగుతాయి. అవికాక సోమవారాలలో, ఏకాదశినాడు, మాస శివరాత్రికి, మల్లికార్జునస్వామికి ప్రత్యేకమైన పూజలు అభిషేకాలు జరుగుతాయి. ప్రత్యేకమైన పూజలు ముగిసిన తరువాత ఆలయాన్ని దీపాలతో అలంకరిస్తారు. ప్రతి శుక్రవారం భ్రమరాంబాదేవికి ప్రత్యేకమైన అలంకరణాలు చేస్తారు.

కొండమీద యాత్రికుల సౌకర్యార్థం ఒక హొటలు, సరకుల అంగడి ఉన్నాయి. హొటల్‌లో ముప్పావలా ఇస్తే ఒకపూట భోజనం పెట్టుతారు. దుకాణంలో సరసమైన ధరలకు సరకులు దొరుకుతాయి. యాత్రికుల వసతికి తగిన సౌకర్యాలుకూడా ఉన్నవి.

భారతప్రభుత్వం 50,000 రూపాయల ఖర్చుతో అతిథి గృహం ఒకటి నిర్మిస్తున్నది. స్థానిక అభివృద్ధి ప్రణాళిక క్రింద 20,000 రూపాయల ఖర్చుతో విశ్రాంతి గృహం నిర్మిస్తున్నారు. వసతి గృహాలు, కుటీరాలు నిర్మించడానికి 40,000 రూపాయలు విరాళంగా ఇవ్వడానికి ఉదారులు వాగ్దానంచేశారు. వాటిలో కొన్నిటికి పునాదులు వేస్తున్నారు. అచిరకాలంలోనే శ్రీశైలక్షేత్రం ఒక నగరంగా రూపొందగలదని, పూర్వపు ఔన్నత్యాన్ని పొందగలదని ఆశిస్తున్నాను. శ్రీ భ్రమరాంబా మల్లికార్జునులు అన్ని విధాలా అనుగ్రహించటానికి ప్రార్థిస్తున్నాను.

# శ్రీ భగవత్పాదాంజలి

*కవిశేఖర పంతుల లక్ష్మీనారాయణశాస్త్రి*

ఆకల్పాంతము నిల్చు నీయతుల లోకాతీతసుశ్లోకమే
యేకాలమ్ముల, నేచరిత్రముల, నేయేబోధలందెందు,నే
లోకాలందును నిన్నుఁబోలిన యతీంద్రుల్ గల్గ రేనాడు నీ
వాకుర్మీరిన వాకురాదు; గురుదేవా! భాష్యకారప్రభూ! ౧

నిరవద్య స్థిరవిద్య దుర్మతములన్ నిర్జించి - గర్జించి, భా
సురయోగస్ఫురదాగమోక్తసరణిన్ శోధించి - సాధించి, జ్ఞా
నరసమ్మున్ సరసమ్మునౌ రచనమున్ సంధించి - బంధించు, శం
కరుఁడౌ - శంకరు, నిన్భజింతు జగతీకళ్యాణ లీలప్రియా! ౨

స్వామీ! బూటకమెక్కువైనది; పరబ్రహ్మాత్మ విజ్ఞాన వి
ద్యా మాంగళ్యము తక్కువైనది; యతీంద్రా! వేషభాషాధన
వ్యామోహప్రియులై చరించెదరు సన్యాసీంద్రులున్నేడు, ని
ష్కామ శ్రీమయవేద భూమసుఖమున్ సాధించు టెట్లో? గురూ! ॥ 3

పరమానంద రసప్రసారలహరీ భాష్యప్రబంధావళిన్
వరగంభీర భవత్పదార్థరచనా భాస్వత్సుధాపూర వి
స్ఫురితాత్మీయ శివస్వరూపమునె, తాచూడంగ గాంక్షించు దు
ర్భరమీ నా హృదయమ్ము; నెటులన్ బాలించెదో సత్ప్రభూ! ౪

సంసారామయ భేషజమ్ములు, మహాశాస్త్ర ప్రమాణావళీ
సంసక్తంబులు, నిశ్చితార్థములు, విజ్ఞానప్రపూర్ణమ్ము లా
శంసాహేతునిగూఢ భావములు, సాక్షాత్కార యోగాలు, ద్వా
త్రింశత్వర్ష సమృద్ధముల్ హృదిని సంధింపంగదే సద్గురూ! ॥ ౫

# తోట్లవల్లూరు - వేణుగోపాలస్వామివారు

కవిరాజశిరోమణి, పండిత, దీవి నరసింహాచార్యులు, అష్టావధాని, అవనిగడ్డ.

వల్లూరు కృష్ణామండలమున "ఉయ్యూరు"కు నాలుగు మైళ్లదూరములో పశ్చిమముగా, కృష్ణానదికి తూర్పు తీరమునకలదు. "వల్లూరు" అను గ్రామములు గుంటూరు మండలమున బాపట్లతాలుకాలో నొకటియు, పశ్చిమ సముద్రతీరమున "కొచ్చిన్" స్టేటులో మఱొకటియు కలవు. ఈ గ్రామమున పలురకముల ఫలజాతి తోటలు మెండుగానుండుటచే దీనికి "తోట్లవల్లూర"ని ప్రసిద్ధ నామము కలిగినది. ఈ గ్రామములో అనాదిగా దేవాలయములుగాని, జమీందారిగాని లేవు. ఇది పూర్వము నూజివీటి జమీనులో చేరిన గ్రామమే. తరవాత కొంతకాలమునకు చల్లపల్లి యెస్టేటుకుఁజేరి, మరికొంతకాలమునకు యదియే నొక చిన్న "యెస్టేట"య్యెను.

## వల్లూరు యెస్టేటు - ఎడ్లనాగన్న

ఈ ఎడ్లనాగన్నగారిది వల్లూరు గ్రామమే. సామాన్య గృహస్థు. వీరి యింటిపేరు యెడ్లవారు. వీరికి మొదటినుండియు పశుసంపద మెండగుటచే యెడ్లవారని పేరు కలిగినది. వీరు యెడ్లమీద సరంజామాలను దూరదేశమునకు తీసుకొనిపోయి వర్తకము చేయుచుండెడివారు. "టిప్పు"సుల్తాను శ్రీరంగపట్టణమును నేలుచు పాండ్యులను చోళులను నోడించినప్పుడు వీరు కలకత్తానుంచి "కారన్‌వాలీసు" (Carnvalis) ను యాశ్రయించి వారి సైన్యముల సహాయముతో "టిప్పు" ను చంపి శ్రీరంగపట్టణమును (యిది మైసూరు స్టేటులోనున్నది) వశపరుచుకొనిరి. అప్పుడు "కారన్‌వాలీసు" సైన్యమునకు (మిలిటరీకి) అవసరమగు ఆహారపదార్థములను యీ నాగన్న 150 యెడ్లమీద తోలుకొని వెళ్లి సహాయపడుటచే యీ గవర్నరు జనరల్ సంతసించి యందరికి బహుమానములొసంగుచు, యీ నాగన్న గారి యెడ్లకు గోగ్రాసముక్రింద వుల్లిపాట్టును యొసంగగా నందు ధనము దొరికినట్లును దానిని యెడ్లమీద తెచ్చుకుని నాగన్న యీ యెస్టేటును వేలములో కొనుక్కొన్నట్లును వదంతికలదు.



ఆలయ దృశ్యము



ఆలయమునందలి - లోపలి దృశ్యము

## బ్రహ్మదేవర - బొమ్మదేవర

ఈ యెడ్లనాగన్న నిత్యము యొక బ్రాహ్మణపండితుని దర్శించి నమస్కరింపుచు వారికి కావలసినవన్ని యొసంగుచుండెడివాడనియు, నా బ్రాహ్మణుఁడీయనతో నీవు "అదృష్టవంతుడవయ్యా! నీకు రాజ్యాధిపత్యము రాఁగలదు." అని ఆశీర్వదించుచుండెడివాడనియు, నట్లె యీ నాగన్నకు రాజ్యాధిపత్యము వచ్చిన తరువాత, నా బ్రాహ్మణ పండితుని యొద్దకు వెళ్లి, "అయ్యా! తమ ఆశీర్వాదము వలన నాకు రాజ్యము లభించినది. కాన మా యింటిపేరు యింతటినుంచి మీ పేరు పెట్టుకొందుమని చెప్పి "బ్రహ్మదేవర" వారని పెట్టుకొనెనట. ఆ బ్రహ్మదేవరే" నేడు "బొమ్మదేవరై"నది. ఈ కథనే చరిత్రపరిశోధకులు, శ్రీయుతులు భావరాజు వెంకటకృష్ణారావు పంతులుగారు భారతిలో "అదృష్ట"మను కథను వ్రాసియుండిరి. తరువాత నీ గ్రామమభివృద్ధి కాఁజొచ్చినది. వీరె కోటను కట్టుకొని రాజ్యస్థాపన మొనర్చిరి. వీరి కోటప్రాకారముపై బండి తిరుగతగిన వైశాల్యము కలిగియుండెడిది. ఆ కోట వైభవము నేఁడు జీర్ణించినది.

## శివకేశవులు - జమ్మిలభావి

ఈ గ్రామమధ్యమున అతి ప్రాచీన కాలమునుండియు నొక పెద్దభావికలదు. దానికి నాలుగు మూలల నాలుగు జమ్మిచెట్లు కలవట. అందువలన దీనికి "జమ్మిలభావి" యని పేరు. ఈ భావి శివాలయమున కెదురుగానున్నది. నేటికిని యొక వృద్ధశమీవృక్షమానూతియొద్దునఁగలదు. ఈ గ్రామములో అనాదిగా "శివలంక" వారను ఆరాధ్య పండిత వంశము "కాళహస్తి" నుండి వచ్చి నివసించుచున్నది. ఒకనాటిరాత్రి శివలంక అయ్యవార్లంగారికిని చలివేంద్రపాలెము గ్రామములో శ్రీమంతులైన యొక రెడ్డిగారికిని శివకేశవులు స్వప్నమున సాక్షాత్కరించి తాము జమ్మిల భావిలో యేనాటినుండియో యుంటిమనియు వారుభయులు తమ్మును ప్రతిష్ఠింపుడనియు శాసించినట్లును, అందువలన యా మఱునాడే అయ్యవార్లంగారును రెడ్లును, యా నూతిని త్రవ్వించి పరిశోధించగా నందు శ్రీ భ్రమరాంబిక- చెన్నమల్లికార్జున విగ్రహములును, రుక్మిణీ సత్యభామా సమేత వేణుగోపాల మూర్తియు- శ్రీదేవి విగ్రహములును దొరికినట్లును, అంత వారుభయులు సంతో

పాంతరంగులై యా విగ్రహములనుఁ గొనిపోయి చిన్న దేవాలయములను నిర్మాణము చేయించి, శ్రీ మల్లికార్జున దేవరను భ్రమరాంబికను వీరభద్ర అయ్యావార్లంగారును, శ్రీ వేణుగోపాలమూర్తిని రెడ్డివారును ప్రతిష్ఠించిరట. ఇందు వలన నేటికిని కల్యాణసమయమున "తలంబ్రాలు" అక్షత లను వారి వంశీకులే తెచ్చు యాచారము అనూచాన ముగా జరుగుచున్నది.

## నాగన్ననాయుఁడు - గోపుర నిర్మాణము

తరువాత నాగన్ననాయుఁడుగారికి మూడవతరము వాడైన (మనుమడు) శ్రీ రాజా నాగన్ననాయుఁడుగారిప్పు డున్న దేవాలయ విమాన మంటప ప్రాకారాదులున్నూ అయిదుఅంతస్థుల గొప్పగోపురమున్నూ కట్టించి ధ్వజ దండాది శిఖరప్రతిష్ఠలంగావించిరి. మఱియు శ్రీస్వామి వార్లకు అంగరంగవైభవములకు తగు భూవసతులనిచ్చి అర్చక, ఆచార్య, పరిచారక, స్వస్తివాచక, మేళకార, మాలాకార, రథకారాదివృత్తులను యేర్పాటుచేసి నిత్య నైమిత్తిక బ్రహ్మోత్సవాదులను చేయించుచుండెను. ఇది గోపర్ధనవిమానము. ఇట్టి విమానములు "మధుర" (Muttara) లోను "తిరుప్పంది" (నందప్రయాగ) లోను కలవు. స్వామి త్రిభంగిలలితుఁడు. నిలువుసేవ. ఆల యము పశ్చిమాభిముఖము. గోపురశిల్పమతిసుందరమైనది. ఆలయమున కభిముఖముగ అంజనేయస్వామివారి ఆల యముకలదు. ఆలయమునకు తూర్పున ఆగ్నేయమూలలో నాలుగుఅంకణముల పెద్దకళ్యాణమంటపమును, దాని పక్క వాహనశాలయుకలవు. ఆలయమునకు దక్షిణభాగ మున "తిరుమట్టుపళి" (పాకశాల)యు, యాగశాలయును కలవు. ఆలయమునకు వెనుకభాగమున పుష్పవనమును- పూలబావియునుకలవు.

## నార్తువల్లూరు - సాతువల్లూరు

ఈ యెస్టేటు అయిదవతరమువరకు అవిభాగముగనే పరిపాలింపఁబడినది. కాని ఆరవతరములో అన్నదమ్ము లకు వివాదములుకలిగి, యిది అవిభక్తసంస్థానమని పెద్ద వొంటువారును, యిదివిభాజ్యముకావలెనని చిన్నవొంటు వారును న్యాయస్థానమునకేగఁగా, దొరతనమువారిది విభాగమున కర్హమైనదనియే తీర్మానించిరి. అందువలన నప్పటికి పరిపాలకులైన నరసింహారావునాయుఁడు భాష్య



కళ్యాణ మంటపము



శ్రీ వేణుగోపాలస్వామి ఆలయము - గాలిగోపురము

కారులునాయుఁడను యన్నదమ్ముల కుమారులు యెస్టేటును విభాగించుకొనిరి. ఈ గ్రామములో శివాలయమునకును, విష్ణ్వాలయమునకును మధ్య తూర్పుపడమర్లుగా నొకబజారుకలదు. అనగా నా వీధికి దక్షిణమున శివాలయమును నుత్తరమున విష్ణ్వాలయమునుఁగలవు. అందువలన నావీధికి యుత్తరభాగమును, ఆ ప్రాంతీయ భూములను "ఉత్తరవల్లూరు" (North Vallur) అనియు నావీధికి దక్షిణభాగమును, ఆ ప్రాంతీయభూములను "దక్షిణవల్లూరు" (South Vallur) అనియు పేరిడి పంచుకొనిరి. అందు "పంగెనగూడెము" పరగణా ఉత్తరవల్లూరువారికిని, "బందరు గూడూరు" పరగణా దక్షిణవల్లూరువారికిని చేరినవి. అందువలన శ్రీ వేణుగోపాలాలయము నార్తువల్లూరువారికి చెందినదైనను, శ్రీ గోపాలమూర్తి న్యాయస్థానమున తనకు అనుకూలముగా సహాయముచేయనందున స్వామివారు తమకక్కరలేదని వదిలివేసిరి. అంత దానిపాలనాభారమును సౌతువల్లూరు వారే వహించి అతివైభవముగా స్వామివారి కైంకర్యములను చేయించుచుండుటయేఁగాక దీనిని దివ్యస్థల మొనర్చి వార్షికోత్సవములను అతివైభవముగా చేయించుచూవచ్చిరి.

## మూలవరులు - అళ్వారులు

ఇచ్చట ధ్రువబేరము శ్రీ వేణుగోపాలమూర్తి రుక్మిణీ సత్యభామాసమేతముగా నేకపీఠమందు కలరు. అంతరాళికమున స్వామికి యుత్తరభాగమున లక్ష్మీదేవియు, దక్షిణభాగమున "అండాల్" (గోదాదేవి)యు విషమరేఖా స్థానములలో ప్రతిష్ఠింపఁబడియున్నవి. ఇట్లుండుట అగమ శాస్త్రవిరుద్ధము. ఈ విగ్రహములును శిల్పశాస్త్రప్రమాణ పురస్సరముగా లేవు. మరియు సుందరతరమైన శ్రీ అంజనేయస్వామివారి విగ్రహమొందు ప్రాచీనవిగ్రహమొందు అంతరాళికమున లక్ష్మిఅమ్మవార్లకు దక్షిణభాగమున పూర్వాభిముఖముగా భిత్తిలో బిగింపఁబడియున్నది. ఈ విగ్రహమీదేవాలయ ప్రతిష్ఠకంటె యనాదిగనున్నట్లు యర్చకులు చెప్పుచున్నారు. వీరే యీ క్షేత్రపాలకులై యుండ నోపును. మరియు "అండాల్" దేవికి దక్షిణపార్శ్వమున పన్నిద్దరాళ్వార్లు ప్రతిష్ఠింపఁబడియుండిరి. వీరు యీ కోవెలను దివ్యస్థలమొనర్చినప్పుడు ప్రతిష్ఠింపబడియుందురు. మరియు నిచ్చట మూలవరులకున్నూ పరివారదేవతలుకు కూడా, కౌతుకోత్సవ స్నపన బేరములు కలవు.

## స్వర్ణకవచము - సప్తనారీహంసవాహనము

శ్రీస్వామివారికి శ్రీ రాజా నాగన్ననాయుఁడుగారును, శ్రీ రాజాభాప్యకార్లు నాయుఁడుగారును సుమారు ముప్పది వేలరూప్యములు కిమ్మతుగల వజ్రములు, నవరత్నములు పొదికిన సర్వాంగస్వర్ణకవచమున్ను, సర్వాలంకరణ ములున్ను, రజతపాత్రములు, ఛత్రచామరములున్ను, పట్టు ఆలవట్టం మున్నగు సర్వాభరణములున్ను చేయించిరి. మరియు గరుడ, హనుమంత, అనంత, గజాశ్వ, వ్యాళ, పొన్న, రాజాధిరాజ వాహనములున్నూ, చలువచప్పరములు, రథాందోళికాది రాజలాంఛన వాహనములున్ను కలవు. మరియొక విశేషమేమన? ఈ దేశమున యెక్కడనులేనటువంటి "సప్తనారీహంస వాహనము"ను అపూర్వమైనదియు, ననన్యసామాన్యమైన శిల్పసంపదతో నొప్పారు విచిత్ర వాహనమొకటికలదు. ఇట్టి వాహనము దక్షిణ దేశమున "కంచి"లో మాత్రము కలదు. ఇది హంసాకృతిగనుండును. కాని అవయవములను పరిశీలించి చూచిన నేడుగురు స్త్రీవిగ్రహములతోనిది నిర్మింపబడినట్లు కన్పట్టుచున్నది. అన్ని విగ్రహములకు అంగ ప్రత్యంగ విభాగము స్పష్టముగా కన్పించుచున్నది. కాని మొత్తము అంతాకలసి హంసాకృతిగా కాన్పించును. ఇందువలన దీనికి "సప్తనారీహంస వాహనము"ని పేరు.

## ఉత్సవములు - సాంప్రదాయము

చైత్రశుద్ధపాడ్యమి- సంవత్సరాది, పంచాంగ శ్రవణము. వైశాఖశుద్ధ పౌర్ణమికి నవాహ్నికదీక కళ్యాణోత్సవము. ఆషాఢమాసమున పది దినములు అండాళ్ తిరునక్షత్రము. శ్రావణశుద్ధ పౌర్ణమాస్యకు పవిత్రోత్సవము. ఈ బహుళ అష్టమికి జన్మాష్టమి, ఉట్లపండుగ; అశ్వీయుజము నవ రాత్రములు, లక్ష్మీదేవికి కుంకుమపూజ. దశమికి శమీపూజ, పారువేటోత్సవము. మార్గశీర్షమున ధనుర్మాసోత్సవములు. శుద్ధయేకాదశికి ముక్కోటి. పుష్యమాసమునందు తిరు నక్షత్రములు, ప్రతివారము శుక్రవారసేవలు, నిత్యము పుష్పయోగోత్సవము (పవళింపుసేవ) జరుపుట ఆచారమై యున్నది. మరియు త్రికాలార్చనము జరుగును. ఇవి అన్నియు శ్రీ వైఖానససూత్ర ప్రకారము జరుపఁబడు చున్నవి.

## శ్రీ సత్యనారాయణవరప్రసాద్ - తిరునాళ్లవేడుకలు

శ్రీ భాష్యకార్లు నాయుఁడుగారి తరువాత, శ్రీ సత్యనారా యణవర ప్రసాదుగారు రాజ్యమునకు వచ్చిరి. వీరి కాల ములో గోపాలమూర్తికి జర్పిన యుత్సవములు వేడుకలు, భోగములు, వైభవములు ఆంధ్రదేశమున యెచ్చటను జరుపబడలేదన్నమాట అతిశయోక్తికాదు. ఆ తిరునాళ్లలోని వేడుకలు కొనియాడుటకు శక్యముకాదు. నిత్యము అలం కారములు, పూజా విశేషములు, భోగములు, యూరేగిం పులు, చూచి తీరవలసినదే. వేదపారాయణలు, పండిత ప్రకాండుల వాగ్వాదములు, కవితాగోష్ఠులు, అవధాన ప్రసంగములు, గానసభలు, నాటక ప్రదర్శనములు, పలు విధములైన మేళసమ్మేళనములు, భరత నాట్యములు, జరుగుచుండెడివట. ఈ దేశమునగల గొప్ప విద్వాంసు లను, విదుషీమణులనుగాక, దక్షిణదేశమునుండి పలు మంది గాయకులను, విద్వాంసురాండ్రను రావించి పలు ప్రదర్శనములను గావించుచుండెడి వారట. వింత వింత జంతువులపై విహారములు, ఏనుగులు, గుఱ్ఱముల పందెములు, పలురకముల "బాణసంచ" కాల్పులు, వర్ణింపనలవికాదట.

## తిరునాళ్లు - చాటువులు

వీరిపాలన కాలములోనే శ్రీస్వామి వారికి "బిందె తీర్థ" కైంకర్యమునకునొక "యేనుగు"ను సమర్పించిరి. ఈ విషయము యీ చాటుపద్యమువలన తెలియుచున్నది.

ఉ॥ వచ్చిరి రాజబంధువులు - వచ్చిరి మిత్రులు సత్క
విశ్వరుల్
వచ్చిరి గాయకోత్తములు - వచ్చిరి వారవధూపరం
పరల్
వచ్చిరి వాద్యకోండులును - వచ్చిరి యెచ్చటఁ
జూచినన్ బురం
బచ్చపునంతసంబునకు - నాకరమైకరమున్ భరం
బుగన్ ॥—

తే॥ గే॥ పిదపనియెల్ల పరిజనుల్ - వెంటరాగ
కృష్ణవేణికిఁజని కర - టీంద్రమొకటి
సేవకర్పించె జలకల - శికిఁగరీంద్ర
పాల కుండగు వేణుగో - పాల పతికి ॥—



శ్రీ వేణుగోపాలస్వామి - మూలవరులు

## శతకములు - కృతులు

శ్రీస్వామివారిపై పూర్వకవి యొక సీస శతకమును వ్రాసినాడు. శతకకర్తపేరు తెలియదు. శతకమున్ను సమగ్రముగ దొరకలేదు. కాని శైలి అంత్యప్రాసనియమ ముతోకూడి లలిత రతినొప్పారుచున్నది. అందందు కవి నిందాస్తుతినిఁజేసినాడు అందులోని రెండు పద్యములు.

సీ॥ శ్రీమహిళాహృత్కు - శేశయ పరఖేల
బలదైత్యసూదన - వలవిసీల
బుధగురు సంకాశ - సుధిత కీర్తివిసాల
దుర్మతి దితిజనం - దోహకాల



శ్రీ రాజ్యలక్ష్మి అమ్మవారు

బర్హిర్ముఖ వ్రాత - పరిపాలనోల్లోల
  కమనీయ విలసిత - కనకచేల
సంపూర్ణ దాక్షిణ్య - సంరక్షితకుచేల
  ఘనతర దుష్కృత - కంధికోల

గీ॥ భూరి కరుణారసావాల - పుణ్యశీల
భక్త సంఘాత సురసాల - భరితశైల
సరసగుణ జాలసంగీత - సామలోల
తోట్ల వల్లూరి గోపాల - తోయజాక్ష ॥

సీ॥ కాంచనచేలంబుఁ - గలియుండియుగొల్ల
  యిల్లాండ్రచేలంబు - లెత్తలేదె ?
కౌస్తుభరత్నంబుఁ - గల్గిసత్రాజిత్తు
  కాంచనమణి నపే - క్షింపలేదె ?
యురమున శ్రీదేవి - యొప్పారుచుండగాఁ
  గుబ్జతోరతికేళిఁ - గూడలేదె ?
ఐశ్వర్యనిధియున - నలరుచుండియుబలిఁ
  జేరి, చేఁజాచియా - చించలేదె

గీ॥ జౌరయిట్టియపేక్షచే - నలరెదీవు
చెలగినాకోర్కెఁదీర్చి ర - క్షించుటెట్లు ?
సరసగుణజాల సంగీత - సామలోల
తోట్లవల్లూరి గోపాల - తోయజాక్ష ॥ -

మఱియు శ్రీ స్వామివారిమీద పదకవితాధురంధరులగు శ్రీ రాయబట్టువీరరాఘవ కవిగారును, దాసుశ్రీరామపండితులుగారును కొన్ని పదములను వ్రాసి సన్నుతించిరి. ఈ రెండు ప్రబంధములును చాలా సుప్రసిద్ధములై యున్నవి.

## జీర్ణబింబము - పూర్ణబింబము

ప్రపంచమున చెడుపనిచేయుట యెట్టిదోషమో, మంచి పని చేయకుండుటయు నట్టిదోషమే. ఇవిరెండును తప్పులే ఇట్లె ఆలయములందు జీర్ణబింబములను పూజించుటయు పూర్ణ బింబముల పూజింపకుండుటయు, యీ రెండు కార్యములను తప్పులే. అనర్ధదాయకములే. ఈ దేవాలయము శ్రీ చారిటబుల్ అండ్ ఎండోమెంటు డిపార్టుమెంటువారు స్వాధీనపర్చుకొనిన తరవాత ఆలయమును చాలావరకు జీర్ణోద్ధరణమునుఁ గావించిరి. రంగులువేయించిరి. విద్యుద్దీపములను పెట్టించిరి. ఇట్లు ఆలయమును మాత్రము జీర్ణోద్ధరణముచేసిన చాలదు. ఇప్పుడున్న ధృవబేరము (మూలవిరాట్టు) యెప్పుడో శిథిలమైనది. లక్ష్మిగోదా విగ్రహములున్నూ అంగప్రత్యంగ విభాగము ప్రమాణపురస్సరముగా లేవు. ప్రతిష్ఠితస్థానములున్నూ సమరేఖమీద ప్రతిష్ఠింపఁబడక విషమస్థానములందు కలవు. ఈ సంగ



శ్రీ ఆంజనేయస్వామి - (మూలవిరాట్‌కు ఎదురుగా)



శ్రీ రుక్మిణీ సత్యభామాసమేత శ్రీ వేణుగోపాలస్వామి - ఉత్సవరులు

తిని శ్రీ బోర్డువారు గ్రహించి వీటిని తీసివేసి జలాధివాసము చేయుచు నూతన విగ్రహములను ప్రతిష్ఠింపవలసినదిగా సూచించుటచే వారి యుత్తరువు ప్రకారం నూతన విగ్రహములు చేయింపఁబడి అయిదు సంవత్సరములైనది. వాటిని ప్రతిష్ఠించకుండా యెవ్వరో వద్దు అన్నారని ఆపివేసిరట. ఇందువలన పైనచెప్పిన రెండు దోషములున్నూ కలుగుచున్నవి. జీర్ణవిగ్రహములను పూజించినను ఫలములేదు. పైగా అనర్థఫలమునిచ్చును. ఇట్లు నూతన విగ్రహములను ప్రతిష్ఠించుటకు యుద్దేశింపఁబడి తయారుచేయబడి వాటికి దీపధూపనైవేద్యాదులులేక పాడుపెట్టి యుంచుట మఱి యొక దోషము. ఇందువలనను అరిష్టమే ఫలము. కనుక శ్రీ స్వామివార్లను తమ మూర్తివంతముచే పునః ప్రతిష్ఠితులై అఖిల వైభవములతో పూర్వమువలె తులతూగుచు భక్తుల నగ్రహించుచుందురుగాత. అధికారులును శీఘ్రముగా నూతన విగ్రహములను ప్రతిష్ఠించి, శ్రీ వేణుగోపాలస్వామి వారి యనుగ్రహమునకు పాత్రులగుదురుగాక!

# దేవాలయములు - విశేషపూజలు

పండిత, పార్థసారధి భట్టాచార్య.

## గ్రహణారాధనము

సూర్యచంద్ర గ్రహణముల గొప్పతనము మన పూర్వులు గ్రహించి ఆ సమయమున స్త్రీలు పురుషులు బాలురు వృద్ధులు అందరును స్నానదానాదుల నాచరించదగునని నిర్ణయించిరి. సూర్యగ్రహణమున ఆరంభమునను చంద్ర గ్రహణమున విడుపు కాలమునందును స్నానాద్యాచరణము విహితము. స్నానము పట్టువిడుపులయందు రెండు సమయములలోను విహితము. దానము తర్పణము మొదలగునవిమాత్రము ఆరంభమునను అంత్యమునను చేయబడవలయును. సూర్యగ్రహణమునకు ముందు నాలుగు యామములలోను చంద్రగ్రహణమునకు ముందు మూడు యామములలోను భోజనము చేయరాదు. ఈ నియమము శక్తుల విషయమైనది. అశక్తులు కొంచెము ముందువెనుకగ భోజనాదులను చేయుటకు అనుమతించబడినది. విశేషములగు మంత్రములను అనుష్ఠించుటకును ఉపదేశములను పొందుటకును ఈ గ్రహణకాలము ప్రశస్తమని పెద్దలు చెప్పుదురు.

ఇయ్యది మానుషిక మర్యాద. ఈ తీరుననె దేవాలయములలోకూడ విశేషవిధులు చెప్పబడినవి. చాలా చోటులందు గ్రహణకాలమున ఆలయము తలుపులు మూసి యుంచబడి గ్రహణమోక్షము కాగానె గ్రహణతిరుమంజనమను పేరిట ఆలయమందలి బింబములను అభిషేకము చేసి పాత్రములను శుద్ధిపరచి వస్త్రములను ఉతికి యెండబెట్టి ధరింపచేసి విశేషముగ ఆరాధనము నివేదనము చేయుటకలదు. తిరుపతి దివ్యక్షేత్రమందుమాత్రము గ్రహణకాలమున తలుపులు మూయబడుచున్నవి. విశేష తిరుమంజనము లేకనె తరువాత నిత్యార్చనాదులు జరుగుచున్నవి.

శాస్త్రవిధి ననుసరించి గ్రహణకాలమున భగవానునకు మహాస్నపనము చెప్పబడినది. ఈ సమయములో కైంకర్యపరుల కెట్టి ఆటంకములేక భగవానుని అభిషేకకైంకర్యములను చేయవచ్చును. లోకాచారమునుబట్టి సూర్య చంద్ర గ్రహణము ఆ గ్రహముల విపత్తును సూచించునదై వైదికులకు ఆశౌచమును కల్పించుటచే అశుచి పరిహారమునకై స్నానము చేయబడునని తెలియుచున్నది. అట్టి యాచారమునకు తత్త్వమేదియైనను భగవత్కైంకర్యమునకట్టి దోషమున్నట్లు లేదు. పక్వప్రసాదములనుగాని అపక్వములనుగాని నివేదనము చేయుట ఈ స్నపనమునందు చెప్పబడలేదు. గ్రహణకాలమున జన్మనక్షత్రాది సంభవముచేతనేమి కారణాంతరములచేతనేమి భక్తులకు భగవత్సేవ కర్తవ్యమై యొప్పుటచే గ్రహణకాల స్నపనము జరిపించుట యుక్తమే. ఈ నిర్ణయమును ఆయాస్థలములందు జరిగెడి ముందువెనుక ఆచారమునుబట్టి వ్యవస్థ చేయవచ్చును.

## పవిత్రోత్సవము

ఈ యుత్సవము యొక్క మహత్త్వము ననుసరించి సాధారణముగ శైవవైష్ణవ భేదములేక వైఖానస పాంచరాత్ర శైవసన్నిధులన్నిటియందును వైదిక క్రియాకలాప యుక్తముగ ఆచరణమున నున్నది. ఇయ్యది బ్రహ్మోత్సవము (కల్యాణోత్సవము) వలె ప్రతి సంవత్సరము అనుష్ఠించదగిన నిత్యకృత్యమై యున్నది. మరీచి మహర్షి ఈ క్రింది విధమున దీని ప్రకారమును చెప్పిరి.

"అథ పవిత్రారోపణం వక్ష్యే సర్వయజ్ఞ ఫలప్రదం సర్వదోషోపశమనం సర్వతుష్టికరం సర్వకామప్రదం సర్వలోక శాన్తిదం హ్యేతత్. మంత్ర క్రియాద్రవ్యహీనం యత్కృతం తద్దోష శాన్త్యర్థం పవిత్రారోపణం కుర్యాత్. పవిత్రారోపణ హీనా యా పూజా సా నిష్ఫలా భవతి. రాజరాష్ట్రం వినశ్యతి. తస్మాద్యత్నేన పవిత్ర మారోపయేత్."

(పవిత్రోత్సవము సర్వయజ్ఞ ఫలప్రదము, సర్వదోషోపశమనము, సర్వతుష్టికరము, సర్వకామప్రదము, సర్వలోక శాన్తికరము. ఆరాధనాదులందు సంభవించెడి మంత్ర క్రియాద్రవ్య లోపములు దీనిచే చక్కపరుపబడును. పవిత్రోత్సవము జరుపబడని నిత్యపూజ ఫలము నీయదు. అట్టి పూజ రాజరాష్ట్రములకు క్షేమము నీయజాలదు. కావున తప్పక ప్రతి ఆలయమునందును సంవత్సరమున కొకసారి ఈ యుత్సవమును తప్పక చేయవలెను.)

ఈ యుత్సవమును చేయుటకు ఉక్తకాలములు చాంద్రమానరీతిగగాని సౌరమానరీతిగగాని ఆషాఢ శ్రావణ భాద్రపదమాసముల యందాచరింపవలెను. ఏ మాసమందుగాని శుక్లపక్ష ద్వాదశియందుగాని విష్ణుపంచక దినములందుగాని చేయదగునని కొందరనియెదరు. అధికమాసములందును క్షయమాసములందుగాని శూన్యతిథ్యాదులందుగాని పూర్వవిద్ధయగు ఏకాదశి తిథియందుగాని ఇతర దుష్టకాలములందుగాని ఈ యుత్సవమును చేయరాదు. రాజాజ్ఞచే ఏ సమయమందును చేయవచ్చును.

ప్రయోగప్రకారము :—ఆలయము ముంగిట మండపము నందుగాని ప్రపయందుగాని యాగశాలను నిర్మించి యథా శాస్త్రముగ దర్పణోదరమువంటి వేదికను కట్టవలెను. నలు దిక్కులను ద్వారతోరణములచే అలంకరించి పూర్ణకుంభ ములు అంకురములు దర్భమాల తరంగములు స్తంభ వేష్టనములు ముక్తాదామములు మొదలగు అలంకారములచే శాలను శోభితము కావించి పూర్వోక్త వేదికకు ముందు భాగమున పౌండరీకాగ్ని కుండమునుగాని సభ్యాగ్ని కుండ మునుగాని నిర్మించి దానిని గోమయముచే అలికి పంచ వర్ణములతో రంగవల్లులను బెట్టి యాగద్రవ్యమును సేక రించవలెను. ఉత్సవారంభదినమునకు ముందునాటిరాత్రి శాలశుద్ధిచేసి అంకురార్పణము కావించవలెను.

పట్టుతోగాని సువర్ణముతోగాని పవిత్రములను చేయుట ఉత్తమకల్పము. వెండి పవిత్రము మధ్యమకల్పము. నూలు పవిత్రము చివరికల్పము. దోషరహితమైనట్టి ద్రవ్య ముతో సుమంగలియును పతివ్రతయునగు బ్రాహ్మణ వధువుచేగాని బ్రాహ్మణకన్యకచేగాని పేనబడిన సూత్రముచే పవిత్రమును చేయుట యుక్తము. అట్టి వస్తువులభించనప్పుడు విక్రయమునకు అంగడిలో కొన వచ్చును. మూషికములు మొదలగు వానిచే కొట్టబడి నట్టిగాని తలవెంట్రుకలతో కలసినట్టిగాని సూత్రము కూడదు. యెక్కువ లావుగగాని సన్నముగగాని కూడదు. హెచ్చుతగ్గులు లేక సమముగా నుండెడి సూత్రమును మూడు పేటలుగా మడిచి మంత్రముతో పంచగవ్యములచే ప్రోక్షించి దానిని ఒక్కటిగా పేనవలెను. నూటయెనిమిది ముడులతో మెడనుండి జానువులవరకు (బింబమునకు) వ్రేలాడునట్టు చేయుబెడి పవిత్రము ఉత్తమము. అట్లే యేబదినాలుగు ముడులతో ఊరువులవరకు వ్రేలాడునది రెండవ పక్షము. యిరువదియేడు ముడులతో నాభివరకు ఉండునది కడపటి పక్షము. బింబము నంతను ఆవరించ దగి వేయిన్నినూటపదారు గ్రంధులతో చేయబడిన ఒకానొక సూత్రము వనమాలయనబడు దానిని కూడ కట్టవలయును. ముడియనునది అంగుష్ఠ ప్రమాణఘనముగలిగి యుండుట ఉత్తమపక్షము. మధ్యమాంగులి ప్రమాణము రెండవ పక్షము. కనిష్ఠాంగులి ప్రమాణము కడపటి పక్షము. మంత్ర పూర్వకముగ పై ముడులను వేయవలయును. ఇరువదియేడు ముడులతో ఉపవీతము ఉండవలయును.

యజమానుడు ఆచార్యుడు శిష్యుడు అగ్నికుండము వీనికివలయు పవిత్రములకు యెనిమిది ముడులుండ వలయును. పరివారదేవతల పవిత్రములకు పంద్రెండు గ్రంధులుండవలయును. ఈ గ్రంధులను సుగంధ ద్రవ్య ములచే అలంకరించి సుగంధధూపమును సమర్పించ వలెను.

ముందు చెప్పినట్లు పూర్వరాత్రి అంకురార్పణము చేసి, మరునాడు ఏకాదశి ఉదయము ఆచార్యాదులు స్నానాను ష్ఠానముల జేసికొని ఆలయమునకు వచ్చి ప్రదక్షిణ ప్రణామములజేసి దేవునకభిముఖులై సమాహితమనసుతో అష్టాక్షర మహామంత్రమును జపించి ఆనాడు ఉపవాసముగ నుండవలయును; స్త్రీ శూద్రాదులతో భాషింపరాదు. యాగ శాలలో ప్రవేశించి దేవుని బ్రార్థింపవలెను. దేవునకు స్నప నము ఉక్తహోమాదులు చేసి పూర్వోక్తవేదికి పశ్చిమమున పవిత్రములనుంచి అర్చించి రక్షాబంధము చేసి శయనాధి వాసము గావించవలయును. పవిత్రములను స్పృశించి ఉక్తమంత్రములను జపించుచు చుట్టి రక్షాచక్రమును ఆవరణత్రయ దేవతలను శాంతగరుడ చక్రదేవతలను స్యక్షాది విమానపాలకులను కూర్చలయందావహించి బలినొసగి అగ్నియందు హౌత్రశంసన పూర్వకముగ మూర్త్యావాహనము చేయునది. ఆవాహన క్రమముగ జుష్టాకార స్వాహాకారముల చేసి భగవానునకు స్నపనము వస్త్రాలంకారములను చేసి సప్తవింశత్యుపచారములచే అర్చించి అధివాసగతములగు పవిత్రముల తెచ్చి భగ వానున కర్పించునది. అట్లే ఆలయ మండపాదులకును సమర్పించి బలినీయవలెను. అట్లే యజమానుడు ఆచార్యుడు శిష్యులు వీరలు పవిత్రములను ఉంచి ఉక్త హోమముల చేయునది. ప్రాగాదిగ నాలుగు దిక్కు లందును చేయునది. ఆచార్యులు ఋత్విక్కులును అష్టాక్షర ద్వాదశాక్షర మహామంత్రములను విష్ణుగాయత్రిని జపించి పుష్పాంజలిని సమర్పించి నృత్తగీత వాద్యములచే రాత్రిశేషమును గడుపవలయును. ఆవల అగ్ని విసర్జ నము చేసి పుణ్యాహము ఆచార్యాదులకు దక్షిణాదానాదుల చేయునది.

ఇట్లు తొమ్మిది, యేడు, ఐదు, మూడు, లేక ఒకదినము గాని పవిత్రోత్సవారాధనము చేసి బ్రాహ్మణపూజనము వైష్ణవతదియారాధనమును చేసి దక్షిణాదానము చేయ వలెను. ఈ యుత్సవాచరణముచే సర్వాభీష్టసిద్ధి గల్గును. సంవత్సర పూజాఫలము సిద్ధించును. భగవానునితో శ్రీ వైకుంఠలోకావాసమును సిద్ధించును.

(మరీచి విమానార్చనా కల్పము 78 పటలము)

# గర్వభంగము

బులుసు - వేంకటరమణయ్య.

ధర్మరాజు రాజ్యం పాలిస్తూ, ఒకప్పుడు నిండు కొలువు తీర్చి ఉండెను. అప్పుడు సభలో అతని సోదరులూ, కొందరు మహర్షులూ, వేదవ్యాసుడూ కూడా ఉండిరి. సందర్భవశాత్తూ వ్యాసమహర్షి విష్ణువుయొక్క విలాసాన్ని గ్రహించడం సామాన్యులకు సాధ్యం కాదనీ, అతడు మానుషరూపం ధరించి, కృష్ణుడుగా మనతో కలసి మెలసి తిరుగుతూ ఎంతో ఆప్తుడుగా ఉన్నా అతనినిగురించి మనం తెలుసుకో లేక మాయలో పడి ఉన్నామనీ, అందుకొనమే తనవంటివానికి కూడా యింకా ముక్తి లభించలేదనీ, అతని లీలలు అనంతాలనీ చెప్పగా—ఆ విషయాన్ని వివరించే ఒక లీలను వినిపించ వలసినదిగా యుధిష్ఠిరుడు కోరినాడు. వ్యాసమహర్షి చెప్పడానికి సిద్ధంగా వున్న సమయంలో అక్కడికి ఆకాశమార్గంగా అయిదుగురు మహాత్ములు దిగి సభలో ప్రవేశించారు. వారిలో నలుగురు పెద్దవారు, ఒక్కడు బాలుడు. పెద్దవారిలో ముగ్గురు సూర్య సమాన తేజులు. ఒక్కడు పూర్ణచంద్రోపమానుడు! బాలుడు ఇంద్రనీలమాణిక్యంవలె ఉన్నాడు. సూర్యసమాన తేజస్కులు ముగ్గురూ సనక, సనందన, సనత్కుమారు లనీ, పూర్ణచంద్రసమానుడైన పురుషుడు నారదుడనీ వారు గ్రహించారు. కాని, అయిదవవాడైన ఆ బాలుడెవ్వడో తెలుత తెలియడం లేదు. అతడు విశాలమూ, ప్రకాశ మానమూ అయిన ఫాలము కల్గి గోపిచందనాన్ని ధరించి యుండెను. రమణీయమైనట్టియు, దివ్యవాసనలు కలిగి నట్టియు పారిజాతపుష్పమాలికను ధరించి ఉండెను. చెవుల ప్రక్కను తులసీదళాలను పెట్టుకొని, రెండవ కృష్ణునివలె కనబడెను. వారు కొంచెం సేపు ఆలోచించి, ద్వారకానగరంలో శ్రీకృష్ణుని దేవేరులకూ, తక్కిన అంతః పురస్త్రీలకూ వినోదంగా కాలక్షేపంకోనం కథలు చెప్పుతూ వుండే గోవిందశర్మ అనే బ్రహ్మచారి అని తెలుసు కున్నారు.

ధర్మరాజుతో సహా సభాసదు లందరూ వారిని చూచి, లేచి ఎదుర్కొని, సగౌరవంగా సభలోనికి తీసుకువచ్చారు. కుశలప్రశ్నానంతరం ధర్మరాజు వారిని సుఖాసనాసీను లనుగా చేశాడు. గోవిందశర్మ వ్యాసమహర్షిదగ్గర కూర్చున్నాడు. భగవంతుని లీలలకు ఉదాహరణంగా ఒక అద్భుతవిషయాన్ని - విష్ణుమాయాజాలాన్ని బాగుగా ఎరిగిన ఆ గోవిందశర్మచేతనే చెప్పించవచ్చునంటూ వ్యాసుడు అనుకున్నాడు.

ధర్మరాజుకు గోవిందశర్మను చూడగా ఆశ్చర్యమూ, ఆనందమూ కలిగినవి. అతడు శర్మను చూచి "మహాను భావా! మాకు శ్రీకృష్ణు డెంత పూజ్యుడో, నీవున్నూ అంత పూజ్యుడవు. అతనికి ఆప్తస్నేహితుడవు. నీవు యిచ్చటికి వచ్చి మా గృహాన్ని పావనం చెయ్యడంచేత మేము ఎంతో ధన్యుల మైనాము. చెప్పకేమి? నా కొక్క విషయం మాత్రం ఎంతో ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నది. అది నీవు పారి జాత పుష్పమాలికను ధరించడమే! ఆ మాలికను ధరించ డానికి యీ లోకంలో భగవదవతారమైన శ్రీకృష్ణునికి తప్ప మరెవ్వరికీ అధికారం లేదుగదా! నీవు ఎలా ధరింపగలిగావు? దీన్నిబట్టి చూస్తే నీవు సాధారణవ్యక్తివి కాక, లోకోత్తర పురుషుడవువలె కానవస్తున్నావు. నీ వృత్తాంతమంతా సవిస్తరంగా తెలిపి మా సందేహాలను తీర్పవలెనని ప్రార్థన" అని సవినయంగా అభ్యర్థించాడు.

తర్వాత ఆ బాలవటువు ఈవిధంగాచెప్ప నారంభించాడు. "అయ్యా! బలరామ, కృష్ణులు కాశీలో సాందీపని అనే విద్వాంసుడిదగ్గర సమస్తవిద్యలూ అభ్యసించారని మీకు తెలిసే వుంటుంది. ఆ సాందీపనియే నాకు తాతగారు. ఆయన పెద్దకుమారుడైన ధర్మశీలుడు మా తండ్రి. నేను పుట్టిన సమయంలో ఆకాశవాణి "ఈకుర్రవాడు సమస్త శాస్త్రాలూ అచిరకాలంలోనే గ్రహించి యత్యాశ్రమాన్ని స్వీకరిస్తాడు. గోవిందునికి మిత్రుడుగానూ, సహచరుడు గానూ వుంటాడు. అందువల్ల ఇతనికి గోవిందశర్మ అనే పేరు పెట్టండి!" అని పలికినదట! ఆ విధంగానే నేను సమస్తవిద్యలూ నేర్చుకొని, బ్రహ్మచారిగా ఉన్నాను. శ్రీకృష్ణునికి నామీద అవ్యాజకరుణ కలిగింది. నేను అతని నగరులో స్వేచ్ఛగా సంచరిస్తూ, శ్రీకృష్ణునికీ, అతని అంతః పురకాంతలకూ వినోదంగా కథలు చెప్తూ కాలం గడుపుతూ ఉంటాను.

ఇక—నా కీ పారిజాతపు పూలదండ ఎలా వచ్చిందో, వివరించి చెప్తాను. సావధానంగా వినండి.

ఈ నారదమహాముని శ్రీకృష్ణుడు రుక్మిణీదేవిఅంతః పురంలో వున్నప్పుడు ఒకసారి ఒక పారిజాతపుష్పం తెచ్చి యివ్వడమూ, దాన్ని శ్రీకృష్ణుడు రుక్మిణీదేవికే ఇయ్యగా సత్యభామ అలిగి పారిజాతవృక్షాన్నే తన పెరటిచెట్టుగా నాటించడమూ మీ అందరికీ తెలిసిన సంగతే! దాని ప్రభావం ఎటువంటిదో? ఆ వృక్షం వచ్చినదగ్గిర్నుంచే సత్య భామకు ఒక నూతన లావణ్యం—ఆత్మతృప్తీ కలిగినవి.

శ్రీకృష్ణుడు ఎప్పుడూ ఆమెగృహంలోనే వుంటూ వచ్చాడు. అతడు ఇకమీద తన్ను విడిచి ఒక క్షణమైనా ఉండలేడనే అభిప్రాయం ఆమెకు కలిగినది. ఇట్టి లోకోత్తరసౌభాగ్యంచేత ఆమె గర్వించి, శ్రీకృష్ణునియొక్క తక్కినమహిషులను అవమానించాలని ఆమె సంకల్పించి—ఒకనాడు పారిజాత పుష్పాలను విరివిగా బుట్టలతో కోయించి, బంగారు పళ్లెల నిండా నింపి—శ్రీకృష్ణుడు చిరునవ్వుతో గమనిస్తూ వుండ గానే—"యీ పువ్వులు తీసుకొని వెళ్లి—ఆ యీ సవతులకు ఇచ్చి—'ఇవి మా దేవి పెరటిలో పూచిన పువ్వులు' అని హెచ్చరించి, వారివారి భావాలు ఎలా వున్నదీ గమనించి రావాలి. ముఖ్యంగా రుక్మిణీదేవి ఏమి అనుకున్నదీ నాకు వివరంగా తెలియాలి" అని తగిన చెలి కత్తెలచేతికి ఇచ్చి వారందరికీ పంపినది.

రుక్మిణీదేవి దగ్గిరికి పంపబడిన పరిచారిక పోతూ తనలో "మాదేవి మంచి ఉపాయం పన్నినది. ఈ దెబ్బతో రుక్మిణీ దేవి యీ జన్మలో తల యెత్తుకోలేదు" అని అనుకొని కులుకుతూ ఆ దేవి భవనద్వారాన్ని చేరింది. అక్కడి ద్వారపాలకురాలు సత్యభామపరిచారికను లోపలికి పోకుండా అడ్డుకొని "మాదేవిన్నీ, శ్రీకృష్ణులవారున్నూ ఏకాంతంగా ఏదో మాటలాడుకుంటూ వున్నారు. ఇలాంటి సమయంలో నీవు లోపలికి పోవడం భావ్యం కాదు. అయినా నీవు ఏమిపనిమీద వచ్చావు? ఈ పువ్వులు యివ్వడానికేనా? వీటిని ఎవరు పంపారు? నువ్వు ఎవ్వరి పరిచారికవు?" అని అన్నది. ఆ మాటలు విని సత్యభామసేవకురాలు నవ్వి "పారిజాతవృత్తాంతమే నీకు తెలియదా? శ్రీకృష్ణులవారి కాంతలలో మా దేవి ఒక్క సత్యభామకు తప్ప యీ పువ్వులు మరెవరిదగ్గరున్నాయి? పాపం! మీ దేవికి ఇవి లేవని అభిమానంకొద్దీ ఎంతో ప్రీతితో మా దేవి పంపించినది. ఏమో, మీదేవీ, శ్రీకృష్ణులవారూ ఏకాంతంగా వున్నారంటూ లేనిపోని అబద్ధాలు ఆడుతున్నావు. ఆ ప్రభువు మా దేవి అంతఃపురాన్ని విడిచి ఎక్కడికీ పోడు. అయన దగ్గర వుండగానే మాదేవి వీటిని పంపింది" అని అన్నది.

ఆ మాటలకు ద్వారపాలకురాలు విరగబడి నవ్వుతూ, "పారిజాతమంటూ ఏమో మహా ప్రమాదంగా చెప్తున్నావు! ఈ చెట్టు శ్రీకృష్ణుని దేవేరు లందరియిళ్లల్లోనూ వుంది. నువ్వు తెచ్చిన యిలాటి పువ్వులు మా దేవి అంతఃపురంలోని దాసీజనం తలలపై ధరిస్తూ వుంటారు" అని జబాబిచ్చింది.

ఈ మాటలు వినేసరికి సత్యభామ చెలికత్తెకు విప రీతంగా కోపం వచ్చింది. అయినా, దాన్ని లోపల అణచు కుని "ఇదంతా ఎందుకూ? ఈ పువ్వులు రుక్మిణీదేవికి యివ్వవలెనని మా దేవి చెప్పి, పంపించినది. వీటిని ఆమెకు అందించడమే నా పని. నన్ను లోపలికి పోనియ్యి. లేకపోతే నేను వెనక్కి పోవలసి వస్తుంది. అది మర్యాద కాదు" అన్నది. లోపలనుంచి వీరి సంవాదాన్ని వింటూ వున్న ఒక పరిచారిక వెంటనే వచ్చి "మాదేవి అనుమ తించింది. నీవు లోపలికి రావచ్చును" అంటూ సత్య భామ పరిచారికను లోపలికి తీసుకుని వెళ్ళినది.

అక్కడ రుక్మిణీదేవి శ్రీకృష్ణునితో కొంతసేపు విహరించి, ఉద్యానంలోని దీర్ఘికలో స్నానం చేసి, బంగారుచాయ పట్టుచీర ధరించి అప్పుడు పూచిన పారిజాత పుష్పాలను తలలో తురిమి, ఆ పారిజాతమంటపంలోని పూలపాన్పు మీద సుఖాసీనయై, తనలో ఇలా అనుకొన్నది—"భగ వంతుడు తన కొక్కరైకే పారిజాత వృక్షాన్ని యిచ్చినట్లు సత్యభామ భావిస్తూ ఉన్నది. ఆ పరాత్పరుడు నాకుకూడా యీ వృక్షం పెరటిచెట్టుగా ప్రసాదించినట్లు తెలిస్తే మన స్సులో ఎంతో కుమిలిపోతుంది. తన పెరట్లో పారిజాత వృక్షం వున్నాదని తృప్తిపొంది, మనోహరుడు చాలాకాలం నుంచీ నాదగ్గిరే వుండిపోయినా లక్ష్యంచెయ్యడం లేదు. ఇప్పుడుగానీ నేను ఈ పుష్పాలను ఆమెకు కానుకగా పంపిస్తే మరీ కుమిలిపోతుంది. ఆమెగర్వం కాస్తా అణ గారిపోతుంది" అని యిలా అనుకొని కొన్ని కొత్తగా పూచిన పారిజాతపుష్పాలను కోయించి తెప్పించి నేర్పుగల పరిచా రికకు వానిని యిచ్చి "నువ్వు యీ పువ్వులను తీసుకు పోయి సత్యభామ కిస్తూ మాకృష్ణపరమాత్మ మాకున్నూ ఒక పారిజాతవృక్షాన్ని తెచ్చి యిచ్చాడు. అలాంటి వృక్షం మరెక్కడా లేదు. ఇదిగో! అది పూచినపువ్వులు! ఎంతో సువాసన గలవి! వీటిని నీకు కానుకగా సమర్పించినది" అనిచెప్పి యిచ్చి, ఆమెమనోభావం యెలా ఉన్నదీ గమ నించి నాకు చెప్పుము" అని చెప్పుతూ వుండగానే—సత్య భామ పంపిన పరిచారిక అక్కడికి వచ్చినది. రుక్మిణీ దేవితో శ్రీకృష్ణుడు కూడా వుండడం చూచి, ఆ పరిచారికకు చాలా ఆశ్చర్యం కలిగింది.

"ఇప్పటిదాకా సత్యభామదగ్గిరున్న యీ మాయలమారి కృష్ణుడు ఎప్పుడు, ఏ దారిని వచ్చి యీమెతో వినోదిస్తున్నాడో తెలియదు. ఇక్కడి పారిజాతవృక్షం పువ్వులు మా దేవి పంపినవాటికంటే మనోహరంగానూ, ఎంతో సువాసనను ఇస్తూనూ ఉన్నవి. ఈ మాయల కృష్ణుడు యీ వృక్షాన్ని ఎక్కడనుంచి, ఎప్పుడు తెచ్చి యీమెకు ఇచ్చినాడో బోధ పడకుండా వున్నది. ద్వారపాలిక ఏమో చెప్పితే అదంతా అబద్ధం అనుకున్నాను. కాని, అదిచెప్పిన సంగతులన్నీ అక్షరాలా నిజం!" అని ఆ పరిచారిక తనలో అనుకుంది. ఇంతలో రుక్మిణి సత్యభామదగ్గరకు పంపదలచిన పరిచా రిక కానవచ్చింది. ఆమె సత్యభామ పరిచారికను చూచి చిరునవ్వునవ్వినది. అది ఆమెకు చాలా కష్టమని అని

పంచినది. "ఇలాంటి సందర్భంలో ఈ పుష్పములు రుక్మిణీదేవికి ఇవ్వడం మేలా? ఇవ్వకుండా తిరిగి పోవడం మేలా? ఒకవేళ ఇచ్చినట్టయినా "ఇలాంటివి మాయింట్లోనూ ఎన్నో ఉన్నవి. ఇవి మాకు అక్కర్లేదు" అని అంటే తల కొట్టినట్లుండదా? ఇవ్వకుండా వెళ్ళిపోతే—ఇంతదూరమూ వచ్చి, అందరికళ్ళాబడి, తిరిగి వెళ్ళిపోవడం అంతకంటెనూ అవమానం కదా!" అని సందిగ్ధావస్థలో పడి—చివరకు ధైర్యం తెచ్చుకుని యేమీ యెరగనట్టుగా దగ్గరకు వెళ్లి, రుక్మిణీకృష్ణులకు నమస్కరించి, ఆ దేవిముందర ఆ పువ్వులు పెట్టి "మీకు సత్యభామాదేవి పంపినది" అని పలికినది.

అది చూచి రుక్మిణీదేవి నవ్వుతూ "నాథా! నీ ప్రియురాలు పంపిన యీ పువ్వులు నీవే తీసుకో. నీవు తన యింటికి రావాలని ఆమె నీ కోసం వీటిని లంచం పంపినట్లు ఉన్నది"—ఇలా అంటూనే ఆమె ఆ పువ్వులను శ్రీకృష్ణుని తలలో ముడిచినది. తర్వాత సత్యభామకు తన చెలికత్తెద్వారా పువ్వులు పంపుట మానివేసి, సత్యభామ పరిచారిక తెచ్చిన పళ్ళెంలోనే పూవులను ఉంచి, ఆమెతో "ఇదిగో! యీ పువ్వులను మీదేవికి ఇచ్చి ఈ పువ్వులు మీ యింటిపెరటిలోని పారిజాతపుష్పాలవంటివేమో బాగా చూచి చెప్పుము. వీటికున్న సువాసన మరే పుష్పానికి ఎక్కడా వుండదని తెలుసుకో! అని నేను చెప్పినట్లుగా చెప్పుము" అన్నది.

సత్యభామ చెలికత్తెకు యీ మాటలు కర్ణకఠోరములైనవి; విపరీతంగా కోపం వచ్చినది. "నరకాసురుడిని గెలిచి, భర్తతో కూడా యింద్రలోకంలోకి పోయి, స్వయంగా ఆమె సంపాదించి తెచ్చిన పారిజాతవృక్షం మీ యింటి పెరటిచెట్టుకు కూడా సరి కాకపోయిందా? అమ్మా! ఇలా అనడంలో నీ తప్పేమీ లేదు. ఇదంతా యీ ప్రభువు ఆడిస్తున్న కపటనాటకం! దీనికి తగిన ప్రతిక్రియకు కాలం రాకపోదు. అప్పుడు ఏమి జరిగేదీ నీకే బోధపడుతుంది" అని అంటూ ఆ పరిచారిక గిర్రున వెళ్ళిపోయింది.

అక్కడ సత్యభామ తన పరిచారికను రుక్మిణీదేవిదగ్గరకు పంపినతర్వాత శ్రీకృష్ణునితో ఆనందిస్తూ, తన చెలికత్తె యెప్పుడు వస్తుందా అని యెదురుచూస్తూ తనలో "చెలి యింత ఆలస్యం ఎందుకు చేసిందో! శ్రీకృష్ణుడు సర్వదా నాదగ్గిరే ఉండడంవల్ల విరహవేదనతో చాలా బాధపడుతూ వుండడంవల్ల—వెంటనే చూడ్డానికి వీలు కలిగివుండదనుకుంటాను. లేకపోతే పువ్వులిచ్చి తిరిగి రావడానికి ఇంత ఆలస్యం ఎందుకూ?" అని అనుకుంటూ వుండెను.

అప్పుడు చిన్నబోయిన ముఖంతో—విచారంవల్ల బరువైన హృదయంతో, సిగ్గుతో, కళాకాంతివిహీనమైన దేహంతో ఆమె చెలికత్తె వస్తూ—దూరంనుంచే సత్యభామదగ్గర శ్రీకృష్ణుడు ఉండడం చూచి మిక్కిలి ఆశ్చర్యం పొందినది. శ్రీకృష్ణుని చూడగానే—ఆమె తన ముఖవైవర్ణ్యాన్ని కప్పిపుచ్చి, తాను రుక్మిణీదేవిదగ్గర్నుంచి తెచ్చిన పూవులను తన యజమానురాలియెదట చిరునవ్వుతో ఉంచి, దూరంగా నిలబడినది.

ఎంత కప్పిపుచ్చినా, సత్యభామకు తన చెలికత్తెయొక్క ముఖవైవర్ణ్యం తెలియకపోలేదు. ఆమె "ఏమిటలా వింతపడి చూస్తున్నావు? నీముఖం వెలవెలపోతూ ఉండడానికి కారణం యేమిటి? ఈ పువ్వులు యెవరిచ్చారు? ఎవరికోసం తెచ్చావు? నా కేమీ బోధపడకుండా ఉన్నది. వివరంగా చెప్పు" అని పరిచారికతో పలికింది. ఆ పరిచారిక "అమ్మా! నాకు అంతా అగమ్యగోచరంగా ఉన్నది. నేను ఏమీ చెప్పలేని స్థితిలో ఉన్నాను. నీకు సర్వదా అత్యంతప్రియుడివలె ఉన్న యీ శ్రీకృష్ణులవారినే అడుగు. ఆయనే అంతా చెప్పగలరు. ఆయనకు తెలియనిది ఏమీ లేదు" అని అంటూ అక్కడి నుంచి వెళ్లిపోయింది. జరిగినదంతా శ్రీకృష్ణునియెదుట చెప్పడానికి జంకి అది యిలా చేసినది. తన పరిచారిక యిలా మాటలాడడానికి ఏదో కారణం వుందనీ, శ్రీకృష్ణుడే ఏవేవో మాయలు పన్నివుంటాడనీ, అతనిని అడిగితే విషయ మంతా తెలుస్తుందనీ మొదట అనుకుంది. కాని, వెంటనే కృష్ణునిమీద కలిగిన కోపం, కారణంగా—తాను అభిమానవతి కావడంవల్ల ఏమిన్నీ అడగక అక్కడినుంచి లేచి, వెళ్లిపోయి, పరిచారికను కలుసుకొని అడుగగా—ఆమె జరిగిన వృత్తాంతం పూసగ్రుచ్చినట్లు తెలియజేసింది. తాను చూచినదంతా కన్నులకు కట్టినట్లు వివరించి చెప్పినది. ఇలా చెప్పుతూ ఆమె సత్యభామకు రుక్మిణిపై యీసున్నూ శ్రీకృష్ణునిమీద కోపమున్నూ ఎక్కువ అయ్యేటట్లు చేసినది.

వెంటనే సత్యభామకు శ్రీకృష్ణునిమీద విపరీతపు కోపం కలిగి, పారిజాతవృక్షం తన ఒక్కర్తె యింట్లోనే తప్ప మరెక్కడా లేదని తన్ను మోసపుచ్చినందుకు నానావిధాలా శ్రీకృష్ణుని నిందించి, పొంగి పొరలి వస్తున్న దుఃఖాన్ని ఆపుకొనలేక వలవల యేడ్చి, "యీ పారిజాతవృక్షాన్ని తీసుకుని పోయి నీ యిష్టమైనదానికి ఇచ్చుకో; నా కవసరం లేదు" అంటూ జంకూ గొంకూ లేక ఆ పువ్వుల నన్నింటినీ అతని తలమీద పోసి, కోపంతో తన కేళీమందిరానికి వెళ్లిపోయింది. శ్రీకృష్ణుడు నవ్వుతూ ఆమెవెనకనే వెళ్లి చీర కొంగు పట్టుకోగా—ఆమె విదలించుకొని అతిత్వరగా గదిలోకి పోయి, తలుపులు బిగించుకున్నది. శ్రీకృష్ణుడున్నూ బయట మరొక గదిలో పరుండి—చెలికత్తెలు చూస్తూ వుండగా ఎంతో బాధపడుడూ ఉన్నట్లు నటించి, ఆ రాత్రి

అక్కడే ఉండిపోయాడు. ఉండిపోయాడే గాని రుక్మిణీదేవి మున్నగు మహిషుల భవనాల్లో కూడా ఉండి, వినోదంగా కాలం గడిపాడు. ఉదయాన్ని మాత్రం ఆ యా రూపాలను ఉపసంహరించుకున్నాడు.

ఉదయాన సత్యభామా, శ్రీకృష్ణు లిద్దరూ ఎడమొగం తోనూ, పెడమొగంతోనూ కాల్యకృత్యాలు తీర్చుకుని, ఒకరి నొకరు చూసుకోవడానికి, ఒకరితో ఒకరు మాటలాడ డానికీ, మనస్సులో చాలా కుతూహలపడుతూ, దానికి తగిన ఉపాయ మేమిటా ? అని ఆలోచిస్తూ వుండగా నేను అక్కడికి వెళ్లడం సంభవించినది. నేను వెళ్లేసరికి అక్కడి చెలికత్తెలు జరిగిన సమాచారమంతా చెప్పిరి. నేను మొదట శ్రీకృష్ణుని దగ్గరకు పోగా—ఆయన తాను జరిపిన దానిని చెప్పి, నవ్వుతూ "నువ్వు ఆమెదగ్గిరకు పోయి "ఇదంతా—నీకు కోపం తెప్పించాలని అతడు చేసిన గారడీ గాని, మరేమీ కాదు," అని చెప్పి ఆమెకోపాన్ని పోగొట్టి, మనస్సు నెమ్మదిపరుచు" అని అన్నాడు.

నేను వెంటనే సత్యభామదగ్గిరికి పోయాను. ఇలాంటి అవకాశానికే ఎదురుచూస్తూ ఉన్నది. కాబట్టి—ఆమె ఎంతో గౌరవంగా, దగ్గిరగా కూర్చోపెట్టుకుని జరిగినదంతా వివ రించినది. నేను అంతా విని తలఊచి పక్కున ఒక్క నవ్వు నవ్వినాను.

ఆమె కుతూహలంతో "నాయనా ! ఇది చాలా వింతగా ఉన్నది. కల్లోలితమైన పాలసముద్రంలో అమృతంలాగు నీ నవ్వు ఏమో నా మనస్సుకు సంతృప్తినీ, నెమ్మదినీ కలిగించినది. ఇందులో విశేషమేదో ఇమిడి వున్నది. వెంటనే చెప్పుబాబూ!" అన్నది. నేను "తల్లీ! అన్నీ ఎరిగినదానవు, నీవు యీ మాత్రం గ్రహింపలేవని నే ననుకోను. ఇదంతా అతని మాయగా... మరొకటి కాదు. నిజంగా పారిజాతవృక్షం నీ పెరట్లోనే ...ది. అతడున్నూ, నీదగ్గిరే ఉన్నాడు గాని, మరొక చోట ... నిన్ను పరీక్ష చెయ్యడానికి మాయావృక్షాలు కల్పించి, ... స్వరూపంతో అనేకస్థలాల్లో ఉన్నట్లు శ్రీకృష్ణభగవానుడు నటించాడు. కావలిస్తే యిప్పుడు పరిచారికలను పంపి కనుక్కో. ఎక్కడా యీ వృక్షమూ వుండదు ; ఈ పువ్వులూ వుండవు ; శ్రీకృష్ణుడు అంతకన్నా ఉండడు. అమ్మా ! బ్రహ్మరుద్రాదులే యితని మాయలో పడి, భ్రాంతితో నానా చిక్కులూ పడ్డారు. ఆ కథలన్నీ—కావలిస్తే నీకు చెప్తాను. శాంతి వహించి, నీ భర్తను సంతోషంగా ఎదుర్కో" అని అంటూ వుండగానే శ్రీకృష్ణుడు అక్కడకు వచ్చాడు. అతడు స్వయంగానే తనదగ్గిరికి రావడంవల్ల సత్యభామకు ఎంతో తృప్తీ, ఆనందమూ కలిగి, ఆమె భర్తను ఎంతో గౌరవించినది. వారిద్దరి మనస్సులలోని కలతలూ పోయి - సంతృప్తికలగడానికి నేను నామమాత్రంగా సాధనం కావడం వల్ల—నామీద వారిద్దరికీ ఎంతో అభిమానమూ, వాత్సల్యమూ కలిగినవి. సత్యభామ ఎంతో వాత్సల్యంతో అప్పుడు పూచిన పారిజాతపుష్పాలు మాల కట్టించి, నాకు బహూకరించినది. అందువల్లనే—ఎవ్వరికీ లభించని యీ పారిజాతమాలిక నాకు లభించింది."

అప్పుడు వ్యాసమహర్షి "నాయనా ! గోవిందా ! శ్రీకృష్ణుని విలాసాలు మనకు వాచామగోచరాలని మేము అనుకుంటూ ఉన్న సమయంలో నీవు వచ్చి, నీవు నీ అనుభవాన్నే కాకుండా—అతని లీలను వివరించి ఎంతో ఆనందం కలిగించావు. నన్ను చెప్పమంటూ వుండగా—నువ్వు వచ్చి, చెప్పి నా బరువు తగ్గించావు" అని నవ్వుతూ పలికాడు.



# నా మ జ ప ము

*తటవర్తి సూర్యనారాయణ*

భగవన్నామచింతనముయొక్క మహిమ అద్భుతము. సామాన్యమనుజులకు బోధపడదుగాని నిరంతరము నామ చింతనమందు సంలగ్నమనస్కులే దీని మహిమ మెరుంగ జాలుదురు. నామస్మరణములో నెవ్వనికి క్షణక్షణమున రోమాంచమై మధురస్మృతివలన ఆనందబాష్పములు ప్రవహించుచుండునో, జలవిహీనమత్స్యమువలె క్షణమైన నామ చింతనవియోగము దుస్సహవ్యాకులత కలిగించుచుండునో, ఏ మహాత్ముడు నిమిషమాత్రముగూడ భగవన్నామచింతనము మానియుండజాలడో, నిష్కామభావముతో ప్రేమ పూర్వకముగ నిరంతరము నామజపము చేయుచుచేయుచు నందు తల్లీనుడై యుండునో అట్టి మహాత్ముడే యీ విషయమున పరిపూర్ణముగ వర్ణించుట కర్హుడు; అట్టివాని కథనమే విశ్వమునకు కళ్యాణకారి. అట్టి అవర్ణనీయమహిమను నేను వర్ణించ యత్నించుట సాహసమే కాగలదు. అయినను మిత్రుల ప్రోత్సాహముచే నే నీ విషయమున గొంచెము చెప్పబూనితిని. ఇందేవైన దోషములున్నచో క్షమార్హములు.

### మహిమాదిగ్దర్శనము

భగవన్నామ మపారమహిమాన్వితము. ప్రతి యుగము నందు దీని మహిమమెక్కుడే. సాధుమహాత్ములు, సర్వ శాస్త్రములును సర్వయుగములకును ముక్తకంఠముతో నామమహిమను గీర్తించియుండిరి. అయినను కలియుగమున కిద్దానితోఁ దుల్యమగు ముక్తిసాధన మొండులేదు.

హరేర్నామ హరేర్నామ హరేర్నామైవ కేవలం
కలౌ నాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతిరన్యథా ॥

(నా. పు 1-41-15)

"కలియుగములో కేవలము శ్రీహరినామమే కళ్యాణమునకుఁ బరమ సాధనము. ఇది తప్ప రెండవ యుపాయ మెద్దియును లేనేలేదు."

కృతేయద్ధ్యాయతో విష్ణుం త్రేతాయాంయజతోమఖైః
ద్వాపరే పరిచర్యాయాః కలౌ తద్ధరికీర్తనాత్.

(శ్రీమద్భాగ 12-3-52)

(కృత) సత్యయుగములో విష్ణుదేవుని ధ్యానించుట వలనను త్రేతాయుగములో యజ్ఞములు చేయుటవలనను ద్వాపరయుగములో సేవ - పూజలు చేయుటవలనను లభించెడి ఫలము కలియుగములో కేవల హరినామ సంకీర్తనమువలననే లభించును.

నామమహిమకు ప్రమాణములకు బారములేదు. మన శాస్త్రములన్నియు అట్టివానితో నిండియున్నవి. ప్రపంచములో మతములు మతాంతరములు ఈశ్వరనామమహిమను గుర్తించి యొప్పుకొనుచున్నవి, కీర్తించుచున్నవి. రుచిభావమునుబట్టి నామములలో భిన్నత్వముండుట వాస్తవమే కాని పరమాత్ముని నామమేదియైనను ఎట్టిదైనను అన్నియును సమానఫలప్రదములే. కనుక నెవ్వరికే నామ మిష్టమనితోచునో వారద్దానినే ధ్యానముతో జపించుట కభ్యసించవలెను.

### స్వానుభవము

మిత్రులు కొందరీ విషయములో స్వానుభవము వ్రాయవలెనని కోరిరి. కాని భగవన్నామమును విశేష సంఖ్యలో నేను జపించియుండనప్పుడు నా యనుభవమేమి చెప్పుదును ? భగవత్కృపవలన ఏ కొంచెము నామ స్మరణము చేసియుంటినో దాని మాహాత్మ్యముకూడ పూర్తిగ వ్రాయుట కష్టము. నేను బాల్యమునుండియు నామజపము చేయుచుండుదును. దానివలన మెల్లమెల్లగ నా మనస్సులో విషయ వాసన తగ్గుట మొదలిడెను. పాపములనుండి తొలగుటకు నాకు చాల సహాయము కలిగెను. కామక్రోధాది దుర్గుణములు తగ్గుటయేగాక అంతఃకరణము శాంతి వికాసము గాంచెను. అప్పుడప్పుడు నేత్రములు మూసుకొని నప్పుడు శ్రీరామచంద్రుని ధ్యానముకూడ బాగుగ జరుగ దొడంగినది. ప్రాపంచిక స్ఫురణము చాల తగ్గెను. భోగములయెడ వైరాగ్యముత్పన్నమయ్యెను. అట్టివేళల నాకు వనవాసమునగాని ఏకాంతస్థానమునగాని ఉనికి అనుకూలమై తోచుచుండెడిది.

ఇట్లు అభ్యాసము చేయుచుజేయుచు నుండగ నొక నాడు స్వప్నములో శ్రీ సీతాలక్ష్మణసమేతుడైన శ్రీరామ చంద్రుని దర్శన భాగ్యము లభించెను. ఆసీతావల్లభునితో సంభాషించితినిగూడ. వరము కోరుకొమ్మని శ్రీరామచంద్రు డెంతయు జెప్పెనుగాని నాకేది యడుగుటకును కోరిక జనించలేదు. చివరకు పట్టుబట్ట నేను 'రామా! నీ వియోగ మెన్నడును నాకుండకుండును గాక' యని మాత్రమే యాచించితిని. ఇదంతయు నామజప ఫలితము. ఆటు పిదప నామజపమువలన నాకింకను నెన్నో సత్ఫలితములు, లాభములు గలిగెను. అవి యన్నియు వర్ణింపజాలను. అయినను ఒక్కటి చెప్పెదను. నామజపమువలన నాకు కలిగినంత లాభము భగవద్గీతాభ్యాసమున గాక మరే

సాధనమునను గాలేదు. నన్ను నా సాధననుండి భ్రష్టము చేయు నాటంకములు వచ్చిపడినప్పుడు భావనాసహితుడనై నామజప మొనర్చెడివాడను. అంతే—తత్ప్రభావముచేత విఘ్నములన్నియు తొలంగిపోయెడివి. కనుకనే సాధనపథ విఘ్నములను బోగొట్టుటకును మనస్సులో జనించుచుండు ఐహికస్ఫురణలను నాశముచేయుటకును స్వరూపచింతనా సహితమైన ప్రేమపూర్వక నామజపము చేయుటకన్న నొండు సాధన మేదియునులేదని నా దృఢవిశ్వాసము. సాధారణసంఖ్యలో చేసిన నా జపమువల్లనే ఇంతటి శాంతి, ఇంతటి అనందము, ఇంతటి అనుపమలాభము ప్రాప్తించి నప్పుడు నిష్కామభావముతో ధ్యానసమేతుడై భగవన్నామ జపమును నిరంతరము చేయుచుండువారి అనందమహిమ మింతయని చెప్పగలమా ?

## నామజప మెందులకు జేయవలెను ?

శృతికథనము :

ఏతద్ధ్యేవాక్షరం బ్రహ్మ ఏతద్ధ్యేవాక్షరంపరం
ఏతద్ధ్యేవాక్షరం జ్ఞాత్వాయోయదిచ్ఛతి తస్యతత్ ॥
(కఠ-1-2-16)

"ఈ ఓంకారమను అక్షరమే బ్రహ్మ. ఇదే పరబ్రహ్మము. ఈ ఓంకారరూపమగు అక్షరమెఱిగి ఏ మనుష్యు డేవస్తువును కోరునో వాని కదే లభించును."

శృతి కథనానుసారము కల్పవృక్షస్వరూపుడగు భగవంతుని భజనశక్తివలన ఏ వస్తువును మనుజుడు కోరుచుండునో అదే వానికి లభించును. కాని ఆత్మకళ్యాణము గోరు నిజమగు భక్తులు మాత్రము నిష్కామభావముతోడనే భజించవలయును. నిష్కామప్రేమియగు భక్తునే శాస్త్రము లెక్కుడుగ ప్రశంసించియున్నవి. పరమాత్ముని వాక్యము—

చతుర్విధా భజంతే మాం జనాఃసుకృతినోఽర్జున ।
ఆర్తోజిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ ।
తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే
ప్రియోహి జ్ఞానినోఽత్యర్థ మహంసచమమప్రియః ॥
(గీత-7-16-17)

"ఓ భరతవంశశ్రేష్ఠుడవైన అర్జునా! ఉత్తమకర్మశీలురైన అర్థార్థి (ప్రాపంచికభోగపదార్థములు గోరి భజించువారు) ఆర్తులు (ఆపన్నివారణార్థమై భజించువారు) జిజ్ఞాసువులు జ్ఞానులు. (నన్ను యథార్థరూపమున నెరుగుటకై భజించువారు, నిష్కాములు) ఇట్టి చతుర్విధభక్తులు నన్ను గొలుతురు. అందులోగూడ నాలో ఏకీభావమున స్థితుడై అనన్యప్రేమభక్తిసమేతులగు జ్ఞానులకు నేనత్యంత ప్రియుడను. ఆ జ్ఞానియు నాకత్యంతప్రియుడు."

ఇవ్విధమున నిష్కామప్రేమపూర్వకముగ జరుగు భగవద్భజనప్రభావము నే మనుజుడెరుగునో అట్టి పురుష డొక నిముసమైనను పరమాత్ముని విస్మరించడు. అట్లే పరమాత్ముడు నాతనిని మరువడు.

యోమాంపశ్యతి సర్వత్ర సర్వంచ మయిపశ్యతి
తస్యాహం న ప్రణశ్యామి నచమేసప్రణశ్యతి ॥
(గీత 6-30)

"ఏ పురుషుడు సమస్తభూతములయందును సమస్త ప్రాణులకు ఆత్మస్వరూపుడనగు నన్నే వ్యాపకునిగ జూచునో సంపూర్ణభూతములను నాయంతర్గతములుగా జూచునో అట్టివానికేనెన్నడు నదృశ్యుడనుగాను. అట్లే అతడు నా కదృశ్యుడుకాడు. ఏలనన - అతడు నాయం దేకీభావమున నిత్యసంస్థితుడు గదా!"

ఓహో! నిజమగు భక్తుడు ప్రేమి. నిజప్రేమాస్పదుని విడిచి యెన్నడైన నితరునికి తన హృదయమున స్థానమొసగజాలునా? మహాభాగ్యుడగు పురుషుడు సర్వసుఖమయుడు పరమానందుడునగు పరమాత్ముని ప్రభావ మెరింగి వానినే తనకు ప్రేమాస్పదునిగ జేసికొనుచు నహర్నిశలు నాప్రియుని నామస్మృతిలోనే తన్మయుడై యుండును. అన్యవస్తువాంఛ యెన్నడును జేయడు; అన్యవస్తువేదియును వానికి బాగుండదుకూడ.

కనుక ఇట్టి అవస్థ - దశ ప్రాప్తించువరకును సాధన - అభ్యాసమొనరించుచుండవలెను. నామోచ్చారణచేయు వేళ శరీరజ్ఞానము, స్పృహయు లేనట్లుగ మనస్సును ప్రేమలో నిమగ్నమొనర్పవలెను. మహాదుస్సహదుర్భరాపత్తులు వచ్చిపడినను విశుద్ధప్రేమభక్తి - భగవత్సాక్షాత్కారమును దక్క నన్యములగు నేప్రాపంచిక వస్తువాంఛయు, యాచనము, ఆకాంక్షయు నెన్నడును జేయరాదు.

నిష్కామభావముతో ప్రేమపూర్వకముగ విధ్యుక్తముగ నామజపమొనర్చు సాధకుడతిశీఘ్రకాలముననే మంచి ఫలితము బడయజాలును.

కాని చాలమంది నామజపము చేయుచున్నను వారికేవిశేషలాభము కలిగినట్లు గన్పడదేమి - యని ఎవ్వరైన శంకించవచ్చును; కాని అట్టివారు విధ్యుక్తముగ నామజప మభ్యసించ లేకపోయియుండవచ్చుననియు, తమ చేయు నామజపమునకు బదులుగ తుచ్ఛసాంసారిక భోగములను గొనియుండవచ్చుననియు, లేనిచో విశేషమగు ఫలితము లభించెడిదేయని సమాధానము.

ఇందుచే నామజపమనునది చిన్నపెద్ద కోరికలకొఱకై చేయక కేవలము పరమాత్ముని విశుద్ధప్రేమకొఱకే చేయబడవలెను.

## నామజప మెట్లు చేయవలెను ?

మహర్షి పతంజలి చెప్పినది.

తస్యవాచకః ప్రణవః (యోగ. 1-27)

"ఆ పరమాత్ముని వాచక మనగా-నామమోంకారము"

తజ్జప స్తదర్థభావనం (యోగ. 1-28)

"ఆ పరమాత్ముని నామజపము తదర్థభావన మనగా స్వరూపచింతన."

తతఃప్రత్యక్ చేతనాధిగమోఽప్యంతరాయాభావశ్చ (యోగ. 1-29)

"ఉపర్యుక్తసాధనమువల్ల సంపూర్ణవిఘ్నముల నాశనము, పరమాత్ముని ప్రాప్తియునగును."

ఇందుచే నామజపము నామధారిస్వరూపచింతనము చేయబడవలయుననియు స్వరూపచింతనముతోగూడిన నామజపముచే అంతరాయములు నశించి పరమాత్మప్రాప్తి యగుననియు రూఢియగుచున్నది.

స్వరూపచింతన చేష్ట లేకున్ననుకూడ కేవల నామజప ప్రభావముచే యుక్తసమయమున సాధకునకు భగవత్స్వరూపసాక్షాత్కారము దానంతట అదే లభించుటయు గలదు. నామము నామధారిని ఆకర్షించుచునుగదా; కాని ఇట్టి సాధనమువలన ఫలితము వెంటనే కలుగక ఆలస్యముగ నగుచున్నది. భగవంతుని దివ్యమంగళ స్వరూపమును జింతించుచు జపము చేయుట అభ్యసించినచో అత్యల్పకాలమునే ఫలములభించును. ఏలనన-చింతనము నిరంతరము జరుగుటచేత పరమాత్ముని స్మృతిలో అంతరము కలుగదు. ఇందుచేతనే గీతాకారుడు—

తస్మాత్ సర్వేషు కాలేషు మామనుస్మర యుద్ధ్యచ।
మయ్యర్పితమనోబుద్ధిర్మామేవైష్యస్యసంశయం॥ (8-7)

"కనుక అర్జునా! నీవెల్లవేళల నన్ను స్మరించుము. యుద్ధమును జేయుము. ఇవ్విధమున నాయందు హత్తించిన మనోబుద్ధులుగల నీవు నిస్సంశయముగ నన్నే పొందగలుగుదువు."

భగవంతుని ఇట్టి యాజ్ఞానుసారముగ లేచుచు కూర్చుండుచు తినుచు త్రాగుచు నిద్రాజాగ్రదవస్థలలో - ప్రతియొక సంసారకార్య కలాపనిమగ్నుడై యుండియు సాధకుడు నామజపముతోబాటుగ మనోబుద్ధులతోడను భగవత్ స్వరూప చింతనము నిశ్చయము జేయుచునుండవలెను. క్షణకాలమైనను ఆ పరమాత్ముని స్మృతివియోగము కారాదు.

ఇందుపై నెవ్వరైన—ఏ నామజపమువలన అధికలాభము కలుగును? నామముతోపాటుగ భగవంతుని యెటువంటి స్వరూపమును ధ్యానించవలెను? అని అడుగవచ్చును- పరమాత్మునికనేకనామములు గలవు. ఈ నామములలో సాధకునికేనామమన్న ఇష్టమో శ్రద్ధయో అట్టి నామమును జపించుటవలననే అధికలాభముగలుగును. కనుక సాధకుడు తన యిష్టము చొప్పుననే భగవన్నామజపము స్వరూపచింతనము చేయుచుండవలెను. ఒక విషయము ముఖ్యము—ఏ నామము జపించబడుచున్నదో స్వరూపము తదనుకూలముగనే చింతించవలెను. ఉదాహరణకు:—

"ఓం నమోభగతే వాసుదేవాయ" ఈ మంత్రము జపించువారు సర్వవ్యాపియగు వాసుదేవుని ధ్యానించవలెను.

"ఓం నమోనారాయణాయ" ఈ మంత్రము జపించువారు చతుర్భుజుడగు శ్రీ విష్ణుభగవానుని ధ్యానించవలెను.

"ఓం నమశ్శివాయ" మంత్రము జపించువారు త్రినేత్రుడగు శంకరభగవానుని ధ్యానించుట ఉచితము. కేవల మోంకారము జపించువారు సర్వవ్యాపియు సచ్చిదానంద ఘనమునగు శుద్ధబ్రహ్మమును జింతించుట ఉచితము. శ్రీరామనామ జపము చేయువారు దశరథాత్మజుడైన శ్రీరామచంద్రుని స్వరూపచింతనము గావించుట లాభకరము.

హరేరామ హరేరామ రామరామ హరెహరే
హరేకృష్ణ హరేకృష్ణ కృష్ణకృష్ణ హరెహరే॥ (కలిసం॥)

ఈ మంత్రము జపించువారు శ్రీరామ, కృష్ణ విష్ణువుల గాని సర్వవ్యాపియగు పరబ్రహ్మ మున్నగు సమస్త రూపములను తన కోరిక-ఇష్టము చొప్పున ధ్యానము చేయవచ్చును.

ఈ యుదాహరణలవలన తెలియవచ్చినదేమనగా:— సాధకుడు గురువుద్వారా ఏ నామరూపముల నుపదేశము గ్రహించునో ఏ నామమున ఏ రూపమున శ్రద్ధ ప్రేమ విశ్వాసములధికముగనుండునో ఏది తన ఆత్మ కనుకూలముగ ప్రతీతమగుచునుండునో అట్టి నామరూపజపమే ధ్యానముచే అధికలాభము చేకూర్చును.

కాని నామజపముతోబాటుగ ధ్యానముగూడ తప్పక ఉండవలెను. వాస్తవమునకు నామములతోగూడ నామధారి స్మృతియగుట అనివార్యముగూడ. మనుజుడేయే వస్తు నామముచ్చరించునో ఆయావస్తుస్వరూపస్మృతియు నతనికొకసారి యవశ్యము కలుగును. అంతేగాక స్మృతిని బట్టియే మంచిచెడ్డల పరిణామముగూడ తప్పకగలుగును. ఎట్లన:—వీరరస కరుణారస ప్రధాన వృత్తాంతముల స్మృతిచే తదనుసారముగ మనుజుని వృత్తులు భావములు పరిణతమగుచుండును. సత్పురుషస్మృతివలన మనస్సులో శ్రేష్ఠభావముల జాగృతియగును. అట్లే దుష్టాత్ముల స్మృతి

వలన దుష్టభావము లావిర్భవించును. లౌకికస్మరణమే ఇట్టి అనివార్య పరిణామమొనగుచున్నదన పరమాత్ముని స్మరణముచే పరమాత్ముని భావములు గుణము లంతఃకరణమున జనించుననుటలో నందియమేమి గలదు?

కనుక సాధకుడు భగవత్ప్రేమయందు విహ్వలుడై నిష్కామభావముతో నిత్యము రాత్రింబవళ్లు కర్తవ్య కర్మలు జేయుచునే ధ్యానసహితుడై శ్రీ భగవన్నామజప ప్రవృత్తుడు కావలెను.

సత్సంగముచేతనే నామజపములో శ్రద్ధకలుగును. నామజపములో నింతటి మహిమ యుండియున్నదికదా, మరి జనులీ ప్రేమస్వరూపుడగు భగవంతుని స్మరించుటలో నెందులకు బూనుకొనరు? కారణము లేకపోలేదు. భగవంతుని దయకు పాత్రుడైనవాడే భగవద్భజనములోని నిజ మర్మమెరుంగజాలును.

నిజమునకు భగవంతుని దయ సర్వదా సర్వులపై సమానరూపమున నుండియేయుండును గాని అతని యా యపార దయను మనుజుడు గుర్తించజాలనంతవరకు మనుజుండా దయవలన లాభము పొందజాలడు. ఎట్లన - ఒకనియింటిలో ధనపుపాతుండియున్నను దానినెరుంగనంతవరకు వానికి దానివల్ల లాభమేమియుండును? కాని అతడే మర్మజ్ఞుడైన ఎవనిచేతనైనా ఆ నిధియున్నతావు వానిని గైకొను సాధన మెరిగినచో వానికి లాభము గలుగదా? ఇట్లే భగవంతుని దయాప్రభావ మెరింగినవారి సత్సంగమువలన మనుజునకు భగవంతుని నిత్యదయాళుత్వము విశదమగును. అప్పుడే యాతడా పరమాత్ముని భజించుటకు శ్రద్ధ ఆసక్తిగలవాడగును. నిత్యభజనసేవాధ్యానమువలన వాని సమస్త సంచిత పాపరాశులు సమూలముగ నశించి వానికి పరమాత్మప్రాప్తియను పరిపూర్ణ లాభము ప్రాప్తించుచున్నది.

నామములో పాపనాశనమునకు స్వాభావికశక్తిగలదు. భగవంతుడు తనను భజించువారి పాపములను బోద్రోలును. లేదా వానిని క్షమించుచున్నచో నిందు "విషమతాదోషము లేదా" అని శంకించవచ్చును. అగ్నిలో దహించు ప్రకాశించు శక్తి స్వాభావికము ఇట్లే భగవన్నామమందుగూడ పాపనాశకమగు స్వాభావికశక్తి యుండియున్నది. కనుకనే భగవద్గీతలో భగవానుడు -

"నమోఽహం సర్వభూతేషు నమేద్వేష్యోస్తి న ప్రియః
యేభజంతి తుమాం భక్త్యా మయితే తేషుచాప్యహం॥
(9-29)

"నేనెల్ల భూతములందును సమభావమున వ్యాపకుడను. నాకప్రియుడు ప్రియుడు నెవ్వరునులేరు. కాని నన్ను ప్రేమతో భజించు భక్తులు నాయందును నేనును వారి యందును ప్రత్యక్ష ప్రకటుడను. ఎట్లన - సూక్ష్మరూపమున సర్వస్థలముల వ్యాపకమైయున్నను అగ్ని సాధనముల ద్వారా ప్రకటితమొనర్చిననే ప్రత్యక్షమగునట్లుగనే సర్వస్థలముల సంస్థితుడైనను పరమేశ్వరుడు భక్తితో భజించువారి అంతఃకరణమందే ప్రత్యక్షరూపమున ప్రకటుడగుచుండును." అనెను

ఇందువలన స్పష్టమగుచున్నది:—శీతబాధితులగు వారిలో నెవ్వడగ్ని సమీపమునజేరి అగ్నిని సేవించునో వాని చలియే నివారణమగును గాని అగ్నివద్దకు పోని వారి శీతవ్యథ శాంతించునా? ఇంపగ్నిలో విషమతా దోషమున్నదందుమా? అగ్ని సర్వులకును తన వేడిమియొనంగి వారి శీతవ్యథ మాన్పుచున్నది. అట్లు చేయుటకు సర్వదా సంసిద్ధమైయున్న అగ్నిని సమీపించనివారి నగ్నియేమి చేయగలదు? ఇట్లే భగవంతుని భజించువాని యంతఃకరణమునే శుద్ధమొనర్చి భగవంతుడాతని దుఃఖశోకాదులను సర్వథానాశనమొనర్చి వానికే కళ్యాణములు చేకూర్చును. కనుక భగవంతునికి విషమతా దోషములేదు.

## నామభజన వలననే జ్ఞానము లభించును

(శంక) భగవన్నామ జపము పాపముల నడంచునని అంగీకరించెదము. కాని పరమపదప్రాప్తి దానివలన నెట్లు లభించును? పరమపదప్రాప్తి జ్ఞానముచేతనేగదా అగునది?

(సమాధానము) బాగున్నది. పరమపదము జ్ఞానము వలననే ప్రాప్తించును. కాని శ్రద్ధ ప్రేమవిశ్వాసపూర్వకముగ నిష్కామభావముతో చేయబడు భజనప్రభావము చేత భగవంతుడు వానికి భగవత్స్వరూప తత్వజ్ఞాన మలవడు జ్ఞానమొనగును. ఆ జ్ఞానముచేతనే ఆ సాధకునికి పరమపదమవశ్యము ప్రాప్తించును.

భగవానుడు—

మచ్చిత్తామద్గతప్రాణా బోధయంతః పరస్పరం
కథయంతశ్చమాం నిత్యం తుష్యంతి చ రమంతిచ
తేషాంసతత యుక్తానాం భజతాం ప్రీతిపూర్వకం
దదామి బుద్ధియోగం తంయేనమా ముపయాంతితే
తేషామేవానుకంపార్థ మహమజ్ఞానజంతమః
నాశయామ్యాత్మ భావస్థో జ్ఞానదీపేన భాస్వతా॥
(గీత 10-9.11)

"నాయందే నిశ్చల మనస్కులై భజించువారును నాయందే స్వప్రాణములర్పించు భక్తులును సదా నా భక్తి చర్చలద్వారా పరస్పరము నాప్రభావమును దెలుపుచు గుణప్రభావయుక్తుడైన నన్నే చెప్పుచు గీర్తించుచు సంతుష్టులగుచుందురు. నాయందే సతతము క్రీడించుచుందురు. అట్టి భక్తులకు నన్ను బొందజాలు తత్వజ్ఞాన

